MADRAS GOVERNMENT ORIENTAL MANUSCRIPTS
SERIES No. 60




# పతివ్రతా చరిత్రము

# PATIVRATĀ CARITRAMU

EDITED BY

**T. CHANDRASEKHARAN, M.A., L.T.,**
*Curator, Government Oriental Manuscripts Library, Madras*

AND

*the Staff of the Library*

*(Under the orders of the Government of Madras)*

1958

**Price Rs. 4-20**

# INTRODUCTION

The present publication, PATIVRATĀCARITRAMU, is based on two manuscript copies available in the Government Oriental Manuscripts Library, Madras, and described under D. No. 1104 and 1105. D. No. 1105 is a palm leaf manuscript, while the other is on paper. The paper manuscript contains some brief notes in English written by Mr. C. P. Brown. Both the manuscripts are incomplete and contain the same extent.

PATIVRATĀCARITRAMU is a fine composition in Dvipada metre describing the greatness of "PĀTIVRATYA". The last story in this work as printed is numbered as 32 but eleven stories are missing within these 32 stories. So only twenty-one stories are brought to publication.

The name of the author is not known. It can be inferred however, by his style etc., that he should have flourished after Prabandha Poets. As the final colophon is not available, it is difficult to say how many stories he had written.

The work is closely modelled on Pālavēkari Kadirīpati's Śuka Saptati except that the author has refined the base erotic love of the novel. The pattern is identical in both, but each has a different motive and import. In Śuka Saptati, when a rich merchant goes abroad on one of his trade-trips, his beautiful wife, goaded on by a chamber maid of the king, tries to meet him in his palace; a parrot, reared as a pet, protects her chastity by engaging her every night with an ingenious story and thus keeps her at home till her master returns. The present work also moves on the same lines.

The stories of this work are gathered from many sources. The introduction and the story of Puṣpadanta are taken from Bhaṭṭa Sōma Dēvā's Kathā Saritsāgara. Some stories are found in Dharma Vyādha Upākhyāna (Mahā Bhārata), Bhōjarājīya, Simhāsana Dvātrimśati and Kēyūrabāhu Caritra. Others, like the stories of Arundhatī and Lōpāmudrā, are taken from Purāṇas The story, resembling that of Sumati, who, by her supreme power of Pātivratya, stopped the day break to protect the life of her husband, has its source in the Mārkaṇḍēya Purāṇa. Durmēdha, the husband of the chaste

lady, is a close parallel to Gunanidhi of Kāśīkhaṇḍa and Nigama Śarmā of Pāṇḍuraṅga Māhātmya. There are a few other popular stories also. All are absorbingly well written.

The narrating parrot in this work was no ordinary parrot. He was Sukīrti, the minister of a king by name Caṇḍa Pratāpa. He was well versed in all the arts, but having been under the spell of a curse which he brought on himself from a sage called Dalabhōji, he assumed the form of a parrot retaining all his mental powers. No wonder he was very shrewd and attractive in his talk even as a parrot and kings and chieftains came to hear him! This parrot, again is a close parallel to Śucimukhi as drawn by Pingali Sūranna in his Prabhāvatī Pradyumna.

A merchant by name Dhanadatta bought this parrot. The parrot, in its turn, ordered some changes in its master's shop thus bringing on a boom in his business. But, its master was not happy for all the money, for, his son Kubēra Datta had fallen on evil ways neglecting his own beautiful young wife. How the parrot skilfully brought the young couple together makes an interesting reading.

The verse is sweet and simple. The poet has a flair for Śabdālaṁkāras. One relishes the sayings and idioms aptly used. Some of the words used in this work are taken as authoritative in Śabda Ratnākara. The influence of the great masters like Nannaya, Tikkana and Mukku Timmana is apparent.

Bhārat is a land famous for sages and Pativratās. The ideal of such life sustains not only individuals but the country as a whole. It is hoped that this book will be enjoyed by many of our devoted womenfolk.

My thanks are due to Pandits Sris M. Sarabhesvara Sarma and T. Sridharamurthy who prepared the press copy, did the collation and corrected the proofs.

Government
Oriental Manuscripts
Library, Madras-5.
22—4—1958

T. CHANDRASEKHARAN,
Curator.

# మున్నుడి

---

మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నీపతివ్రతా చరిత్రమునకు రెండు మూలప్రతులు లున్నవి. అవి డి. నెం 1104, 1105 లలో వర్ణితములు. అందు మొదటిది కాగితపుఁబ్రతి. రెండవది తాళపత్ర ప్రతి. కాగితపుఁ బ్రతియందు నెడనెడ బ్రౌనుదొరగారి యాంగ్లవివృతు లున్నవి. గ్రంథపాత ముభయప్రతులందు సమానము.

పతివ్రతాచరిత్రము పాతివ్రత్య ప్రభావమును బ్రకటించు ప్రశస్త ద్విపదకృతి. ఇందు ముప్పది రెండుకథ లున్నట్లు తెలియ వచ్చుచున్నది. కాని మూల ప్రతులయందుఁ బదునొకండుకథలు లుప్తములగుటచే నిరువది యొక్క కథలు మాత్రము ప్రకటింపఁబడెను.

ఈ కృతికర్తనామము తెలియవచ్చుట లేదు. కవితారీతులను బట్టి యీతఁడు ప్రబంధకవులకుఁ దరువాతివాఁడని యూహింపవలసి యున్నది గ్రంథాంత్యభాగము లేకుండుటంజేసి యీకవి యెన్నికథలు వ్రాసెనో తెలియ కున్నది.

పాలవేకరి కదిరీపతినాయక ప్రణీతమగు శుకసప్తతి (నీచ) శృంగార కథలు గలదగుటచేఁ బవిత్రమగు పతివ్రతాచరిత్రమును వ్రాయుతలం పీకవికిఁ గల్గినట్లు తోఁచుచున్నది శుకసప్తతియందు వణిగ్వరుఁడు దేశాంతర వ్యాపారగతుఁ డైనప్పుడు దూతికాప్రేరణమున నవ్వైశ్యసుందరి రాజునభి మతము దీర్పఁ బోనుద్యమించును. ఆకాంతభావ మెఱిఁగి యయ్యింటి చిలుక బుద్ధిచెప్పి పతివచ్చునందాఁక (డెబ్బది దినములు) రేలెల్లఁ గథలతోఁ గాలహరణము చేయుచు నామెశీలమును గాపాడును. పతివ్రతా చరిత్రమునం దును కథ యిదేరీతి సాగినది. ఇందలి కథలన్నియుఁ జిలుకయొక్క "సదాశివ జటాజూట కలిత గంగాతరంగ ఘుమంఘుమోక్తుల" వెలువడినవే. ఈ కారణ ములచే నీ గ్రంథముకూడ శుకసప్తతివంటిదే. కాదు—శుకసప్తతియే!

ఇందలి కథలన్నియు ననేకగ్రంథములనుండి సంగ్రహింపఁ బడినట్లు తోఁచుచున్నది. అవతారికయుఁ బుష్పదంతుని వృత్తాంతము భట్టసోమదేవుని కథాసరిత్సాగరమందలిది. నీ యెట్టిచూపునకుఁగాంగఁగానన్న కథకు మూలము భారతమందలి ధర్మవ్యాధోపాఖ్యానము. పతియనుమతిగాంచినసతి కథవంటిది భోజరాజీయమందును గలదు. సులోచనకథ సింహాసన ద్వాత్రింశతిలోనిదై యున్నది. కేయూరబాహుకథ కేయూరబాహు చరిత్రమునుండి యుద్ధరింపఁబడినది. అరుంధతి లోపాముద్ర మొదలగువారి కథలు పురాణ గృహీతములు. తెల్లవార కుండశపించిన సాధ్వికథ సుమతికథ వంటిదై యున్నది. అట్టి కథ మార్కండేయ పురాణమందును జూపట్టుచున్నది. ఈ కథయందలి దుర్మేధుఁడు కాశీఖండము పాండురంగమాహాత్మ్యములయందలి గుణనిధి నిగమశర్మలకు సైదోడు. విశాళమున జనులు చెప్పుచుండు చేపనవ్విన కథ, పులిని జంపినవానికిఁ బుత్రికనిచ్చు రాజుకథ మొదలగునవియు నిందుఁ గొన్ని కలవు. శయ్యాగానమ్మను కథకుఁ గ్రిందిశ్లోకమాధారము.

శయ్యా గానం చన్దనం చారుహాసో ।
వీణా వేణుః సున్దరీ యాచనారీ ।
నభ్రాజన్తే క్షుత్పిపాసాతురాణాం ।
సర్వారంభా స్తణ్డులప్రస్థమూలాః ।

ఈ కథలన్నియు నుత్తమసంవిధానములు గలవై రసవంతములై శ్రవణపేయములై యున్నవి. అరుంధతీదేవికథయందు నింద్రియ నిగ్రహముయొక్క ప్రభావము, సావిత్రికథయందు స్త్రీకిఁగల మృత్యువులోనైన నెదుర్కొనుశక్తి, కాళిగుడిలోఁ బతినివరించినసతికథలోఁ గొడుకుప్రాణముకంటె సతికి మానమే ప్రాణమనునీతి, బుద్ధికర్మములకథలోఁ గర్మముయొక్క యద్వితీయశక్తి, లోపాముద్రకథలోఁ బడఁతికిఁబతితోడిదే లోకమను నాదర్శము, మానవతికథయందు స్త్రీమానమునకు రక్షకుఁడు పురుషుఁడా? లేక స్త్రీయా యనుసమస్యకుఁ జక్కని సమాధానము, కిరాతసతికథలో నన్యదానములకంటె నన్నదానమునకుఁ గల వైశిష్ట్యము, ద్రౌపదీదేవి పూర్వజన్మకథలో ద్రౌపది పంచవల్లభ యగుటలోఁగల రహస్యము చక్కఁగ రూపింపఁ

బడినవి. ఇట్లు కథలన్నియు లోకవ్యవహార సాధనభూతములు సంశయ విచ్ఛేదకములు సదుపదేశకములునై యున్నవి.

చండప్రతాపుని మంత్రివరుఁడగు సుకీర్తి సకలకళావిశారదుఁడు మేధావి. ఇతఁడు దళభోజిమునీంద్ర శిష్యశాపముచేఁ జిలుకతనముఁ బ్రాపించియుఁ దొంటి ప్రజ్ఞావైభవమును గోల్పోవనివాఁడు. ఈచిలుక మంజుభాషల వివిధేతిహాసములు ధర్మశాస్త్రము లుపన్యసించును. అందలి రహస్యములు విశదీకరించును. దీని వీక్షించుటకుఁ బలుకులను వినుటకు మన్నీలు, దొరలు, సామంతులు, మంత్రులు, ఎన్నికగలరాజులే క్రిక్కిఱియు దురన్నచో దాని పాండిత్యము ప్రజ్ఞాకౌశల మెట్టిదోకదా!

ఈచిలుక కొన్నివిషయములలోఁ బ్రభావతీప్రద్యుమ్నమందలి శుచిముఖికి నుద్ది యగుచున్నది. శుచిముఖి వచోనిపుణత్వమందు, సత్కథారచనలయందు, నీతివిదురత్వమునందు, బహుశ్రవావలోకచణతయందు నెందును సాటిలేనిది. వీనులకు సుధారసములసోనలు వర్షించు మృదులసుస్వరఫణితి గలది. అటు దేవకార్యము ఇటు ప్రభావతీప్రద్యుమ్నుల సమాగమము తన ప్రజ్ఞాకౌశల్యముచే జోడించి యింద్రోపేంద్రుల మన్నన వడసినది. పతివ్రతాచరిత్రమందలి చిలుకయు విద్యావైదుష్యమునఁ గార్యసాధక నైపుణ్యమున శుచిముఖితో నెంతమాత్రమును దీసిపోవునది కాదు. ధనదత్తునికిఁ దానమ్ముడు పోయిన తరువాత నతనివ్యాపార మభివృద్ధియగుటకు నంగడిలోఁ గ్రొత్తమార్పులు తెచ్చిపెట్టెను. గడియలో వెయ్యార్లు గడన కాఁజొచ్చెను. ధనదత్తుఁడు ధనమునకుఁ గోడయ్యెను. కాని యతఁడేదో మానసికవ్యథ ననుభవించుచున్నట్లు శుకము తెలిసికొనెను. అతనికుమారుఁడు కుబేరదత్తుఁడు. విటనట వారనారీ పరాయణుఁడు. భార్య సౌందర్యరాశి. ఆమెను గన్నెత్తి చూడఁడు. చూచియే యుండలేదు. వీరిద్దరికిఁ గలయిక గలుగుటెట్లు? వీరి సంసారము మూడుపూవులాఱుకాయ లగుటెన్నఁడు? ఈ సందర్భమునఁ జిలుక చూపించిననేర్పు అసమానము. కుబేరదత్తుఁడు ఇలువీడలేదు. ధనదత్తుఁడు చిలుకను దనపాలిటి దైవమని తలంపని నిముసము లేదు.

పతివ్రతా చరిత్రమందలి కవిత సరళము సుందరము మధురము. శబ్దా లంకారములపైఁ గవికిఁ గొంత మోజు. అపూర్వములైన నానుడులు జాతీయములు పాలుతోఁ జక్కెరవలె భావములతో బెరసియున్నవి. ఇందలి ప్రయోగములు శబ్దరత్నాకరకర్త గ్రహించునంతటి ప్రామాణికత్వమును బడసియున్నవి. (చూ. శ. ర. 17 పుట. అచ్చాళు. అచ్చము+ఆళు= జంజాటము లేనివాఁడు. ఆళు. అన్య, దే)

కొన్నిపట్టుల గ్రంథాంతర సాదృశ్యములు చూపట్టుచున్నవి.

అలినీలవేణి!

దీని కులంబేమి దీని పేరేమి
యీనాతిపతి యెవ్వఁ డెన్నినాళ్లాయె
నిచ్చటి కరుదెంచి యేపని సేయు
నిచ్చంద్రముఖ దెల్పు మిదియెల్ల నవిన (ప. చ. పు. 121)

ఇయ్యరవిందగంధికుల మేమి చరిత్రము చంద మెద్ది పే
రెయ్యది నాథుఁ డెవ్వఁడిది యెచ్చట నెప్పుడు నుండు నిప్డు దా
నియ్యెడ కేగుదేవలయు నేపనిసేయఁగఁ బూని దీనిపై
నెయ్యము కల్గి యేకొలఁది నీమది కింతయు నాకుఁ జెప్పుమా

(భారతము. వి. పర్వ. 2 ఆ. ప. 40)

నీమంత్రి సత్తముం డీతఁ
డేనా! మహామహుండెపో యటంచు. (ప. చ. పుట 161)

వీరెవ్వరయ్య! ద్రుపదమ
హారాజులె! యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె! యహహా! మ
హారాజ్యమదాంధకారమది వాసెనొకో!

(భారతము. ఆది. పర్వ. 6 ఆ, ప. 89

పల్లవ గ్రాసకషాయ

కలకంఠ కలకంఠి గతి నిట్టులనియె. (ప. చ. పుట. 126)



బాలపల్లవ

గ్రాస కషాయకంఠ కలకంఠవధూ కలకాకలీధ్వనిన్,

(పారిజాతాపహరణము)

నాఁటిరే యొక్కక్షణమ్ముగ గావించె. (ప. చ. పుట. 176)

రాత్రిరేవ వ్యరంసీత్. (ఉ. రా. చరిత్ర)

భరతభూమి పతివ్రతాకరము. హరిహరబ్రహ్మలఁ బురుటిబిడ్డలఁ జేసి జోలఁబాడిన పురంధ్రీలలామ లెందఱో మనదేశమును బావనమొనర్చి యున్నారు. అట్టి పతిదేవతా దివ్యచరిత్రలను జదివి వారి నాదర్శముగఁగొని తమ జీవితమును దేశమును ధన్యతమము గావించు వర్తనము వనితాలోకమున కావశ్యకమైయున్నది. అట్టివారికీ గ్రంథము మిక్కిలి తోడ్పడఁ గలదని యాశింప వచ్చును.

"యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః"

ఈ గ్రంథమును తదితర ప్రతులతో సరిపోల్చి ముద్రణ ప్రతిని తయారు చేయుటలోను, ప్రూపులు సరిదిద్దుటలోను నాకు తోడ్పడిన పండితులుగా బనిచేయుచున్న శ్రీ. మ. శరభేశ్వరశర్మకు, శ్రీ. తి. శ్రీధరమూర్తికి నా కృతజ్ఞత తెలియ జేయుచున్నాను.

24-4-1958 తి. చంద్రశేఖరన్.

# విషయసూచి

# పతివ్రతాచరిత్రము

శ్రీమహితమహర్షి సేవ్యమై వెలయు । నైమిశారణ్యపుణ్యక్షేత్రమునను
శౌనకాదికమునీశ్వరులొకనాఁడు । జ్ఞానియా రౌమహర్షణిఁ జూచి యనిరి
మును శైలసుతకు శంభుఁడు పూర్వకథలు । వినిపించెనని బుధుల్ వివరింప మేము
వినియుందు మాకథల్ వివరింపవలయు । ననిన సూతుం డామహర్షుల కనియె
శ్రీకరచిరతపస్సిద్ధుల ఘనతఁ । జేకొన్న శివయోగసిద్ధులచేత
లోకబాంధవనిభాలోకంబుగని వి । లోకింపఁదగు భక్తలోకంబుచేత
దరము చూపెడు నిజోదరము చీఁకట్లఁ । దఱుము మాణిక్యకందరములచేత
నొనరు నీలప్రభావనము లార్యాభ । వనములౌ శృంగారవనములచేత
సరసిజప్రముఖకేసరములరుచి వి । సరములఁ బచ్చనౌ సరముల చేత
డంబుగా నుడులకూటంబుల నాయి । తంబులౌ రత్నకూటంబుల చేత
ప్రాఁగెంపురంగు కెంబట్టులపరపు । బాగొందనగు రచ్చపట్టులచేత
సరిలేని సిరులూని సవురొందు రజత । గిరియందు శరదిందుకిరణబృందముల
హసియించు పసమించు నంగంబు మెఱయ । నసమానలసమానహరినీలకాంతి
గడుదెప్పు మెడకప్పు కరమొప్పుగులుక । నిడికెంపు జడగుంపు నెఱసంజకావి
తలపింపఁ బలుసంపదల మించు యక్ష । కులనేత బలుభూతకోటితోఁ గొలువ
నజముఖుల్ గజముఖుండాదియౌదొరలు । భజియింప నొకనాఁడు భద్రాసనమునఁ
బేరోలగంబుండి భృంగిహాస్యంబు । భూరిహాస్యంబునఁ బ్రొద్దుపుచ్చుచును
తుంబురు నారదాదులపాట వినుచు । శంబరాంతకుకాంతఁ జక్కఁదనాన
నగజాలు రుద్రకన్యా సహస్రములు । తగునూడిగంబు లెంతయు భక్తిసేయ
విలసిల్లు తనభర్త విశ్వైకకర్త । ఖలదైత్యభటహర్త ఘనగుణోద్ధర్తఁ
గనుగొని హిమశైలకన్యాలలామ । తనహస్తములు మోడ్చి తగుభక్తి మ్రొక్కి
మొలకలేనవ్వు కెమ్మోవిపైఁ జిలుక । తళుకుఁజెక్కుల రత్నతాటంకరుచులు
తళతళగులుక చెంతల చిల్కతనదు । పలుకుఁజక్కెర యంచు బాళి వహింప
వినయంబు ప్రియమును విస్తరిలంగ । ఘనసుధామధురవాక్ప్రౌఢి నిట్లనియె

శివ శంకర మహేశ స్థిరసత్ప్రకాశ । యవధారు పరమేశ యాకాశకేశ
సకలలోకములకు సాక్షివి కర్త । వలంకకృపఁ బ్రోచు నాదిదేవుఁడవు
ఈ వెఱుంగనికథ లీప్రపంచమున । లేవుగదా కబళీకృతగరళ !
యేనెన్నడునుగాని యెఱుఁగనియవియు । వీనులవిందు గావించునట్టివియుఁ
గడువిచిత్రములు నొకథలాలకింపఁ । బొడమెఁ గౌతూహలంబు మనంబునందు
వినదగుధర్మముల్ వివిధవ్రతములు । మనురహస్యములు సమస్తతంత్రములు
నానతిచ్చితిరికదా యింక వింత । లైనకథల్ రహస్యంబుగా నాకు
వినిపింపవలెనని వేడుచునున్న । తనదేవి మోమునెత్తమ్మి లేనగవు
మొనయ వీక్షించి శంభుఁడు బోటి నీవు । విననికథల్ గలవే! ప్రపంచమున
నీవెఱుంగనికథ లేమున్నవైన । నే వినిపింతుఁ గొన్ని విశేషకథలు
వెలఁది రేపటినుండి విందుఁగాకనుచు । పలికి మర్నాఁడు రేపటిపూట గౌరి
బంగారు పనులయుప్పరిగపై తావి । చెంగల్వవిరులమించిన చప్పరంబు
లో విడికెంపుమేల్తూఁగుటుయ్యాల । నావేళవసియించి యలరుచు గిరిజ
వామాంకముననుండి వలనొప్పవినఁగ । నామహేశ్వరుఁడు బాహ్యద్వారసీమ
నందీశునునిచి యెంతటివారినైన । నిందురానియ్యకుమీ యనిపనిచి
యతివిచిత్రతరంబులై యింపొనర్చు । కతలు సెప్పఁదొడంగెఁ గడురహస్యముగ

## పుష్పదంతుని కథ

ఆయెడఁ బుష్పదంతాహ్వయప్రమథ । నాయకుం డభవు సందర్శించుకొఱకు
వడిఁ బాఱుదెంచి యవ్వాకిలిఁజొరఁగఁ । గడగిన నంది యెక్కడఁబోయెదీవు
నెలమిఁ బుత్రులనైన నిందురానీయ । వలదని సెలవిచ్చె వామదేవుండు
దేవికేమొ హితోపదేశమీవేళఁ । గావింపుచున్నాఁడు కడురహస్యముగ
నీకుఁబోఁగూడదు నిలువుమటన్నఁ । బోకనిల్చి వచించెఁ బుష్పదంతుండు
ఇదియేమి! నందీశ యెఱుఁగవే మమ్ము।మదనారి శయనించు మంజుతల్పమున
నవనవంబుగ మహానందుండు నేను । వివిధ ప్రసూనముల్ విస్తరించుటలు
ఏకాంతభక్తుల మీయీశ్వరునకు । మాకును నొకయడ్డమా! యిదేమయ్య
కన్నపుత్రులకన్నఁ గడుగారవించి।మన్నింపుచుండు మమ్ము మామహేశ్వరుఁడు

అని చనవరిగాన నలపుష్పదంతుఁ । డనియెడిపెక్కువాక్యము లాలకించి
యేల రెట్టించెద విదివేళగాదు । చాలు నింటికిఁబొమ్ము చనవరివౌట
తొలుఁగనౌ! సంవాదమేల నంచవలఁ । జొఱనీని నందికేశుని యాజ్ఞదాటఁ
దనకుఁ గూడమిఁ బుష్పదంతుండు మఱలి । చని కొంతవడి కదృశ్యప్రకారమున
వాయువువలె బహిర్ద్వారంబుసొచ్చి । పోయె మాయావిధంబున మీఁదుగనక
అతఁడిట్లు శంభుసేవాధికుండయ్యు । మతకరియై తనమాయపెంపునను
హరుఁడార్యకెఱిఁగించునవి యాలకించు । కొఱకు లోపలఁజొచ్చి గొబ్బున వరిగి
విరిచప్పరంబున వ్రేలెడు పువ్వు । సరమునఁ దేఁటియై సయ్యన వ్రాలి
హరుఁడు నాఁటికిఁ దెల్పు నక్కథలెల్ల । గురుబుద్ధియై పూసగ్రుచ్చినయట్లు
విని గ్రహియించి యవ్వేళకింటికిని । జనియె శంభుఁడు కథల్ చాలించెఁ గమక
చని తనప్రియుడైన జయకుఁదానాఁడు! వినినట్టి కథలెల్ల వేడ్కతోఁ దెలిపె
దినదినమ్మును మహాదేవుఁడీచంద । మున నపూర్వమ్ములై పొసఁగుసత్కథలు
లలనామణికి సప్తలతు లింపుగను । దెలిపె నన్నియు స్వబుద్ధివిశేషమునను
నెంతయుఁ దమి గ్రహియించి యాపుష్ప । దంతుండు తనతలోదరి కెఱింగించె
నీచందమునఁ బరమేశుచే గట్టు । రాచూలి బహువిచిత్రకథాచయంబు
విన్నదై యెవ్వారువినని యావింత । లన్నియు నావయస్యల కెఱిఁగించి
యాశ్చర్యహర్షధుర్యలఁ జేతు ననుచు । నిశ్చయించి సమాధినిష్ఠుఁడై శివుఁడు
నలరెడు నొక్కసాయంతనవేళ । బలితంపు విడికెంపుపని మేడమీఁద
చందురాతిన్నెపై సవరొందుమేలి । కుందనంపుమెఱుంగుకోట్లరాణించు
సకినల పట్టెమంచంబుపై వింత । రకమొందు నికరంపురాయంచగఱుల
పానుపుపైఁ బొంకపఱచిన మల్లె । పూఁనెఱతావి గుప్పునఁగుప్పు జిలుగు
చలువదువ్వలువపై సరిలేనిమిసిమి । తలగడమీఁద నందంబుగా నొరగి
రమణియొక్కతె కప్పురపువిడెమొసఁగ । కమలాక్షియొక్కతె కాళంజిఁబూన
వెలఁదులు నిద్దఱు వీచోపులిడఁగ । సొలపులాడి యొకర్తు సురటి వీవఁగను
కీరవాణియొకర్తు గిండిధరింప । చేరి పావడయొక్కచెలి పూని గొలువ
విద్యాధరి యొకర్తు వీణవాయింప । గద్యపద్యముల నొక్కతె ప్రస్తుతింపఁ
గొలువున్నయద్దేవిఁ గొలువ నేతెంచె । నలపుష్పదంతుని యంగన యపుడు

వచ్చి యద్దేవికి వలగొని మ్రొక్కి । హెచ్చు మచ్చికను రావే! జయ యనుచు
నంబ రావింపఁ దదంఘ్రుల యంతి । కంబునఁ దగు హొన్నుగద్దియ నుండి
పడతుక శ్రీగౌరిపాదముల్ తొడల । నిడుకొని యొత్తుచు నెలమిఁ గొల్వఁగను
చరణమ్ములొత్తెడు జయ మోము చూచి। గిరికన్య పలికె మిక్కిలి ప్రమోదమున
వినవిన నింపుగా వింతలౌ కథలు । వనిత నీకేమైన వచ్చునే యనిన.
ఏనేమి యెఱుగుదు నీశ్వరి! మీర । లానతిచ్చిన విందునటక యబ్బోటి
పతిచేతఁదావిన్న బహుకథలందు । సతికిఁ గొన్నిక్రమంబెసంగ విన్పింప
తప్పక జయఁజూచి తరుణియిట్టి కథ । లెప్పుడు వింటి నీకివి యెన్నివచ్చు
ననవిని జయ పల్కె నమ్మరో! యిట్టి । ఘనకథల్ పెక్కులక్షలు వచ్చుననిన
పవనసంచలిత దీపజ్వాలవోలె । శివ బుద్ధి చలియింప శీఘ్రంబె లేచి
యోగమంటపమున నున్నశంకరుని । నాగకేయూరుని నందివాహనునిఁ
జేరి కందోయికెంజిగి లోహితోత్ప । లారూఢిఁ దెగడఁ బేరలుక నిట్లనియె
ఓదేవ! నీవెంతయును సత్యవాది । వౌదువు నేఁడది యంతయుఁ దెలిసె
వనితలతో మృషావాదిగావచ్చు । నని యానతిచ్చితో? యదియును గాక
నన్ను వంచనచేసి నాచిత్తమరయ । నున్న యెన్నికయో! నిన్నోకఁడనఁ నేర
దొరలమాటలును వెదుల్లపందిల్లు । శరణాగతప్రియ! చక్కనగాదె
నావిని శంభుఁడెంతయు వెరగంది । యీ వేళ నోబాల యీకోపమేల!
నే యసత్యమ్ము నాయెడఁగంటి తెల్ప । వే యని కరమున నింతి రాఁదిగిచి
తొడమీద నిడుకొని తొయ్యలినొసట । నడరెడి ముంగురు లమర దువ్వుచును
నల్లన నవ్వుచు నడిగిన ప్రాణ । వల్లభుతో హైమవతి యిట్టులనియె
గరళకంఠ! యపూర్వకథలు మున్నెవ్వ। రెఱుఁగనియవి నాకు నెఱిఁగింపు మనిన
నంద తెఱింగినయవి యానతిచ్చి । రందున నలిగి యిట్లాడగావలసె
నావిని శంభుఁడోనలినాయతాక్షి! । యా వింతకథ లేవయస్యలచేత
నీవువింటివి నేఁడు నిజముగాఁదెల్పి । యావెలందిని బిల్వనంపు మిందనిన
ధవళాక్షి యను పుష్పదంతునిభార్య । యవు జయ కీకథ లన్నియువచ్చు
అది యెవ్వరెఱిఁగింప నాలకించినదొ । యదిగాన నివి రహస్యములుగావనుచు
మిమ్ము దూఱితినన్న మృత్యుంజయుండు । సమ్ముఖంబునకు నజ్జయను బిల్పించి

ఈకథ లెవ్వారలెఱిఁగించినారు । నీకు నిక్కము దెల్పు నీలోత్పలాక్షి
కల్లలాడిన నల్క గదురునటన్న । తల్లడపడి యది తనువు వడంక
కరములుమోడ్చి యీకథలెల్లదినము । పురహార ! మీబంటు పుష్పదంతుండు
వరుస నెక్కడ విని వచ్చునో యెఱుఁగ । నెఱిఁగించు నాకు పదేసి పదేసి
యిరువది ముప్పది యిటుపెక్కునాళ్లు । లెఱిఁగింప వింటి ననేకసత్కథలు
అక్కథల్ మాయమ్మ యడుగఁగాఁ గొన్ని।తక్క క తెల్పితి ధవళాంగ! యనిన
పుష్పాస్త్రదమనుఁ డప్పొలతుకమగని । పుష్పదంతుని రయంబునఁ బిలిపించి
నీకాంతకీవు విన్పించినయట్టి । యాకథ లెక్కడ నాలించినావు
కలది కలట్టె నిక్కము తెల్పుమనిన । తలఁకున వాఁడు వందనమాచరించి
గడగడ వణఁకుచుఁ గాలకంధరుని । బొడఁగని పలికె నోభూరిప్రకాశ !
అకలధౌతహర్మ్యమున మాయమ్మ । కేకతంబున మీర లెఱిఁగించుకథలు
వినగోరి నేరాగ వెస నడ్డగించె । నను నందు రానీక నందీశ్వరుండు
మంచిదే యని పోక మాయావి నగుచు । వంచనఁజొచ్చితి వాయురూపమున
నటుసొచ్చి సుమవితానాంతరస్ఫురిత । పటుమధువ్రతరీతిఁ బ్రాపించి యుండి
నానాఁటి కగజ కానతి యిచ్చుకథలు । నే నాలకించి నా నెలతఁకు జయకు
దినమును దెల్పుదు దేవాదిదేవ । విని యది యంబకు వివరించెనేమొ
యిది కల్లగాదన్న నిందుశేఖరుఁడు । తుదమొదల్గనక తం దూఱిన సతిని
నవ్వుచుఁజూచి మిన్నక నన్నుదూఱి । తివ్విధంబెఱుఁగక యింతి నీవనిన
నాగ్రావకన్య మహాగ్రహావ్యగ్ర । తాగ్రస్తయై పుష్పదంతుని కనియె
ఓరి ! దుర్మద ! ప్రమథోత్తములందు । పేరును బెంపును బెరసియుండుచును
మర్యాద యెంచక మాయాస్వరూప । ధుర్యత మమ్ము దోడ్తోడ వంచించి
యేకతంబున నుండి యీశుండు దెల్ప । నాకథలెటువలె నాలించినావు
అంతఃపురంబు మాయాజ్ఞ లేకిటుల । దంతిముఖాది, పుత్రకులును జొరరు
కడు శివద్రోహివి గావున నిన్ను । కడఁగి శపించెదఁ గష్టాత్మ ! వినుము
నీవు రాక్షసుఁడవై నిర్జనారణ్య । మావాసముగ నిల్చియాఁకట నొగిలి
పెద్దగాలంబు తపింతుగాకనుచు । గద్దించి శపియింపఁ గళవళమంది
మారుమాటాడ సమర్థుండుగాక । నీరుకన్నుల జాఱ నివ్వెర నున్న

వాని సఖుండన వలనొందు నల మ । హానందుఁ డేతెంచి యంబకు మ్రొక్కి
తల్లి ! నిన్ సేవించు దాసుని మీఁద । సెల్లునే కోపంబు సేయ నీలీల
తగిన విచిత్రకథల్ స్వామి దెలుపఁ । దగిలి యాలింపఁగాదా ! సేవకులకు
అది తప్పుగాఁగాని యామరయోని । నుదయింపుమని తిట్టు టుచితమే మీకు
కొంచెపు పనికింత కోపంబు మది వ । హించినఁ గాదన నెవ్వఁడున్నాఁడు
కలకాలమును సేవగావించుటకును । ఫలమటవమ్మ శాపంబొసంగుటలు
తగినభక్తుండొక తప్పుఁజేసినను । తగదె క్షమింప నో తల్లి యటంచు
నాక్షేప మొనరించు నమ్మహానందు । నీక్షించి మది కోప మినుమడి కాఁగ
కన్నుల కెంజాయ గడలు కొనంగ । నన్నగేంద్ర కుమారి యనియె నోరోరి
చెడుగవై మమ్ము శిక్షింప వచ్చితివె । యొడయని సేవ కర్హుఁడవు గావింక
నీవు మనుష్యయోని జనింపుమనిన । నావేళ భయకంపితాత్ముఁడై వాఁడు
చండికి నీశ్వరేశ్వరునకు నెఱఁగి । మండాడఁబోయిన మతియొండు దగిలె
నెన్నాళ్లకీశాప మెడయు మీపాద । సన్నిధిఁబెడఁబాసి చరియింపఁగలమె !
శాపమోక్షంబు ప్రసాదింపుమనుచు । నాపుష్పదంత మహానందు లడలి
వేఁడిరై కన్నీరు వెడలఁ గాసిలుచు । వాడిన శివుఁడు శాపవిముక్తి నింక
వీరిపై కృపయుంచి వివరింపుమనినఁ । గూరిమిపొడమి యక్కోమలి యనియె
పుడమి రత్నావతీ పురమున వైశ్య । కొడుకవై మతి రత్నగుప్తనామమున
జనియించి నీవు నిర్జనవనభూమి । దనుజుఁడౌ నీ పుష్పదంతునిచేత
గ్రహియింపఁబడి వీఁడు గణియించు కథలు । రహి విందువందున రాక్షసత్వంబు
విడిచి యెప్పటివలె వీఁడు మేమున్న । యెడకునేతెంచు నయ్యేడు లక్షలగు
కథలు లిఖించి లోకములఁ బ్రఖ్యాత । గతి నించి శాపమోక్షముఁ జెంది నీవు
నరుదెంచెదిటకు మహానందయనుచు । గిరిజ యానతియీయఁ గేల్దోయి మొగిచి
వారి యనుజ్ఞ చే వసుధ జన్మించి । యారీతి వర్తిల్లి రది యెట్లులనినఁ
బురపురఁ బొక్కుచుఁ బుష్పదంతుండు । పురహరుసతి శాపమున నొక్కయడవి
రక్కసుండై మహోగ్రతఁ బ్రవర్తిలుచు । నక్కడి మృగముల నాహరింపుచును
బశుపక్షిమనుజులఁ బట్టుచుఁ గ్రూర । దశఁ జరియించెఁ దత్కాలంబునందుఁ
గలఁడు రత్నావతీకటకంబునందు । కులపావనుఁడు ధర్మగుప్తుఁడన్పేరి

యూరవ్యశేఖరుం డొకఁడు ధర్మార్జ । నారంభుఁడై మించు నవైశ్యమణికి
నా మహానందుఁడ య్యగజశాపమున । భూమిపై రత్నగుప్తుఁడన జన్మించి
బాలత్వముననే కపర్దిపై భక్తి । గీలించి శమదమాకృతి యొతఁడనఁగ
యౌవనం బొదవినయపుడును బుధుల । సేవ మానక కులోచితవణిగ్ధర్మ
శాలియై యొకకొన్ని సమలు వర్తించె।నాలోన నొక్కనాఁడయ్యె యనుజ్ఞఁ
బరదేశముల ప్రియంపడి కొనఁదగిన । సరకులు పెరికల సాగించి కొనుచు
నితరభూముల విక్రయించి యనేక । గతుల లాభముగాంచి కలిగినధనము
తన తండ్రికడకంపి దానధర్మములు।నొనరించి యనుచరవ్యూహంబు ముందు
వెనుక రా నొకఁడు నవ్విపినంబు సొచ్చి । చనుచు మార్గము దప్పి శాంభవీశక్త
రక్షోవరాన్వితారణ్యంబు సేరె । నాక్షణంబున నొక్కయశ్వత్థవృక్ష
శాఖల ప్రేలు రాక్షసుఁడు వీక్షించి । నాఖరక్షుధదీర్ప నాపాలిభాగ్య
దేవత వీనిఁ దోడ్తెచ్చెనటంచుఁ । గ్రోవ కడ్డముసొచ్చి తోడిబడ మ్రింగఁ
గడఁగిన వైశ్యశేఖరపుత్రుఁడనియె । జడత నాఁకటగాని సాధుహింసనము
గావింపఁ జనునె భక్ష్యములు భోజ్యములు । నీవడిగినవెల్ల నేఁడె తెప్పింతు
గనుదనియఁగ తాళిగా సమ్ముఖమున।నునిచిన మృదులాన్న మోయన్న!తినుము
వను విడువుమటన్న నవ్వి రాక్షసుఁడు । మనుజమేదోరక్త మాంసముల్ చేతఁ
జిక్కియుండఁగ దీనిఁ జేకొనకింక। నొక్కఁడ నిను విడ నుపహారములకు
మనసొగ్గునే యెట్టి మతిహీనుఁడైన । తనచేతఁ జిక్కినదాని వర్జించు
కాలివానికిఁ బెమంగదలంచునోటు । చాలు నీమాట లీక్షణమున నిన్ను
తలఁబుచ్చకయె మ్రింగెద నటంచుఁబట్టె।బలిమి నీడ్వఁగ వైశ్యబాలకుండనియె
హరహర యింతమూర్ఖ్యము పూనఁదగునె।యెఱుకమైఁ జూచిన నీశ్వరేశ్వరుఁడు
నెల్లప్రాణులయందు నేకాత్ముఁడగుచు । మల్లసిల్లుచునుండు నోదానవేంద్ర!
తనవలె సకలభూతముల నీక్షించు । ఘనుఁడు సాయుజ్యమ్ముగను శివునందు
నేనురాకున్న నీకోటుల నీక్షుత్తు । మాను నించుకక్షమింపవకట నీవు
అని శివస్మరణసేయఁగ వాని సంగ । తిని దానవునకు జాతిస్మృతివొడము
తనలోనఁ దా పుష్పదంతాహ్వయుండ।ననియు మహానందుఁడ వైశ్యుఁడనియు
తెలిసి హారని యేడ్చి దీనత నతని । నెలమిఁ గౌఁగిటఁ జేర్చి యిట్లని పలికె

వోయి మహానంద యో సదానంద । యో యురుగుణబృంద యోధర్మకంద
నానిమిత్తమ్మగా నాఁడు శర్వాణి । తోనీవు కలహించి దూఱు చెందితివి
నాకతంబున నీకు నరజన్మమొదవె । నీకతంబున శాపనిర్ముక్తిగలుగు
నాకిఁక దడవేల నాఁడు నేవిన్న । యాకతలెల్ల నీ వాలింపుమన్న
నతఁడును సుజ్ఞానమావిర్భవింప । మతి నుత్సహించి యోమహనీయశీల !
ఏడులక్షల కత లీవు దెల్పుటకు । నేడాదిపట్టు నేనెటు లన్నినాళ్లు
నిరశనత్వంబున నిద్దురలేక । చరియింతు నీయొద్ద జడవృత్తిఁజేసి
మానుషజన్మ సంబంధంబు వలన । నేనంటి నీమాట నీతోడ ననిన
నగి పుష్పదంతుఁడన్నా !శంకయేల । యగజాకటాక్ష మాహాత్మ్యంబు వలన
నీకు నాఁకలి దప్పి నిద్దుర జడత । లేకుండు నాకథల్ లెస్స యాఁకొనుము
కలవీ వనంబున ఘన భూర్జపత్ర । ములు పచ్చికస్తూరి పొదలు నిప్పొదల
నవిగొని నే దెల్పునట్టి సత్కథలు। సవరొంద వ్రాయుమా! చతురాత్మయనుచు
నన్నియు జతగూర్చి యావైశ్యుఁ డనదు । సన్నిధి నిడికొని శంకరాభిహిత
సప్తలక్షకథా వ్రజంబును దెలిపె । సుప్తిలేకతఁడు వించు లిఖించుకొనఁగ
నాతేడు నెలలకీ యనువున కథలు । తీఱ వ్రాయింప నద్దేహంబుమాని
తనరూపుగని పుష్పదంతుండు ప్రమథు। లనుసరింపఁగ విమానారూఢుఁడగుచు
నావైశ్యుఁగాంచి యన్నా పాపముక్తి । నీవలన ఘటిల్లె నిద్దురవోక
చనుమింటికడకు మజ్జనభోజనంబు । లొనరించి సుఖనిద్ర యొందుమచ్చోట
హరుని చెంగటికి నే నరిగెద నీవు । ధరనిక్కథల్ ప్రసిద్ధతనందఁజేసి
యరుదెమ్ము కొన్నాళ్లకని ప్రబోధించి । పరమేశుగూర్చి తపంబుగావించి
చరితార్థయైయున్న జయతోడఁగూడి । పరమోత్సవంబున భవుఁజేరియుండె
నిటరత్నగుప్తుండు నెలమితో నాత్మ।కటకంబునకుఁ బోవఁగడఁగి యా కథల
పొత్తరల్ గొని మార్గమున నొకసరసి । హత్తి కృతస్నానుఁడగుచుఁ దత్తీర
వనభూమి ఫలములవ్వారిగామెక్కి । తన శ్రాంతిదక్కి చంద్రశిలావితర్ది
దళముల పొత్తర తలక్రింద నునిచి । నెలకొని శయినించి నిద్దురఁజెందె
కమల సౌగంధికగంధసమీర । సముదారతర శైత్య సౌరభ్యమాంద్య
గతులనెమ్మెయిఁగ్రమ్మఘర్మాంబుబిందు। తతులుదొలంగనిద్రాసౌఖ్యమొంది

నెలలుకొన్ని క్రమింప నెరిదప్పి యతని । తలక్రిందనున్న పత్రములపొత్తరలు
వదలి నల్దిక్కుల వాయువశమునఁ । జెదరిన వేఁటవచ్చిన శకాధిపుఁడు
నయ్యాకు లొకకొన్ని యనుచరసమితి । సయ్యనఁ దెచ్చినఁ జదివి యాకథల
సారస్యమున కాత్మ సంతోషమంది । చేరువదవ్వులఁ జెదరిన పర్ణ
చయములు గూర్చి లక్షకథల్ సమగ్ర । మయిన పల్లకిమీఁద నక్కట్ట యునిచి
తనపురంబునకేగి తత్కథలెల్ల । ననఘుఁడా క్షేమేంద్రుఁడను వానిచెంత
నిలిపిన నాతఁడన్నియుఁ జదివికొని । భళి మంచికథలని పరితోషమంది
యారాజుఁ బ్రార్థింప నా లక్షకథలు । ధారదప్పక సంస్కృతమునఁ గావించె
నప్పురాణము భూమి నందందు వెలసె । నప్పుడు కొన్నాళ్లక వైశ్యసుతుని
తలక్రిందనున్న పత్రములపొత్తరలు । నలుగడఁ జెదర గంధర్వులుగొన్ని
గరుడులుకొన్ని రాక్షసులొకకొన్ని । యురగులుగొన్ని సాధ్యులుమఱిగొన్ని
యమరులుగొన్ని విద్యాధరుల్ గొన్ని । క్రమమునఁ గొనుటలోకము లెల్ల నిండ
అంతనిద్దుర దేఱి య వైశ్యసుతుఁడు । చింతించి తలక్రిందఁ జేర్చినకథల
పొత్తరల్ కానక పొగులుచునున్న । యత్తెఱంగెఱిఁగించె నాకాశవాణి
యావాక్యములు విని యతఁడు హర్షించి । దైవయోగమున కథల్ ఖ్యాతిఁ జెందె
నింతియచాలు నింకేమిటికింక । సంతాపమని తన జనకునిఁ జేరి
కొన్నేండ్లువర్తించి కులములో ఖ్యాతి । గన్నవాఁడై శంభుకారుణ్యమునను
శాపంబు దీఱిన స్వస్వరూపంబు । ప్రాపించి పరమేశుపజ్జకు నరిగె
ననిసూతుఁ డెఱిఁగింప నాశౌనకాదు । లని రో మహాత్మ మున్నంబకు శివుఁడు
తెలిపినకథల నాదిమకథయెద్ది । తెలుపవే యన నక్కథికుఁ డిట్టులనియె
అంబకు లోకరక్షావలంబకును । త్ర్యంబకుఁడాది నిట్లని సెప్పఁదొడగె
పరమవైభవమునఁ బంటవలంతి । భరియించు మణిమయాభరణంబు లీల
బంగారుమేడలఁ బరగువాడలను । శృంగారవనముల శ్రీతపవనముల
మహితతోరణముల మదవారణముల । రహిమించు వీథుల రత్నవేదులను
అమరుపేటలను మిన్నాగుకోటలను । సుమవితానముల భాసురవితానముల
భవనికేతనముల పటుకేతనముల । జవరాండ్రహేలల చంద్రశాలలను
అనఘశృంగములఁ జెన్నగు వలంగముల । బలువైన దళముల బలుకొత్తళముల

అనఘులౌ పాఱుల నత్యుదారులను । సనయభూరమణుల సద్వైశ్యమణుల
బహువీరభటులను పటువీరభటుల । నహితులడాకల నడఁచుమూఁకలను
దీపించు చంద్రావతీనామపురము । భూపాలకృత పుణ్యములకు దాపురము

## చండప్రతాపుని కథ

ఆపురం బేలు న్యాయమునఁ జండప్ర । తాపభూపాలుండు దర్పితారాతి
జాలవిభాళుండు సత్యధర్మైక । శీలుండు సంతతాశ్రిత కృపాళుండు
ఆ యినుండెపుడు నర్థార్థిదారిద్ర్య । మాయాంధకారసంపత్తి మాయించు
నారాజు విద్వజ్జనాలోకవికచ । కైరవామోద సంఘటకుఁడై మించు
ఆప్రజానేత సత్యావనోత్సాహ । ధీప్రాప్తభాషారతిన్ బ్రవర్తిల్లు
నీరీతి సద్గుణాన్వితుఁడై మెఱయు । నారాజచంద్రుని యర్ధాంగలక్ష్మి
చారుశీలానామ సాధ్వీలలామ । శౌరి కిందిరవోలె సతతంబు మెలఁగు
నతనికిఁ గలరు మహామాత్యవరులు । ద్యుతివిభావసులు నిర్దోషమానసులు
కీర్తిమంతుఁడు చారుకీర్తియు దేవ । కీర్తి మఱియు సత్యకీర్తి సుకీర్తి
యలపృథుశ్రవుఁడు మున్నైన పదుండ్రు । బలభేదిగురునిభ ప్రతిభలమీఱి
సలలితప్రీతి నచ్చండప్రతాపుఁ । గొలుతురు నయమార్గకుశలత లోదవి
యలికాతునకు దశహస్తముల్ వోలి । యలమంత్రులెపుడు సహాయులై మెలఁగ
కరవాలమొక్కటి ఖరకరకరుణ । వరముగాఁ బడసె నవ్వసుమతీశ్వరుఁడు
ఆ మహీతలభర్త యాదిత్యదత్త । హేమమాలిక ధరియించి తత్కాంతి
మండలం బఖిలభూమండలి నిండ । రెండవ మార్తండురీతి వెలుంగు
ఆ మణిమాలిక నతని తాతకు న । భోమణి కరుణించెఁ బూర్వకాలమునఁ
గావున నది కులాగత యౌట నతఁడు । నేవేళ ధరియించి యిలయేలుచుండు
నతనిపట్టపుదేవి హారురాణిఁగూర్చి । సతతంబువ్రతములు సలుపుచు వెలయు
నక్కాలమున శౌర్యమడర నుజ్జయిని । తక్కక పాలించు ధారుణీశ్వరుఁడు
విక్రమకేసరి విమతేభహరణ । విక్రమకేసరి వేగరుల్ దెలుప
చండప్రతాపుని సామ్రాజ్యలక్ష్మి । చండాంశుదత్తకాంచనహారమహిమ

విని సహింప కనూయ విరివిగా మదిని । తనచెంత కొక్కదూతను బిల్చిపలికె
వేగరి రారోరి వేగ నీవిపుడె । యేగి చంద్రావతి కేలికయైన
చండప్రతాపుని చక్కని నిల్చి । నిండుకొల్వున్నవానికి నిట్టులనుము
ఉజ్జయినీనాథుఁ డొడయుండు నాకు । ముజ్జగమ్ములఁ గీర్తి ముంచినాఁడతఁడు
కృతిమాళి విక్రమకేసరి శౌర్య । జితహేళి యతని గొల్చి తదీయకరుణ
బ్రతికిన నృపతులు పదివేలుగలరు । మతినిది తలపోసి మహినాథ! నీవు
కానుకగా నీదుకంఠహారంబు । మానృపాలునకిచ్చి మన్ననగనుము
హారమిచ్చిన మంచిదటుగాక రణ వి । హారమెంచిన మంచిదని చెప్పిరమ్ము
చనుమనన్వాఁడేగి చండప్రతాప । జననాథజంభారి సన్నిధిఁబలికె
నీకడ కుజ్జయినీనాథుఁడనుప । నాకార్యమెఱిఁగింప నరుగుదెంచితిని.
అతఁడు నీమెడ రత్నహారంబొసంగి । బ్రతుకుమటంచుఁ దెల్పఁగఁబంచె నన్ను
ఆరీతి నీకున్న నతనికి నీకు । ఘోరాహవంబగు గోరనొ పనికి
గొడ్డలి యేల చేకొనుము నాపలుకు।గొడ్డుసేయక యన్నఁ గువలయేశ్వరుఁడు
పకపక నగి మంచిపని కంపె నిన్ను । వెకలియై మీరాజు విపరీతబుద్ధి
ఇది వినాశమునకు హేతువటంచు । మదినెఱుంగఁడు పాలుమాలిసిఁబోలి
వేలువాచిన రోలువిధమాయెనన్న । రోలువాచిన నెంతయాపగుఁజెపుమ!
కప్పగంతుల వార్ధి గలఁగునే నిన్న । కుప్ప నేఁడాళ్లెంత కొరగామిఁదలఁచె
తన ప్రతాపంబెంత తానననెంత । నను దనుగొలువు మన్నాఁడెంతవింత
హార మీకున్న గయ్యు మొసంగు మనుట । సారంబు మాకది సంతోషమయ్యె
రమ్మను రణము ఘోరమ్మనుప్రాణ । మిమ్మను మాచేతిహేతికి భీతి
గ్రమ్మిన శరణొంది కానుకలిచ్చి । మమ్ముసేవించి నెమ్మది మను మనుము
తమి నపుంసకుఁడు కాంతనుగోరినటుల । కుమతియై హారమ్ముగోరె మీరాజు
ఇమ్మాట లెల్లమీయేలినవాని । సమ్ముఖమ్మునఁ జెప్పి సమ్మతంబైన
పనిసేయు మనుమని బహుమతివాని । కనుపమభూషాంబరాదులొసంగి
పనిచినవాఁడును పతిచెంతకరిగి । జననాథుఁడాడిన చందమ్ముదెల్ప
పీఠులశిఖులుట్ట విక్రమకేస । రితిమీంద్రుండు మంత్రిజనమ్ము జూచి
వింటిరే సభవారు! విభవదర్పమున । దంటయై చండ ప్రతాపుఁడాడినది

హారమాత్రంబు మేమడిగిన నియ్య । నేరక తనప్రోలు నిఖిలరాజ్యంబు
ధనవస్తువాహనోత్కరములోఁ బ్రాణ।మునునియ్యఁదలఁచెదుర్బుద్ధియైయనుచు
మునుకొని రణభేరి మ్రోయింపఁబనిచి । యనికి జత్తాయత్తమై బయల్దేరి
మంతురుల్ దొరలు సామంతులు హితులు । చెంతలఁగొలువ రాజితరత్నఖచిత
కేతన పటపటాత్కృతి కింకిణీర । వాతత ద్వాదశహాయ హేషితోగ్ర
ఖరతరఖుర సముత్కరఘట్టనోత్థ । నిరవద్య పెటపెట నినదానుకారి
ఘనచక్రకట్క ఘర్ఘరదీర్ఘఘోష । జనితాష్టదిక్సామజశ్రవోబధిర
కలనా ధురంధరకాంచనరథము । వెలయు వేడుక నెక్కి వీరభటాళి
యార్భటుల్ తౌరంగికాదభ్రచాప । నిర్భరటంకారనినదముల్ మత్త
కరటి ఘీంకారముల్ కాంచనగ్రావ । సురథ నిస్సాణవిస్ఫురణమ్ము లెనసి
భూనభోభాగముల్ బూరటిలంగ । సైనిక సింహగర్జలు వందిజనుల
సాహోనినాదముల్ సందడిలంగ । బాహుభవాయుధ ప్రభలు మిన్ ద్రింగ
బలసముద్గత రజఃపటలి చీకటుల । బలియింప లయకాలభైరవస్ఫూర్తి
దీపింపఁ జంద్రావతీపురిమీఁద । నాపార్థివుఁడు వచ్చు నవసరమ్మనను
చారులుదెల్పఁగాఁ జండప్రతాప । ధారుణీనేత శాత్రవురాక యెఱిఁగి
అలచారుకీర్తి మున్నగుమంత్రివరుల । పిలిపించి యవ్వార్త పెరిమతోఁ దెలిపి
వారితో సైనికవరులతో బిరుదు । వీరులతో భటశ్రేష్ఠులతోడ
గజహయరథ సముత్కరముతోనపుడె । నిజపురివెలువడి నిర్ఘాతపాత
దారుణనిర్ఘోషధర్షణోదీర్ణ । భేరీధణంధణల్ పెల్లుగా మొరయ
నరిసేనఁదాఁకిన నయ్యిరువాఁగు । దొరలును దొరలు మంతురులు మంతురులు
తౌరంగికులు మహాతౌరంగికులును । తేరులవారును తేరులవారు
వారణారూఢులు వారణారూఢు । లారభటులఁ గ్రూరులగు వీరభటుల
వీరభటుల్ దాఁక విచ్చుకత్తులను । శూరులై నఱకుచు శూలంబులెత్తి
పొడుచుచు సురియలఁబొదవుచు గదల।నడఁచుచుఁ బరశువులడరి వ్రేయుచును
పట్టిసములఁ దొట్రుపఱచుచుఁ గశలఁ । గొట్టుచు నీటెలఁ గూలగ్రుమ్ముచును
ప్రాసముల్ నిగిడించి పంది బల్లెముల । వ్రేసి కటారుల విదళించి నొంచి
పేరులువాడుచుఁ జెక్కుచందముల । నారెండుతెగల వారటులఁ బోరఁగను

తెగుహారుల్ దిర్దిరఁదిరుగు నేనుఁగులు । నొగులు తేరులుఁగ్రుగ్గినుగ్గైనభటులు
ఛిన్నమ్ములగుకాళ్లు చినిఁగినజోళ్లు । భిన్నమ్ములగు వ్రేళ్లు పిగిలినతోళ్లు
సడలినసొమ్ములు జాఱునెమ్ములును । వెడఁగులౌ మెడలును విరిగినతొడలు
పాఱెడినెత్తురుల్ పలలాశదిశలఁ । బాఱెడు భూతముల్ భయముఘటింప
పోరుఘోరంబైన భూపాలురిరువు । రోరసిల్లక తాఁకి రుగ్రహుంకృతులఁ
గినుకతో విక్రమకేసరియపుడు । తన తేరుచండప్రతాపునిమీఁదఁ
బరపించి హయముల పదిమార్గణముల । శరపంచకంబున సారథి నొంచి
యొకకోల నాతనియురమునొప్పింప । మొకమెత్తఁ బాఱ నమ్మూర్ధన్యుఁడలిగి
విలునారిసారించి విలయకాలాగ్ని । వలె నుగ్రుఁడై రెండు వాఁడిబాణముల
ఆరాజుకేతనంబవనిపైఁగూల్చి । సారథి మూఁడింటఁ జక్కఁగావించి
హయములఁ బంద్రెంట నవనిపైఁగూల్చి । భయదాస్త్రమేసి చాపము నుగ్గుఁజేసి
సునిశితాస్త్రద్వయి జోడుచించినను । దనమేన నవరక్తధారలుదొరుఁగ
విక్రమకేసరి వీడని భుజప । రాక్రమంబున ఖడ్గహస్తుఁడై ధరకు
సరగున లంఘించి చండప్రతాపు । శరములు పలకచే జడియుచుఁగదిసి
కరవాలమున వ్రేయఁగడఁగినరాజ । వరుఁడు ఖడ్గము ద్రుంచివైచి కేడెంబు
పరియలుచేసి పైఁబడి వానిరెండు । కరములు బిగఁబట్టికాంచనరథము
పైకితాఁగొనిపోయిబలువైనత్రాళ్ల । వీఁకతోబంధించి వెసఁ గూబరమున
నంటగట్టించి జయానకార్భటుల । మింటఁబ్రతిధ్వనుల్ మిక్కుటంబుగను
వందిమాగధుల కైవారంబులొలయ । ముందరవెనుక బల్ మూఁకలు నడువ
పదువురుమంత్రులు పరమానురాగ । మొదవగాఁ దను నుచితోక్తులఁబొగడ
నలరుచుఁబురిఁజేరి హర్మ్యవాసినులు । చెలువొప్ప ముత్యాలసేసలుసల్లఁ
జనితేరుడిగ్గిహజారంబుసొచ్చి । కనకపీఠిక నోలగంబుననుండి
విరిచికట్లనుబడి విన్ననై యున్న । యరిరాజుగని మందహాసంబుతోడ
నేమి విక్రమకేసరీ! కంఠమాలి । కామణిఁ గావించి కాకైతివిటుల
పరులసొమ్ముల కాసపడి దుండగములు । దొరకొనిసేయంగ దొరలకు నగునె
చేతఁజిక్కిననిన్ను ఛేదింపనొల్లఁ । గాతరత్వముమాను గాచితిననుచు
తనుగొల్చువారలద్దయుఁదద్దయును । దనరఁగీర్తింప నాతని విడిపించి

ఘనభూషణాంబర గంధమాల్యములు । నెనరుతో నిచ్చిమన్నించి వీడ్కొలిపె
అట్టిదకాదె దయాళులౌనృపులు । పట్టువడినవాని భంజింపరెందు
ఖిన్నుఁడై విక్రమకేసరి యంత । కన్నవారలు కేరగాఁ బ్రోలు వెడలి
చెన్నేది చని హతశేష సైన్యములు । కొన్ని యాడాడ తన్గూడి కొల్వఁగను
నుజ్జయినికిఁ బోయి యుసురుసురనుచు । సెజ్జపై మైవైచి శివశివాయింత
యాగడంబైతిగా యహితునిచేత । నేగతి బ్రదుకుదు నింక సిగ్గులేక
వెతదీఱఁ బ్రాయోపవేశంబుచేసి । శితిమూర్తి కొప్పగించెద శరీరంబు
ననియుద్యమము సేయునతని యుద్యమము।విని మంత్రనిధియను విప్రపుంగవుఁడు
నతని పురోహితుఁడప్పుడెవచ్చి । క్షితినాథ ! యిదియేమిసేయఁబూనితివి
శివుఁడుశంభుఁడు సదాశివుఁడు మాధవుఁడు । భవుఁడభవుండు నీపాలిటఁగలఁడు
హరుని నమ్మినవారి కాపదల్గలవె । కరమొప్ప ధర మహాకాళేశ్వరుండు
తారకేశుఁడు వియత్తలమున నధికుఁ । డారసాతలమున హాటకేశ్వరుఁడు
కడుఁబ్రసిద్ధుండు ముక్కంటి మూఁడెడల।కొడయుఁడై భక్తుల కొసఁగు కోరికలు
కావున శ్రీమహాకాళేశుఁబూజ । గావింపు రేపాదిగా క్షమానాథ!
ఒకయేఁడు గొలువుమార్యులఁ గూడి నీకు।సకలశాత్రవరాజజయమిచ్చుశివుఁడు
అని పురోహితుఁడు హితార్థంబుదెల్ప । విని యమ్మహీపతి విశ్వాసమొదవ
నతనిఁబూజించి తదాజ్ఞ మర్నాఁడు । క్షితిసురోత్తముల విశిష్టులఁగూడి
యామహాకాళేశు నాలయంబునకు । నేమంబుతోఁ దపోనిష్ఠవహింప
జపము ధ్యానమ్ము తచ్చరణపూజనము । విపులభక్తి నొనర్చు వేదోక్తవిధిని
నభినవక్షీర తైలాజ్యాదికముల । నభిషేచన క్రియ లమ్మహేశునకు
నొనరింపఁ బంచె నహోరాత్రములును।పనిఁబూని పూజించుఁ బదియాఱువగల
నీరీతి నొక్కయేఁ డిభచర్మవసను । గూరిచి భజియింపఁగువలాప్తధరుఁడు
బసువనినెక్కి డా పలిచక్కనున్న । కుసుమకోమలి మెఱుంగుల రంగుగులుక
విమలాంగరుచి పండువెన్నెలల్ గాయ । నమరాపగామణి యౌదల మ్రోయ
మువ్వన్నెపచ్చడంబు భుజాగ్రమొరయ । నవ్వలివ్వలఁ బ్రమథాధిపుల్ గొలువ
నొకనిశావేళ నయ్యుజ్జయినీంద్రు । నకుఁ బ్రసన్నుండైన నవనవప్రీతి
భయమును వినయమ్ము భక్తియు మెఱయ।జయకాముఁడమ్మహీశ్వరుఁడట్టలేచి

పెక్కువందనము లర్పించిఫాలమునఁ । జక్కనంజలిఁ జేర్చి చతురోక్తిఁబొగడె
శరణుగౌరీనాథ శాంతిసనాథ । శరణుచంద్రకలాప చైతన్యరూప
శరణుమన్మథభంగ సదయాంతరంగ । శరణు వార్థినిషంగ సత్యప్రసంగ
నన్ను నవ్యాజబాంధవుఁడవై ప్రోవ । సన్నిధిఁజెన్నిధి సరణిఁదోఁచితివి
నిన్నుసన్నుతి సేయ నేనెంతవాఁడ । నన్న, శంకరుఁడు నీయభిమతంబేమి
వివరింపుమనిన నవ్విశ్వేశ్వరునకు । సవినయస్ఫురణ నుజ్జయినీశుఁడనియెఁ
జండప్రతాపుని సంగ్రామభూమి । ఖండించి జయమందఁ గాంక్షచేసితిని
ఇంతమాత్ర మొసంగి తేని నాపాలి । కెంతేని బ్రహ్మాండ మిచ్చినట్లనిన
హరుఁడు నవ్వుచుఁ బల్కెనక్కట నీకుఁ । గరమల్గి యేతప్పు గావించె నతఁడు
అనిదానవిద్వేష మతనిపైఁజేసి । యని నొచ్చివచ్చితి వదియునుగాక
చేతఁజిక్కిన నిన్ను జెడఁజూడ కెలమి । చేత రక్షించె నాక్షితివరోత్తముఁడు
హరిభక్తుఁ డరిజైత్రుఁడాదిత్యదత్త । వరరత్నహారభాస్వర ఖడ్గధరుఁడు
అతని పట్టపుదేవి యతిసాధ్విగనుక । క్షితినెవ్వరికి వాని గెలువగారాదు
సాధువర్తనుఁడౌట చాలఁజెప్పితిమి । యేధమాన ద్వేష మెడవీడవేని
గద యొక్కటిచ్చెదఁ గైకొనిదాని । మొదట వేయక రాజముఖ్యునిసేన
చేత నీసేన నొచ్చినవేళ శత్రు । జేతయై యతఁడు హెచ్చినవేళఁజూచి
ఇది ప్రయోగింపు మహీనసత్త్వమున।హదివి వారి ససైన్యముగ సంహరించు
దొలితాఁకునన వానిఁ దునిమెదననుచు । బలుగదవైచినఁ బగతునిచేత
నది ఖండఖండమ్ములగు సుమీ యనుచు । గదయిచ్చి మదనారి కనఁబడకరిగె
దేవుఁడంతర్థిఁ జెందిన సమయమున । నావిక్రమమృగేంద్రుఁ డానందమంది
హితులమంత్రులఁ బురోహితుల రావించి । శితికంఠుఁడెలమినిచ్చినగదఁజూపి
యొకశుభవేళ రణోద్యోగమూని । సకలసేనలు వెంటఁ జనుదేరవెడలె
నావార్త వేగు వారరుదెంచి తెలుపఁ । దావిని చండప్రతాపభూవిభుఁడు
తనమంత్రివరుల కందఱ కవ్విధంబు । వినిపించి యిఁకనొండు వినుఁడని పలికె
హరుఁడొసంగినగద యది రిత్తసనునె । పఱతెంచి మనసేనఁ బరిమార్చుగాక
అందున నపజయంబగు నవశ్యంబు । దండడివచ్చినఁ దప్పింపరాదు
ఒకయుపాయం బిప్పుడూహించి తెలుపుఁ । డకలంకమతులార యనవారిలోనఁ

చారుకీర్తి సుబుద్ధిసంపన్నుఁడగుట । ధారుణీభర్తతోఁ దగనిట్టులనియె
మనపురిలో నింకమణివస్తువాహ । ధనభూషణాంబరోత్కరముంపరాదు
చారుశీలాముఖ్యజలజలోచనలఁ । జేరికొ బంధులఁ జెలుల నీక్షణమె
పగటికిఁ జొఱరాక బహుదుర్గమార్గ । మగు కోహాళ మహర్షియాశ్రమస్థలిని
జేరిచి మనము నిశ్చింత నేతెంచి । యారూఢి బలయుక్తి నచ్చాళిగాఁగ
ననికి సన్నద్ధులమై యుండమవల । ననుభవింపుదము దైవాజ్ఞ నయ్యెడిది
అనిన నందఱు మెచ్చి రధిపుఁడాలాగె।యొనరింత మని కోహాళోపాంతమునకు
దాను మంత్రులునేఁగి తపసిదర్శించి । యానిశ్చయము దెల్పి యమ్మౌనియాజ్ఞఁ
దనవారినెల్లఁ దద్వని నొక్కదుర్గ । మునను౦చి ధనరత్నములు నందె దాఁచి
చంద్రావతికి వచ్చి చతురంగసైన్య । సాంద్రకోలాహలస్ఫారుఁడై యుండె
అటుల విక్రమసింహుఁడభవప్రదత్త । పటుగదాభీలుఁడై పౌరుషంబమర
నడగొండల బెడంగునఁజెలంగుకరులు।వడిఁ బవమానుకై వడి మీరుహరులు
నలరోహణాద్రుల ట్లమరు తేరులును । ప్రళయభైరవ సముద్భటులైన భటులు
లెక్కకెక్కువయై చలింపక కొలువ । నొక్క మహారథంబుద్ధతి నెక్కి
చండప్రతాపభూజాని పట్టణము । దండ భండనకాంక్షఁదగదండువిడిసె
చంద్రావతీశుండు సముదారహీర । సాంద్రచక్రాష్టకోచ్ఛ్రియ పద్మరాగ
ఘటితధ్వజానేకఘంటికాచ్ఛత్ర । పటలవైదూర్యకూబరశోభమాన
గారుడోపలవర్ణ కమనీయతురగ । చారుచామీకరస్యందనంబెక్కి
దశదిశలద్రువ నుద్భట వృత్తిమంత్రి।దశకంబు వెనుకముందరఁ బార్శ్వములను
బహుళ సేనాపరంపరలతోఁ గొలువ । నహితునిపైఁజని యదరంట దాఁకి
యరదముల్ తుండించి హరులఖండించి।కరులఁ ద్రుంచిభటప్రకాండంబుద్రెంచి
మన్నీల నొంచి సామంతులజంచి । వెన్నాడిరథికులవి ముఖులఁ జేసి
యార్చినఁ జెలరేగి యారాజుమంత్రు । లేర్చినభటులతో నేపగ్గలించి
పరసేన తటిమిన భయమంది వార । లరిగి విక్రమసింహు నంచెలఁజేర
వెరవకుండని వారి విముఖత మాన్పి । హరి శరభము దాఁకు ననువునఁ గనలి
చండప్రతాపుని శరముల నొంచి । కాండ మొక్కటి వైచి ఖండించి సూతు
వాస వానిమంత్రుల విముఖులఁ జేసి।యసమాస్త్ర రిపు దత్తమగుగదాయుధము

బిరబిరఁ ద్రిప్పి యప్పృథివీశుమీఁదఁ । బరువడి వైచిన ప్రళయాగ్నిశిఖలు
గ్రక్కుచు నమ్మహాగద పైకిరాఁగ । గ్రక్కున రవిదత్తఖడ్గ మంకించి
గద పదితునుకలుగా నఱుకుటయు । నది యమోఘముగాన నందొక్క తునుక
చండప్రతాపువక్షము దాఁక నతఁడు । గండారి త్రెళ్లి నొక్కటఁ దేరిమీఁద
వత్తేరు గొనిపోయె వారులు భీతిల్లి । యత్తఱిఁ గోహళు నాశ్రమంబునకు
నచ్చోటి వటభూరుహంబుల నడుమ । చొచ్చి గుఱ్ఱము లీడ్చుచో రథస్తంభ
గత కేతనంబు శాఖలఁ జిక్కికొన్న । కతన రథంబుపోక మఱట్టి నిలిచెఁ
బగ్గముల్ ద్రెంచుక పరువునఁబోయి । యగ్గుఱ్ఱములు కోహళాశ్రమసవిధ
గిరిహాంతరవీథిఁ గీడ్పడియున్న । తెఱఁగెల్ల నద్ధరాధిపుదేవి చూచి
పతిరథ్యములు తొట్రుపడి వచ్చె నృపతి।మృతుఁడయ్యెనో యని మిగుల శోకించి
ప్రొద్దుగ్రుంకిన కతంబునఁ దమంబడర । నెద్దియుఁగానక నేడ్చుచుఁ బోయి
వటభూరుహముల క్రేవలఁ బ్రలాపించి।యట దేహము త్యజింతు నని నిశ్చయించి
యొకయూడఁ గుత్తుక నురి వెట్టుకొనఁగ । నికటరథస్థుండు నృపతి యాలోనఁ
దెప్పిరి యప్పురంధ్రీమణిఁ గదిసి । యొప్పునే యిప్పని యువిద నీకనుచు
మెడ యురిఁ దప్పించి మెలఁత నూరార్చి।కడుఁ బ్రేమతో గొని కదలి యాతఁడు మె
యలకోహళునిఁ జేరి యతఁ డూరడింప । బిలములో పురము ప్రాపించి వర్తించె
నగ్గద శకలమ్ము లందందఁ దాఁకి । మ్రొగ్గె సేనలు కొన్ని మూర్ఛిల్లెఁ గొన్ని
పదుగురు మంత్రులు బలుమూర్ఛఁ బొంది।పదిదిక్కులను దూర పదములఁ బడిరి
వారిలోన సుకీర్తి వరపుణ్యమూర్తి । యారాజమంత్రులం దగ్రేసరుండు
గదతునుక తాఁకున గతప్రజ్ఞుఁడగుచు । మదమఱి నాలుగామడ పోయి పడియె
పడి తత్సమీప తాపసవనాంతరము । కడఁ జూడ నింపైన కమలాకరంబు
చేరువ యగుటఁ దచ్ఛీకరశిశిర । మారుతాంకురముల మైసేదదేరి
యొక్కింత ప్రొద్దున కొయ్యన లేచి । యెక్కడవచ్చితి నిదియెంత దవ్వొ
అక్కటా నృపతి యేమాయె నెఱుంగ । తక్కిన మంత్రు లేస్థలములఁ బడిరొ
దైవయత్నంబిది తప్పింప వశమె । యీవేళ నిటవసియించి తర్వాతఁ
గ్రమమునఁ దెలిసెదఁ గార్యమ్ము లనుచుఁ।గమలాకరమునసోత్కంఠుఁడై మునిఁగి
సమయోచితక్రియల్ సలిపి యాచెంత । నమరు తపోవనం బల్లనఁ జొచ్చి

యదిదళాద మునీంద్రునాశ్రమంబగుట।మదినెఱుంగమినయ్యమాత్యపుంగవుఁడు
నాఁకటిపెల్లున నచటి కపిత్థ । మాకంద కదళికా మాతులుంగాది
ఫలములు గొని భుజింపఁగ నొక్కవటుఁడు । దళభోజి శిష్యుఁ డుద్ధతివందువచ్చి
కనుగొన మిణుగుర్లు గనుర నిట్లనియె। చనునె మునీశ్వరాశ్రమములు సొచ్చి
యడుగక ఫలము లాహా! కోసి నమల।నోడయుండవే! యీమహోద్యానమునకు
నీపాపఫలమున నిఁక చిల్కతనము । ప్రాపించి తిరుగుము బహువత్సరములు
పోరోరి యని కోపమున శాప మొసఁగ।నారాజమంత్రి భయభ్రాంతుఁ డగుచు
నామునితనయున కంజలిచేసి । యోమహాత్మక క్షుధాయోగమ్ము కతన
నెఱుఁగక చేసితి నీయపరాధ । మరయక శపియించు టర్హమే ! నీకు
యాపద మీఁదనే యాపద లొదవె । శాపమోక్షంబు ప్రసాదింపు మనిన
శాపమియ్యనె కానిశాపంబు దీర్ప । నోప మద్గురుఁడోపు నోమంత్రితిలక !
యతనిఁ బ్రార్థనసేయు మనివటుండనగ।హితశీలుఁడు దళాదుఁ డేతెంచె నపుడె
ఏతెంచిన మహర్షి కెదురేగి మ్రొక్కి । యాతఁ డవ్వటుశాప మంతయు నొడివి
యెయ్యదిగతి బుద్ధియెయ్యది యాన । తియ్యవే! మాయయ్య హేమాద్రిధైర్య!
అని వేఁడుకొను మంత్రి నతఁ డాదరించి । మనికితపడనేల మహనీయశీల
దైవకృతం బిది తప్పింపరాదు । నీవు కేవలుఁడవె నిర్మలమతివి.
నిన్ను నేనెఱుఁగుదు నేఁడాదిగాఁగ । నన్ను యీరాఱు హాయనముల దాఁక
చిలుకవై మెలఁగుము శ్రేయమ్ము మీఁద।గలిగెడు నని భావికార్యముల్ దెలిపి
శుకశాల్మలికిఁ బొమ్ము శుకరూపమూని । యిఁక తామసంబేల నిచ్చోట ననిన
బలువైన యీఁకల పంచవర్ణములు । గళము చక్కదనంబు కన్నుల తేఁట
పగడంపుజిగి ముక్కు ప్రతిలేని టెక్కు । తగ గొప్పచిలుకమై తాపసోత్తముని
కరుణ జాతిస్మృతిఁ గన్నవాఁడగుట।నురుభక్తిమ్రొక్కి యయ్యోగి వీడ్కొలుప
గగనభాగమున కుత్కటసత్వరమున । నెగసి శాల్మలిఁ జేరనేఁగి యాచెట్టు
నడికొమ్మ నెక్కియుండఁగ నంతఁ గొంత । పడికి దిక్కుల మేసి వచ్చెఁ గీరములు
లక్షకీరమ్ము లీలాగున వచ్చి । యక్షీణమతిశాలి నక్కీరమాళి
పొడగని సంతోషమున మ్రొక్కి మాకు।నొడయుండవై యేడనుండి యిచ్చటకు
విచ్చేసినా వని వినయమ్ముతోఁడ । వచ్చిలుకలు పల్క నతఁడు వీనావంటి

బందుగుల్ గూడి యిప్పట్టున నునికి । ముందునే విని ప్రియంబున వచ్చినాఁడ
నెగులెల్లఁదీతేఁ గంటికిఁ గనుఱెప్ప । పగిది నన్ జేకొని పాలింపుడనుచు
నాచిల్క పల్కిన నలరి యచ్చోటి । రాచిల్కలనియె మారాజవు నీవు
నినుగొల్చి యిదిమొదల్ నీయాజ్ఞలోన । పనివడి సంచరింపఁగఁగల మనుచు
నతిగౌరవంబున నన్నిచిల్కలును । హితలీల భాషింప నెంతయు నలరి
యుచితకథాగోష్ఠి నుండె నారేయి । యెచట నేగతి వసియించిన ఘనుఁడు
ఘనతచే నుండు లాఘవమొందఁ డతివ । వినుమిట్లు శాల్మలీవృక్షమ్మునందుఁ
గమియించె నొకకొంతకాల మచ్చిలుక।ప్రమదంబుతో శుకప్రతతి తన్ గొలువ.
ఇందిరావతియన నెసఁగు పట్టణము । నందుఁ జంద్రాభరణాఖ్య భూవిభుఁడు
చిలుకలపైఁ బ్రేమ చిగురొత్త మంచి । చిలుకలఁ బట్టితెచ్చినవాని కిత్తు
కోరినధనము పల్కులునేర్చు మరుని । వారువం బొకటిచ్చువానికి నూఱు
వరహా లొసంగెద వంచనలేక । యరిగితెం డనుచు వనాటులఁ బనుప
వారు నానాశైల వనదుర్గభూము । లారసి తిరుగగా నందొక్కబోయ
బూరుగఁజిల్కల పోబడి యెఱిఁగి । చేరి యక్కడనున్న చిలుకలఁ జూచి
మేయఁబోయిన వేళ మేకులు గొన్ని । యావెడ గ్రహియించి యరిగి యాచెట్టు
మొదటనుండియుఁగ్రమంబునగొమ్మలున్న।తుదదాఁక మెట్లుపొందుగసంఘటించి
పైకొమ్మలకు నెక్కి బలువైన యురులు । నాకడఁ గీలించి యాచెట్టు డిగ్గి
వాఁడేగె మరువారువంబులు గుంపు । గూడి యన్నియుఁ బ్రొద్దు గ్రుంకినయంత
నెప్పటివలెఁ గొమ్మలెక్కి యయ్యురులు । తప్పక తగిలినఁ దపతప మనుచు
ఱెక్కలార్చుచు వగరింపుచు నుండె । చిక్కినయ్యురియందె చిలుకలదొరయు
నాసమయంబున నాచిల్కలెల్ల । నోసామి యిది విడునుపమ యెట్లనుచుఁ ?
దను వేఁడుకొన నమాత్యశుకంబు వలికె।వినుఁడు బాంధవులార! వెతఁ జెంద నేల
కట్టిఁడియై వేఁటకాఁడు వేకువనె । చెట్టుక్కనెడ మీరు చేష్టలు మాని
మెడలు వ్రేలగవై చి మిన్నక యుండు।డొడలఁ బ్రాణములు లేకున్న చందమునఁ
జిలుకలన్నియును జచ్చినవో యటంచు।కలఁకఁజెందుచు వేఁటకాఁ డురుల్ వాపి
ధరణి నన్నియు వేయుతరి లెక్కదప్ప । కెఱిఁగి యందఱము బిట్టెగసి పోవుదము
ఈయుపాయము మది నిడుఁడని చిలుక । రాయఁ డాడిన శుకప్రతతి యట్లుండె

మఱునాఁడు బోయ సంభ్రమమున వచ్చి । తఱవెక్కి చేష్టలుదక్కి యున్నట్టి
శుకములఁ గని వగచుచు నురుల్ వాపి । యొకటొకటినిఁబట్టి యుర్విపై నేయ
లక్షకీరములు నిలాస్థలిఁ బడుట । నాక్షణమ్మున గని యావి బోయవంక
ధర జాతిపడివచ్చెఁదమదారి యనుచు।బరచె నభ్రముచాయ భ్రమచెంద బోయ.
ఆవింతఁ జూచి యౌరా యెంతమాయ । గావించె నీచిలుకలగుంపు లనుచు
శబరుఁ డాకీరరాజముఁ బట్టినీవె । సొబగులు నేర్పితీశుకముల కిన్ని
నిన్ను జంపెదనని నిర్బంధపఱుప । నన్నిచుఁ జూచి శుకాగ్రణి పలికె
నీవేల బేలవై నేఁడలిగెదవు । నోవెట్టి ననునొంప నొదవునె మేలు
నన్ను జేపట్టు మెంతయు లాభ మొదవు । నెన్నికీరములున్న నేమి ఫలమ్ము
నేనృపుండైన నూఱేఁబదు లిచ్చుఁ । గాని నీకిట నధిక మొసంగలేఁడు
నరుగు మింద్రావతి కమ్ము మచ్చోట । హరువొందు ధనదత్తుఁ డనువైశ్యమణికి
నతఁడు నీకిచ్చు సహస్రనిష్కములు । మఱి నమ్ము మింక నామాట యటంచు
మాయురే! యీచిల్క మంచిదటంచు । బోయకు విశ్వాసపుట్ట భాషింప
నాఁడింటిలో నొక నవపంజరమున । వాఁడు మెల్లనఁ గీరవరము గొంపోయి
యుంచి మేఁతలువెట్టి యురుధనాపేక్ష । ముంచ నింద్రావతీపురమున కేఁగి
ధనదత్తుఁడున్న సద్మముఁ జేరి యతని । గని మ్రొక్కి రాజశుకంబు చూపినను
ఆవైశ్యరత్న మౌరా యని చిలుక । నావేళఁ గని తెక్క లలరి దువ్వుచును
మాటలాడించిన మాధుర్యధుర్య । చాటుగాథా సుధాసారంబు జాఱఁ
బలుకులఁ గపురంపు పలుకులఁ జిలుకఁ । బలికిన నాసెట్టి భ్రమపుట్టి యిట్టి
కీరవరేణ్య మీక్షితి నెందుఁగలదె! । సారంబు నవసుధాసారంబు దీని
పలుకు పల్కులబోటి పాణిపద్మమునఁ । గులుకు చిల్కకు నిట్టికుశలత లేదు
ఇది దేవతాశుకంబే యని మెచ్చి । హృదయమర్మము బోయ కెఱుఁగరానీక
దీనికి వెలయేమి తెలుపరా యనిన । నేనెఱుంగుదునె సామీ దీనిక్రయము
పదివేలొసంగినఁ బదిలక్షలిడిన । నిది దొరకునె భూమి నెవ్వారికైన
నీవంటి బహు భాగ్యనిధులకుఁ గాక । యేవైశ్యులకు దీని నేనేల యిత్తు
ననువేళ శుకరత్న మవ్వైశ్యుఁ జూచి।యనఘ! యీతనికి సహస్రనిష్కములు
తగుకోక లిచ్చి డెందము కందళింప । నగధీర! పనుపు మింతప్రయత్న మేల

నాకోస మిచ్చుధనంబు నిక్కముగ । నీకొక్క క్షణములో నేఁగూర్తు ననిన
నూరవ్య శేఖరుం డుత్సాహ మంది । కీరరాజంబు పల్కిన చందముననను
బోయకు భోజనంబును గోక లొసఁగి । వేయినిష్కము లిచ్చి వీడ్కొల్పె నపుడు
తదనంతరంబున ధనదత్తుఁ డల్ల । మదనుతేజీ గొని మందిరంబునను
తనకులాంగనకును దనబాంధవులకుఁ । దనపరిచరుల కాదరమునఁ జూపి
రత్నకీలిత పంజరంబు దెప్పించి । యత్నమ్ముతోఁ జిల్క నచ్చోట నుంచి
పంచదారయుఁ బక్వఫలములు పాలు । మంచి పదార్థముల్ మాటిమాటికిని
బెట్టించి ముంజేత బెరసిన కీర । పట్టభద్రుని మంజుభాషలఁ జొక్కి
యదిదెల్పు వివిధేతిహాసముల్ వినుచు । సదమల ధర్మశాస్త్రంబు లూనుచు
నవని నేరికిఁ దెలియని రహస్యములు । వివరింప నాశ్చర్య వివశుఁడై దాని
తోడిదే లోకమై దొరకొని ముచ్చ । టాడుచుఁ గొన్నినా ళ్లలరుచు నుండె
నంతట నొక్కనాఁ డాచిల్క పలికె । సంతోష మెసఁగ వైశ్యావతంసుఁ జూచి
నాయందుఁ బ్రేమయుండగ నిచ్చినావు । వేయువరా లల్ల వేఁటకానికిని
నాయప్పుతోఁగూడ నమితమాద్రవ్య । మోయయ్య నీకు నేనొసఁగూర్తు నిదిగో
నీయింటిచెంత ననేకశిల్పములు । మాయురే యని ప్రజల్ మదిమెచ్చ నొక్క
యంగడిఁ గట్టించి యందుఁ బెట్టింపు । మంగుగా నీయింట నడవిపడ్డట్టి
పట్టాంబరమ్ములు బహుభూషణములు । కట్టాణిముత్యాలు గారుడాశ్మములు
గురుతరవజ్రముల్ గోమేధికములు । సరసిజరాగముల్ చందనతరులు
మొదలైన సరకులు ముకురాదికములు । నదిగాక తక్కపదార్థమ్ము లుంచి
పాయ కంగడినేరుపరులను లెక్క । వ్రాయువారి నమర్పు వైశ్యవంశేంద్ర!
అపుడు చూచెదవు నేనాఁడుబేరమ్ము । లిపుడు నీతోఁ దెల్పనేల యటన్న
నావైశ్యుఁ డౌగాక యని చిల్కయనిన । ఠీవి నంగడియుఁ గట్టించి యచ్చోట
నడవులా తనయింటి యఖిలవస్తువులు । నిడఁబంచి తగువారి నేర్పాటు చేసె
శుకలలామం బొకశుభవేళ విప్ర । నికరార్చన మొనర్ప నియమించి మంచి
శకునముల్ గని మెచ్చి సంతోషమెచ్చి । సుకరమా నంగడిఁజొచ్చిమాణిక్య
మయపీఠిక వసించె మహనీయబుద్ధి । యయిన వైశ్యమణిందు యర్థదత్తుండు
పరిపరి సరకులు పచరింపఁ జెంత । కరణంబు ఘంటంబు కవిలెయుఁ బూని

వసియింపఁ దన యిరువంకల నిరువు । రసమాస్త్రిదీపంబు లన నుల్లసిల్లు
కొమరు బ్రాయపు వెలగుబ్బెత లుండి । క్రమమొప్ప జంత్రగాత్రములను బాట
పాడుచు రక్తి సంపాదింపగుంపు । గూడి వీథుల ప్రజాకోటి వీక్షింప
మన్నీలు దొరలు సామంతులు మంత్రు । లెన్నికగలరాజు లెలమి నచ్చెలుక
పలుకులు వినుకాంక్షఁ బటములు రత్న । ములు గొనియెడు నెపంబున నందువచ్చి
యంగట వసియింప నాయాయిఘనుల । సంగతోక్తి సుధారసంబులఁ దేల్చి
హారకేయూర రత్నాంబర గంధ । సార కాశ్మీరాది సారవస్తువులు
వారివారికిని విల్వలుదీర్చి యిచ్చి । వారిచ్చు రొక్కముల్ ప్రాయించుకొనుచు
గడియలో వెయ్యార్లు గడియించునేర్పు । కడఁకయు మాటలకలదలు బెరయ
లక్షోపలక్ష లీలాగు గడించె । నక్షయమతిశాలి యక్కరవాళి
తనయింట వస్తుసంతతులెల్ల నమ్మి । ధనరాసు లొనఁగూర్చె తను నుపాయమున
నిది చిల్క యనవచ్చునే! నన్నుఁ బ్రోవఁ । గదిసిన దైవంబె కాఁబోలు ననుచుఁ
దనరుచు నొకనాఁడు ధనదత్తుఁ డింట । కనకపంజరమునఁ గడువేడ్క నున్న
చిలుక రాఁదిగిచి ముంజేత నుంచికొని । యెలమి లాలింపుచు నిట్లని పలికె
నాపుణ్యఫలమున నామందిరంబు । ప్రాపించితివి నీవు పతగవంశేంద్ర!
నీకతంబున నాకనేకసంపదలు । చేకూడె నిన్ నుతిసేయఁగాఁ గలనె
విన నింకొకవేడ్క యంతరంగమున । మానకున్నది వినుమా! వినుపింతు
తనపుత్త్రుఁడు కుబేరదత్తాహ్వయుండు । వినయ దాక్షిణ్య వివేకవర్జితుఁడు
కన్నతల్లిని నన్ను గైకొనఁ డింట । నున్నసొమ్మొకవేశ్య కొసఁగుచున్నాఁడు
ఉప్పునేయదు చూడనొప్పదు రూపు । మొప్పె మందులమారి మొఱకు బజారి
తన వలచినవనితయె కదా రంభ । యనుమాట నిజమైన దామూర్ఖునందు
ఇంటికి నొకవేళ యేతెంచు దొంగ । బంటుకైవడిఁ గనబడఁడు మాకపుడు
సుమము లమ్మెడుచోట జూదంబుచోట । క్రమమేది కుంటెనకత్తెల యిండ్ల
గంటవడమ్ము నంగళ్లవసించు । పొందుసేయును మందబుద్ధులతోడ
తనయిల్లెఱుంగఁడు తనసొమ్ముజూడఁ । డనదయై తిరిగెడు నదియునుగాక
నాకొడలున్న దింటను నీవుగనవా । కాక యాబిడ రేక గలదె లోకమున
మదిరాక్షి యది పుష్పమంజరి యనెడి । చదరాలు జవరాలు సన్మార్గరాలు

దాని మోమెన్నఁడు తాఁజూచియెఱుఁగఁ । డానాఁటి వీనికె ట్లజుఁడు గూరిచెనొ
మొక్కలీఁ డెట్లేలు ముదిత కెంకాయ । కుక్క కబ్బినఁ జవిగొన నెట్టునేర్చు
నట్టిమూర్ఖుని సుగుణాన్వితుఁ జేసి । యెట్లుపాలించెదో యెఱుఁగ నీమహిమ
హీనభామిని గోష్ఠి యెడఁబాపి కూర్చు । మా నయేతరుని కులాంగనతోడ
నని పెక్కుభంగుల నాత్మజుచంద । మనువందఁ దెల్పు వైశ్యాగ్రణిఁ జూచి
యానెఱవాది మహాశుకం బనియె । నౌనయ్య ! యిన్నినాళ్లయ్యె నేవచ్చి
యెన్నఁడు వివరింప వీవిచారంబు । మున్నె తెల్పిన ముదంబు ఘటింతు నీకు
నిప్పుడేమాయె వాడింటికి వచ్చి । నప్పుడె తెల్పు మొయ్యనఁ జేరఁబిలిచి
యొకనేర్పు సేసెద నుడుగుమీ చింత । లిఁక నని నమ్మికలిచ్చి పీడ్కొలిపె
నంత మేఘాక్రాంతమై యొప్పె నభము । సంతసం బొసఁగెఁ గర్షకులకు నభము
అందంద నెరసి చల్లారె దావంబు । కందళత్తరులక్ష్మి గాంచె దావంబు
నెనసెఁ బశ్చిమదిశ నింద్రచాపలత । జనియించె విరహిణీసతికిఁ జాపలత
పరివేషగతి మించె భానుబింబంబు । హరియించె నింద్రప్రాభ బింబంబు
తఱచయ్యె హంససంతతి కలజల్లు । మురువిచ్చె నెమలిగుంపుల కలజల్లు
తమముచే రేలీలఁ దాల్చె నా పగలు । భ్రమణంబుతో నిండి పాఱె నాపగలు
అట్టి వర్షావేళ నవ్వైశ్యపాళి । పట్టి భోజనము సల్పఁగ నొక్కనాఁడు
పగలింటి కరుదెంచి పరితుష్టిగాఁగ । తగు భక్ష్యభోజ్యముల్ తల్లి వడ్డింప
భుజియించి వెలువడిపోవ నుంకించ । గజకరోపమ జలోత్కటధార లెసఁగ
నురుములు మెఱుములత్యుగ్రముల్ గాఁగ । కురియసాగెను వాన కుతలంబు గరఁగ
నావానలో వెలయాలి యింటికిని । బోవఁగూడక మొగంబునఁ దెల్వి తప్పి
దిక్కవెంకంబు రీతిని సందుగొందు । లొక్కటఁ జూచుచు నున్న యానన్న
తలిదండ్రు లెఱిఁగి యాప్తజనంబు గూడి । పలుమాటలాడి కోపమున నిట్లనిరి.
వానలో నైన నిల్వఁగరాదె యింట । కానవా ! నీతోడి ఘనవైశ్యసుతుల
నంగడిబేరమో యర్థార్జనాప్ర । సంగమో వలసిన సరకుసుప్పటలు
గూర్చుటో యిదియేమిగుణ మింక నెపుడు । నేర్చెదో నీజాతి నీతిప్రసక్తి
యింట నుండెదుచిల్క నిన్నినాళ్లాయె । కంటివే వింటివే కటకటా ! దాని
ఘాట లీవెక్కడిమాధిసి విఛట । నేఁటి కింతకపేపు నిలిచి కన్గొనుము

అని దూతివాని నొయ్యనఁ దోడితెచ్చి । రానరికతోఁ జిల్కుయున్న యంగడికి
అత్తతి చిల్క హాస్యముతోఁ గుబేర । దత్తునిఁ గని చాలతడవుల కొర
కంటిమిగా సెట్టిగారినెచ్చోట । నుంటిరో! యిన్నినా ళ్లోహో! కొంత
కరుణపుట్టెనొ మీశుకంబుపై నింత । యరమరికైన మాకాదరు వేది
నీసొమ్ము నీయిల్లు నీవు పరాకు । చేసి యన్యునివలె చెంగియాడెదవు
తల్లియుం దండ్రి పెద్దలు గృహభార। మెల్లక తిరుగ నయ్యో బాలుఁడవె?
పో! నీవెఱుంగవె బుద్ధిమంతుఁడవు । నే ననవలసంటి నీకంటు వలదు
అన్న! నీతోడ నేకాంతంబులాడ । నున్నది యొకకార్య మొద్దికి రమ్ము
అని చెంతల వసించునందఱఁ బోవఁ । బనిచి సుధామధుప్రాయోక్తిఁ బలికె
అవునోయి నీవేమొ అలివేణినొకతెఁ । దవిలి యున్నావట తథ్యమా యేమి
ఏపాటిచక్కని దేమిజవ్వనియె । ఆ పద్మలోచన యభిధాన మేమి
వారకామిని కేడవలపు నీవేల । యోరక తిరిగెద వూరెల్లఁ దెగడ
నీరూపరేఖకు నీగుణమునకు । చారువివేకి! నీజవ్వనంబునకు
నక్కురూపపు వెలయాలేమి తగునె । యెక్కడఁబుట్టె నీ కీవెఱ్ఱిమరులు
అక్కటా! నినుజూచి యంగజుబారిఁ । జిక్కి సొక్కినదొక్క చివురాకుబోణి
యదియేమొ సామాన్యురాలని నీవు । మది నెంచఁబోకుమీ మనపురంబేలు
రాజశేఖరుపుత్రి రమణీయగాత్రి । రాజితమణిపుత్రి రసికతాధాత్రి
మదనరేఖానామ మహనీయధామ । యది రేఁబగల్ విరహాగ్నిచేఁ బొగిలి
నినుగూర్పు మను మను నేనున్నయెడకుఁ । బనుచుచున్నది తన బాలికామణుల
గడియకు పదిమార్లు కలికిదూతికలు । నడతు రంగడికి నన్నా! వేయునేల
నే నిన్ను గనరాక యీమాట యెవరి । తో ననరాక కుందుచునుందు మదిని
నాకన్నులాన కందర్పునితోడు । నీకుమరుల్ గొని నెలలురెండయ్యె
వానకతంబున వచ్చితి విటకు । గాన నీతోఁ దెల్పగా సందుగలిగె
నిచ్చోట వసియింపు మెందఱు చెలులు । వచ్చెదరో చూడు వరుసతో నేఁడు
అని ప్రబోధించిన నవ్వైశ్యసుతుఁడు । మనసిజునకుఁ జిక్కి మాయలచిలుక
పలుకులు నిజమని భావించి నమ్మి । చిలుక! నిక్కము వలచినదె రాకన్నె
యెన్నఁడు ననుఁజూచె నిది నిజంబైన । నున్నకాంతల గోష్ఠియొల్ల నీతోడు

ఎన్నఁడు ననుగూర్చి యిందీవరాక్షి । నిన్ను నిక్కముననమ్మి నిలతునా! యిందె
అనినఁ గీరవతంస మాత్మహర్షించి । తనయుడిఁ జిక్కె నితండని యెంచి
యనియె నిట్లనుచు నుద్యానమార్గమునఁ।జనుచున్న నిన్నొక్క సమయంబునందుఁ
గనుఁగొన్నదఁట! రాజకన్యాలలామ । విను మది మొదలుగా విరహార్తి చెంది
దూతికామణుల నాతోఁ దెల్పఁబనిచె । నీతోడు బొంకైన నేను తెల్పుదునె
యొక రెండుమూఁడునాళ్లందు మిచ్చోట । సకియ రప్పింతు నీ సదనంబునకును
వెలయాలి నిజముగా విడిచినఁగాని । నలినాక్షి రాదిందు నమ్మిక యిమ్ము
ఇదిగొ వచ్చెదరీడ కింతిదూతికలు । పదరక చూడు నాపజ్జ నీవుండు
మనిన వైశ్యకుమారుఁ డానందమంది । వినుమ కీరలలామ! వెలయాలిగొడవ
విడిచితి నీయాన వెడవిల్తునాన । మడికాసుగట్టేలు మన్నినియాన
మా గురువులయాన మాతండ్రియాన । వేగుఱ వినుటీవు వినుట నాబాస
యనిన మంచిదియని యతని లాలించి । తనచెంత నిడుకొని తగినవస్తువులు
వానిచే నమ్మించి వచ్చినధనము । చేనందికొనఁజేసి చెల్ల! యిన్నాళ్లు
ఈలాభ మెఱుఁగలే కితరునిలీల । కాల మజ్ఞులఁగూడి గడపితి వనుచు
చూఱుకుపుట్టఁగనాడుచును మహోత్సాహ।భరితుఁజేయుచు మంచిప్రజ్ఞనీదనుచు
వినుతి గావింపుచు వివిధవస్తువులు ।గొన నంగడికి వచ్చుఁగుసుమకోమలుల
చెవులలో నొకకొన్ని చెప్పి వీడ్కొలిపి । యవ్వర రాజకుమారి యతనుకటారి
యెంత మోహించిన దిచ్చ నీమీఁద । కాంతల బడిబడిగా నంపసాగె
నిపుడు వచ్చిన చెల్వలెవ్వరో యనకు । చపలాక్షి పనిచిన సకియలు సుమ్ము
అని చెప్పి నాఁటికి నానాఁటికేయి । వినవిన నింపుగా వింతలౌ కథలు
వినుపించి నవ్వించి వేడుకసేయ । తన కిన్నినాళ్లీకథల్ వినుమేలు
గలుగదాయె నటంచుఁ గడుఖేద మొందె । నల సెట్టికొడుకంత నామణినాఁడు
ధనదత్తుతో నేకతమునఁ గోడలికి । మునుమాపె సింగారములు సేయఁబనిచి
తోఁటతెఱువ నొక్క తొయ్యలితోడ । మాటలాడుచుఁ గేళిమందిరంబునకు
వచ్చునట్లుగ సేయవలె నని తెలుప । నచ్చతురత కాతఁ డచ్చెరువంది
యటువలెఁ గావింప నాళులఁ బంచె । తటుకునఁ గీరరత్నము వైశ్యుఁ జూచి
జలకమ్ములాడి భోజనము గావించి । చలువలు రత్నభూషణములు దాల్చి

గంధ మాల్యాద్యలంకారమ్ము లూని । బంధురప్రేమ నీపడకింటిలోన
నలరుపాన్పున నుండు మంతటిలోన । తొలిజామున నె రాచతొయ్యాలి వచ్చు
వచ్చిన యచ్చెలి వాంఛలీడేర్చి । చెచ్చెర నొకజాముసేపులోఁ బనుపు
"మఱునాఁడు నెప్పటిమాడ్కి నే తెంచి।మరుకేళి నినుదేల్చు మగువ" యటంచుఁ
బనిచిన నానందభరితుఁడై మమత । పెనగొన నటులఁ గుబేరదత్తుండు
పడకయిల్ పాన్పును బాగు గావించి । తొడిపూసికట్టి య త్తొయ్యాలి యెప్పు
డే తెంచునో యని యెదురు చూడంగ।నాతొయ్యలికి మున్నె యవైశ్యునింటి
చెలులు సంపఁగినూనెచేఁ దలయంటి । యలరుచు గందంపుటటకలి పెట్టి
చలువ గొజ్జంగినీట జలకమ్ములార్చి । వలిపెంపుఁ జలువపావడఁ దడి యొత్తి
జిగి బురుసాపనిచీర గట్టించి । సొగసుగా నుదుటఁ గస్తురిరేఖ దీర్చి
పునుగు జవ్వాది కప్పురము కస్తూరి।మొనయు గంధము పొంకముగ మేన నలఁది
యంగుగా నాణిముత్యపు మించుపనుల । కంగులరవిక చన్గవనొప్పఁ దొడిగి
పంజులకమ్మలు పాపటబొట్టు । మంజుల నవరత్నమాలికాతతులు
పచ్చలకడియాలు బవిరలు తీఁగె । మెచ్చులబుగుడలు మేలినీలంపు
ముంగర బంగారు ముంగామురములు । నుంగరంబుల తెగ లుదరిఘంటికల
మొలనూలు మంజీరములు గిల్కుమట్టె।యలును బొబ్బిలికాయ లాదిగాఁగలుగు
ఘనభూషణములను గైసేసి కెంపు । మినుకుటారతులె త్తి మృష్టాన్నభుక్తి
సమకూర్చి పుష్పమంజరికి ధమ్మిల్ల । సముదార పుష్పమంజరికిఁ గప్పురము
వీడియం బొసఁగుచు వెనువెంటఁ గొంద।ఱాడిగం బమర సేయుచుఁ గొల్చి రాగ
సొలపుతోఁ బడకయిల్ సొచ్చి యక్కలికి।చిలుక మున్ దెలుపుట సిగ్గరితనము
పదలించి విభుఁడున్న చలువపానుపున।కడు వేగఁ గూర్చుండి కరముపైఁ గరము
తొడఁదొడపైఁ జేర్చి దొరకెబో! నెట్టి । కొడుకు నేఁడని నవ్వుకొనుచు నీవలచు
తెలికంటిఁ బోలనైతిన! యిన్నినాళ్లు । చలము జేసితి వెంత జాణవు నీవు
నిదె నేఁడు చిక్కితి వెందుఁబోయెదవు । మదవల్లెఁ దీర్చెద మసలక యనుచుఁ
గొదమగుబ్బలతొమ్ము గ్రుమ్మి నెమ్మోము।గదియ మోమునఁ జేర్చి కడిమిఁ గెమ్మోవి
మొనపంట నొక్కుచు మొలక లేనవ్వు।లెనయఁ గౌఁగిటఁ జేర్చి యేమిరాసామి!
వన్నెకాఁడా! వలవంత చే రాచ । కన్నె యేమాయెనో గద యనకున్న

నినునమ్మవచ్చునా నేఁడని కొసరి । కొనగోరఁ జెక్కునొక్కుచుఁ బొలయలుక
యాలవడ నవలిమోహమైనఁ గోపంబు । నిలుపక నామీఁద నీచిత్తమేను
తెలియకుండితి చిల్క దెలుపఁగా నున్న । తెలిసితి వలచితి జెలువ ! నీమీఁద
నని వాఁడు తగిననెయ్యపుమాట లాడి । వనిత మేకొని కూడి వలపుతో వేఁతి
కళలంటి రతికేళిఁ గరఁగించి దాని । నలయించి సొలయించి యానందలీల
పరవశంజేసి తాఁ బరవశుండయ్యె । మఱి కొంతవడికి నమ్మానినీమణియు
రహిమించు పతి పునారతి కిచ్చగింప । సహజ కామోద్రేక సంపర్కమంది
పరిపరి నేర్పుల బంధభేదముల । బెరసి మెప్పించిన పెద్దయు నలరి
యీలాగు దినదిన మింపుతో నన్ను । నేలెదో వెలయాలియింటి కేగెదవో
నీ యిచ్చఁ గలమాట నిజముగాఁ దెల్పు । రా యని పల్కు నారాజీవగంధి
చెక్కిలి నొక్కుచుఁ జెలువ నిన్ బాసి ! యొక్కక్షణంబైన నోర్వలే నింక
నెప్పుడువచ్చెద వింటికిఁబోయి । చెప్పవే యని వేఁడు చెలువునిఁ జూచి
నేఁటికిఁ బోనిమ్ము నృపమౌళి రచ్చ । కూటంబునందుండి కొలువుచాలించి
యంతఃపురంబున కరుదెంచువేళ । యంతకుమున్నె నే నందుండవలయు
రేపు మాపటికి నీరీతి నేతెంతు । నీపడకింట నీ వెటుఁబోక నుండు
ముండెదనని బాస యొసఁగక పోవ । నొండేల నినుబాసి యోనాథ యనుచు
పలుమాటలాడిన బాసలిచ్చుచును । వలపునఁ బొమ్మని వాక్రువ్వలేక
యెట్టకేలకు సెలవిచ్చిన నదియు । నిట్టలంబగు ప్రేమ నిలుబాసి యవల
నల దోఁటలోఁ జొచ్చి యెపుడు దానున్న । నిలయంబు ప్రాపించి నెమ్మదిలోన
రాచిల్క కతమున రమణునిఁ గూడి । యీచందమున సుఖయింపఁగాఁ గంటి
తిలకింప నాభాగ్యదేవత గాని । చిలుకగాదని నుతిసేయుచు నుండె
ప్రియకాంత చనినఁ గుబేరదత్తుఁడును । శయనించి యొకనిమిషము యుగంబుగను
దోఁచిన దానిసుద్దులె తలంపుచును । రాచకన్నియఁ గూడి రహిఁ జెందఁగంటి
దొరకునే యిది యెంతదొడ్డవారికిని । పరమోపకారి యీ బంగారుచిలుక
నాపాల గల్గియుండగ నింతసుఖము । ప్రాపించెనని యెంచి పరితోషమందె
నీరీతి దినదిన మింటిలోనున్న । యా రాజబింబాస్య యాత్మనాథునికి
పగలెల్లఁ గామసింపక రాత్రియైన । సొగసుతోఁ బడకిల్లు సొచ్చి మోహమున

సమరతిక్రీడల సరిప్రొద్దు దాఁక । రమియించి నిజమందిరమునకుఁ బోవు
రతిఁ జొక్కి వైశ్యపుత్రకుఁడునిద్రించు।నతివ రాజకుమారి యని భ్రాంతుఁడగుచు
దినమును జిలుకవద్దికి వచ్చి దాని । తనువిలాసమ్ములు దాని ముచ్చటలు
తెలుపఁగ నాలని తెలియనందులకుఁ । జిలుక నవ్వుచు వానిఁ జెంతనుంచికొని
పగలెల్ల నంగడిపనికి లోఁబఱచు । తగుఁలెంచి రేలు బిత్తరికి లోఁబఱచు
ఆరేడుమాసమ్ము లరిగిన నంత । తా రాజపుత్రిచందమున వల్లభుని
భ్రమయించు నవ్వైశ్యభామిని చిలుక।యమరిక నొకయుపాయము ప్రబోధింప
నొకరేయి పతిఁగూడి యుండి లేనవ్వు। మొకమునఁ దులకింప ముద మొప్పఁబలికె
వల్లభ! చంద్రికావతియను పురికి । నెల్లి నీవును నేను నింపుతోఁ గూడి
చని యటఁ దిరునాళ్ల సాగుచున్నదఁట । కనుగొని వత్తముగాక వచ్చెదవె!
అనినఁ గుబేరదత్తాహ్వయుం డనియె । వనజాక్షి! మాయత్తవా రుందు రచట
నిను రాజసుతఁ గూడి నే నందుఁజనిన । మనసున మాయత్తమామ లోరుతురె!
తమపుత్రి నేలఁ డీతఁడు పరాంగనల । రమియించి తిరిగెడి రవ్వాఁడనుచు
దూఱుచుందురు వారు తొయ్యలి! యనిన।నారాజముఖి పల్కె నందుల కేమి
యే రాజసుతనొట యెఱుఁగరే నన్ను । గూరిచి నిన్నాడఁ గొంకుదు రాత్మ
జడియకు మీఁక రేపుసంజెప్రొద్దునను । వడి నేను పైనమై వచ్చెద నీవు
పల్లకి జతచేసి భటులతోఁ గూడి । యుల్లాసము వహించి యుండు మటంచుఁ
బలికి పోయిన వైశ్యబాలుఁ డామాట।చిలుకతోఁ దెల్పె నచ్చిలుకయు మున్నె
పుట్టినింటికి నలపుష్పమంజరిని । నెట్టనఁ బంపఁగా నేర్పు చింతించి
ధనదత్తుఁగని యేకతమున నిట్లనియె । విను మొక్కకమ్మ,నీ వియ్యంకునికినిఁ
బనుపు డీతెఱఁ గేరుపడ వ్రాసి యనినఁ । బనిచె నందున రాచపట్టి యటంచు
రాకన్నియ యనిగౌరవము సేయుండు।మీకన్యయనుమాట మిగుల గోప్యముగ,
వియ్యంకుఁ డెఱిఁగి యేవిధమున నైన । నియ్యెడ మాపుత్రి నేలినఁ జాలు
మాయల్లుఁడనుచు సమ్మదము వహించె।నాయెడ సతిఁగూడియవ్వైశ్యసుతుఁడు
భటులు కొందఱు గొల్వఁ బల్లకి యెక్కి । యట నత్తవారింటి కరిగిన వారు
తమ కుమారిని రాజతనయగా నెంచి । ప్రమదంబొనర్చిరా భ్రాంతచిత్తునకు
నీకుఁ బ్రియంబైన నెలఁత యెు సుమ్ము । మాకూఁతురని యత్తమామలు పల్క

వాఁడు వేడుకపడి వారింట నుండె । నేఁడనిమిదినెల లింతలోనచట
జనులెల్ల నొకరాజసతిఁ గొనివచ్చె । మన రత్నదత్తు జామాత యటంచు
నాడుకోఁగా భయమంది యందుండఁ । గూడక ధనదత్తుకొడుకు రాచిలుక
పనుపున మరల నప్పుడుచుతోఁ గూడి । కొని తనప్రోలికి గొబ్బున వచ్చె
వచ్చి యిచ్చెలువ కే వలచియున్నాఁడ । నెచ్చోటికేఁగక యింటి లోపలనె
ఓచిల్క ! యిది నిల్చునుపమ దెల్పుమన । నా చిత్తజునితేజి యతని కిట్లనియె
నీవేల యీవేళ నెగులుచెందెదవు । భావింపు మిది రాజభామిని గాదు
మదిరాక్షి యలపుష్పమంజరి నీదు । సుదతి నీవెన్నఁడు చూడకుండుటను
రాకన్నెయని నిన్ను భ్రాంతునిఁ జేసి । యీకన్నెఁ గూర్చితి నే నుపాయమున
నీసొమ్ము నినుజేరె నీకేల వంత । యీసుందరిని గూడి యింపొందు మనిన
నరుదంది సంతోష మావహిలంగఁ ! బెరిమ నుప్పొంగి కుబేరదత్తుండు
పలుమాఱు చిలుకను పదివేలచంద । ములఁ గొనియాడుచుఁ బుష్పమంజరికి
మేలువాఁడై తనమేడలఁ జంద్ర । శాలలఁ గేళికాసదనంబులందు
విహరింపుచును దనవిత్తంబెఱింగి । గృహకృత్య మరయుచు కీరంబు బుద్ధి
తా జవదాటక తలిదండ్రు లలర । రాజితసౌఖ్యాభిరాముఁడై యుండె.
ధనదత్తుఁ డింతితోఁ దగువారిఁ గూడి । కనకావతికి వర్తకము సేయనేఁగె.
ఆపుర మేలెడియవనీశ్వరుండు । రూపమన్మథుఁడు విరోధిభీకరుఁడు
మదనసేనుం డొక మాపటిపూట । వదలనివేడ్కతో వాహ్యాళి వెడలి
విపణివీథుల వచ్చువేళ నవ్వైశ్య । చపలాక్షి పుష్పమంజరి మేడమీఁదఁ
జెలులతో నుండుటఁజేసి యారాజ । వలశాసనునిఁ జూచె వాతాయనమున
చూచిన యాచెల్వ సొగసు బంగారు । మైచాయ క్రొమ్మించుమాడ్కి నల్లడల
ధళధళమన నద్భుతముఁజెంది నృపతి । కళవళపడి మోహకాంక్షలు నిగుడ
దానిబంగరుమేను దానిలేఁగౌను । దానికన్నులబెళ్కు దాని నున్‌బలుకు
దానిగుబ్బలతీఱు దానినూఁగారు । దాని చెక్కులఠీవి దానికెమ్మోవి
తిలకించి పులకించి తియ్యవిల్కాని । యలరుతూఁపుల నొచ్చి యాచెల్వ మెచ్చి
యెవ్వతో! దీనిపేరేమొ ప్రాణేశుఁ । డెవ్వఁడో! దీని కిదెవ్వరియిల్లో!
తెలియఁగావలె నంచు దృష్టిమరల్చి । కెలకులవారి నీక్షించు నాలోన

నలపుష్పమంజరి యా భావమెఱింగి । నిలువక యింటిలోనికిఁ జనెనంత
ధరణీశుఁ డడుగఁ జెంతల నున్నవార । లెఱిఁగించి రధిప! యీ యిందుబింబాస్య
ధనదత్తుకోడ లుత్తమవైశ్యకులజ । ధనదుఁబోలు కుబేరదత్తు నాలనుచు
విని రాజచంద్రుఁ డవ్విమలాంగియందు । మనసునాఁటగ నందు మసలక యుపుడె
తననగరికిఁ బోయి తాఁబవ్వళించు । కనకసౌధాంతరాగారమ్మునందు
విరులశయ్య శయించి విరహానలంబు । దరికొనఁ దాలిమిదక్కి యవ్వేళ
దూతిక నొక్కతెఁ దోడ్తేరఁ బనిచి । యాతన్వితోఁ దనయంతరంగంబు
దెలుప నచ్చెలి పల్కె దేవ! యవ్వైశ్యుఁ । డిలుఁబాసి పదిపూట లెందేనిఁ జనిన
దాని బోధించి మీదయ కర్హురాలి । గా నొనరింతు వాక్ప్రౌఢిచే ననిన
నదియ మంచి యుపాయమని దానిఁ బనిచి । మదనసేననృపాలమణి మఱునాఁడు
కొలువుండి తనచెంతకుఁ గుబేరదత్తుఁ । బిలుపించి బహుమతిం బ్రీతిగాన్పించి
యిష్టగోష్ఠి వసించి యిట్లని పలికె । శిష్టవర్ణితశీల! స్థిరకీర్తిలోల!
మున్ను మణిద్వీపముననుండి మణులు । కొన్ని దెచ్చిరి వర్తకులు మాకుఁ బ్రీతి
మగఱాలు కెంపులు మౌక్తికావళులు । తగు నింద్రనీలరత్నములు పచ్చలును
గోమేధికాదులు గొనితేరవలయు । నామణుల పరీక్ష లన్నియు నీకు
కరతలామలకముల్ గద రేపటికిని । దఱిగాంచి తరియొక్కి తరలిపొమ్మనినఁ
దప్పించుకొనరాక తానొకరీతి । నొప్పి యవ్వైశ్యముఖ్యుఁడు మంచి దనుచు
నృపతి వీడ్కొని తనయింటికి వచ్చి । కృపణుఁడై చిల్కతో నిట్లని పలికె
శుకశిఖామణి! యొక్కచోద్యంబు వినుము । మకరాంకనిభుఁడైన మనయూరిరాజు
నను నేఁడు పిలిపించి నవరత్నసమితి । గొనితేరఁ బనిచె నకూపారమునను
బొలుచు మణిద్వీపమునకు రాజాజ్ఞ । చులుకసేయుట బుద్ధిచొప్పు గాదనుచుఁ
గోరినపని కియ్యకొని వచ్చినాఁడ । నేరీతిఁ బోవుదు నీయింతిఁ బాసి
నిను నొంటిగా డించి నే నెట్టులోర్తు । ననిన వైశ్యునిఁ జూచి యచ్చిల్క పలికె
కపటవర్తనుఁడు భూకాంతుండు నేఁడు । నెపమొక్కటి గణించి నిన్నుఁ బొమ్మనియె
పొమ్మని దొరపల్కఁ బోకుండరాదు । కొమ్మనుబాసి యేగుట తగదైన
నెన్నినాళ్లకు వత్తు విచటికిఁ దెల్పు । మన్న డెబ్బదినాళ్ల కరుదెంతు ననుచు
నతఁడు పల్కిన మంచి దైననేమాయె । నతివఁ గాపాడెద నందాఁక నేను

గడువుదప్పకరమ్ము గ్రక్కునననుచు । నొడివిన వైశ్యుఁ డెంతో సంతసించి
మగువఁ గాపాడు మేమరక రేవగలు । ఖగరాజ! నీ వేడుగడయును మాకు
చలచిత్త లటుగాక జవరాండ్రవగలు । తెలిసియుందువునీకుఁ దెలుప నేమిటికి
నని పుష్పమంజరి నటకు రప్పించి । తనయత్నము కుబేరదత్తుండు దెలుప
పతిఁ బాయఁజాలక పద్మాయతాక్షి । వెతఁజెంది కన్నీరు వెల్లువగట్ట
వగచిన నెలలోన వత్తు నీకేల । వగపని యూరార్చి వనిత కచ్చిలుక
నప్పగించి పయోరుహాక్షి నచ్చిలుక । కొప్పగించి శుకేంద్రుఁ డొసగుదీవెనలు
గైకొని మంచిలగ్నమ్మున వెడలి । యాకంధిఁ దరియెక్కి యవ్వైశ్యుఁడరిగె
పతిచన్న రాచిల్క పలుకులఁ గొంత! వెతమాని ధృతిఁబూని విరిబోణి యున్న
మధురవాణీ ఖ్యాతి మహిమ గన్ దూతి । యధిపతి యానతి నమ్మరునాఁడు
పుష్పమంజరి గృహాంబునకు నేతెంచి । పుష్పబాణవ్యథా పూరితమైన
దాని భావమెఱింగి తనకు సన్మాన । మానెలంతుక చేసి యర్హపీఠమునఁ
గూర్చుండ నియమింపఁ గూర్చుండి దాని। గూర్చి ప్రియోక్తి నక్కోమలి పలికె
నేల జాలి వహించెదే! ముద్దరాల । బాలవు గోలవు పతిఁబాసి యొంటి
నిలువనోపక యార్తి నివ్వటిలంగ । వలవంతఁ జిక్కుభావము గానిపించె
పనిగల్గి పతి దూరభారంబు చనిన । వినుజవ్వని! వహించి విరహాభారంబు
పాయంబు నీవయో! పాన్పుపాల్సేసి। యోయక్క యెటువలె నోర్చెదో! యింక
మచ్చిక ముచ్చటల్ మదినిగరంగ । పచ్చవిల్తుని బారి పడనేల నీకు
కంటి కింపైచక్కని మగవాని । నింటికిఁ జెలిపించి యేలుకోరాదె?
అది పతివ్రతల కర్హమె యనవలదు । మదిరేక్షణ! యహల్య మఘవునిఁ దొల్లి
కూడియుండదె! తార గురు నెడఁబాసి । వేఁడుక చంద్రుతో విహరింపలేదె
వ్యభిచరించినదోష మడఁగు నంతైన । నిభరాజగమనల కేటి మర్యాద
దిననష్టి చేసి పతివ్రతాభావ । మెనసి గాసిలిన నీకేసౌఖ్య మొదవు
నేకతంబున నీకు హితవుదెల్పుటకు । నీకడ కే గమనించితి నతివ
నాలుగునాళ్ల ముందర రాజవీథి । హాళిగా వాహ్యాళి నరుదెంచుచుండి
మదనసేనతనూమండలేశ్వరుఁడు । మదిరాక్షి నినుఁజూచి మరులుగొన్నాఁడు
పలకంబులాడఁడు చలువగలుగట్టఁ । డెలమితో భుజియింపఁ డింతనేమైన

కొలువుండుటకు మదిఁగోరఁడు నిన్నె । తలఁపుచునున్నాఁడు తవిలి రేఁబవలు
సరసుండు కోకోక శాస్త్రకోవిదుఁడు । కరియాన కళలంటి కరఁగించఁగలడు
నిమిషమాత్రంబు మానృపతికౌఁగిటను । దమినున్న నదియకదా జన్మఫలము
నేఁటి మాఁపటికి నే నిను బిల్వవత్తు । బోఁటి రమ్ము రహస్యముగ రాజు కడకు
నిరుచెవి యెఱుఁగరాదిది మంజువాణి । యెఱుఁగుదో నావిధం బెఱుఁగవో కాక
అని పెక్కుభంగుల నది ప్రబోధింప । విని పుష్పమంజరి వికవిక నవ్వి
మధురవాణివి గాన మధురవాక్యముల । నధికచాతురి మీఱ నాడితి విపుడు
కులకాంతలకు మాకుఁ గూడునె యిట్టి । పలువనేతలు! రాజు పాటిదప్పినను
పాములు తరిమి పైఁబడిన వారాశి । యే మేరఁదప్పిన యేమనఁగలము
మా కన్నిటికిఁగర్త మాయిలువేల్పు । శ్రీకరఫణితి రాచిలుక; మాయింట
నున్న రాచిలుక సెల్వొసఁగిన వత్తు । నిన్నేల వలదన్న నేను రావెఱతు.
అని ప్రొద్దుగ్రుంకిన యందాఁక జరపి । నవబోణిమిన్న సంధ్యాసమయమున
దానివెంటనె వచ్చి తనచెంత నిలువ । నా నెలంతుకతో శుకాగ్రణి పలికె
నెక్కడి కేగదే! యిందీవరాక్షి । యిక్కాంత యెవ్వరే! యిగురాకుబోడి
ఎవ్వరు పిలిపించి రేమీ ప్రయత్న । మివ్విధం బెఱిఁగింపవే! యని యడుగ
అపుష్పమంజరి యనియె నోచిలుక । యీపురం బేలెడి నృపతి నన్నేమొ
చూచినాఁడట మొన్న చూచినమొదలు।రాచిలుకహుమాయిరాతుచే బడలి
నన్ను బిల్చుక రమ్మనంగ వచ్చినది । యిన్నాతి, నీ వానతియ్య కేపనియు
నేము సేయముగదా! యిఁకనాకు బుద్ధి।యేమి దెల్పు మటన్న నెలనవ్వునవ్వి
చిలుక యిట్లనియె రాజీవాక్షి ! నిజమె । పలికితి విదివిన్నఁ బరితోషమయ్యె
కల్లలాడక మది కలదికలట్టె । పల్లవాధర ! నీవు పలుకుటవలన
నిను చాలమెచ్చితి నీవుదూతికయు । నెనసి యీ నిల్వొకొల్వేల చేసెదరు
పోవలసిన వెన్క పోదురుగాని । యీవేళఁ గూర్చుండు డించుకసేపు
కలికి రాజానతి గాదనరాదు । కలకంఠులకు నేడుగడ గదా! విభుఁడు
పతిఁ బాసి వేఱొక్కపతిఁ జేరుటెల్ల । సతుల కర్తమె! యిది జాతిధర్మంబె
వనిత! యొన్నఁడు పతివ్రతల సత్కథలు।వినినదానవు గాదు వినదు దూతికయు
నే నొకకథ మీకు నెఱిఁగింతు నిపుడు । వీనులవిందుగా విందురు గాక

ఆదిమసాధ్వియై యమరు నరుంధ । తీదేవి కథ విన్న తీఱు దోషములు
అనిన విస్మయమంది యారాజధూతి । విన పుష్పమంజరి విమలాంగిఁ జూచి
చతురాననాంగనాంచత్పాణిపద్మ । గత రత్నకంకణగానానుకారి
పరివాదినీస్వరప్రస్థిత గీత । నురుచిర మధురోక్తి శుకరత్న మనియె

---

## అరుంధతీ దేవికథ

ఆదిమబ్రహ్మ మనోంబుజాతమునఁ । బ్రాదుర్భవించె నే పరమతపస్వి
కౌశికు బ్రహ్మర్షిఁ గావించె నేమ । హాశమాధికుని సత్యవచోనిరూఢి
యురగాధిపతి తాల్చు నురుభారమెల్ల । భరియించె నేమౌని బ్రహ్మదండంబు
కలశజుండు వహించు గౌరవంబూని । తులకించె నేమహాత్ముని కమండలువు
మహనీయమార్తాండమండలద్యుతులు । వహియించె నేమునీశ్వరు శాపించె
అట్టి వసిష్ఠమహర్షి శేఖరుఁడు । పుట్టిన మొదలు తపోనిష్ఠఁ బూని
బహుకాలము తపింపఁ బరమేష్ఠి వచ్చి । బహుమాన పూర్వకఫణితి నిట్లనియె
పట్టి! నీ వుగ్రతపః ప్రభావమున । దిట్టవై మముగెల్చితివి నిక్కువముగ
నిను బురోహితునిగా నెమ్మది నెంచి । నను వేఁడె నిక్ష్వాకునరవరోత్తముఁడు
చాలింపుమిఁక బ్రహ్మచర్యవ్రతంబు । పాలింపుము గృహస్థపరమధర్మములు
అనఘ! పత్నీహీనుఁడై యుండఁ జనదు । నినువంటి మునిమౌళి నీ విధి దెలిసి
తగుకన్య నొకతె నుద్వాహంబు గమ్ము । పొగడొందెదవు జగమ్ముల నందువలన
నని యానతిచ్చిన యంభోజభవుని । గనుగొని యమ్మునిగ్రామణి వలికె
నా నెమ్మదికివచ్చు నాతి యేజాతి । నైన నే పరిణయంబగుదు నిందులకు
ననుమతి గావింపుఁడనిన నాలాగె । యొనరింపుమని ధాత్ర యుడువీథి నరిగె
నా వశిష్ఠుఁడును గన్యక వరయుటకు । నావేళ పయనమై యతిశుభ్రమైన
యిసుక ఘ్నానెడు గ్రహియించి కట్టుకొని । వసు రుద్ర సిద్ధ భాస్వరు లున్న చోట్ల
గరుడ గంధర్వ యక్షశ్రేష్ఠులున్న । యిరవుల నింద్రాదు లెసఁగు లోకములఁ
జరియించి మెచ్చకైచ్చుటఁ బెండ్లి లేని । చిఱుతకన్యలఁ జూచి చేరి యీ యిసుక
వండిపెట్టుడు! యన్న వారు నవ్వుచును । పొం డిదియేమి తపోనిధుల్ [illegible]

యిసుక వంటకము సేయింతురో కాక । పొసఁగదు మాచేత భువనత్రయమున
విన్నది లే దిట్టివింత యటన్న । నున్నతలోకమ్ము లొగి దిగి వచ్చి
పాతాళలోకముల్ పరికించి యచట । నేతరుణియుఁ దన కిసుకపాకంబు
సేయ నొల్లమి తెలిసి ధరిత్రియందు । పాయక తిరిగి ద్వీపము లెల్ల వెదకి
యల్లొనెరెడుదీవి కంతట వచ్చి । యెల్ల దేశంబు లందెసఁగు కన్నియలఁ
బొడగని యావిధంబునఁ బల్కరింప । జడదారి యిది యేటి చాదస్తమనుచు
సాకుఁ గేరిన సకలజాతుల కు । మారికామణుల నిమ్మాడ్కి శోధించి
వేసర కమ్మాని వెలివాడలందు । భాసిల్లు పడుచులఁ బరికింతు ననుచు
నూరూర వెలివాడ లొయ్యనఁగదిసి । యారీతి నడుగ నంత్యజుల కన్యకలు
పకపక నగుచు నొప్పని మాటలాడ । నొక యగ్రహారవరోపాంతసీమ
గనుపట్టు నొక గట్టుకడ నొప్పుతాళ । వనవీథి చండాలవాటిక యొకటి
యాలోకన మొనర్చి యట నాటలాడు । బాలలఁ గొందఱఁ బరికించి యతఁడు
పలికె దగ్గఱఁ జేరి బాలికలార । యిలయెల్లఁ దిరిగి యే నిటకు వచ్చితిని
దెచ్చితి నిసుక మీ తెగ నెవ్వతైన । వెచ్చెరఁ బాకంబుసేసి యీవేళ
మా కిడఁగలరె సమ్మతిఁ దెల్పుఁడనిన । నాకన్యకలు చాల నాశ్చర్యమంది
యొండొరుఁ జూచుచు నూరకయున్న । వండెపెట్టెద నని వారిలో నొక్క
కన్నెపాయమది చక్కనిమోము గలది । చిన్నారి పలుకులచిలుకఁ బోలినది
యరుదెంచి యమ్ముని యడుగుల కెరఁగి । కరములు ముకుళించి కడుభక్తిఁ బలికె
పరతత్త్వనిధి మీతపఃప్రభావమున । స్థిరలీల నేమైన సేయ నోపుదురు
యిసుక నన్నముసేయు టెంతమాత్రంబు । వెస వంటఁ జేసి నివేదింతు మీకు
నిప్పించుఁడని చేట యెత్తుక వచ్చి । యప్పుణ్యు కడ నిల్వ నతఁడు మున్ బంచె
చెఱఁగునఁ దా ముడిచిన తెల్లయిసుక । పోరిఁబోరిఁ జేటలోఁ బోసిన నదియు
వరభక్తిఁ జేకొని యర్థక్షణంబు । హితశీల వసియింపు డీచెట్టునీడ
సరసిలో నిదె నేను స్నానంబొనర్చి । మఱివంటచేసెద మసలకయనుచు
భోరున నిసుక గొంపోయి రోట నిడి । తా రోకలి గ్రహించి దంపెడువేళ
నువ్వె జగద్రక్షు నువ్వె పద్మాక్షు । నువ్వె రమాధీశ సూర్యప్రకాశ
నువ్వె భక్తవిధేయ సుగుణధారేయ । నువ్వెమేఘశ్యామ సురసార్వభౌమ

తపసికై యిసుక యే తండులమ్ములుగ । నిపుడు పాకముసేయ నేను పూనితిని
నాభక్తి నిజమైన నాపూను పూని । యేభంగి నైనచో నీడేర్ప మనుచు
నిసుక దంపఁగఁ దవు డసఁగినఁ జెరిగి । వెసలలోఁ బోసి యవ్వెసలయుఁ గొనుచు
కొలనికట్టను నిల్పి కొలనఁ దా మునిగి । కొలనినీళ్లను కడుగోరంగఁగడిగి
తగునీళ్లతోఁ బాత్ర దాలిపైనుంచి । జగదీశు వెన్నుని సన్నుతింపుచును
కలయఁబెట్టుచు దర్వి గైకొని భక్తి । గలదాననేని యీఘనుఁడు నాపూజ
గైకొనఁగలఁడేనిఁ గరుణనన్న మగు । గా కిసుక యటంచు గంధవహాప్త
కడునేమమున వేఁడగాఁ గొంతవడికి । నుడుకుచుఁ దుకతుక నోగిరంబయ్యె
నెడనెడ గంజెల్ల నిగిరి ధావళ్య । మడర రాజాన్నమై యటిక నిండుటయుఁ
గన్నె సంతోషించెఁ గన్నియఁజూచి । కన్నుల హర్షాశ్రుకణములు దొరఁగ
నవ్వసిష్ఠుఁడు తనయాత్మ నుప్పొంగె । పువ్వులు గురిసి రప్పొలఁతిపై సురలు
అల బాల యవ్వేళ నమ్మౌనిమాల । నిలిచి యన్నంబయ్యె నిర్మలాచార
భుజియింపవలవదే ప్రొద్దుఁబోయెనన । నజనూతి పలికె నోయరవిందనయన!
నిన్ను బెండ్లాడక నీవిడినట్టి । యన్నంబు భుజియించు టర్హమే మాకు
నీతల్లిదండ్రులు నిన్నియ్యకున్న । నేతెఱంగున గ్రహియింతు నీపాణి
వారలఁ బిల్వుము వడి నీడకనిన । వారును వచ్చిర వ్వార్త యెఱింగి
వచ్చి దవ్వుల మునీశ్వరునకు మ్రొక్కి । యిచ్చిన్నిపడుచు మీ కేపనిఁ జేసె
చండాలవాటికాసవిధదేశమున । నుండుటర్హంబె మీ కోమునిచంద్ర!
కులహీనులముతాముగురుధైర్య!బ్రహ్మ!కులజులుమీరుమీకునుమాకునెటుల
జెలిమియౌ తాము భాషింప నర్హులమె । తలఁప లౌకికవిరుద్ధంబిదియేల
నా విని యమ్మునినాథుఁ డిట్లనియె । మీవచనము మేలు మృషగాదు వినుఁడి
ధరనెంచ జాతి ప్రధానంబె! గుణమె । కరము ప్రధానంబుగాఁ గంద్రు బుధులు
ఇది యూహ్య మనుచు మే మెఱుఁగకున్నామె । పదివేలసుద్దులుపలుక నేమిటికి
ఈకన్నె మాకు మీ రిచ్చిన దీనిఁ । జేకొని సుపవిత్ర సేయ నోపుదుము
ఇచ్చెదరో! యట్టునిటులాడి త్రోసి । పుచ్చెదరో! యన్న బుద్ధి భీతిల్లి
యియ్యకుండిన శపియించు నిమ్మౌని । యియ్యెడనిచ్చుటే హితకార్యమనుచుఁ
దమ బంధువులఁ గూడి తమరు యోజించి।విమలాంగి నవ్వచోవిభుకుమారునకు

ధారవోసిన ముహూ_ర్తంబున సురల ! ధార గ్రోసె బ్రసూనధారతో దివిని
తన కామధేనువుఁ దలఁచి రప్పించి । వనిత గుంధుని పుత్రివండినయట్టి
యన్నంబు క్షీరధారావళిఁ గూర్చి।యన్నయాధ్యుఁడు వహ్నికాహుతుల్ చేసి
అక్కన్న దోకొని యటఁ బోయిపోయి।యొక్క పుణ్యక్షేత్ర మొయ్యనఁ జొచ్చి
యటఁ గమండలువుంచి యద్భుతస్థైర్య । పటుధైర్యశీల నబ్బాల నీక్షించి
యోకన్యకామణి యొక్కింతసేపు । మాకమండలువుపై మరలని దృష్టి
యేకాగ్రమతి నిల్పి యేమరకుండు । మీకడ నటువోయి యేతెంతు ననుచు
దాని నియోగించి తపముగావింప । మానససరసి కమ్మానీంద్రుడుఁ డరిగె
నక్కన్నియును మది నళుకింత లేక । యెక్కడిపని యిది యెంత లేదనక
నొంటిగా నెటుల నిందుండుదు ననక । జంటగా మాటాడు సఖులు లేరనక
నాఁకలి దప్పుల నలయక సోల । కీకడ కతఁ డెప్పుడేతెంచు ననక
గజసింహశార్దూలగండభేరుండ । భుజగాది బాధలుపొందునో యనక
వానకు నెండకు వలికి గాడ్పునకు । మేనోమికొనక కంపిల్ల కుల్లమునఁ
దల్లిని దండ్రినిఁ దలఁపక బెదర । కిల్లునువాఁకిలి యెంచక యొకట
నేకాగ్రదృష్టి ననేకకాలంబు । లాకమండలువు దా నరయుచునుండెఁ
గలశంబు స్థిరదృష్టిఁ గనుగొనుచున్న । చెలువకు వాయువుల్ చెదరక నిలిచె
వాయువుల్ నిలిచినవరుసతోఁ జి_త్త । మేయెడఁ జలియింప కేకాగ్రమయ్యె
మనసు నిల్చినచోఁ గ్రమక్రమంబునను।దనయంత నింద్రియోత్కరమును నిలిచె
తలఁపులో నింద్రియతతి నిగ్రహంబు । గలుగుట నక్కన్యకావతంసంబు
కలశంబు లక్ష్యంబుగా నిరీక్షింప । బలునిష్ఠ నుగ్రతపంబయ్యె నదియె
ముని కమండలువున మొనసిన దృష్టి । యనయంబు చలియింప కమితకాలంబు
కవగూడి యేకమై కనుగొన కితర । వివిధవస్తుశ్రేణి వెగటింత లేక
కాయంబు మఱచి యొక్కట సురల్ సేయు । మాయల బెదరక మానంబు విడక
శయములు ముకుళించి చరణముల్ సమము।లయి మున్ను నిల్పినట్లమర నిల్చున్న
స్థిరమనోదృష్టి భాసితమహాయోగ । పరిణతి వెలయు నబ్బాల చూడ్కులను
దొలితొలిఁ బ్రభవించె ధూమసంహతులు।చెలరేగి పొగలతో సెగలుద్భవించెఁ
సెగలతో భుగభుగ శిఖలుప్పతిల్లె । గగన మంతయుఁ గీలికామాలికలను

ధగధగధగ మండె దశదిశల్ నిండి । పొగలేని మంటలు భువియెల్ల నెరసి
తరువులుగాలె పొదల్ మాఁడి వ్రాలె । చెరువులు దొరువు లచ్చెరువుగా నింకె
నాపగల్ మ్రందె మర్త్యావళి గుందె । తాపసతతి యెదల్ తల్లడమందె
సురకోటి బెదరె నాసురపేటి చెదరె । నురగాదికలోమ్ము లొక్కట నదరె
సప్తసముద్రముల్ సలసల నుడికె । సప్తాశ్వముఖుల తేజంబులు నుడిగె
చదల నిల్వక యుడుల్ జలజలరాలె । పొదల కెల్లెడఁ బంచభూతముల్ సోలె
ఆదిమఘోణిపై నహిరాజు గూలె । ఛేదిల్లెఁ గూర్మంబు పృథుశక్తి తూలె
ప్రాంచితాజితనూజభాషితవ్యాజ । చాంచల్యరహిత పంచమకులోద్భూత
కన్యకాదృష్టియోగమహత్త్వజనిత । వన్యాగ్నితులిత వైశ్వానరశిఖల
జగములు పొగుల నా సకలదేవతలు । దిగులొంది చని బ్రహ్మదేవుని గాంచి
యో భారతీనేత యోదయాన్విత । ఓ భక్తమందార యో శుభాకార
యివెయొక్కవడిమంటలెగసిభూమ్యాది। భువనపంక్తులఁగ్రమ్మిపొగయింపసాగె
నీ మంట లెక్కడి వేకారణమున । నీమాడ్కిఁ బొదివె నీరేడులోకములు
నీ మహోపద్రవం బెడబాప కుఱక । స్వామివార లుపేక్ష సలుపఁగా దగునె
యిఁకఁ దామసించిన నెల్లలోకముల । కొకట నాపదవచ్చు నుడుగు నీసృష్టి
కారుణ్యరసదృష్టి గలయ నీదృష్టి । నారసి యీమంట లార్పవే యనినఁ
దమ్మిచూలి యొకింతతడవు చింతించి । యమహ్మానిసహితులా నమరుల కనియె
ననఘాత్ములార మహాతపోనిష్ఠుఁ । డనఁగ మించు వసిష్ఠు నాజ్ఞ మస్తమున
ధరియించి యొక్క యంత్యజపుత్రి యిపుడు । సరిలేని భక్తి నజ్జటి కమండలువు
తిలకింపఁ దద్దృఢదృష్టియోగమున । జ్వాలనకీలలు పుట్టి జగమేర్చఁ దొడిగె
నాచేత దాని మాన్పఁ దరమ్ముకాదు । శ్రీచక్రధరునితోఁ శివునిఁ బ్రార్థించి
వారు నేమును మీరు వడి నేఁగి కన్య। కాహూతదృష్టియోగము మాన్పవలయు
నని వారితోఁ గూడి యబ్జసంభవుఁడు । మనసిజాంతకుఁడున్న మహీధరంబునకుఁ
జని మ్రొక్కి సద్భక్తి సన్నుతుల్ సేసి । యనలకీలలు బాధలార్పవే యనిన
హరుఁడు లక్ష్మీమనోహరు తోడు లేక। హరియింపఁ దరమె యీయాపద యనుచు
బసువరాయుని నెక్కి బ్రహ్మాదిదివిజ । విసరంబు తనుగొల్వ వెన్నునిం జేరి
యాకన్య వృత్తాంతమంతయుఁ దెలుప । వైకుంఠవాసుండు వారితోఁ గూడి

యాక్షణంబున గరుడారూఢుఁ డగుచు । యక్ష కిన్నర పన్నగామరసాధ్య
చారణ గరుడ భాస్వర విశ్వ వసు మ । హారాజిక ద్వాదశాదిత్య రుద్ర
గణములు మునులు నొక్కటఁ గొల్చిరాఁగ । గణనీయధైర్య సంకలితనిశ్చలిత
దృష్టియోగక్రియోదిత వహ్నిశిఖల । సృష్టివృష్టికి నష్టిఁ జేకూర్చుదాని
యదరక బెదరక యతినియమమున । కదలని కంబంబుగతి నున్నదాని
మౌనంబు శమము నేమంబుదమంబు।బూని మౌనులకు నద్భుతమిచ్చు దాని
కడజాలిఁ బుట్టిన కన్యకామణిని । బొడఁగని హరిహరాంభోజసంభవులు
దాని ముందర నిల్చి తమపేళ్లు నుడివి । ఓనలినాక్షి! నీయుగ్రతపంబు
నీ నిశ్చలపుదృష్టి నీధైర్యమహిమ । నీనిర్మలత మెచ్చి నిఖిలదేవతలు
వరము లిచ్చెదమని వచ్చియున్నారు । మరలింపు దృష్టి కమండలం బెందు
బోవునో యని భయంబు వహింపవలదు । నీవు బాలిక వింతనిష్ఠ నీకేల!
అని పెక్కుభంగుల నాఁడు వాక్యములు । వినక వారలదిక్కు వెలఁది గన్గొనక
దృష్టి మరల్పక స్థిరబుద్ధి విడక । నిష్టఫలప్రదు లీవేల్పు లనక
సరకు సేయక యున్న సకలదేవతలు । వెరగొంది నెఱిఁగుంది వివిధవాద్యములు
మ్రోయించి బాల సమ్ముఖమున సద్దు । సేయించుటయు శిలాస్థితి నూరకుండ
హరియు బ్రహ్మయు వెరగందియుంకెటుల।మరలించుదృష్టియిమ్ముగువయటంచుఁ
దమలోనఁ దమరు సంతాపంబునంద । కమలాక్షుఁడనియె నో ఘనతేజులార
మనలఁ గైకొన దీకుమారి వశిష్ఠ । మునిశిఖామణి వచ్చి ముందర నిల్చి
పలుకరింపక మరల్పదు దృష్టి యతనిఁ।బిలుపింపుఁ డని తెల్పఁ బ్రియమంది నలువ
యమరులఁ బిలిచి హేమాద్రికి నుత్త । రమున మానససరోరాజతీరమునఁ
దపముగావింపు మత్తనయు వసిష్ఠు । నిపుడె తోడ్తెండన్న నేఁగి వారతని
గని మ్రొక్కి హరిహరకమలజుల్ మిమ్ము । పనిగలదని పిల్వఁబంపినా రిపుడు
విచ్చేయుఁడనిన నవ్విధమెల్ల నాతఁ । డిచ్చలోఁ దనయోగదృష్టిచే నెఱిఁగి
యలరుచు లేచి చే యక్షసరంబు । పలుమారు ద్రిప్పుచు బ్రహ్మదండంబు
నారకచ్ఛదము కెందలిరాకుచాయ । మీరు పెంజడలొప్ప మేనివిభూతి
తళతళమన నతిత్వర నేఁగుదెంచి । జలజాక్ష నిటలాక్ష చతురాననులకు
సాష్టాంగయోగదీక్షాధ్యక్షుఁ డతఁడు।సాష్టాంగములొనర్చి హస్తముల్ మొగిచి

ముందర నిలుచున్న ముక్కంటి పలికె । నిందు దేవతలెల్ల నేతెంచి నేడు
ఘనుఁడ! నిన్ బ్రార్థింపఁ గాంక్షించినారు। పనుపుము చూపుద్రిప్పఁగ నిక్కుమారి
కన్నులు మూయక కడతేర దార్తి । కన్నెఁ బ్రబోధింపఁ గదవయ్య యనిన
హరియు బ్రహ్మయు సకలామరుల్ మునులు। పరిపరి తెఱఁగులఁ బ్రస్తుతించుటయు
నావసిష్ఠుఁడు పల్కె నఖిలేశులార । యీవధూమణి భావమెఱిఁగెడి కొఱకు
నాకమండలువు మిన్నక చూడుమంటి । నీకన్నె యటుసేయ నిటలాగ్ని వోడమె
చూపు వారింతు నీసుదతినె కాని । యేపడంతుల నొల్ల నిది నావ్రతంబు
సుదతి సద్వంశప్రసూతఁ గావించి । కదిసి వైదికలౌకికజ్ఞులు మెచ్చఁ
బరిణయోత్సవ మొనర్పందగు నన్న । హరిహరబ్రహ్మాదు లప్పు డిట్లనిరి
ఏడుజన్మముల నియ్యింతిఁ బుట్టించి । పాడిదప్పక తుది బ్రహ్మవంశమునఁ
బుట్టించి యుద్వాహము ఘటించువార । మిట్టట్టనరు దాన నెల్లలోకులును
నావిని యమ్మునినాయకుఁ డలరి । యావిమలాంగి సయ్యన డాయఁబోయి
యుడినచూపు మరల్ప కిక్కలశంబు । పడుచ! చూచితివి మేల్బహువత్సరములు
చాలుచాల్ నీచూస్కి సడలింపు మింక। బాలికామణి! యన్న భక్తియోగమున
కనుఱెప్ప లల్లార్చి కడుఁ బ్రయత్నమున। మునిపదాబ్జములకమ్ముదితయు మ్రొక్క
మ్రొక్కిన చెలిఁజూచి మునినాథుఁడనియె । నిక్కారుచిచ్చులో నిందీవరాక్షి
పడుము చూతమటన్నఁ బడియె నప్పడుచు। జడదారి శూద్రాదిజాతుల యందు
నేడుమారులు జనియింపఁగాఁ జేసె । తోడిమానులు త్రిమూర్తులు సన్నుతింప
ఘనబుద్ధి పిమ్మటఁ గర్దమబ్రహ్మ । కును దేవహూతికిఁ గూఁతురై పుట్టి
యమర నరుంధతి యనునామ మంది । సుమతియా నవ్వసిష్ఠునిఁ బెండ్లియాడె
చూపుద్రిప్పు మటంచు సురలు ప్రార్థింప । నాపొలంతుక వసిష్ఠానుజ్ఞ లేమి
యెందున జడియక యేకాగ్రదృష్టి । నందు టరుంధతి యని రెల్లసురలు
నాయరుంధతి గూడి యార్యులు వినుతి । సేయ వసిష్ఠుండు శ్రేష్ఠుఁడై వెలసె
నీ యరుంధతికథ యెవ్వారు వినిన । వ్రాయించి చదివిన వ్రాసిన జగతి
నాయురారోగ్యభాగ్యంబులు గలిగి । శ్రీయుక్తులై మహాశ్రేయ మందుదురు
అని చిల్క దెల్పిన నధికసంతోష । మున రాజదూతియుఁ బుష్పమంజరియు
విని పుణ్యకథ నేడు వినఁగల్గె ననుచు । వినుతించి రద్దూతి విభుపాలి కరిగె

నని శివుం డెఱిఁగింప నద్రికుమారి । ఘనభక్తి నవ్వాలికథఁ జెప్పుమనియె
చారుపతివ్రతాచరితంబునందు । దారమై ప్రథమకథారత్న మమరె
శ్రీవిశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టు లానతియిచ్చె.
మఱునాఁడు నృపదూతి మాపటివేళ । సరసోక్తిఁ బుష్పమంజరిని బోధించి
తన యుపాధికి నది తనవెంట రాఁగ । చని చిల్కయున్న పంజరము డాసినను
కీర మిట్లనియె నోకిసలయపాణి । యీరేయి యెక్కడి కేఁగనెంచితివి
నిన్నటిమాటలా! నీవంటిసాధ్వి । కిన్నిచవుతలంపు లిపుడేలఁ, బుట్టె
పతిదక్క వేఱొక్కపతి రతియువతి । పతియైన సతి యాసపడునటె సుదతి
రాజైననేమి రేరాజైననేమి । రాజీవముఖి వలరాజైననేమి
వారి చెల్వము చెల్మి వలెనటె నీకు । వేఱెయొక్కనిఁ గోరు వెలయాలివోలె
యిల్లాలు చనునటె యిల్లెడఁబాసి । తల్లి భార్య పతివ్రతానుభావమున
పతికి నాయువుగల్గు భాగ్యంబుగలుగు । పతిని వంచనసేయు పణఁతి దేనడత
వినవటె తొల్లి సావిత్రీవధూటి । తనవిభునకుఁ జావు తప్పించి కాచె
నటువలె నుండవద్దా! యింతి కనిన । నెటువలె నాకథ యెఱిఁగింపు మనుచు
రాజదూతిక గూడి రాజీవగంధి । భ్రాజితమణిపీఠిపైనుండి యడుగఁ
జిలుక యిట్లను సదాశివజటాజూట । కలితగంగాతరంగఘుమంఘుమోక్తి

---

## సావిత్రికథ

అగధృతి మద్రదేశాధీశుఁ డగుచు । తగు నశ్వపతియను ధరణీశ్వరుండు
గురుతరకీర్తి దిక్కులఁ బిక్కటిల్ల । సిరులచేఁ గడువెలసియు నాఘనుండు
సంతానశూన్యుఁడై సంతాపమంది । యంతంతమించ బ్రాహ్మణపూజచేసి
వారిచే సావిత్రివైభవం బెఱిఁగి । కోరి యా సావిత్రిగూర్చి సద్భక్తిఁ
బదునెనిమిదియేండ్లు బలుతపంబూన । సదయాత్మయై మెచ్చి సావిత్రి యపుడు
హారినీలమౌక్తికహైమప్రవాళ । శరదిందువదనపంచకకాంతి వెలయ
ఖండేందుకోటీరకమనీయరుచులు । నిండి బ్రహ్మాండంబు నిగనిగలీన
ఘనరత్నకేయూరకంకణోర్మికలు । కనకనూపురకాంచికలు ప్రకాశింప

వరదాభయాంకుశవనజాదికముల । తనరుచుగ మృదుపాణిదళకంబు మెఱయ
హంసదేవునికన్య యయ్యును దివ్య । హంసవాహనమెక్కి యారాజు ముందు
నిలిచిన నాతఁడెంతే సంతసించి । బలుభక్తి వలగొని ప్రణతులుచేసి
కరములుముకుళించి గంభీరవచన । సరణి నిట్లనియెంచె జయ జగజ్జనని
జయ లోకపావని జయ సూర్యపుత్రి । జయజయ సావిత్రి సత్పుణ్యగాత్రి
గోత్రంబు వర్ధిల్లుకొఱకుఁ గొల్చితిని । పుత్రుని మన్నించి ప్రోవవే తల్లి
యనిన లోకేశ్వరి యద్దేవి పలికె । తనయుండు గలుగఁడిత్తఱి నీకు వినుము
ఒకపుత్రి జనియించు నుజ్జ్వలగాత్రి । పికవాణి దానినా పేరు పెట్టుమని
పలికి యాపుత్రి ప్రభావంబు వలన । గలిగెదు సుతశతకంబు నీకనుచు
నంతర్ధి చెందిన యాదేవిమాట । లింతికిఁ దెలిపి యథేచ్ఛ రాజవరె
నలరాజు భార్యయు నంతటఁ గొన్ని । నెలలకు గర్భమై నెచ్చెలుల్ ప్రోవ
నవమాసములు నిండినను శుభవేళ । నవమోహనాంగి నందని నొక్క గనియెం
మాళవీదేవి, సమ్మతి నేఁటఁబెంచు । బాలికఁ బూటలోపలఁ బెంచె ననఁగ
నానాఁటఁ బోషింప నవవల్లి కరణి । దాన వర్ధిలెఁ బూర్ణశశిరేఖ జోక
సావిత్రివరమున జనియించెఁగనుక । సావిత్రి యనుపేరు దానికి నమరె
నెలఁతకు మఱిమీఁద నిండుజవ్వనము । తులకించె మధులక్ష్మి తోఁటకుఁ బోలె
దానిసౌందర్యంబు దర్శించి చెలులు । కాన మెక్కడ నిట్టికన్నియ ననఁగ
నాటలపాటల నబ్బోటి వెలసె । మాటల తేటల మంచినీటులను
అటుల సావిత్రికి యౌవనస్ఫూర్తి । కుటముగాఁ దల్లిదండ్రులు దీనికైన
పతి యెవ్వఁడో యని భావించుచున్న । సతికి సావిత్రికి సాళ్వభూభర్త
యగు ద్యుమత్సేనుని యాత్మజునందుఁ । దగిలె విన్కలిని చిత్తము వినుమతిని
సతత యాతాయాతజనముల వలన । సుతమతి సత్యవంతుని యందువలపు
చెలుల కెవ్వరికిని జిత్తంబుకోర్కి । తెలియంగనీక వర్తింపుచునుండ
అంతటఁ గొన్నినాళ్లరిగిన నటకు । శాంతిమంతుఁడు దేవసంయమీశ్వరుఁడు
చనుదెంచి మంద్రభూజనపతి సేయు । వినుతిపూజనముల వేడుక నొంది
యున్నతాసనమున నుండి యారాజు । మన్నించి కుశలసంభాషణ సేయు
నంతలో సావిత్రి యయ్యెవెంగటికిఁ । గంతుపట్టపుదేవి కైవడి వచ్చి

చెలులు దవ్వులనిల్వఁ జిన్నారిసిగ్గు। వెలయ మ్రొక్కినఁ దండ్రి వేడ్కతోఁ గూఁతు
నక్కున నొత్తి నిజాంకపీఠమున । మక్కువ నిడుకొని మమత ముద్దాడి
శిరము మూర్కొని తల్లి శృంగారవల్లి । వరభక్తి నిమ్మునీశ్వరుని సేవింపు
మితని దీవన నీకు నిష్టార్థసిద్ధి । యతిశయిల్లు నటన్న నల్లన లేచి
యల్ల సావిత్రి సంయమికి మ్రొక్కుటయు । పల్లవాధర మంచిపతిని బెండ్లాడి
చిరకాలము శుభంబు చెందుమటంచు । కరుణ దీవించి భూకాంతుతోఁ బలికె
బాలిక యిది పెండ్లిప్రాయమై యుండ । నేల పెండ్లియొనర్ప వెతఁగింపు మధిప
నావిని మద్రభూనాయకుం డపుడు । సావిత్రి నెమ్మోము సంప్రీతిఁ జూచి
తల్లి యెవ్వనిమీఁదఁ దగిలె నీమనసు । తెల్లంబుగా మాకుఁ దెలుపవే యనిన
తలవంచి సిగ్గుచేఁ దరళాయతాక్షి । యల సాళ్వపతిపుత్రుఁడగు సత్యవంతు
మనసుగోరెదు నక్కుమారవర్యునకు । నను బెండ్లిసేయుము నరనాథ యనిన
నారదుఁ జూచి భూనాయకుండనియె । సారజ్ఞ నీకు ముజ్జగములు దెలియు
నాసత్యవంతుఁ డేయందంబువాఁడు। వాసికెక్కునె [వాఁడు!] వసుధ వర్ధిలునె !
యిత్తునా యతనికి నీచిన్నదాని । సత్తుగాఁ దెల్పవే సర్వజ్ఞ యనిన
నమ్మని యించుక నాత్మఁ జింతించి । రమ్ము భూపాలయా రాజనందనుఁడు
సత్యవంతుఁడె యగు సత్యంబుపేర్మి । నత్యంతమతిశాలి యార్యసమ్మతుఁడు
అతనికిఁ జిత్రాశ్వుఁడను పేరుగలదు । సతత తేజోబుద్ధిశాంతివివేక
శూరత్వములు వానిసొమ్ములు సుమ్ము । వైరులచేఁ దమవసుధఁ గోల్పోయి
తల్లిదండ్రులతోడ దారుణాటవుల । నెల్లసిరుల్ వాసి యిప్పుడున్నాఁడు
జనకుఁ డంధుఁడుగాన సతతంబు సేవ । యొనరించునేకదా! యొక్కటి కొదువ
అది యేమియనుచు నన్నడిగితివేని । మదిదాఁప కెఱిఁగింతు మహినాథ! వినుము
అతఁడు సావిత్రిఁ బెండ్లాడినదినము । మితి నొక్కయేడాదిమేర నిండినను
బంచత్వమందు నిబద్ధి యీమాట । కొంచెమాయువు మంచిగుణములే తఱుచు
ఇకొక్కఁడువరుఁడు కాని యితరంబు లేదు । నిక్కంబనిన రాజు నివ్వెరగంది
దిగులున నెగులున ధృతిఁబాసి పలికె । మగపోడి యిదియేమి మానెడమ్మెడిన
అటులైన నతఁడేల నమ్మ వేఱొక్క । పటుతరాయుష్మంతుఁ బతిని వరింపు
నావిని సావిత్రి నరనాథుఁ జూచి । భూవర ! నామనోబుద్ధివాక్కాయ

కర్మంబు లాన్నపాగ్రణియుండె నిలిచె । నర్మిలి దలఁపుదు నతఁడె భర్తయని
యితరపూరుషులు నాకిఁక కానివారి । యతఁడె నాపతి పెండ్లియాడుదు నతని
వేఱొకరీతి భావింపకుండనిన । నారదుండనియె నోనరనాథచంద్ర
నీపుత్రి సౌభాగ్యనిధి భాగ్యకలిత । యీపె భాగ్యమున నయ్యెలరాయనికిని
గరిమ దీర్ఘాయువు గలిగినఁ గలుగు । వెరవక పెండ్లిగావింపు మటంచు
నెఱిఁగించి మౌని యఁథేచ్ఛ నేఁగుటయు।మఱి మద్రపతి యొక్క మంచిలగ్నమున
నల సాళ్వరాజున్నయడవికిఁ బోయి । యెలమిమీఱఁగ వారలిచ్చిన యతిథి
పూజలు గైకొని పొసఁగువాక్యముల । నోజతో నారాజు నొడఁబడఁ జేసి
యాసత్యవంతున కాత్మజఁ బెండ్లిఁ । జేసి యిరువ్వరికిని సిరులుప్పతిల్ల
ననుపమరత్నాంబరాభరణములు । ఘనవస్తుకోటులు గరిమతో నిచ్చి
తన భార్యతోఁగూడి తనయూరికేఁగె । జననీజనకులేఁగ సావిత్రి యంత
నత్తయు మామయు నంధులు గాన । హత్తి వారికి సేవలాచరింపుచును
బతిపాదసేవ యేపట్ల నేమరక । ధృతిఁ బెండ్లియాడిన దివసంబులెక్క
మఱువక యాయుఃప్రమాణంబు పతికి । నెరవేరు నేఁడాదినిండిన ననుచు
దినములెన్నుచుఁ బ్రవర్తిల్లఁగా నాల్గు । దినములు కొదవగాఁ దీఱెవత్సరము
నింకనాలుగునాళ్ల కీరాజసుతున । కంకురించును మృత్యువని నిశ్చయించి
వరుసఁ ద్రిరాత్రోపవాసంబు పూన । నెఱిఁగి ద్యుమత్సేనుఁ డెంతయువగచి
కోడలిఁబిలిచి యోగుణనిధి! నీకు । నీడ సౌఖ్యంబులే దెంతయు డస్సి
వసివాడి దుష్కరవ్రతమును బూన । పొసఁగునె! వలదు నాబుద్ధులతల్లి!
అని నివారించు పల్కాలించి మ్రొక్కి।వనిత, యోదేవ! నావ్రతమున మీకుఁ
గడు శుభంబగుగాని కాదువేఱొకటి । విడుమనవలదని వేఁడిన నతఁడు
నవుగాకయని యుండె నంతట మూఁడు।దివసముల్ తోడ్తో నతిక్రమించుటయు
నాలవనాఁడు కాంతామణి పతికిఁ । గాలంబుచేరికగా నిశ్చయించి
మనసున దుఃఖంబు మల్లడిగొనఁగ । ఘనత ధీరోదాత్తగాన ధైర్యమునఁ
దనపతి స్నానసంధ్యావిధుల్ దీర్చి । కొని దేవపూజయు గురునిష్ఠఁ జేసి
ఔపాసనమొనర్చి యతిశుద్ధనియతి । నాపట్ల నడవికి నరుగఁదలంచి
పయనమౌటయు మద్రపతి ముద్దుపట్టి । భయభక్తుల నిజేశుపజ్జఁ గానరుదు

తాన్నను బోనెంచి తమయత్తకటఁగి । పూని మామకు మ్రొక్కి మునుల సేవించి
వారి దీవెనలంది వారియనుజ్ఞ । వారక పతిగూడి వనమున కరిగె
వింటివే! తెలిగంటి! విపులాంగి మగని । జంటఁబాయక వనస్థలి కిటులేగి
తనయుపవాసంబు తనబడలికయుఁ । దనమది నెంచక దవ్వుగానేఁగి
యాపతివ్రత తనయాత్మలో వగపు । తోపనీయక పతితోఁ బల్కుకొనుచుఁ
గొలఁకులు వనములు కుంజపుంజములు । చెలువుఁడు దెలుప నీక్షింపుచు నగుచు
ఫలములు పువ్వులు పత్రముల్ విభుని । గలసి తానును గోసి కట్టగా.గట్టి
బుట్టలోనిడి చేతపాలమున నెందు । కట్టెలు గొట్టుచుఁ గాంతుండు బడలి
గొడ్డలిఁ బడవైచికొని దగదొట్టి । దొడ్డచెమ్మట మేనఁదొరుగఁ గాసిల్లి
వగరింపుచున్న యవ్వరతేజుఁజూచి । మగువ, నేఁడెల్ల యిమ్మాడ్కినుండుటకుఁ
గారణంబేమి చక్కనిసామి యనిన । నారాచపట్టి యిట్లనిపల్కె నపుడు
ఓ కాంత! నేఁడేమిదో కాని తనకు । ధీరతచెడి తలదిరుగంగఁ దొడఁగె
నదరుచున్నది గుండె యడుగులు నిలవు । గదిసెఁ గన్దోయి చీఁకటి మేనునొచ్చె
పంతఁబెట్టుము నీడపట్టున ననిన । గుండెదిగ్గన రాచకూఁతురు బెగడి
మగని నెత్తుక యొకమంజుకుంజమున । చిగురుపానుపొనర్చి శీఘ్రంబె చేర్చి
తన తొడమీఁద నాతని శిరంబునిచి । కొని చిగురాకులుగొని విసరుచును
కళవళపడియుఁ ద్రొక్కటపాటులేక । పలుమారు మోముతప్పక చూచుచుండ
నాలోనఁ గొంతసేపడిగిన వటకు । నీలమేఘముబోలు నెమ్మేనితోడ
వాఁడికోఱల మీఱు వక్త్రంబుతోడ । వేఁడిమిగల రక్తవీక్షలతోడ
జాళువామెఱుఁగు పచ్చనిపట్టుతోడ । కాలాగ్నిఁబోలు నుగ్రత్వంబుతోడ
పాశగదాభీలబాహులతోడ । నాశాప్రచండమహాద్యుతితోడ
దక్షిణంబుననుండి తరళాక్షిచూడ్కి । కాక్షణంబుననె మహామహుం డొకఁడు
గానుపించిన నట్టి కనుగొని యాతఁ । డేసెలవుననుండి యెచటికేగెడినొ
చూచెదగాకంచు సుదతి చింతింపఁ । నాచాయకాతఁ డుద్ధతి నేఁగుదెంచి
ముందర నిలిచిన ముదిత భీతిలక । పొందుగా విభునిఁ బాన్పున నొయ్యనునిచి
మ్రొక్కి కరాబ్జముల్ మొగిచి యిట్లనియె । నెక్కడనుండి మీ రిందుఁ బోవుచును
నిచ్చోట కేవేళ నేఁగుదెంచితిరి । అయ్య! మీ తెఱఁగు నాకానతిమ్మనిన

నమ్మహాత్ముఁడుపల్కె యముఁడు నానామ।మమ్మ నీవిభుఁడు సత్యనిధానుఁడగుట
నితనిఁ దోఁకొనిపోవ నేన వచ్చితిని। సతి! వీనికాయువు సంపూర్ణమయ్యె
నీపతిభక్తిచే నేఁడు నన్గంటి। ఓపుణ్యశీల! నీవుత్తమాంగనవు
కాలంబుదీఱినఁ గాయంబు మనుపఁ। బోలునె! హరిహరాంబుజగర్భులకును
అని మహోగ్రాకారుఁడై దండధరుఁడు। మనుజాధినాథకుమారుని మేనఁ
గలయు లింగశరీరగతుఁడైన జీవు। వెలువడఁ దీసి వేవేగఁ బాశమున
బంధించి తనదీర్ఘబాహుపీఠమున। సంధించి దక్షిణాశాముఖుండగుచు
కొనిపోవుచుండఁ గన్గొని మద్రపుత్రి। కనుగవ శోకాశ్రుకణములు దొరుగ
తన పతిదేహంబు దగ పొదలోన। నునిచి రక్షకుఁ జుట్టు నొకగీత గీచి
చరణముల్ దొట్రిల్ల జాఱువాయందె। లరుదార ఘల్లుఘల్లని మ్రోయుచుండ
గమనవేగంబునఁ గొనసిరియాడ। గమనీయకంకణక్వాణనంబు లెసఁగ
యముని వెంబడిఁబడి యటవేగ నరుగ।యముఁడంతయఱలి యయ్యతివ నీక్షించి
యీవేళ నోబాల యీమహాటవుల। నావెంటరాఁ గారణంబేమి! నీకు
నిలునిలు మీఁకమీఁద నీకు రారాదు। కలకంఠకంఠి యగమ్యమార్గములు
అనవిని యాబోఁటి యంజలిఁజేసి। వినయవాక్యంబులు వెలయ నిట్లనియెఁ
బరమధర్మస్వరూపక! ధర్మరాజ। కరుణానిధాన యొక్కటి యాలకింపు
పతి పోవుచోటికిఁ బడఁతి రాకున్నె। మతిదలపోయ నీమన్ననవలన
నాపతిభక్తిచే నాకుఁ జేరఁగ దు। రాపంబు లగుచోటు లవనిలోఁ గలవె
అదిగాక సకలమార్గావళిలోన। గదలని ధర్మమార్గమె పెద్దయగుట
నట్టి ధర్మము నీకు స్వాధీనమగుట। పట్టైన ధర్మదేవతవు నీవగుట
నీవంటి సద్గుణనిధిని దర్శించి। దేవ శుభంబులతెరువుఁ జేకొనక
యూరక మఱలుట యుచితమె యనిన।నారామ ప్రౌఢవాక్యములకు నలరి
యముఁ డద్భుతముగ నిట్లని యానతిచ్చె। రమణి మహాపతివ్రతవు నీపలుకు
చాతుర్యమునకు నేఁజాల మెచ్చితిని। నాతి నీమగని ప్రాణమ్ములు దక్క
నితరవరమ్ము లేమేనియు నడుగు। మతికృప నిచ్చెదనన్న మేలనుచు
మగువ యంజలిచేసి మామామగారు। విగతనేత్రుఁడుగాన వేఁడెద మిమ్ము
కన్ను లాతనికిచ్చి కరుణింపుమనిన। మన్నించి శమనుండు మంచి దాలాగె

కన్నులు మీమామగారి కిచ్చితిని । సన్నుతాంగిరో నీవు చనుమింక రాక
అని ప్రేతనాయకుం డటఁజనుచున్న । వనిత యించుక నేపు వారక నిలిచి
క్రమ్మఱ వెనువెంటఁ గదలిరాఁ జూచి। యమ్మహాత్ముఁడు పల్కె నమ్మరో నీవు
వరమందితివి యేలవచ్చెద వనిన ! తరుణి యిట్లనియె నోధర్మస్వభావ
దారయ మీవంటిసత్పురుషులు హింసఁ।బారయరు తమ మనోబుద్ధివాక్క్రియల
నేతరి దీనులనెఱిఁగి రక్షింపఁ । జూతురు కొంచెమిచ్చుట కియ్యకొనరు
కోరు నాశ్రితులకుఁ గొదువగా నీక । కోరికలిత్తురు కొనసాగ నెపుడు
సర్వజ్ఞుఁడవునీవు సకలధర్మములు । నిర్వహించఁగ ధర్మనేత వైనావు
సమబుద్ధి ప్రాణుల సంతరించుటను । సమవర్తియను పేరు సమకూరె మీకు
నెమకి భూతమ్ముల నియమింతు గనుక । యముఁడవైతివి దుర్మహాపాతకములు
శమియింపఁజేయుట శమనుఁడవైతి । వమరె దండధరాఖ్య యఘదండనమున
నో దేవతాగ్రణి యోపుణ్యమూర్తి । యే దేవతలు నీకు నీడుజోడనఁగ
యముఁడు సంతోషించి యవ్వ నీపలుకు।లమృతధారలవోలెయానందమొసఁగెఁ
గావున నీమనఃకాంతుని బ్రతుకు । నీవు గాంక్షింపక నీకుఁ గావలయు
వర మెద్దియైనను వాంఛింపు మనినఁ । దరుణి క్రమ్మఱ మ్రొక్కి దైవతారాధ్య!
మా మామ కఖిలసామ్రాజ్య మెప్పంటి । గోము కట్టడఁజేసి కోర్కె లీడేర్ప
నా విని యిచ్చితి నలినాక్షి యింక । రావలదని ధర్మరాజానతిచ్చె
సరభసగతిఁ బోవ సావిత్రి నిలువ । కరిగె నాయనవెంట నతిసంభ్రమమునఁ
జెక్కులు చెమరింపఁ జిన్నారియడుగు । లొక్కటఁ దడబడ నురుహారలతలు
పాలిండ్లపై చలింపఁగ నూర్పులడర । బాలికామణి వచ్చుభావంబు సూచి
బడలితి వెంతయుఁ బద్మాయతాక్షి । కడు దూరభూములు గడచి రానేల
నిలువు నేఁబోవలె నెలఁతరో యనిన । కలకంఠి జముఁజూచి కరములుమొగిచి
ధర్మమర్మజ్ఞ! నాతండ్రి యోప్రథమ । ధార్మికమణి మహాధర్మాత్ములైన
నినువంటి పెద్దలు నియతధర్మంబు । గొని నడపింతురు ఘోరశాపములు
పరిహార మొనరించి పరుల నోముదురు । కరుణాబ్ధి నీవెఱుంగని నీతిగలదె
పతి యనుగమనంబు పడఁతికి విడువ । మతియొడఁబడునె నామగని వెంబడిన
పరతెంచుటిది నాకుఁ బరమధర్మంబు । పరిహరింపకుఁ డన్న భానుజుం డలరి

భళి పతివ్రత నీదుపతిప్రాణ మొకటి । వెలిగాఁగ నడుగుము వేఱొండు వరము
అనవిని క్రమ్మఱ యమునకు మ్రొక్కి । తనుమధ్య యను నపుత్రకుఁడు మాతండ్రి
యతనికి నూఱుగురాత్మజుల్ గలుగ । హితబుద్ధిఁ గరుణింపవే! స్వామి యనిన
నవ్వర మిచ్చితి నతివ నీవింక । దవ్వువచ్చితి నిల్వ తగదు రాననిన
నప్పతివ్రత పల్కె ననఘాత్మ నాకు । దప్పి యెక్కడిది నీదయ కల్గియుండ
నా మతి పతిపాదనలినమ్ములందు । నేమర దెప్పటి కెఱుఁగుదు నీవు
పతిఁ బాసిపోవుట పడఁతికిఁ దగునె! పతియేడుగడగాదె పద్మాక్షులకును
అదిగాక సకలధర్మాధారులగుచు । సదయులౌ మిమువంటి సజ్జనాగ్రణుల
సహవాసమునఁ బాయు సకలదోషములు । వహియింపఁబడి వారివల్లనె కాదె
ధరణి సుస్థిరలీలఁ దనరుచునుండు । తరణిచంద్రులు గతుల్ తప్పకుండుదురు
వారిరాసులు మేర వదలకయుండు । ధారుణీధరములు దలఁకకున్నవియు
పరగు సఖ్యముసప్తపదముల మితిని । మఱి నెయ్యమగు నేఁడుమాట లాడినను
సుజను లావగవారిఁ జుట్టంబులనుచు । నిజబుద్ధినెంచి మన్నింపుదు రనగ
నే నింతసేపు మిమ్మోడయక వచ్చి । పూని మాటాడితిఁ బ్రోవగాఁ దగదె!
నాకోర్కె దీర్చి మన్ననసేయు టిపుడు । మీకుఁ గర్తవ్యంబు మేఘప్రకాశ
ఇనపుత్ర! నీచిత్త మిఁక నాదుభాగ్య । మనిన నాధర్మాత్ముఁ డాయింతి మెచ్చి
మేలుపతివ్రత! మేలుమాయమ్మ । మేలు నీపతిభక్తి మెచ్చితి నిపుడు
వలసిన వరమిత్తువచియింపు మనిన । నలరుచు సావిత్రి యమున కిట్లనియె
కాంతుప్రాణము వెలిగా నిత్తుననుచు । నింతసే పానతి యిచ్చితివీవు
ఇప్పు డామాట లే దేవరంబైన । తప్పకిత్తు నటంచు దయను బల్కితిరి
వలసిన దేమిఁక వల్లభుప్రాణ । ములె దయసేయవే పుణ్యస్వరూప!
పతిలేని హితులేలఁ బ్రాణంబులేల । పతిలేని బ్రతుకేలఁ బ్రాభవంబేల
పతిలేని సతి నిందపాలగు గాన । పతియె మంగళ మండ్రు పడఁతులకెల్ల
రమణి యలంకారరహితయౌ గాదె । రమణునిఁ బాసిన రమణీయతేజ
యీ రాజతనయున కెలమి దీర్ఘాయు । రారోగ్య భోగభాగ్యములు మన్నించి
రక్షింపవే ధర్మరాజ! దయాక । టాక్షవీక్షణ రక్షితాశ్రిత యనిన
యముఁడు కానిమ్మ మాయమ్మ యటంచు । ప్రమదంబుతోఁ గాలపాశమ్ము విడిచి

యాసత్యవంతుని నప్పుడె యిచ్చి । యోసతి నీవిభుఁ డుర్విలో నింక
నుతకీర్తియుక్తి నన్నూఱేండ్లు బ్రతుకు।సుతులనూర్గురఁ గను శుభములఁ బొందు
శతయాగములు సేయు సత్కులధర్మ । హితుఁడగు నని యానతిచ్చి వేంచేసె
విడిచినప్పుడె సాళ్వవిభునిపుత్రకుఁడు । నొడలిలోఁ బ్రాపింప నుద్యుక్తుఁడైన
యంతలో సావిత్రి యచటికి వచ్చి । కాంతుని దిరము దక్కక తొడ నునిచి
కూర్చున్నయంతలోఁ గొంతసేపటికి । వర్చస్వియగు సత్యవంతుండు బ్రదికి
గ్రక్కున లేచి దగ్గఱి కాంతఁజూచి । యిక్కడఁ దడవయ్యె నే నిద్రఁజెంది
నన్నేల లేపవు నలినాక్షి నీవు । గన్నులఁ గనరాని ఘనమూర్తి యొకఁడు
నను బట్టి కొంపోయినాఁడెవ్వరతఁడు । కనుగొనఁ గలగాదు కల్లయుఁగాదు
నిక్కంబు సెప్పవే నీ వెఱింగినను । బెక్కులేమిటి కన్నఁ బ్రియకాంత పలికె
బ్రొద్దు గ్రుంకఁగవచ్చెఁ బోవలె నింటి । కద్దమరేయి పోననువుగా దనఘ
నీవడిగినకథ నేను రేపటికి । దేవ యెఱింగింతు దెల్లంబుగాఁగ
మీ తల్లిదండ్రులు మిడుకుచునుందు । రేతెమ్ము నావెంట నిప్పుడె యనిన
జనపతిసుతుఁడను సత్వంబు లేదు । మునుపటివలె పాదముల వడి లేదు
తల్లిదండ్రులఁ బాసి తడవుంటి నిచట । చెల్లఁబో యిఁక నేమిసేయుదు ననుచు
వగచుప్రాణేశ్వరు వగపు వారించి । మగువ కౌఁగిటఁజేర్చి మగనిభుజంబు
మెడమీఁద జేర్చుక మెల్లన నడిచి । యడవియెల్లను దాటి యాశ్రమంబునకు
వచ్చె నంతట దృష్టివచ్చిన సాళ్వుఁ । డిచ్చలో నలుకుచు నీవిశేషంబు
కోడలిమహిమంబొ కొడుకుసత్యంబొ । పాడిదప్పని తనభాగ్యమో యనుచుఁ
గొడుకు గోడలి వెదకుచువచ్చి యెదురు । పడినవారలఁ జూచి పరితోషమందె
ఆవృద్ధులకు మ్రొక్కి యతివయుఁబతికి । సేవసేయుచు వలసిన ఫలాదులను
ఆఁకలి తీర్చి తానశనంబుగొని వ్ర । తాకలనఁ గృతార్థయై మఱునాఁడు
ఆకథ యాద్యంత మత్తమామలకు । బ్రాకటస్థితిఁ దెలుపఁగ మునులలరి
పుట్టినయింటికిఁ బోలఁతి నీ చొచ్చి । నట్టియింటికి శుభంబయ్యె నీవలన
నీవు సావిత్రివే నిజమని పొగడి । రా వేళ సాళ్వ పూర్వామాత్యవరులు
పరతెంచి దేవర! పగవారలెల్ల । పోరిఁబోరి తమలోనఁ బోరాడి దివికిఁ
బోయిరి నీరాజ్యమునకు రమ్మనుచు । నాయన నొక మదహస్తి నెక్కించి

చతురంగబలముక్తిశక్తి సత్యవంతుఁడును । సతియు సావిత్రియు సంప్రీతితోఁ
పట్టంబు గట్టిరి భార్యతో రాచ । పట్టియు సకలసంపదలఁ జెన్నొందె
సావిత్రి తండ్రియు శతపుత్రవంతుఁ । డై వెలసెను వింటివా! యివ్విధంబు
కావున నిప్పుడు కమలాయతాక్షి । సావిత్రివలె నీవు సౌశీల్య మహిని
పతిభక్తి గలుపుము భాగ్యముల్ గలుగు । నితరబోధలు విననేల నీకవిన
ఆపుష్పమంజరి యందున నలరె । భూపదూతియుఁ జిల్కఁ బాగడుచు నరిగె
గరిమ నీసావిత్రికథ విన్నఁగలుగు । సిరులు దీర్ఘాయువు శ్రీహరికరుణ
వ్రాసినవారికి వనజాయతాక్షి । పాసిపోవును మృత్యుభయము లటంచు
పరమేశ్వరుఁడు దెల్పెఁ బార్వతీదేవి । కరుణతో నవ్వాలికథఁ దెల్పుఁడనిమ
సరస పతివ్రతాచరితంబునందు । గరిమతో రెండవకథ పూర్తిఁ జెందె
నని శౌనకాదిమహామునీంద్రులకు । వినిపించె సూతుండు విపులవాక్ప్రౌఢి.

---

# "కరాగ్రేకంకణం" అన్న కథ

శ్రీవిశ్వపతి సమంచితలీల గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
నాఁడేలుదార మఱునాఁడు కావలచి । నాఁడు గావున దినాంతమున దూతిఁ గని
నాఁడు నేఁడును రాక నన్నేఁచసాగ । నాడువారలలోన నది చాలఁజాడు
నేఁడటులైన నినింతిని దెమ్ము తాళనీఁడనంగుఁ డటంచు నృపుఁడు పీడ్కొలుపు
దూతిక వచ్చి తన్ దారచేసి పిలువ । నాతిరాఁ గనుగొని నగి కీరమునితు
ముంజేతికంకణంబు దృశింపఁజూచి । యుం జెల్లునే! కోపమానఁ దండ్రి యని
జనకుతో నని చిల్కచందంబుచెందు । తనపతి దాఁచిన దానిచరిత్ర
వింటమై యుండు నవ్విధ మెఱింగింతు। కాంత యూకొను మాదికాలంబునందు
బంగాళభూమిలోఁ బరగుశృంగార । రంగమన్ పురము శ్రీరమణీ కాపురము
ఆపురంబేలు మహాసేనుఁ డను ధ । రాపాలి భుజపరాక్రమకళాశాలి
యుతనికిఁ జంద్రిక యను పేరి పుణ్య । సతికిఁ గల్గె సుతుండు చంద్రసేనుండు
జనకుండు కీర్తితేజనకుఁ డాపుత్ర । కుని బహువిధ కళాకుశలు సేయించి

శైశవంబునన ప్రశస్త శస్త్రాస్త్ర । కౌశల్య కల్యాని గావించి పెంచె
నతనికిఁ బరిపూర్ణ యౌవనలక్ష్మి । యతిశయించిన వివాహంబు సేయుటకు
తలఁచి మహాసేనధరణీశ్వరుండు । నలుదిక్కులందుఁ గన్యల విచారింపఁ
దగువారిఁ బనిచె నంత సుధాముఁడనెడి । జగతీశసుత సుదర్శన రూపరేఖ
చెలువొందు టెఱిఁగి యాక్షితిపాలు నడుగ।పిలిపించి యాలాగె పెండ్లి సేతునని
పలికె నమ్మాట భూపాలునితోడఁ । దెలిపిరా పెద్దలు తేటతెల్లముగ
నా సుధామునిసుత యందచందములు । తానుతుఁ డాలించి రాగంబు మించి
తమతండ్రి మాగధధరణీశుమీఁద । సమరంబునకుఁ జన్న సమయంబునందు
శిల్పిచేఁ బైఁడి [వాజిని ?] సేయఁబనిచె । నల్పేతరప్రీతి నవ్వీతి నెక్కి
హేమవతీపురి కేగెద ననుచు । వ్యోమంబునకు సూత్ర ముద్ధతి నెగయఁ
బట్టినఁ దప్పి యప్పట్టణసరణిఁ । బట్టక యది దైత్యభామ కిమ్మైన
పున్నాగకాంతారమున కేఁగి యొక్క।పొన్నపై వడిఁ వ్రాలెఁ బ్రొద్దు గ్రుంకునెడ
ఆవనంబున లోహితాక్షియన్ రాక్ష । సీవతంసమ్ము వసించిన దగుట
కృతకాద్రిపైనుండి కృత్రిమతురగ । గతుఁడైన రాచూలిఁ గాంచి విరాళి
హెచ్చి పదాఱేండ్ల యెలనాగయగుచు । పచ్చవిల్తుని బాలఁ బ్రహసింపఁ జాలు
చెలువంబుతోఁ దళ్కు చెక్కుటద్దముల।దులకించు మిహికమ్మదోయితోఁ దావి
యుప్పతిల్లెడు జాదులూని రాణించు । గొప్పపెన్నెఱికప్పు గొప్పుతో సొగసు
నగుమోము టెక్కుతో నాణెంపు మోవి । చిగురాకుతో గబ్బి సిబ్బెంపుగుబ్బ
చన్నుల నొక్కింత జాఱుపయ్యెంట । చిన్నెతో హొన్నుతోఁ జెలిమి గన్మోని
వన్నెతో నిడువాలు వాలుగులనఁగ । చెన్నొందు కందోయిజిగితోడ వచ్చి
కేళీసరముచెంతఁ గ్రీడింపుచున్న । కీలుగుఱ్ఱము పొన్నఁ గిల్లొన్నకతన
తివియగూడక వచ్చి దిగువకు వచ్చి । సువిలాసవతి దానిఁజూచి మోహించి
చెంగటి కేతెంచు క్షితిపాలసుతుని । నంగజాకృతిఁ జూచి యది యిట్టులనియె
నెక్కడినుండి నీ విందువచ్చితివి । చక్కనిసామి ! యీ సంజెప్రొద్దునను
నొంటిగా నిచ్చోట నున్నలాగేమి । వెంట నెవ్వరులేక విపినదేశమునఁ
జరియింపనేల! నాసౌధాంతరమున । కరుదెమ్ము నీసేవ యాచరించెదను
ధరధీర ! నేను గంధర్వకన్యకను । హరిణాక్షి యనుపేర నమరినదాన

లేదు వివాహంబు లీలామనోజ్ఞ । డా! దొరబిడ్డ నిన్నరయుచుండఁగను
నా నోముఫలమున నాకన్నుగవకు । గానుపించితివీవు కాంత లీడిర
నీనామ మెయ్యది నీకులంబేమి । యానతీవలె నన నతఁడిట్టు లనియె
శృంగారరంగపురీ భర్తసుతుఁడ । శృంగారవతి! చంద్రసేనుఁడ నాఁడ
కృత్రిమహాయముపై నెక్కి యాడాడ । ధాత్రి వింతలు జూడఁదలఁచి వచ్చితిని
నీ చిన్నిప్రాయంబు నీ చక్కఁదనము । చూచినప్పుడె మనోజుండు చెందమ్మి
దోదుమ్మిచేఁ గ్రమ్మి దొమ్మిగాఁ గ్రుమ్మె।నీదయ నామీఁద నిలుపవే యనుచు
నా మాయదారి యొయ్యారంబు మీఱి। మోము మోమునఁ జేర్చి ముద్దులాడుచును
నేమిరా! నా పడకింటికి రాక । సామిగా యని గుబ్బచన్నొనలొరయ
కౌఁగిలి వదలక కనకసౌధమున । బాగొందు విరవాది పానుపునందు
నారాకొమరుఁ జేర్చి యధరంబు నొక్కి । యీర! పుక్కిటివిడె మేను దక్కితిని
పైకొని యేలరా బంధభేదముల । మేకొల్పి యని చెక్కుమీటి గాటముగఁ
జెవిలోనఁ బావురా జిలిబిలిరొదలు । కవకివల్ గొణఁగి బంగరుసామి! యీర
నీధాటి కేఁ దాళనేర్తునె వొడ్డె । మోధవు మన్మథయుద్ధమందనుచు
రతికర్తిఁ బొగడుచు రాగాబ్ధి ముంచె । నతని గరంగించి యా గట్టివాయి
కఱవునఁబడినట్టి కానకకన్న । యరిదివస్తువు గన్నయటుల రేఁబవలు
కామరూపిణియైన గట్టిప్రాయంపు । తామసీచరి యది తనతోడఁ గూడి
పక్కఁ బాయకయుండి భక్ష్యభోజ్యాదు।లెక్కుడు తమిఁ దెచ్చియిడుచు భోగింప
దాని మాయలఁ బడి తల్లిదండ్రులను । దానున్నయూరును దనపేరు మఱచె
హేమావతీపురాధీశుని పుత్రి । వైమించు నక్కన్య నటమున్న మఱచె
ధరణీశసుతుఁడు కుందనపుగుఱ్ఱంబు । మఱచె నిక్కరణి సమస్తంబు మఱచి
దానవి నుడి జవదాటక యుండె । నానందమునఁ జొక్కి యాఱుమాసములు
అతఁడు గానక యుండ నపరంజితేజి । నతివ యొక్కెడ దాఁచి యతనిజవ్వనము
పుంభావసంభోగములఁ జుంబనైక । గుంభనమ్ములఁ జూఱఁగొనుచు గ్రీడించె
నంతట నొక్క దినాంతమ్మునందు । కాంత యెప్పటి నిజాకారంబు పూని
వంట సేయుచునున్నవాఁడ టైపడక । యింటి కోరణగంట నేర్పడఁ జూచి
పడబాకినో రెంటి బలుమొద్దువంటి । యొడలేంది పడు చన్నులూగులాఁగేంది

అయ్యయ్యయ్య యిది దయ్యమని భీతిఁ జెంది। యయ్యెడఁ గృత్రిమహాయము వల్లదల
వెతకి కానక యిది వేలుపుఁగొమ్మ । గతి మన్న భ్రమసితిఁ గటకటా యనుచు
మిక్కిలి వెతఁ బాన్పుమీఁద మైవైచి । గ్రుక్కుచునున్న రాసుతుని చెంగటికి
నిక్కంబు తెలిగంటి నెలఁత చందమున । నక్కపటని కాటి యరుదెంచి పలికె
చిన్నఁబోయితి వేమి క్షితిపాలతనయ । యిన్నిగులొందుట కేటి కారణము
కావలసినరూపు గైకొననేర్చు । నావిధం బెఱిఁగి డెందమునఁ గుందెదవో
కామరూపిణులౌటఁ ఖచరవధూటు । లేమనుజులైన వహింతు రాటలకు
నరమర లిటులసేయక భోజనమున । కరుగుదెమ్మని వాని హస్తమ్ముఁ బట్టి
తోడ్కొనిపోయి చతుర్విధాన్నములు । రాకాసి యిడ నొక్కరహి భుక్తిఁ జేసి
పలలాశిభామ నిర్బంధింప నతఁడు । వలసి యొల్లములుగా వలరాచకేళి
సలుపుచు నెక్కడఁ జంపునో యనెడి । తలఁకున నిక్కంబు తగిలినట్లుండ
దామావు గ్రసియింపరా విలోకించి । యూహఁ గలంగెడి యుడురాజు వోలె
వీక్షించి యన్నంబు విషదిగ్ధమగుట । భక్షణసేయ నొప్పనివాని పగిది
తలక్రింద భుజగ మొంతయు బుసకొట్ట । కలఁగికంటికి నిద్రగానని వాని
పరుమున పాలలోఁ బాదరసంబు । విరిచినక్రియ దాని వికృతంపురూపు
పరికించినది మొదల్ భావంబు గలఁగ । వెఱచి యెప్పుడుదీని విడిచిపోదునని
తలపోసి యుండ నంతట దానికొడుకు। పరుమాత్ముఁ డనువాఁడు బహుసేనఁ గూడి
తను జూడవచ్చిన దానవిరాజ । తనయుని మెడ సౌమథపుఁదీఁగె యొకటి
చుట్టిన రాచిల్కసొబగు వహించె । నట్టి పంజరములో నాచిల్క నుంచి
కొడుకు నెదుర్కొని కూర్మి మీఱంగ । నడుగుల వ్రాలినయతని దీవించి
హత్తి కౌఁగిట నొత్తి యింటిలో మనిచి । యత్తనయుఁడు వచ్చినట్టి సంతసని
రాచిల్క మఱచె నారాక్షసి యల్ల । రాచబిడ్డఁడు పంజరంబు వెవెతలి
కీరమైయున్న నింగికి నుద్గమించి । చేర సుధామండన క్షితిపాలుపురము
హేమావతీపురం బీరీతిఁ జేరి । యామనోహరకీర మవ్వు డింపురియాల
నల్ల మనర్మ్యవ యారామసీమ । పల్లవదళపుష్ప ఫలములచేతయు
సమాకారమహీరుహ శాఖపై నెక్కి । మహనీయలతికల మధురిమఁ జొక్కి
బవాలవచోవై చిత్రి భాసిల్లువేళ । మహాకామునిల్ నెక్కమందిర లగ్గాలు

అలసయానంబులో హంసల యుండి। యలుని జార్భటుల కాయుంచలఁ బిలువ
గప్పుకీల్గొప్పులోఁ గమ్మగ్రొవ్విరుల। నొప్పు తావులు భృంగయూథంబు బిలువ
చికిలిలేనవ్వులోఁ జిగురుటెమ్మోవి। వికరంపుజిగి పికనికరంబుఁ బిలువ
కళలూను మోములో కండచక్కెరలు। గిలుకు ముద్దులుకు రాచిలుకలఁ బిలువ
తలిరాకుబోణి సుదర్శనానాము। జలజాక్షి యవ్వవస్థలముఁ బ్రాపించి
చెలులార యెదుటఁ జూచితిరటె పొగడ। యలరులు విలసిల్లె నదిమఱు పొగడ
నేలాలతల గ్రమ్మొల నిదియేలఁ బాడ। నేలా! లలవలల్గి యీవేళఁజూడ
నవముగాఁ గాచియున్నవి లికుచములు। తవిలి తత్ఫలలీలఁ దగ నీ కుచములు
నని చిరియొప్పెడు మిళిందములఁ గేసరము। దనరె కంకేళి యీతరుల మీసరము
పెనుపొందె నసలఁ జాంపేయసాలంబు। కనుగొంటిరే దానికడ రసాలంబు
ఆ రసాలముకొమ్మ నదె చూడరమ్మ। సార సుధారసాసారంబు గ్రమ్మ
పలికెడు నొక చిల్క ప్రౌఢిమచిల్క। తిలకింప నెందు నిత్తెఱఁగు రాచిల్క
పగడంపు జిగిఁ జిక్కుపఱచనా ముక్కు। పొగడొందె పలువర్ణముల దీని యెక్కు
ఎందుండి వచ్చెనో తెలియఁగ మిత్తోఁట। కందుకొందము మాటలాడి యిచ్చోట
ఇది చిక్కకేడాలదే వేయునేల। పదరక పొదువుండు పట్టుడి వేళ
అది చెట్టుక్రిందికి వదిగి యాబాల। యనియె వచ్చిల్కతో ననురాగలీల
చెట్టుపై నవ్వారిఁ జేరకిట్టున్న। నెట్టుల్బు సుఖము నీహితనూత్తి విన్న
నీరూపు గనుగొన్న నెమ్మి జనించె। రారాదె యనఁగఁ గీరంబు భాషించె
కలికి నీపలుకు లాకర్ణించివంతఁ। బులకించె మేను నిన్ బోలిన కాంత
గలదె యెచ్చటనైనఁ గాంతులు మీన। కెలమి వేడితి గాన సేవత్తుఁ జూవ
యెవ్వ రర్థించిన నీవిద్యఁజోక। యవ్వాలవేయుక యరదురలేక
కంటికిఁ గనుతెప్పగతిఁ బ్రోచెదేని। వంటియుండెద సందియము సెల్ల మాని
చిత్రంబుగాఁ గథల్ చెప్పంగనేర్తు। గాత్రంబున నె పాడి కర మింపొనర్తు
పొలుపు యాపదతుంబురుఁ బరాకైన। పొలఁతి నిన్నెడఁబాసి పోవక మాన
నీసుముఖంబొప్పదే యున్న వగుచు। నాముదర్శన పల్కె నావుత్తవగుచు
నిన్నింత కొనియాడితినె వేడు చెల్ల। కన్నదనియుటకా! యమ్మచెల్ల!
ననువమ్మ మిది దప్ప నాకమ్మలావ। వినుఁ బొమ్ముదించక నేఁ బ్రోచుదాన.

అనిన ముంజేఁ వ్రాలినట్టి రాచిలుక । గొని ముదశ్రువులు కన్గొనల నొలుక
పేద పెన్నిధిఁగన్న పెరిమ నుప్పొంగి । యాదటఁ దనమేడ కరిగె లతాంగి
మొలఁతలతో నిట్లు మేడపై కేఁగి । చిలుక ముద్దాడుచు చేరి చెల్రేగి
పసవులారిచి మంచి పక్వఫలాళి । రసవంతమగు చక్కెరయు నిడి బాళి
జిగిబిగిగుబ్బలఁ జేర్చి లాలించి । మగచిల్క యనియంచు మాటలాడించి
పరిహాసకథలు దెల్ప బళీ యటంచు । తరుణీమణులఁ గూడి తాఁ బ్రహసించు
అతివ పంజరము తెమ్మన్నదే కాని । సతతమ్ము బొమ్ముదించదు బ్రేమఁబూని
శుకరత్న మన్నాతిఁ జూచి సంప్రీతి । నీఁకయేమి తనరీతియేఁ జిల్కనైతి
దీనికోసమె గదా దేశంబు విడిచి । దానవిచేఁబడి ధైర్యంబు గడచి
చిలుకనై యుండియుఁ జేరితి దీని । నలమెడి మేలెన్నఁడబ్బునో కాని
ఏమిసేయంగల నీమేన ననుచు । కామిని శృంగారకళలు గన్గొనుచు
నతిమోహమునబింబమనిమోవినొక్కు।నతివగుబ్బలు నఖాహతిఁజెందఁద్రొక్కు
తరుణినెమ్మోమునఁ దనమోము చేర్చు।చిరుబూతు కవకివల్ చెవిలో నొనర్చు
మగపోడుములు చిల్క మాటికీరీతి । తగిలిసేయఁగ నద్భుతముసెంది నాతి
ఒకనాఁడు చెలులెవ్వ రొద్దలేనితరి । శుకము ముంజేత నుంచుకొని మైనిమిరి
యిదియేమినీచెయ్వులెఱిఁగింపుమనుచు । ముదమొప్పనడుగుచు మోముమూర్కొచు ను
గళలగ్నమైన సూక్ష్మపుఁదీఁగ కాంచి । వలగొన్నదిది కంఠవలయమై మించి
యిది తెల్పుమని మెల్లనే తీసినంత । మదనావతారుఁడై మానిని చెంత
నిలిచినయతని మానితవిలాసంబు । బలు కంబుకంఠంబు బవిరిగడ్డంబు
నిడికన్నుఁగవ జోక నిటలంబురేక । వెడఁదవక్షము వీఁక వెన్నెలడాక
గేరు నవ్వులసౌరు కెమ్మోవితీరు । కారుమబ్బునుమీఱు కచములబారు
నిండుపాయముఁ జూచి నెరిఁ దలయూచిఁ । యండజవరయాన యప్పుడె లేచి
కరములు ముకుళించి కరముపోరామి । నెరయ నివ్వెర నిట్లనియె నేమిసామి
యిన్నాళ్లు చిలుకవై యుంపొంది నీవు । క్రొన్ననవిలుకాని కొమరు గన్నావు
ఇవు డద్భుతంబయ్యె నిది తెల్పవలయు।చపలాత్ములకు మోహసంపద వెలయు
నీరూపు గనుగొన్న నిజమని వేఁడు । నారాజముఖకను నలరుచు వాఁడు
శృంగారరంగపురీభర్త సుతుఁడ । బంగాళరాజ్యసంపత్ కళానీతుఁడ

సరసవిద్యలఁ బరిశ్రమము గన్నాఁడ । సిరుల నొప్పెడు చంద్రసేనుఁ డన్వాఁడ
వినుకలి నీరూపవిభవ మాలించి । కనకాశ్వ మెక్కి దోయ్యగతి నుద్గమించి
యిందు వచ్చుచు నూత్రమే తప్పఁబట్టి । నందున నదిలోహితాక్షి యున్నట్టి
పున్నాగవనములో బోరున ప్రాల । నన్ని శాటి విరాళి యడర నవ్వేళ
నను భ్రమయించి కొన్నాళ్లు భోగించి । యనిమిషాంగనరీతి నది ఖాళి ముంచె
దాని వైకృత మొక్కతటి నేను గాంచి । దీనికూటమి యనీతి యటంచు నెంచి
జాటి రానున్న నాసన్న యెఱింగి । యారక్కసి యొకానొకప్పుడు మొఱఁగి
చిలుకగావించి యుంచెను పంజరాన । వలసిన నెప్పటివగ యేనుబూనఁ
జేయు మాయావినై చెడుగది దానిఁ । బాయుట కేను రేఁబవ లెన్నియెన్ని
తలఁపులు దలఁప నంతట దానిపట్టి । బలముతో రా వానిపై ప్రేమదొట్టి
మఱచె నన్నది నభోమార్గంబు బట్టి । యరుదెంచినాఁడ నీయం దిచ్చపుట్టి
నా మెడలీవ గనంజేసె దైవ । మేమర కిది పగల్లిదుము నా గ్రీవఁ
బనిబూని లత రాత్రి పదిలంబుసేయు।మనినఁ బ్రమోదించి యమ్మహోపాయు
లాలితాకారంబు లలితాంగి మెచ్చి । వాలుఁజూపుల మక్కువ నివాళి యిచ్చి
ఘనకుచలికుచముల్ కానుకపెట్టి । తనమోవి తేనెలఁ దాపంబు నెట్టి
నా మేను నీసొమ్ము నాజవ్వనమ్ము । ప్రేమ నీకిదె సమర్పించితి నమ్ము
పగలెల్లఁ జిలుకవై ప్రాణేశ రేలు । మగవాఁడవై యేలు మదిని నామేలు
నెఱిఁగి వచ్చితి విదియే బ్రహ్మఘటన । కురులు గూడనినాఁడె గురుకీర్తినటన
గరిమ దిగ్రంగభాగములఁ జెలంగ । నరులెంచ వలచితి నవమోహనాంగ !
అని తీఁగ ముంజేత నతివ కట్టికొని । వినయంబుతో వానివెంటఁ బెట్టుకొని
తనమేడఁ జేరి కాంతల కన్మొఱంగి । యనురాగమునఁ బొంగి యనఁగిపెనంగి
యామిని సురతసౌఖ్యాబ్ధి నోలాడు । మోము మోమునఁజేర్చి ముచ్చటలాడు
తెలతెలవార నత్తీఁగె గీలించుఁ । జెలువుని మెడ శాతుసిని బ్రస్తుతించుఁ
జిలుకయావిభుని ముంజేత నుంచికొను।నలరి యాత్మీయభాగ్యము గణించుకొను
పగ లిట్టులుండి యాభామ యామినులు।మగనితోఁగడపు నమ్మాయ కామినులు
గాన రెవ్వ రెఱుంగకయ యుండ వన్నె । కాని కౌఁగిలియాని కలసి శాకన్నె
విహరింపఁ జాలాడవెను గొన్నినాళ్ల । కహహా యిదేమియో యతివ వేవిళ్లఁ

పోరలేదె యనుచు గుంపులుగూడి సఖులు । వెరగంది రవ్వార్త వికచాబ్జముఖులు
కొందఱు దెలుప నాకొని దానిజనకుఁ।డందమారెమ మతేమి యక్కట తనకు
పగదాయ జనియించె బాలచందాన । తెగ వ్రేయ కీఁకనెట్లు తీఱు పెందాన
పుట్టిన పగయంచుఁ బొలఁతి సౌధమున । కట్టె యుద్ధతినేఁగి యదరుక్రోధమున
చిలుక ముంజేనుంచి చెలఁగి ముచ్చటలు। తెలుప నాకర్ణించు తెలిగంటి సటలు
గని యోర్వకనియె నెక్కడి దానవీవు।తనుమధ్య చూల్దాల్చి తలఁకకున్నావు
నిన్ను నొంపక తీఱునే యపకీర్తి । యన్న నక్కన్న యోయంచితమూర్తి!
ఘనతఁ గర్భాగ్రకంకణము దర్శించి । యును గోపమూనెద వుచితోక్తి డించి
పటుతుదు రే! పదింబదిగ శోధించి । కద! యల్లవలయు నిక్కము నేరమెంచి
వెనుకముందర యొకవిప్రుండు ముంగిఁ । దునిమిన కథయు మత్తుఁడయి కడంగి
శునకంబుఁ జంపిన సుభటుని కథయు।వినవె! మున్ సాహసోద్వృత్తిచే వ్యథయుఁ
బాపంబు ఘటియిల్లుఁ బలుమాట లేల । భూపాల యాచిల్క బోధించుఁ జాల
వింతలౌ కథలది వినుము గూర్చుండి।శాంతితోడ నటంచుఁ జతుర యాడుండి
కొంకకాడిన జనకుఁ డను ముంజేతి । కంకణంబరసియుఁ గనలు లేసీతి!
జనక యంచు నగంబుచదివి తాశ్లోక । మున కర్థమేమి ప్రబోధింతుగాక
అనవిని యయ్యింతి యనియె నోయయ్య।నను దెల్పుమనుట ఘనంబటవయ్య!
యకలంక వేదవేదాంతార్థనిధులు । సకలశబ్దజ్ఞానచతురులౌ బుధులు
నీదేశమున లేరె! నెమ్మిఁ బిల్పించి । యాదృతి శ్లోకార్థ మడుగు మర్పించి
వారె తెల్పెదరు తర్వాత నందియము । లేఱు మీకన్న పుత్రిక దృఢాశయము
తెలిసి ప్రియోక్తియుక్తిని గారవించి । యిలరాయఁ డాస్థానమెలమిఁ బ్రాపించి
తనదేశమునఁ బ్రోలఁ దనరు భూసురుల । ననుపమ వేదశాస్త్రార్థభాసురుల
నాఁట మర్నాఁట మన్ననఁ బిల్వఁబంచి। పాటించి వారురా భక్తిఁ బూజించి
యుచితాసనమ్ముల నునిచి పోరామి । సుచరిత్రులార యీశ్లోకార్థ మేమి
యానతీవలయుఁ గర్భాగ్రే యటన్న । దీనిభావము మాకుఁ దెలియకయున్న
తెలుపుభారంబు మీఁదిగదా! యటంచుఁ । బలుకుచు వినయసంపన్నత మించు
భూనాథుగని శ్లోకము పఠింపవచ్చు । దీనిభావము లెస్స తెలియుటే హెచ్చు
ఇదిగనఁ గొన్నినా ళ్లెడయిచ్చితేని । నది నీకుఁ దెల్పెద మనిన భూజాని

యదుగుత్రోయఁగ రామి నాధీరతతికి । గడువిచ్చె నలునెలల్ గర్భ మాసతికి
నడరిన కారణం బరయఁదలంచి । గడువులోఁ దప్పకాగతి యుగ్గడించి
చెప్పిన మీకు నశేషధనంబు । లిప్పింతుఁ దప్పితి రేని మనంబు
ఘనదోషదూష్యమా కావున నాజ్ఞ । యొనరింతు దాన మాకొదవు నవజ్ఞ
అని రాజు వారితోనని భీతిముంచె । నెనలేని మృష్టాన్నమిడి యాదరించె
నావిప్రవరులు శ్లోకార్థంబు గనిరి । భావంబు గనరాదు బహుకష్ట మనిరి
గడువును దివసమొక్కటి దప్పనిండె । పుడమితేఁ డెదవిని పొక్కుచునుండె
ఆరేయి శివశర్మయను విప్రమౌళి । ధీరుండు తమవారి దెసఁజూచి జాలి
ధరణీసురులకు నిందటికి సంఘాత । మరణంబు లొదవె నిమ్మహినేత చేత
నేలాగు మనకని యెదఁ దాల్మితఱిగి । యాలోన శౌచార్థియై యేటికరిగి
యొక పాదమాటున నుండెడివేళ । వికటదంష్ట్రాభీలవికృతాస్యలీల
నుగ్రుఁడౌ బ్రహ్మదైత్యుఁడు రావి నుండి । యగ్రస్థలి వసించి యభినవచండి
యన మించుఁ దనభార్య కనియె నోకాంత । వినలేదె యియ్యూర వెలసినవింత
పలుమంది విప్రులఁబట్టి హింసించఁ । గలఁడు రేపటికి నాగ్రహము రెట్టించ
క్ష్మారమణుఁడు కలుగానుగల్ చేసి । నారప్పుడే వారి నంజుళ్లుమేసి
మనవచ్చు మనకన్న మనుజాళి భార్య।యనియె నిదేమయ్య యసమానధైర్య
పౌరుల నేటికి భంజించ నెంచె । నీరాజు వారియం దేతప్పుగాంచె।
నానతియియ్యవే యన నప్పలాశి । దానితో ననియె కాంతరో వన్నెవాసి
గల సుధామున కొక్కకన్యక వెలయు । చెలువంబుచే నది శ్రీదేవి గెలయు
శృంగారపురమేలు క్షితినాథసూతి । శృంగారనిధి చంద్రసేనుఁ డన్ ఖ్యాతి
గన్న రాకొమరుఁ డిక్కన్యఁ గాంక్షించి।హొన్నుతేజీ నెక్కి యుదువీథి నించి
చనుదెంచి త్రోవ రాక్షసిమాయఁ జిక్కి । వెనుకఁ గీరాకృతి వెలయ సొంపెక్కి
యీరాజసుతఁ జేరె నది వానిగ్రీవ । వేరొక్కతఱిఁ దీసివేయ స్వభావ
మానితాకృతిఁ బూన మగువ హర్షించి । వానితో రేలెల్ల వలచి క్రీడించి
తెలతెలవారినఁ దీఁగె యొప్పంటి । వలె వాని మెడఁజుట్టి వదలకయుంటి
చిలుక యావాని ముంజేత ధరించు । చెలులెంతు రెప్పటి చిలుకయటంచు
నది రేలు పురుషుఁడౌ నతనితోఁ గలసి । ముదమందఁగా గర్భము జనించె బలిసి

యది తండ్రి యెఱిఁగి మహారోషమెత్తి।యిదియేమియని చే వహించె బల్కత్తి
పదరకుమనుచుఁ గోపము నివారించి । చదరాలుగా సుదర్శన తండ్రిఁగాంచి
యోచెల్ల! కరముననున్న కంకణము । చూచియుఁ గోపగించు టిదేమిగుణము
ఈయర్థ మెవ్వరినేనియు నడిగి । నాయందు నేరమున్న వధింపు గడఁగి
యన సుధీజనుల నయ్యర్థంబు నడువుఁ।డని నాల్గుమాసంబు లతఁడిచ్చె గడువు
గడువునదీతె శ్లోకముభావ మెఱుఁగఁ । బడదయ్యె గాన కోపము పెచ్చుపెరుగ
నామనీషుల నోంతునని యున్నవాఁడు । భూమీశుఁ డాయర్థము వినంగలేఁడు
నీకతింగించెద నెలఁత యూకోనుము । చేకొని చిలుకయా చెలువుని దినము
ముంజేతి కంకణంబుగ ధరియించి । రంజిలం గనియు నేరము లుగ్గడించి
కినియ నేటికి వృథా కీరంబువలన । తనకుఁ జూలోదవె సత్యంబను లలన
భావ మెవ్వఁడు గణింపఁగ లేఁడుగాన । నీవార్త గోప్యమై యిట్లుండె చాన
అని బ్రహ్మరాక్షసుం డాభావమెల్ల । వినిపింప శివశర్మ వేడ్క సంధిల్ల
శ్లోకార్థ మెఱిఁగి మెచ్చుచు వేగఁబోయి । వ్యాకులపడు తనవారి నారేయి
యూరడిల్లఁగఁ బల్కి యోడక తెల్ల । వారిన నృపతి కావైఖరి యెల్ల
చెప్పిన విని చంద్రసేన రాచిలుక । యొప్పున నిన్నినాళ్లుండి మాకలుక
యొదవించితని తీఁగె యొయ్యనఁ దియ్య।మదనునివలె నక్కుమారుఁ డక్షయ్య
చారువయోరూపశాలియై మామ । గారికి మ్రొక్కిన ఘనతరప్రేమ
నతని నక్కునఁజేర్చి యారాజు కూర్మి । సుతను ముద్దిడుకొని చుట్టముల్ పేర్మి
గల మిత్రులెన్న నకన్యకామణికి । నల మహాసేననృపాత్మజాగ్రణికి
పరిణయం బొనరించి బ్రాహ్మణోత్తములు।కరమర్థిఁ బూజించి కనకాదికములఁ
దనియించి వీడ్కొల్పి తనయ కల్లునకు । పనితరూపవిలాసపంచభల్లునకు
ఘనభూషణాంబరగ్రామాదికములు । కనకరథంబులు గజతురంగములు
అరణంబుగా నిచ్చె నలసుదర్శనకు । దరదంబురుహదళాతతసుదర్శనకు
నావిర్భవించెఁ జంద్రాంకుఁడన్ సుతుఁడు । భావజతులితసౌభాగ్యసంయుతుఁడు
సతితోడ సుతుతోడ సైన్యంబుతోడ । నతఁడేఁగెఁ దనయూరి కనురక్తితోడ
అల లోహితాక్షియు నతనిహయంబు।నెలమి నిచ్చి యొనర్చె నంతేఁబ్రియంబు
శుకరూపుఁడగు నిజేశు స్వరూపకలన । సుకుమారతనుఁజేసి సుభగ యాలలన

యతనిఁ బెండ్లాడి మహాసౌఖ్యమందె । పతిభక్తి నెంతేనిఁ బ్రఖ్యాతిఁ జెందె
సతియన నదిసుమీ ! సౌజన్యవసతి । యితిహాసమిది కోర్కెలిచ్చు నోసుదతి!
యని చిల్క తెల్పిన నలరి యక్కలికి । జనపతిసఖి నంపి చనియె లోపలికి
అని యానతిచ్చిన నపుడప్పురారిఁ । గని యేమి యవ్వలికథయనె గౌరి
సరసపతివ్రతాచరితంబునందు । గరిమతో మూఁడవకథ పూర్ణమయ్యె

---

## "శయాగాన్యాం" అనినవనితకథ

శ్రీవిశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
మఱునాఁడు దూతికామణి వెంటవచ్చి । సరస నిల్చున్న యచ్చపలాక్షిఁ జూచి
రావక్క కూర్చుండరాదటవక్క । యీవును దూతియు నిచ్చోట ననుచు
గురురత్నపీఠులఁ గూర్చుండఁబనిచి । సురుచిరవాక్ప్రౌఢి శుకరత్న మనియె
నోపుష్పమంజరి! యొరునిఁగామింప । రేపట్లను బ్రమాద మెంతవచ్చినను
బరమపతివ్రతాభరణంబు లట్టి । తెఱఁగెంచు నొకకథఁ దెలిపెద వినుము
తెలిగంటి! పాంచాలదేశమ్మునందు । కలిమిచే విలసిల్లు గాంపిల్యపురము
ఆపురంబుసుచంద్రుఁడనుభూతలేంద్రుఁ। డాపూర్ణగుణసాంద్రుఁడై యేలుచుండు
నతనికి విజయసేనాఖ్యకుమారుఁ । డతిమోహనాకారుఁ డద్రిధీరుండు
పుణ్యవశంబునఁ బొడమి బుధాభి । గణ్యదాక్షిణ్యశృంగారనైపుణ్య
శాలియై బాహుప్రచండప్రతాప । హేళియై గురునాజ్ఞ నెల్లవిద్యలును
నయశాలియను మంత్రినందనుఁ డోద్ది।కయి మెలంగఁగనేర్చి యాయుధాభ్యాస
పరతంత్రుఁడై ధనుఃపాండిత్యమహిమ । నరుఁడె కాఁబోలుననంగ ననంగ
హరుకృప శౌర్యధైర్యౌదార్యగతుల । హరువొంది కొన్నేఁడు లరిగినపిదప
పరిపూర్ణయౌవనభ్రాజిష్ణుఁ డగుచు । నెఱచందు సిరిఁజిందు నెమ్మోముతోడ
చిగురు వాతెఱతోడఁ జెలువొందు నతని।సొగసు గనుంగొనిసుదతులెన్నుదురు
సకలవిద్యావిచక్షణత నీరీతి । స్వకుమారకుఁడు నయశాలితోఁ గూడి
చరియింపఁగాఁ జూచి జనకుఁ డుప్పొంగి।పరిణయం బిఁక నొనర్పఁగవలె నంచు

దన మంత్రియగు నీతిధనుతో విచార। మొనరింప నత్తైఱఁ గుడిగముల్ దెలుప
విని మంత్రిసుతునితో విజయసేనుఁ డను। ననఘ! పెండిలిసేయ నాలోచనంబు
గావించెదరు రాజుగారు పెండ్లైన। పోనరా దెచటి కిప్పుడె యిరువురము
హయములపై నెక్కి యరుగుద మెచటి। కయిన భూస్థలి వింతలరసి పిమ్మటను
చనుదెంతమని పల్క సచివకుమారుఁ। డనుకూలుఁడై మంచిదని సమ్మతించె
నిరుచెవి వినకుండ నిటుల నేకాంత। పరత మంత్రిసుతుండు పార్థివసుతుఁడు
మృగయావినోదార్థ మేఁగెద మనుచు। జగతీశుతోఁదెల్పి శరచాపఖడ్గ
కలితులై జవనకంఖాణంబు లెక్కి। వలయుధనంబు లవ్వారిగాఁ గొనుచు
బోరున నొకనాఁడు పురినిర్గమించి। దూరంపుటడవుల దూరి యాడాడ
మృగముల నెగుచుచు మృగములవెంటఁ। దగిలి రానియ్యక దవ్వులనిలిపి
హయములఁ బరపి మహారణ్యవీథి। రయమునఁ జనిరి తరంగిణుల్ గడచి
గ్రామముల్ దాఁటి పక్కణములు దూరి। జీమూతములగ్రాలు జీమూతపటలి
క్రమియించిబహునగరములు త్తరించి। యమితదేశములుఘోషాదులుగనుచుఁ
జని రెండుమూఁడుమాసములకు నెదుర। గని రుదక్పథమున గాంధారనామ
దేశంబు ధనధాన్యదీప్ర సస్యప్ర। దేశంబు గాంచి తద్దేశవైభవము
తమలోనఁ బొగడుచుఁ దనుగతశ్రాంతి। సమధిక సవిధ కాసారకల్హార
కమలమరంద సంగతమందమారు। తములు బాపఁగ సమ్మదమున నచ్చోట
నవురొందు పానీయశాలఁ బ్రాపించి। జవనాశ్వములుడిగ్గి జరఠ యొక్కరిత
యన్నపానీయంబు లమరికసేయ। నన్నులవున నుప్పులై కొంతసేపు
వసియించి లేచి యవ్వారెవ్వరేలు। వసుధయో యిది సస్యవైభవంబొంది
మురువొందుచున్నది ముందరఁ దగిన। పురమున్నదె వసింపుటకు మాకు ననిన
నారాజసుతునితో నాయవ్వ పలికె। కారుణ్యసదన గాంధారదేశ మిది
యొక యోజనముమేఱ నున్నది రత్న। మకుటుఁ డేలెడునట్టి మందారపురము
అందు మీరరిగిన నది వసియింప। నందము గృహములెన్నైనను గలవు
శుభముగల్గెడి నీకు క్షోణీశతనయ। యభినవమంధనుండ వనుచు దీవింప
నాయవ్వ కొకకొంత యర్థమర్పించి। యాయమ వీడ్కొని యశ్వంబులెక్కి
ముందరఁ జన నర్యముఁడు పశ్చిమాబ్ధి।యందుఁ గ్రుంకె తమంబు లానె దిక్తటుల

చారుసంధ్యారుణచ్ఛాయలు మించె । తారక లంబరస్థలిఁ రాణించె
ఆరేయిఁ బురిఁజొచ్చి యరుగగా లేక । వా రొక్కకాళికావాసమ్ముఁ జేరి
సన్నిధిఁ గొలఁకులో సంధ్యాదినిష్ఠ । లన్నియుఁ దీరిచి యంబకు మ్రొక్కి
జయ భద్రకాళి యీశ్వరి మహాదేవి । జయ శాంభవి మృడాని జయ నీలవేణి
మమ్ము రక్షింపవే మముగన్నతల్లి । నమ్మి నీశ్రీచరణములు చేరితిమి
అని ప్రస్తుతియొనర్చి యద్దేవి పాద । వనజసన్నిధిని దివాసులు పరచి
యిరువురు శయినించి యీశ్వరికథలు । గురుభక్తి నొడువుచుఁ గొంతసేపటికి
నలసి నిద్దురపోయి రానిశావేళ । అల రత్నమకుటుని యాత్మజయైన
కమలరేఖానామకన్యకామణిని । మమత మేనత్తకొమారుని కొసఁగ
సమకట్టియునికి యాశాంభవి యెఱిఁగి । కమలరేఖ నిజాంఘ్రికమలముల్ నమ్మి
వ్రతములు విహితోపవాసముల్ పూజ । లతినిష్ఠ సలుపుచు నంబ! సౌందర్య
చాతుర్యగాంభీర్య శౌర్యాదిగుణ స । మేతుఁడౌ భర్తనిమ్మా! నెమ్మి ననుచు
దను మదినునిచి నిత్యంబును వేఁడు । కొనుచునుండుట కృపాగుణమునఁ దలఁచి
యాపెండ్లికొడుకు విద్యావయోహృద్య । రూపహీనుండౌట రోసి వీఁడేమి
కమలరేఖకుఁదగుకాంతుఁడే!యనుచు।నమలాంగిశాంభవి యామహూర్తమున
నామేనవాని సద్యాన నాత్మధామ । సీమఁ దివాసిపైఁ జేర్చి యిచ్చోట
నిదురఁజెందిన చంద్రనృపతి కుమారు।మదనావతారుఁ బ్రేమమునఁ గొంపోయి
అప్పెండ్లి కొడుకు పర్యంకమ్ముఁజేర్చి । యొప్పులాడికి వీఁడెయొప్పు నంచలరె
అప్పెండిలిముహూర్త మాసన్నమగుట । నంతఃపురమ్ములో నఖిలబాంధవులు
హితులు పురోహితులెల్లను శీఘ్ర । గతి మంగళస్నాతఁ గావింపుఁ డనుచు
దివరింప నిదురఁజెందెడు సుచంద్రాత్మ । భవు లేపి కాళికాంబాప్రభావమున
వింతవాఁడనుచు వివేకింపలేక । యంత సంపఁగినూనియను దలయంటి
జాజికాయటకలిఁ జల్లి పన్నీటి । చే జలకములార్చి జిలుగు క్రొంజలువ
వలువ లొసంగి సువాసనల్ చిందు । కలపంబు లలఁది చొక్కపుభూషణముల
హారువొందఁ గైసేసి యలరులుచుట్టి । హారిణేక్షణలు కొంద ఱారతులెత్తి
యుడిగంబు లొకకొన్నియొనరింపఁబెండ్లి।కొడుకునై భవమురక్కనఁబెండ్లిచవిక
చేరి మాణిక్యవిచిత్రపీఠంబు । పై రహి నున్నంత బాలికామణిని

పరిపరి సొగసు లేర్పడఁగఁ గై సేసి । కరిరాజగమనలు కమలలోచనలు
తోడ్కొని తెచ్చి రత్నొయ్యాలి మెఱుఁగు । లాకడ నీకడ హరిదంతరములఁ
గ్రొక్కాఱు మెఱుఁగుల కొమరున నెరసె । నక్కల్కి రత్నభూషాంశువు లెనసి
గమ్మని వాసించు కలికికస్తూరి మె । కమ్ము రకమ్మున కల్యాణవేది
వసియించినంత వైవాహికక్రియలు । పొసఁగఁ గులోచితస్ఫురణ భూసురులు
సేయించి లాజలచేత హోమంబు । సేయించి శిఖప్రదక్షిణము సేయించ
నంతఃపురము సేరినంత బువ్వంపు । బంతి సాగించి రప్పట్ల రాసుతుఁడు
నిదురమబ్బగుట పెండ్లిమహోత్సవంబు । పొదలె నిదేమి యద్భుతపుస్వప్నంబొ
నిక్కువంబో యని నివ్వెరఁజెంది । యొక్కట భుజియింప కూరకయుండె
నతఁడు భుజించినాఁడని కూర్మిసకియ । లతనిఁ దోడ్కొనిపోయి యపరంజిమేడ
బాగైన సకినల పట్టెమంచంబు । పైఁ గుల్కుమల్లెపూఁబానుపు మీఁదఁ
బఱచిన జిలుగుదుప్పటి మెప్పులెనయఁ । బరగు తలాడలు బటువుబిల్లలును
గల సెజ్జ శయనించగా నియమించి । చెలువఁ దోడ్కొని తేరఁ జెలు లేఁగిరంత
తలయంటికొను టేమి తానంబిదేమి । కలపంబిదేమి యిక్కడఁ బెండ్లియేమి
యిదమిత్థ మనఁగూడ దే కాళికాంబ । పదసన్నిధి శయించి బడలియుండితిని
ఆఁకలి తఱవై సదని తలంచుచును । రాకొమరుండు నిద్రావశుండయ్యె
అంతలోఁ జెలికత్తెలరిగి రాకన్నె । నెంతయు బోధించి హెచ్చువైఖరుల
సింగారమొనరించి చిత్తజురథము । సంగతిఁ గొనితెచ్చు చందానఁ దెచ్చి
యొకభంగిఁ బడకయిల్లొయ్యనఁ జేర్చి । యొకరొకరరిగి రొక్కొక నెపంబునను
చెలులు పోయినవెన్కఁ జిగురాకుబోణి । జిలుగుపాన్పున నిద్రఁజెందెడు వాని
మొలకపాయమువాని ముఖవిలాసమునఁ । గిలకిల పూర్ణేందుఁ గేరెడువాని
తళుకుఁజెక్కులవానిఁ దపనీయరుచుల । వలనొందు వక్షఃకవాటంబువాని
విజయసేనునిగని విస్మయంబంది । గజయాన యితఁడు జగన్మోహనుండు
నామేనబావ యింత విలాసవంతుఁ । డే మిక్కిలి కురూపియందురు వాని
నతఁడెయీతండని యనవచ్చు నెటుల । నితఁ డెవ్వరో పరమేశ్వరి కరుణ
నను వరింపఁగ వచ్చినాఁడని తలఁచి । యనురాగ మిగురొత్త నతని లేపక యె
సరస వైచిన చిటిచాపపైనుండి । పరివాదిని గ్రహించి బాగుమీఱంగ

కాయలు తనకుచకలశంబు లొరయ। కాయిగా మీటి గోటను దంత్రులెనయ
కరకంకణమ్ములు ఘలుఘల్లు మనఁగ । పరిపరి జిలిబిలిపాటలు దొరయ
నింపుగా వీణవాయింపఁగా నిదుర । మంపు మాని నృపాలమణికుమారకుఁడు
కనువిచ్చి కమలరేఖ మొగంబుచూచి । కనకపాంచాలియో కమ్మవిల్కాని
నవమోహనాస్త్రమో నాతిరూపమున।నవగొందు శృంగార చాతుర్యశయో
వనజాక్షి వల్లకీవాద్యసంగతిని । అని గణింపుచునున్న యాభావమెఱిఁగి
శయ్యయు గానంబు చారుహాసంబు । మయ్యొప్పనలఁదిన మంచిగంధంబు
వీణయు వేఁపు వీక్షింపఁదగిన । యేణలోచన గల్గు టిదిభాగ్య మనుచు
సగము శ్లోకంబు పొసంగఁబాడినను । జగతీశసుతవిన సగము శ్లోకమున
నానృపాలకుమారుఁడను తృప్తిపాస । లానినవారి కోయలినీలవేణి
యివియెల్ల నింపుగా వెల్లసొంపులును। భువిఁ దండులప్రస్థమూలముల్ సుమ్ము
నా విని యాఁకట నలగినాఁడనుచు । భావంబున నెఱింగి పద్మాయతాక్షి
అతివేగమున లేచి యాఁకట బడలి । పతియున్నవాఁడని పసిఁడిపళ్లెమున
సరసభక్ష్యములు భోజ్యములు చోష్యములు । పరిపరి కూరలు పచ్చళ్ల తెగలు
పానీయములు దెచ్చి భక్తి నవ్విజయ । సేనున కవియెల్లఁ జెలువ వడ్డింపఁ
బరితుష్టిగ భుజించి పాణిపద్మములు । పరిమళోదకములఁ బ్రక్షాళితములు
గావించికొని శయ్య గ్రక్కునఁజేరె । నావేళ సతి గిన్నియలు పళ్లెరములు
గడిగి పానుపుక్రిందఁ గ్రన్నన నునిచి । యొడయుని పాదంబు లొత్తుచుఁ గపుర
పీడియం బొసఁగెడు వేళ మార్మాట । లాడక నృపసూనుఁ డలసి నిద్రించె
నితని లేపగఁ దగ దీవేళ ననుచు । పతిచెంత శయనించి బాల నిద్రించె
తెల్లవారకమున్న దేవి శీఘ్రమున । నల్ల మేనల్లుని నతివపానుపున
పడవైచి పాంచాలపతిసుతు తనదు । గుడిలోన నిడుకొని కొమ్మచిత్తంబు
తెలియుటకై మాయదీపింప నుండె । నలవియే దేవిమహత్త్వంబు దెలియ
నంతకుమున్నె పద్మానన లేచి । యంతఃపురంబున కరిగి వర్తించె
నరుణోదయమువేళ నమ్మంత్రిసుతుఁడు । నరనాథసుతు శోభనవిలాసకళలు
తిలకించి యిదియేమి తెలుపు నీమేని । కలపంబువాసనల్ కడలఁ గ్రమ్మెడిని
యీరత్నహారంబు లీహైమపటము । లీరమ్యమాల్యాదు లేడవి నీకు

నెక్కడికేగితి వెతకింపు మనిన । నక్కుమారుఁడు వానికనియె నవ్వుచును
ఏ నిన్ను నెడఁబాసి యారేయి నొంటి । గా నెందుఁజన నిందెకద! మేనులోరయ
శయనించియుండి యే స్వప్నంబుగంటి।నయశాలి విను మదంతయును దెల్పెదను
అని రేయి తనవివాహక్రమం బెల్ల । వినవినవింతగా వినిపించి వెలఁది
చదివిన శ్లోకంబుసగమును దాను । చదివిన శ్లోకంబుసగమును జెప్పి
అందున నన్ను క్షుధాతురుం డనుచు । నిందుబింబానన యిచ్చలో నెఱిఁగి
పసిఁడిపళ్లెరమున బహుపదార్థములు । వెసఁ దెచ్చిపెట్టిన వేడ్క భుజించి
చేతులువార్చి చెచ్చెర హంసతూలి । కాతల్పమున శ్రాంతిగదురఁ గూర్కితిని
ఆలోనఁ జెలి యిచ్చినట్టి వీడియము । మేలికర్పూరంపు మించు దావులును
పుక్కిట నున్న దిప్పుడును గన్గొనుము । పక్కలోనుండి యాబాల నన్ గూర్చి
యేమనిపలికెనో యెఱుఁగ నిద్రాత । మోమయాంత్సుఁడనొట మూఢభావమున
నిన్నియు నిజమని యిందాఁకనుంటి । నన్నియు దబ్బరలయ్యె నీవేళ
మంత్రిపుత్ర యిదేమిమాయయో దైవ। తంత్రమో యటువంటితరుణి నావంటి
భాగ్యహీనున కేలఁ బ్రాపించు నవని।మృగ్య మాచెలిరూప మిఁకఁ జూడగలనె!
అని విమోహాంధుఁడై యాడు రాకొమరుఁ। గని మంత్రియనియె నోకల్యాణశీల!
యిది కల్లయనఁగరా దిదినిక్కువంబె । యిది నిదర్శనమగు నిమ్మహాదేవి
కరుణించి పెండిలిగావించె నేమొ । మరుగకు మిచ్చోట మసలఁగాఁ దగదు
ఆవలఁ బోవుదమని లేచి పైన । మైవాఁడు త్వరసేయ హయముపై నెక్కి
యామంత్రిసుతుఁ గూడియవ్వలఁజనియె।భూమీశతనయుండు పూబోణి వినుము
అరిగి కేదారేశు హతనతక్లేశు । కరుణానివేశు నర్కశతప్రకాశు
భజియించి యచ్చోటఁ బదిపూటలుండి । గజచర్మవసను గోకర్ణేశుఁ గాంచి
పెద్దలౌ ద్విజుల కభీష్టధనంబు । తద్దయు భక్తితోఁ దమ రొసంగుచును
నెలకొని రవ్వీటినృపతి మన్నింప । నెలపూట లిచట మానినికథ వినుము
మఱునాఁటి రేయి కోమలి మేనబావ । పరిణయావసరవైభవ మొకింతయును
నెఱుఁగకుంటినో యిదియేమియో యనుచు। నెరపరికము లేక యింతి సౌధమునఁ
జలువపానుపుమీఁద శయనించియున్న । చెలులు తోడ్తేర వచ్చినదై లతాంగి
నిజశయ్య శయనించి నిదురించువాని । గజచర్మసంగతాంగకముల వాని

పసరంబు వగవాని బలుదోని కడుపు । పసమించువాని నేర్పడక యొండొంటి
నొరసి యట్టయుపొట్ట యొక్కటైనవాని । కటిఅకు జుంజురువెంట్రుకల తలవాని
కనుగొని యాశ్చర్యకలితయై చెలులఁ।గనకాంగి చూచి యెక్కడివాఁడె వీఁడు
నలినలోచనలార నాపాన్పుమీఁద । నళుకులేక శయించి యలకుంభకర్ణు
పెనుపున గురకలుపెట్టుచున్నాఁడు । తనువెఱుంగఁడు పాడితక్కి యీవెడఁగు
నరుని చెంగటికేల నన్నుదోడ్తెచ్చి । తిరి తెల్పుఁడనిన భీతియు నద్భుతంబు
నగవును బెనగొన ననబోఁణు లనిరి । తగునటవమ్మ! యీతని నిట్లుపలుక
నిన్నరే నీదు పాణిగ్రహణంబు । పన్ని ముత్యపుఁదలబ్రా లోవ్వసి నిన్ను
వలపించినాతఁడీనగకాఁడె కాఁడె । యలిగి పల్కెదవేమె హరిణాయతాక్షి
యీతఁడెవ్వండని యెంచక పదరి । మాతోడనన్నట్లు మాతోడ ! నీవు
నెఱుఁగ కాడెదుసుమీ! యేరితోనైన । పరిహసింపుదు రపప్రథ యుప్పతిల్లు
నూరకె పతిఁజేరి యుండుమటన్న । వారిఁ గోపించి యవ్వారిజాతాక్షి
వెలుపలి కరుదెంచి విరిబోఁణులార । తెలివిదప్పిన మీకుఁదెలుప నావశమె
చిన్ననో చిఱుతనో ! శిక్షింప నెఱుఁగ । కున్నానె పతిగానియొరుని నేనేల
నంటెదు పొండన్న నక్కల్కి పల్కు । లింటిలోపలి తల్లి యెఱిఁగి వే వచ్చి
సుదతి! మీమేనత్తసుతుని సువేగు । మొదటనె మీతండ్రి ముదమొప్ప నిటకుఁ
బిలిపించి ప్రజమెచ్చఁ బెండ్లిచేసినది । తెలియవె యిపుడు బుద్ధిచలించి నీవు
యితఁడెవ్వరేనెవ్వరే యని చెలుల । నతకరించితివట యది నాయమగునె
యిమ్మాట మీతండ్రి యించుకవినిన । నెమ్మదిఁ గోపించు నిన్నని పలుక
నెక్కడి దుర్బోధ లీవు చేసెదవు । తక్కరిపల్కెట తరుణి నాపలుకు
ఇతఁడె నాపతియైన నెఱుఁగనో రాత్రి । కతలును నడచిన క్రమము లన్నియును
నడిగిచూడుం డితఁ డందులో నొకటి । నొడివిన నపుడు నన్ను తిరస్కరించి
నిందింపుఁడనినఁ దండ్రియు నంతలోన । నందువచ్చి యిదేమియని యవ్విధంబు
విని తనపుత్రి వివేకినీరత్న । మన్నృతంబులాడ దీయన రాత్రిపనులు
నెఱుఁగునో యెఱుఁగడో యిదియడుగుదము।పరతెండనుచు నెల్లబంధుల హితుల
వియ్యంపువారల విప్రపుంగవుల । నెయ్యంబుతోఁగూడి నిజసభాస్థలికి
నా సువేగునిఁ బిల్వనంపించి మణిమ । యాసనస్థునిఁ జేసి యలమామ పలికె

నిన్నటిరేయి పెండ్లిమహోత్సవంబు । గన్నవాఁడవుగదా ! కనుఁగొన్న వెల్ల
వివరింపు మప్పటి వివిధభూషణము । లవిరళగంధమాల్యాంబరావళులు
నీయందుగాన మన్నియు దాఁచినావొ। ఓయన్న తెలుపు ముహూర్తకాలమున
నడచిన వేడ్కలన్న నతండు కాళి । గుడిలోన రేయెల్లఁ గూర్కుచునున్న
కతననేమియునెఱుంగఁడుగానఁబెండ్లి । కతయొక్కటియునెఱుంగనటంచుఁబలికె
కమలరేఖాకన్యకను బెండ్లియైన । విమలాత్ముఁ డెవ్వఁడో వేఁకువవేళ
నువిద సౌధంబుననుండి యితండె । భవనాంగణమునకుఁ బరతెంచె ననుచు
వియ్యపువారెల్ల వికటోక్తులాడ । నయ్యెడ నక్కన్య యయ్య కిట్లనియె
మేడపై వల్లకిమీటుచు నేను । పాడినపాటకుఁ బ్రత్యుత్తరంబు
లిచ్చినాఁ డాఁకలియెత్తఁగి యన్నంబు । తెచ్చిన భుజియించి తృప్తిగన్నాఁడు
చక్కనివారిలోఁ జక్కనివాఁడు । చుక్కలదొర హసించుమొగంబు వాఁడు
ఆరాజతనయుఁ డెందరిగనో కాక। యీరాసుతుఁ డెఱుంగఁ డిందొక్కటియును
అనుమాట లాలించి యాసభఁ గొంద । అనఘు లీబాల మహాపుణ్యశీల
కల్లలాడదు కాళికాప్రసాదమున । వల్లభుఁ డెవ్వఁడువచ్చి పెండ్లాడి
పోయెనో యని రేయిపురుషుని నేయు। పాయంబునను గ్రహింపనగునో యనుచు
గొంద ఱాడఁగ నట్టికొలువులో వియ్య । పుంద వచ్చినవార లలుకవెట్టుకొని
పోవఁగా గాంధారభూపాలుఁ డేల । నీవేళఁ గోపించి యేగెద రిటులఁ
బదిపూటలు సహించి పదరక నిలువుఁ । డిదిలెస్స శోధింత మింతలో ననుచు
వారి నిల్పినతరువాత మర్నాఁడు । కూరిమిసుతఁ గనుంగొని తండ్రి పలికె
వచ్చిన మేనబావను ద్రోసిపుచ్చి । యిచ్చోటఁ గనబడ కేఁగినవాని
వల్లభుఁడని ప్రేమవహియించియున్న । చెల్లఁబో యతఁడిందుఁ జేరెడి దెటుల
వాలాయమును జేతివానిని విడిచి । కాలివానిఁ బెనంగుకత యయ్యె ననిన
నాకన్యకామణి యనియె నోయయ్య । నాకడ కిపుడు కొందఱ ద్విజన్ములను
రప్పింపవలెనన్న రాజు వేవేల । రప్పింపఁ గన్నె వారలకెల్ల మ్రొక్కి
యాకడఁ జిట్ల 'శయ్యాగాన' మనెడు । శ్లోకంబుసగము భాసురలీల వ్రాసి
వెయ్యారు చీటు లావిప్రుల కొసఁగి । యయ్యలారా! దీని కవలియర్థంబు
చదివిన పురుషుని జాతియు నీతి । సదనంబు దెలిసి యాజనుని మాయింటఁ

బరిణయంబై పైఁడిపళ్లెరం బీవు । హరియించి తిదిధర్మమగునె యటంచు
నిడుబంది పెట్టి యూరెల్ల నెఱుంగ । జదువుపుట్టించి యిచ్చటికిఁ దోడ్తెందు
తెచ్చినవారికి ధేనుసహస్ర । మిచ్చెద నిష్కంబు లిచ్చెద వేయి
యని గ్రాసముల కిచ్చి యనిచిన వారు । చని బహుదేశరాజసభాంతరముల
నలుగురు కూడియున్న ప్రదేశములను । జలిపందిళుల సత్రశాలలయందు
సగముశ్లోకం బదిచదివి యామీఁది।సగము వచ్చునె మీరు చదువుఁడా యనుచు
నడిగి యెవ్వరికిరాదని వారలనఁగ । పుడమియెల్లఁ జరించి భూసురు లెల్ల
మగుడగా వారిలో మహీసురు లిరువు । రగణితవేదశాస్త్రార్థకోవిదులు
గోకర్ణమున కేఁగి కొన్నినాళ్లుండి । యాకడ నొక్కనాఁ డంగడివీథి
నయశాలిరాజనందనుఁడునొండొరుల।శయములు గ్రహియించిచతురవాక్యములు
పలుకుచు నగుచు సంభ్రమముతోఁ జనఁగ।దిలకించి యాశీర్వదించి యాద్విజులు
వెంబడిఁ జని చదివిరి శ్లోకమున స । గంబుచదువఁగ నాకర్ణించి రాజ
తనయుండు మంత్రినందను చెయిఁజఱచి । పెనచి బెట్టుగనవ్వి పెక్కునాళ్లకును
వింటి మీశ్లోకంబు వీరిచే వాలు । గంటి నాఁడటు లోకకలలోన వీణె
లోపలఁ బాడిన శ్లోకంబుగాదె । యాపంకజాక్షి యేమయ్యెనో యనుచు
వగవ శ్లోకము కొదువసగంబు చదువఁ । దగునని భూసురోత్తములు ప్రార్థింపఁ
బులకలు మైఁబర్వ భూపాలసుతుఁడు । సలలితక్షితి దాను చదివినసగము
చదివిన ఘంటం బొసంగి యీసగము । వదలక చీటిలో వ్రాయుఁ డటంచు
వ్రాయించుకొని ధరావరసుతుఁ బట్టి । యాయవనీసురు లానోయి రాజ !
మాయింట భుజియించి మాపళ్లెరంబు।న్యాయంబుడించి మిన్నక ముచ్చిలించి
కొనివచ్చి యిటఁ జెలంగుచు నున్నవారె । ఘనతచే నున్నారు కటకట మీరు
తగునె! యీనీచకృత్యంబు లటన్న । జగతీశతనయుఁ డాసతి పళ్లెరంబు
కడిగి పానుపుక్రిందగాఁ బెట్టినపుడె । నిడుబందె వెట్టెద రేము దొంగలమె
మీరు భూసురవరుల్ మిము దూఱరాదు।మీ రేమియాడిన మాకుఁ జెల్లుబడి
నావిని విప్రనందనులు నవ్వుచును । భావింప బంగారుపళ్లెంబె కాదు
ఎరువుపెట్టిన సొమ్ములెల్ల నెత్తుకొని । పరువెత్తివచ్చుట ప్రభులక్షణంబె
అనిన నెవ్వరుపెట్టుమని రెరువుసొమ్ము।లని రాజసుతుఁ డమాత్యకుమారుఁ డనఁగ

విని తలయారు లవ్విధము రాజునకు । వినిపింప వారలవెసఁ బిలిపించి
విజయసేనుని గారవించి మీరెంత । నిజముపల్కిన నిది నిక్కవం బనరు
వీరితో గాంధారవిభు ప్రోలుఁ జేరి । తీరిచికొనుఁడు సందేహమ్ములెల్ల
మీవంటివారికి మిథ్యాపవాద । మావహిల్లుట తగదని యతం డనుప
ద్విజులవెంబడిని మంత్రికుమారుఁ గూడి । విజయసేనుఁడు మామవీటికిఁ జనియె
నతనిరాక ద్విజన్ములపు డెఱిఁగింప । మతి రంజిలుచు రత్నమకుటభూవిభుఁడు
హితులతో వారల కెదురుగాఁబోయి । కుతుకంబుమీఱఁ దోడ్కొని తెచ్చినిండు
కొలువులో నవరత్నగురుపీఠి నుంచి । కొలఁదిమీఱిన ప్రేమఁ గుశలంబు లడిగి
కమలరేఖాకన్యకను నాఁటిరేయి । సుముహూర్తమున నీవు క్షోణీశతనయ
పరిణయంబై కనంబడక వంచించి । మఱునాఁడె పోవుట మర్యాద యగునె
అందున మాకు వియ్యంపువారికిని । సందళ్లుపుట్టె మీజాడ యెఱింగి
తోఁకొనితేర మత్పుత్రిక సగము । శ్లోకంబు వ్రాసి నల్పోట్లకుఁ బనిచె
నాకారణమ్మున నగపడినారు । గోకర్ణపురి మీరు కొదువలు తీఱె
మీ దేశమెక్కడ మీతండ్రి యెవ్వ । రీదేశమునకు మీ రేల వచ్చితిరి
మీకులంబెయ్యది మీనామమేది । యీకుమారకుఁ డెవ్వఁ డిదిగాక మీరు
యారాత్రి యెటుల మాయంతఃపురంబు । చేరితిరి వివాహసిద్ధిఁ జెన్నొంది
వెలువడిపోవు టేవిధ మిదియెల్ల । తెలుపఁగావలయు సందియములు దీఱ
ననిన గాంధారధరాధినాయకునిఁ । గనిపల్కె కాంపిల్యకటకేశసుతుఁడు
జననాథ! మాది పాంచాలదేశంబు । ఘనుఁడు సుచంద్రుఁడన్ కాంపిల్య విభుఁడు
వినుఁడు మజ్జనకుండు విజయసేనాఖ్య । దనరుదు నితఁడు ప్రధానినందనుఁడు
నాజనకుఁడు పరిణయము గావింప । యోజనచేసిన నూహ నెఱింగి
సతి వరించినఁ గాళ్లసంకెల యిపుడె । క్షితియెల్లఁ జూచివచ్చెదగాక యనుచు
నీమంత్రితోఁ గూడి యేరితోఁ దెలుప । కేము వేఁటాడఁబోయెద మని రాజు
వారితో నని వేగవత్తురంగముల । నారోహణముచేసి యఖిలదేశముల
తిరిగి యీగాంధారదేశంబు చేరి । యరుగుదెంచితిమి సంధ్యాసమయమున
కాళికాంబాగృహాంగణమున కచట । మేలైనసరసి నమ్మోయి సంధ్యవార్చి
నిదురచెందితి మంత నృప! నిశావేళ । నదియేమొ కాళిమాహాత్మ్యంబు వలన

నీయంతిపురిలోన నీపుత్రిఁ బెండ్లి । యై యుందుభుజియించి హర్షించి నటుల
కలగంటికనుగొంటిగంధమాల్యములు।పలుభూషణములుమైఁ బాయ కుండుటలు
తెలతెలవారిన దేవిసన్నిధిని । నెలకొని యితని కిన్నియు నెఱింగింప
నిది దేవిమాయ నీకీయంబ పెండ్లి । చెదరని కరుణతోఁ జేసెఁ గాఁబోలు
నయిన నిందుండరా దరుగు దెమ్మనుచు।నయశాలి పలుక సైంధవముల నెక్కి-
యావలఁ బోయితి మవనీశ యనిన । భూవరుం డాత్మ నద్భుతము వహించి
దేవి మహామాయ తెలియరాదనఁగ । నావేళ నిట్లనె నాకాశవాణి
జననాథ నీకన్య సౌజన్యధన్య । యనుపమసౌందర్య యగుట వీక్షించి
యలసుండు మతిహీనుఁ డతిచంచలాత్ముఁ। డలసు వేగుఁడు తగఁడనియంబ తలఁచి
తనుగూర్చి పెక్కువ్రతంబులు చేసి । తనకు గాంభీర్యసౌందర్యచాతుర్య
కమనీయుఁడగు భర్తగావలె నన్న । కమలరేఖాకన్య కాంక్షలీడేర
నిజపాదసన్నిధి నిదురింపుచున్న । విజయసేనకుమారు వెసఁ గొని తెచ్చి
యిప్పెండ్లికొడు కున్నయెడ నుంచి యతనిఁ । దప్పక గొనిపోయి తనగుడి నుంచె
మఱలఁ గన్యాకేళిమందిరశయ్య । నిరవొందు నిమ్మేటి నెప్పటిచోట
నిడి సువేగుని గొనియేఁగి యప్పడుచు । పడకింటిలోఁ దగుపాన్పున నునిచె
దేవ నీకన్య పతివ్రతాభావ । మీవగ శోధింప నింత గావించె
పాంచాలసుతుఁడె నీబాలకు భర్త । యించుకేనియు సంశయించకు మధిప
కమలరేఖకుఁ బునఃకల్యాణ ముత్స । వమునఁ గావించి కేవలవైభవమున
వారి యూరికిఁ బంపి వలసెనేనియును । వీరకేతుండన వెలయు నీయనుజు
కూరిమిసుత సువేగునికిచ్చి పెండ్లి । యారూఢమతి వెలయనొనర్పు మనిన
నాకాశవాణి వాక్యము లాలకించి । భూకాంతమణి ముదంబుధి నోలలాడి
క్రమ్మఱఁ గమలరేఖను పెండ్లిఁజేసె । నెమ్మిఁ బాంచాలభూనేతపుత్రునకు
నల సువేగున కనుజాత్మజ నిచ్చి । చెలువొప్పఁ బెండిలిసేయించి పనిచె
నయశాలికిఁ బ్రధానినందన సుముఖ । ప్రియపూర్వకంబునఁ బెండ్లిగావించె
బహుచతురంగముల్ బహుపదార్థములు। బహువిధాంబరములుబహుభూషణములు
నరణంబుగానిచ్చి యమ్మామ పనుప । తరుణితో మంత్రితోఁ దనపురి కరిగి
తను జూడఁగాన కెంతయుఁ జింతచెందు । జననీజనకులకు సతితోడ మ్రొక్కి-

వారి కౌఁగిండ్లు దీవనలును బడసి । యారూఢయౌవరాజ్యపదస్థుఁ డగుచు
విజయసేనుఁడు కీర్తివిభవంబు లొందె । గజయాన కమలరేఖయు దేవికరుణ
నెనమండ్రుపుత్రుల నెలమితోఁ గాంచి । తనరె భూమిఁ బతివ్రతారత్న మగుచు
నీపతివ్రతకథ యిష్టార్థ మియ్య । నోపు రవిజ్యోతి యొప్పున నమిత
పాపతమిస్రముల్ బాపు సజ్జనులు । బాపురే యన నిచ్చు బహుళసంపదలు
అని ఫలశ్రుతి దెల్ప నమ్మించుబోణి । విని పుణ్యకథ నేఁడు వినఁగల్గె ననుచు
చిలుకకు నభినుతిచేసి లోపలికి । నెలమితోఁ జనియె రాజేంద్రదూతికయు
కతలకాఱిని చిలుకను బొగడుచును । క్షితినేత కక్కథఁ జెప్పెనటంచు
శంభుఁ డందభవాచాజృంభమాణ । గంభీరగుంభనల్ గడలుకొనంగఁ
దెలిపినఁ బార్వతీదేవి సంతోష । కలితయై యవ్వలికథఁ దెల్పుడనియె
సారపతివ్రతాచరితంబునందు । నాఱవ కథయిది యతిశయంబయ్యె

---

## పతి యనుమతి గాంచిన సతి కథ

శ్రీవిశ్వపతి దయాంచితసూక్తి గారి । కావలికథ యిట్టు లానతియిచ్చె
మఱునాఁడు దూతివెంబడివచ్చు వైశ్య।తరుణి గన్గొని చిల్క తతసూక్తిఁ బలికె
కలికి మనోవచఃకాయకర్మముల । చెలువుని వంచనసేయక కీర్తి
వలను జెందిన పతివ్రతకథ యొకటి । గలదు తెల్పెద విను గౌళదేశమున
మాలినియను పురమణి యొప్పు నందు । మాలిని ధర్మహర్మ్యప్రభాచ్ఛటల
నాలింగనము సేయునట్టి దప్రోలు । పాలించుఁ గువలయాభరణుఁ డన్ రాజు
అతనికిఁ గర్పూరహాసిని యనెడి । సుతగల్గె శ్రీహరి శుభకటాక్షమున
చిన్నప్పు డాకన్నె చెలువలఁగూడి । చిన్నెలవన్నెల సింగార మెసఁగ
నాటలాడుచునున్న నయ్య వీక్షించి । బోటిఁ జెంతకుఁబిల్చి బుజ్జగించుచును
మన పురోహితుని కుమారునియొద్ద । ననబోణి చదువుకొన్న ఫలంబుగలదు
ఇయ్యాటల విశేషమేమి లెమ్మనుచు । నయ్యన గోవిందశర్మఁ బిల్పించి
సభ్యులెంచగఁ దనూజాతకు నక్ష । రాభ్యాస ముత్సవమమరఁ జేయించె
నారాజకన్యక కనుగులౌ నృపకు । మారికలను పదంపడి జతచేసి

చదివించె గోవిందశర్మ నానాఁట । చదివె నక్కన్యయుఁ జదువులు గొన్ని
పాటలాధర కావ్యపాటవంబూనె । నాటకాలంకారనై పుణ్య మెనసె
ప్రక్రియాకౌముదీపాండిత్యమున న । తిక్రమించె సుధీసుధీచమత్కృతులు
చిత్రాశువిస్తరస్థితుల మాధుర్య । పాత్రంబుగా రచింపఁగనేర్చెఁ గవిత
రీతి గుణంబులు క్రియ పాకవృత్తి । చాతుర్యశయ్యారసంబులు గులుక
భావవిభావానుభావసంచారి । భావసాత్త్వికభావపద్ధతు లెనయ
గద్యపద్యాదులు గల్పనసేయు । విద్యాధికులు బాల్యవృత్తి వహించు
భారతియేమొ యీబాలిక యనుచు । సారెకుఁ గీర్తింప జంత్రగాత్రముల
సంగీతవిద్యావిచక్షణ యయ్యె । సంగతానేకలాస్యప్రౌఢి మెఱసె
చదువున సామున సంగీతమునను । గొదువ లేకొప్పు నక్కువలయేక్షణకు
నామోదహేతువై యౌవనం బొదవ । కౌముదీవైభవక్రమ మొందె నగవు
ఒప్పెఁ బ్రబోధచంద్రోదయస్ఫూర్తి । నప్పొలంతి ముఖాబ్జ మలివేణి వేణి
వెలసెఁ గృష్ణవిలాసవిభ్రమంబూని । తళుకొత్తె నభినయదర్పణశ్రీల
మానినిచెక్కులు మత్స్యపురాణ । మానితద్యుతి గాంచె మగువ నేత్రములు
అతివ నున్బలుకు కర్ణామృతరీతి । నతిశయించె లతాంగి యధరోష్ఠకాంతి
నిరసింపసాగె మణిస్ఫురణంబు । హరిణాక్షి రదము లష్టాంగయోగాప్తి
మెఱసి మించెను కురుల్ మేఘసందేశ । పరిణతి శ్రీరామపద మందెచెవులు
ననబోణి చనుదోయి నగె మంజరులను।ననువొందె నమరసింహనిరూఢి కౌను
రమణీయ శృంగారరస కళాగరిమ । కొమరయ్యె నూగారు గురుకటి జగతి
గతి మించె పెందొడల్ కడు మిటారించె । తతసువర్ణోద్దండదండకస్ఫురణ
రాణించెఁ గూర్మపురాణతేజంబు । శ్రేణిచేసె కృశోదరి ప్రపదములు
తరిమెఁ దారావళిఁ దలిరాకుబోణి । చరణనఖాంశువుల్ సకలవిద్యలను
తగినది గావునఁ దదవయవములు । పొగడొందె సత్కళాస్ఫురితంబు లగుచు
నీలీల రమణీయహేలావిలాస । శాలిత గన్న యాజవరాలిమిన్న
యొకనాఁడు గురుసుతు నొద్దికివచ్చి । ప్రకటవిశ్వాస మేర్పడ మ్రొక్కి నుదుట
బటువు ముత్యాలపాపట నటియింప । కటి మేఖలాఘంటికాధ్వను లెసఁగ
వలను జిక్కిన జక్కవల పెక్కువలర । జిలుగుహరాన్ రవికలో సిబ్బెంపుగబ్బి

తగటుచెరగు పయ్యెద యొకింతజాఱ । బిగిగుబ్బచన్నులు పిక్కటిలంగ
నుఱుతారహారంబు లుఱ్ఱూతలూఁగ। మెఱుఁగుచెక్కుల కమ్మ మించులుదొలఁక
చెంగట నిలుచున్న శృంగారవతి గ । నుంగొని యాద్విజన్ముఁడు తత్తరమున
రావే మిటారి దర్పకుని కటారి । క్రేవఁ గూర్చుండు మీక్రియఁ గొంకనేల
ననిచెంత నివసింప ననుమతి యొసఁగుఁ । గనకాంగి యతనిచెంగటనె కూర్చున్న
మగువ నేనొక్క సమస్య నిచ్చెదను । సొగసుగా రచియింపు శ్లోకంబటంచు
పరిపూర్ణయౌవనభ్రాజితయైన । తరుణి శృంగారంబు దర్శనీయమను
నర్థంబుగల సమస్య యొకండొసంగఁ । భార్గవసుత సిగ్గుపడి తలవాంచి
గురునాజ్ఞ ద్రోవక గూఢార్థకలనఁ । దరుణి శ్లోకం బాశుధార రచించె
అందున ముదమంది యవ్విప్రుఁ డనియె । నిందుబింబాస్యతో నేకతంబుగను
కురులు కూడనినాఁడె కోమలి నీవు । పరిచర్య సేయుచు భక్తి మావలన
సకలవిద్యలునేర్చి చతురతఁగంటి । వికఁ జనుపుకొనంగ నిటరావు మాకు
హితమైన దక్షిణ యియ్యక యురక । వితపుచ్చి పోవుట విహితమే యనిన
కరములుమొగిచి యక్కన్యక పలికె । ధరణీసురోత్తమ దక్షిణయీక
యే రిత్తపోదునే యేమిగావలయు । కోరిననిచ్చెదఁ గోరికొండనిన
నతఁడు మోమలర నిట్లనె నీవు పసిఁడి । ప్రతిమచందంబున బాగొందఁజూచి
మరుఁడైన వలఁచు నస్మాదృశు లెంత । గురుఁడ పురోహితుకొడుక నాశ్రితుఁడ
నిన్నె కోరినవాఁడ నీమీఁద మరులు । గొన్న చిత్తము త్రోయగూడదు తనకు
నేకతంబునఁ గౌఁగిలించి యొక్కపరి । చేకొని నన్నేలు చిగురాకుబోణి
యిదిదక్క దక్షిణ యే నేమియొల్ల । సదయత నాకోర్కి సమకూర్చు మనుచు
మోహదైన్యంబులు ముడివడ నడుగు । కూహకు నతనిగన్గొని కన్య పలికె
గురురాయ! మీ రెఱుంగుదురు సర్వంబు । నెరవాదితన మెల్ల నేర్చియున్నారు
ఏ నెంతదాన మీ కెదురుమాటాడ । కాని కార్యము మీరు కాంక్షించినారు
ఇందునఁ గన్యాత్వ మెడయు దోషమగు।నిందయుఁ బ్రాపించు నియతి తొలంగు
అయ్యకు లేదు కన్యాదానఫలము । వెయ్యేల యిపుడు నన్ వేఁడినమాట
గైకొని మీపొందు గావింపఁజాల । ధీకంజభవ యొందుదెలిపెద వినుఁడు
నను నొకరాజనందనునకుఁ బెండ్లి।యొనరింప మాయయ్య యూహించినాఁడు

నెల రెండునెలల పెండ్లి ప్రయోజనమగు । వలదుసందియ మే వివాహమై పిదప
మీా కోర్కి దీర్చెద మిథ్యగాదనిన । నాకలకంఠితో నతఁ డిట్టులనియెఁ
బాలివోని యౌవనంబున మించు నిన్ను । వలచి నేనడిగిన వాంఛ పోనడిచి
ధవు నొక్కనివరించి తరువాత నన్ను । నవునటె పొందెదనని మందలింప
పురుషుని గలసినప్పుడె కన్నెటికము । దొరగె సారమడంగెఁ దొలిజవ్వనమున
నదిగాక పరకీయవైతి విట్లైన । ముదిత యప్పుడునిన్ను ముట్టనేరాదు
తేఁటియంటిన పువ్వు తెఱఁగైన నిన్ను । పాటించి కూడిన ఫలమేమి చెపుమ
నను గూడినంతఁ గన్యాదానఫలము । జనకుఁడు గనఁడని చర్చించినావు
దానపాత్రుండైన ధరణీసురునకు । మేనొసంగుట దోషమే ముద్దులాడి
కన్నెయా కుంతి భాస్కరుఁ జేరలేదె । కన్నెటికము దానఁ గడతేరె నోటు
నామాట యిఁక చేకొనక యెంచితేని । నేమగునో దేహ మెఱుఁగరాదతివ
యింతకన్నను దోస మేమున్న దేల । పంతంబు సేసెదె బంగారుబొమ్మ
ఒక పెండ్లికొడుకు నిన్నొసఁగు మంచెన్న।టికివచ్చి యడుగు తండ్రియుఁదల్లి యొప్పి
యెన్నఁడు పెండ్లి సేయింతురు నీకు । కన్నెపాయము కొల్లగా పతి కొసఁగి
యితరుల వంచించి యేరీతి వత్తు । పతివ యెన్నఁటికి నన్నాదరింపుదువు
నేల దూరక్రియ లిది వట్టిజోలి । చాలింపు మనిన నజ్జలజాక్షి పలికె
పదరనేమిటికయ్య! బ్రాహ్మణప్రవర । యిదె పెండ్లిసాగెడి నే పతితోడఁ
గలకయమున్న నీకాంక్ష గణించి । సెలవుగైకొనియ వచ్చెదఁ గల్ల కాదు
నామాట నమ్ముడన్న భయంబుఁజెంది । యామహీసురుఁడను నతివ! మేల్మేలు
ఇప్పునిఁ జెప్పితివేని నీనాథుఁ । డొప్పునె నిన్ను కోపోద్రేకమునను
దెగఁజూచు దన్ను మర్దింపఁదలంచు । దగ దీవిచారంబు దలిరువిల్కాని
శారిచే నిప్పుడే ప్రాణముల్ చనఁగ । నేరీతి నోరుతు నే నన్నినాళ్లు
నీకును నాకు హాని యొసంగుఁ దుదను । నీకాపురముచెడు నిక్కమ్ము సుమ్ము
గోర నొపని కేల గొడ్డలిఁ గొనఁగ । నీరహస్యపుఁ బను లెవ్వరితోడఁ
దెలుపరా దెటువలె దెలిపెదు పతికి । బళిబళి స్త్రీబుద్ధి ప్రళయాంత మనిన
గోవిందశర్మ కక్కోమలి పలికె । నీవిచారములు మీారేలఁ జేసెదరు
అయ్య మీాకునునాకు హాని రాకుండ । నొయ్యన పతితో హితోక్తి బోధించి

శయ్యఁ జేర్పకమున్నె సరగ నే తెంతు । నెయ్యంబువిడక మన్నించు నన్న తఁడు
నలుక సేయు నటంచు నానతియ్యకుఁడు । పలికినపలుకు దబ్బరగాక యుండ
మీపాలి కరుదెంతు మీపాదమాన । శ్రీపతియాన గౌరీపతి యాన
అనిన నేమోయని యనుమానపడుచుఁ।జనియె భూసురుఁ డాత్మసదనంబునకును
అంతఁ గొన్నిదినమ్ము లరిగిన పిదప। శాంతుండు సుగుణానిశాంతుఁ డుత్తముఁడు
ధవళాశ్వుఁడనుయుగంధరధరావిభుఁడు। భువనమోహనకళాద్భుతమూర్తియనఁగఁ
గర్పూరహాసినీకన్యావిలాస । మేర్పడ విని మోహ మిచ్చ నెచ్చఁగను
బెద్దల నంపించి పెండ్లి కక్కన్య । నొద్దిక గావింప నుత్సాహమంది
కువలయాంభరణుని కూఁతుఁ బెండ్లాడె । ధవళాశ్వనృపతి బాంధవులు మేలనఁగ
వలరాజు రతిని వివాహమైనట్లు । బలభేది పౌలోమిఁ బరిణయంబైన
లాగున విష్ణుండు లక్ష్మిఁ జేపట్టు । బాగున వారల పరిణయంబమరె
నీలీలఁ బెండ్లియై నృపసూతి యతఁడు । కేళీకాగృహపరిష్కృతరత్నఖచిత
పర్యంకమునఁ బువ్వుఁబానుపు మీఁద । భార్యాగమాసక్తభావుఁడై యుండె
నంతలోఁ గర్పూరహాసినీ కాంత । వింతవింతగ బహువిధభూషణముల
కనకాంబరాదుల గంధమాల్యముల । తనచెలుల్ కైసేయ తనుగతసార
సౌరభంబులు నల్దెసల గ్రమ్ముకొనఁగ । వారించి తనచెంత వచ్చు నచ్చెలులఁ
బనిచి తానొంటిగాఁ బతిసెజ్జ చెంత । వినయంబుతో నిల్చి వీడెంబొసంగి
చేకొని వ్యజనంబుచే కొంతవిసరి । యాకడఁ దొడనుంచి యతనిపాదములు
కరపల్లవంబులఁ గడుభక్తి నొత్తి । మెఱుఁగారు చిటిచాపమీఁదఁ గూర్చుండి
యింపుగా వీణవాయించిన మెచ్చి । కంపితంబౌర! చొక్కంబయ్యె తావి
స్వరములు మేల్ శ్రుతిచాతురి మమ్మ! । పరిపరి తానముల్ బాగని విభుఁడు
అలరుపానుపు డిగ్గి యతివ క్రిందటనె । నిలనేల! రమ్మని నిజబాహుయుగళి
నక్కున గదియింప నతివయు లేచి । మ్రొక్కి కరంబులుమోడ్చి యిట్లనియె
ప్రాణేశ యొకవిన్నపంబు గావింపఁ । బూనితి వెఱచి తెల్పుదునొ నాలోన
నెఱపులేకయ విన్నవింతునో యనిన । విరిబోణిరో నీకు వెరవ నేమిటికి
నెఱిఁగింపు మప్పని యేనొనరింతు । నోరకొని యది యెంత దుర్ఘటంబైన
అని బుజ్జగించి రాజాత్మజుం డడుగ । ఘనవేణి శంకలేక మృదూక్తి ననియె

సకలవిద్యోపదేశ మొనర్చినట్టి । యకలంకుఁడు మదీయుఁడగు పురోహితుని
తనయుండు నను గురుదక్షిణ యొసఁగు । మనినఁ గోరికదెల్పుమన నన్నుఁగోర
కోరిన మీకిట్టి కుత్సితక్రియలు । కారాదనుచుఁ బెక్కుగతులఁ దెల్పితిని
పతి యనుమతి లేక పరునిఁ బ్రాపింప । సతి కనర్హంబు నాస్వామితోఁ దెలిపి
నీచెంత కరుదెంతు నిజమని యల్ల । నాచార్యసుతుమీఁద నాన వెట్టితిని
హృదయేశ నాసత్య మీఁడేర్చు కరుణ । యొదవిన ననుమతి యొసఁగు డాదృతిని
వల్లభ ! యటుపోయి వచ్చెదననిన । నల్ల రాజకుమారుఁ డాశ్చర్యమంది
పతితోడ నెటువంటి భామినియైన । నితరుని భోగింపనేఁగెద ననుచుఁ
దెలుపునె యిదియేమొ దీనిభావంబు । సెలవిచ్చి పొంచి యిచ్చెలి వెంటనేఁగి
చూచెదఁగాక యీ చోద్యంబటంచు । నాచెల్వ కనియె మహాభాగ్యమాయె
భూసురుతోఁబల్కు బొంకగాఁ దగునె । నీసత్య మీవేళ నిలుపుకొమ్మనుచు
ననుమతి యిచ్చిన నరమర లేని । మనసుతో నక్కాంత మగని వీడుకొని
జాళువా బంగారుశాలువు పైని । మేలిముసుంగిడి మెఱుపుతీఁగె వలె
తళుకుతళుక్కని తన మేను మెఱయ । నల మేడడిగ్గి యుద్యానమార్గమున
బయలుదేరి పురంబు బహిరంగణమున । రయమునఁ జనఁగ నారాజనందనుఁడు
నెలఁతచందమెఱుంగ నెమ్మదిఁదలఁచి।పొలఁతివెంటనె మేలి బూర్నీసు ముసుఁగు
పెట్టుక చిఱుతయుఁ బెద్దకత్తియును । బట్టి పదత్రముల్ పదముల మెట్టి
యంతంత కనఁబడ కరుగుచునుండె । నింతియుఁ బురికోట యిటువలె గడచి
అగ్రహారముత్రోవ నరుగుచున్నెడ ను । దగ్రవనస్థలి నశ్వత్థశాఖఁ
జాయక వసియించు బ్రహ్మరాక్షసుఁడు । కో యనియార్చుచుఁ గుంభిని కురికి
యాత్రోవఁజను కాంత కడ్డమై నిలిచి । యత్రాసవృత్తి నీయర్ధరాత్రమున
నెందుఁబోయెద వొంటి నిందుఁజిక్కితివి । యిందుబింబాస్య! నీకెటు పోనవచ్చు
నాఁకలిగొన్న నా కాహారమైతి । చేకొని నిన్ను భక్షింపకమాన
నని నోరుదెఱచుక యట మ్రింగవచ్చు । దనుజునిం గనుగొని ధైర్యంబువిడక
పాణియుగ్మము మోడ్చి పద్మాక్షి పలికె । పాణితమాధుర్యభాషానిరూఢ
రవితేజ యీనగరంబు పాలించుఁ । గువలయాభరణుని కూఁతుర నేను
క్రొత్తగాఁ బెండ్లాడి గురునకు మ్రొక్క । నిత్తఱి నచటికి నేఁగెద ననఘ!

అతనిచెంగటి కేఁగి యతనిఁ బూజించి। యతని వీడ్కొని వేగ నరుగుదెంచెదను
మఱలివచ్చి మదీయమాంసరక్తములఁ। బరితుష్టిసేతు నిబద్ధిగా నీకు
నామాట మృషగాదు నమ్ముమటన్న। కామినిఁగని వాఁడు కవకవ నగుచు
నేటికిమాటలు పల్కెదింతి నాచెంత। బూటకంబులుసేయఁ బోసఁగదు నీకు
విడిచిపెట్టిన నీవు విప్రునియిల్లు। విడిచివత్తువె మ్రింగివేయు నాకడకు
నా విని యబ్బోటి నరభోక్త కనియె। నావచనంబేల నమ్మవు? నీవు
బ్రహ్మరాక్షసుఁడవై పాపంబుకతన। బ్రాహ్మణుండవె యిట్లు ప్రభవించినావు
కనుగొన్నయప్పుడే కానఁగారాదె। యనృతవాదుల సూనృతాలాపపరుల
చదువులునేర్చి రాజకుమారి నగుచు। నుదయించి నే నసత్యోక్తు లాడుదునె
భూమి తిర్యగ్జాతిఁబుట్టిన బహుళ। కామధేనువురీతి ఖ్యాతి గైకొనదె!
ఆకథ వినవె నీ వాగమజ్ఞుఁడవు। నీకు సందియమేల నేఁబోయి యిపుడె
యావిప్రుతో మాటలాడి వచ్చెదను। పోవని మ్మిటురాక పోయితినేని
పతిని వంచనసేయు భామిని గతిని। సతతంబు బుధుల నెంచనిదాని గతిని
గురువుల నిందిచుఁ గుత్సితగతిని। హరుదేవి గొలువని యంగనగతిని
వావి దప్పినయట్టి వనజాక్షిగతిని। దేవతాద్రోహ మొందినదంట గతిని
యగ్గుసిగ్గెఱుఁగని యెబ్బెట్టు గతిని। నొగ్గి పాపమొసేయు యుజ్జారి గతిని
గొణఁగుచుఁ దనుతిట్టుకొను చెట్టగతిని। దృణముగాఁ బతిఁదిట్టు తెక్కలిగతిని
నింటిసొమ్మదవగా నిడుమొప్ప గతిని।కొంటయై మదిరత్రాగు గ్రాసు గతిని
పొందుదు సత్యమెప్పుడు దప్పవిడువ। నిందుండు నాబొంది యిది నీకువిందు
అని బహుళపనోక్తు లాయింతి పలుక। విని దైత్యుఁడోయమ్మ విడిచితి నిన్ను
చెచ్చెర రమ్మనిచెప్పి తాఁద్రోవ। యిచ్చిన నచ్చెలి యిచ్చలో నలరి
అద్దైత్యు వీడ్కొని యవ్వలఁబోయె। పెద్దకోల్పులికిఁ దప్పినలేడి పగిది
నాయద్భుతము ధవళాక్షుండు నూచి। మాయురే యిది హెచ్చుమానిసియనుచు
నింతటంతటఁ జనియెడువేళ బాల। కొంతదవ్వేగ నంఘ్రుల నందియలును
మొలనూలిగంటలుఁ మొరయ మైతావి।నలుగడ నెరయ నెన్నడ ముద్దుగురియ
నారామ చనియెడు నారామసీమఁ। జోరుఁ డొక్కరుఁడు జుంజురు సిగయందు
ముడిచిన మందుల మూలికవేళ్లు। కడు నల్లనగు మేను కన్నంపుగత్తి

దోపిన బల్దట్టి తోలుచల్లడము । వేపుల వాకట్టు వివిధౌషధములు
బలుసొక్కుపొడిబుఱ్ఱ భ్రమరాలకోవి।ములుజోడు బలపంబు మోటుకత్తియును
గుడికేలఁ దగు నుక్కుగుదియయు నుదుట।నిడిన కాటుకబొట్టదృశ్యంపు బూతి
గలిగి భయంకరాకారుఁడై త్రోవ । నిలిచి ముందరవచ్చు నెలఁత నీక్షించి
సరిలేని రత్నభూషణములు పూని । యరిగెడి నొంటి నియ్యంగన యొడలి
తొడవు లన్నియుఁబట్టి దోఁచెద వెంట । నడతెంచువారు గనంబడ రంచు
నక్కన్య కడ్డమై యలివేణి యొంటి । నెక్కడి కేఁగెద వేగక నిలుము
నీమేని సొమ్ములన్నియు నిచ్చితేని । యేమి సేయక పోవనిచ్చెద నిన్ను
ఇమ్మట్టు మల్లాడితేని నిన్ బట్టి । సొమ్ములుగొందు నే సొద్దుగా కిపుడె
గుట్టున దోపిమ్ము కొమ్మ! నేమ్రుచ్చ । నెట్టిదిట్టలనైన నేపడంగింతు
నని ముట్టుకొనవచ్చు నమ్మ్రుచ్చుఁ జూచి।కనకాంగి యెచటసంగడమాయె!వీఁడు
వీనిరాయిడిఁ బడి వెతఁజెంద రాదు । వీనికి సొమ్మిచ్చి వీఁడు పోనీఁడు
సొమ్మొసంగెదనని సూనృతోక్తులను । నమ్మించి యేఁగెద నాగురు కడకు
నని యాత్మఁజింతించి యబల యాదొంగ।కనియె నేరాజకన్యను గ్రొత్తపెండ్లి
కూఁతుర నోయన్న! గురునకు మ్రొక్క । నీతఱి వచ్చితి నిదె పోయి మఱల
నరుదెంచి నాసొమ్ములన్నియు నిత్తు । హరియింపవల దిప్పు డాభరణములు
నావిని యాదొంగ నగుచు నిట్లనియె । నీవు క్రమ్మఱవచ్చు టెక్కడ నాకు
నీసొమ్ము లిచ్చుట యెక్కడ నడుగు । బాసిన నక్కఱబాసె నటన్న
వార్త యెఱుంగవే! వనజాక్షి నీవు । ధూర్తవు నన్నిట్లుదొసఁగులఁ బెట్టి
తప్పించుకొనఁజూచెదవు జూడఁగత్తె । విప్పలుమాయ లే నెఱుఁగుదు గొన్ని
లలితాంగి మానుపిల్లకు నీత నేర్పు।వలెనె! యీగచ్చు లెవ్వరితోడ ననుచుఁ
దెఱువాటుగొట్టెడు తెకతేరకాని । పరుషోక్తు లాలించి పడఁతి యిట్లనియె
అన్న నీతో కల్లలాడి నేనవలఁ । జన్న నేమిఫలం బసత్యంబు కంటె
కలదె పాపము జూడఁగత్తె నటంచుఁ । బలికినాఁడవు నీస్వభావంబు గనుక
నీటిబుగ్గనుబోలు నెమ్మేనికొఱకు । నేటి కసత్యంబు లెన్నేని వదరఁ
గను 'నానృతాత్పాతకంపర' మనఁగఁ । జను మహాశ్లోకార్థసంగతి గొంత
యాకాశరాత్రియు నీభూమిదేవి । యాకాశవాణియు హరిహరాదులును

సకలభూతంబులు సాక్షిగా నిదిగో । యొకటి దెల్పెద విను మూర్వీసురేంద్రుఁ
గని వచ్చినపుడె నాకలసొమ్ములెల్ల । నినుఁజేర్తు వలదు సందేహ మటంచుఁ
బలికిన యక్కల్కి భావసంశుద్ధి । దెలిసి తస్కరుఁ డను తెఱవ నీవిన్ని
ఖరవసంబులు పల్కఁబాడియె గ్రోవ । నరుగుము వేగ బ్రాహ్మణవీథి కనుచుఁ
గ్రోవ యావలఁజూపి దొంగ నేమింప । నావెలందియు నగ్రహారంబు సొచ్చి
వినుకలిచేత నవ్విప్రగృహంబు । దనమది నెఱిఁగి తద్ద్వారంబు సేరి
తలుపుదట్టిన విప్రతనయుండు నిద్ర । దెలిసి యెవ్వరటన్నఁ దెలిగింటి యపుడు
తన పేరుసెప్పి మెత్తనియెలుంగడరి । ననఘాత్మ తలుపుదీయందగు ననిన
వసుధామరుఁడు మేను వడవడ వణఁక । నసమాంగి యీవేళ నరుదేరఁ దగునె
అపకీర్తి కిదిమూల మర్ధరాత్రమున । చపలాక్షి యీసాహసంబు సేయుదురె
అని తల్పు తెఱచి యయ్యతివ లోపలికిఁ । జనుదెంచి మ్రొక్కిన సత్పుత్రవతివి
గిమ్మని దీవించి కన్నుల నీరు । గ్రమ్మ నవ్విప్రశిఖామణి పలికె
నమ్మ! నీ సత్యమాహాత్మ్యంబు వలన । నెమ్మదిఁ బ్రాపించె నిశ్చలత్వంబు
నీవె నాతల్లివి నీవె నాతోడు । నీవె నాపుత్రివి నిక్క మీమాట
మగువ నాతోనన్నమాట చెల్లించి । పొగడొందితివి సత్యమున సతీత్వమున
నీకు సాటిగలరె నీపతిఁగూడి । చేకొను మిష్టార్థసిద్ధు లనంగ
పంచనుబొంచి భూపాలుఁ డావిప్రు । నంచితవాక్యంబు లాలించి యలరి
వెలఁది యవ్విప్రుని వీడ్కొని యిల్లు । వెలువడు కదలిక వేగంబె తెలిసి
యవ్వలఁజని డాగె. నంతలో వెడలె । జవ్వని గురునివాసంబును నుండి
యొంటిగా నెటులేగెదో యఁకఁ దల్లి । వెంట నెవ్వరులేక విపినమార్గమున
నని వగచుచునుండె నవ్విప్రసుతుఁడు । వనితయు వేవేగవచ్చి తస్కరుని
గని పల్కె నామేనఁగల సొమ్ములెల్ల । గొనుమన్న యిచ్చితి గొబ్బున నన్న
నాదొంగబంటువురా! సత్యమని ప్ర । మోదంబు నొంది యమ్ముదితకు మ్రొక్కి
నీవు మాయక్కవు నేసహోదరుఁడ । దేవి నీసొమ్ములు తిరుగ నిచ్చితిని
చను మింక నగరికి జాగుసేయకుము । వనములోనని చెప్పి వాఁడటు చనియె
నవ్వింత గని ధవళాక్షుం డయారె । జవ్వని సత్యభాషామహత్త్వమున
కరుణ యన్ పేరెఱుంగని మోషకునకు । కరుణ జనించె రక్కసిబారి యెటులఁ

గడచునో యీసాధ్వి కడపట ననుచు । నడిదంబు మఱువక యరుదెంచుచుండె
నావేళఁ గర్పూరహాసినీదేవి । రావిపైఁ దగు బ్రహ్మరాక్షసుఁ జేరి
జేవెట్టి గాత్రమిచ్చితి భుజియింప । రావయ్య! క్షుధయెంత రగులుచున్నదియొ
తడవు చేసితినన్న దైత్యుఁ డుప్పొంగి । పుడమికి దిగివచ్చి పూబోణిఁ బొగడి
చాగురే! మాతల్లి సాధ్వీమతల్లి । నీ గురుభక్తియు నీ సత్యమహిమ
నీపతిభక్తియు నేర్తునే పొగడ । నీపుణ్యమునఁ బాపనిర్ముక్తుఁ జేసి
నన్ను రక్షింపవే నను గన్నతల్లి । యన్న నచ్చెలిపల్కె నజ్ఞానవతిని
నిను నిరఘునిఁజేయ నేనెట్లునేర్తు । తనువు భుజింపఁగాఁ దలఁచిన నిందుఁ
జనుదెంచితి క్షుధాగ్నిఁ జల్లార్చికొనుఁడు । తనచేత నొండువిధంబు లెట్లగును
అనవిని రాక్షసుం డయ్యింతికనియె । జనయిత్రి నీసత్యసంపదలోన
నఱపాలొసంగిన నఘములు వాసి । యరుగుదు దివ్యుండనై దివంబునకుఁ
దరళాక్షి దశరథధరణీశు చేత । సురథునిచే గయక్షోణీశు చేతఁ
గ్రూరదానములు గైకొని యిట్టులైతి।నోరామ విను పెక్కుయుగముల నుండి
రాక్షసత్వంబు తీరక యున్నవాఁడ । రక్షింపఁదగునన్న రమణి యిట్లనియె
నగ మియ్యఁజాల నాసత్యంబునందు । సుగుణనిధాన యీసుద్దు లేమిటికి
పరకపాలిచ్చెదఁ బట్టుండటంచు । తరుణి జలంబుతో దారవోయుటయు
నసురభావము మానియమరుఁడై యతఁడు। వెసదివంబున కేగె వెలఁది నెన్నుచును
నచ్చోటు వాసి యయ్యలివేణి మరలి । వచ్చెఁ గేళీసౌధవాసమ్మునకును
అంతకుమున్నె దైత్యత్వమ్ము మాన్చి । యింతి వానికి స్వర్గమిచ్చిన తెఱఁగు
కని యిట్టిమహిమ లెక్కడఁగాన మనుచు।దనుమధ్యఁబొగడుచు ధవళాశ్వనృపతి
యామేడమీఁదికి నరిగి తన్మహిమ । లేమియు నెఱుఁగన ట్లైనయని నిద్ర
బెరయగా గురకలు వెట్టుచునుండె । తరుణియు విభుఁడు చిత్తంబున నేమి
తలఁచెనోయని యాత్మఁ దలఁకుచు వచ్చి । చెలువుని చరణరాజీవయుగంబు
మెల్లనఁ బిసికిన మేల్కన్నయటుల । వల్లభుఁ డెవ్వరే వనిత వచ్చితివె
ద్విజునికోరిక తీర్చితే యని యడుగ । గజయాన దేవర కరుణావశమున
మహిసురుతో నన్నమాటఁ జెల్లించి । బహుమతి వచ్చితిఁ బ్రాణేశ యనిన
నాసతిగుణమున కానందమంది । శ్రీసతి కెనయైన చెలువవు నీవు

నాభాగ్యవశమున నాభార్యవైతి । వోభామ యింక నిష్టోపభోగములు
గైకొని సుఖయింతుగా కనిపలికి । పాకారి పౌలోమిఁబాలి నేలుకొను
తెఱఁగున వివిధరతిప్రసంగములఁ । గరఁగించి సకలసౌఖ్యములొంది యతఁడు
తనపురి కేగి కాంతామణితోడ । జనులు మేలనఁ బ్రాజ్యసామ్రాజ్య మేలె
పరమపతివ్రతాభావంబు వలన । దరళాక్షి కీమహత్త్వంబు ప్రాపించె
కర్పూరవాసినీకాంత చారిత్ర । మేర్పడు వినువారి కీప్సితార్థములు
చేకుఱునని చిల్క చెప్పిన వైశ్య । రాకేందుముఖ యనురాగంబు జెంది
యాతస్విఁ బొగడుచు నరిగె లోపలికి । దూతిక యాకథ దొరతోడఁ దెల్పె
నని శంభుఁడెఱిఁగింప నవ్వాలికథలు । వినిపింపుఁడని గౌరి వేడ్కతో నడిగె
సనయపతివ్రతాచరితంబు నందు । ఘనసూక్తి సప్తమకథ సాంగ మయ్యె



## తెల్లవారకుండ శపించిన సాధ్వి కథ

శ్రీ విశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె.
మనుజేశుఁ డనుపఁ గ్రమ్మఱ దూతిపిలువఁ । జనుదెంచు పుష్పమంజరి విలోకించి
రాచిల్క పల్కె సారసగర్భభామి । నీచారు పరివాదినీనినాదమున
తరుణి పతివ్రతాధర్మధూర్వహత । కరము దుష్కర మెట్టికాంతల కైన
నొదవు తద్గుణ మొకానొక పుణ్యసతికి । సుదతి జన్మసహస్రసుకృతంబు వలన
మగఁడు మన్నించినమన్నింపకున్న । మగువ పాతివ్రత్యమహిమంబు విడదు
ఇందుల కొకకథ యెఱిఁగింతు వినుము । చందనగంధి నిశ్చలబుద్ధి వగుచు
మద్రదేశంబున మణిమతీపురము । భద్రేభరథహయభటయుక్తిఁ దనరు
ఆపట్టణమున విద్యానిధియను మ । హాపుణ్యుఁ డొకభూసురాగ్రణి గలఁడు
అతఁడు సదాచారుఁ డధ్యాత్మవేత్త।యతనికి దుర్మేధుఁడను పుత్రుఁ డొకఁడు
ప్రాదుర్భవించె నర్భాలుఁ బోషించి । యైదేండ్ల కక్షరాభ్యాసంబు చేసి
జనకుండు రెండువత్సరములలోన । ఘనకావ్యములు నాటకంబులు నేర్పి
గర్భాష్టకమున దక్క యుపనయన । మర్భకున కొనర్చి యాతఁడువాతఁ

జదివించె ఋగ్యజుషములు శాస్త్రములు । పదునాలుగేండ్లలోపల నెఱింగించె
స్వకులోచితములైన సకలధర్మములు । సుకుమారునకు నిట్లు సొలవక చెప్పి
కులరూపగుణములు గురువివేకంబు । గల సుశీలానామ కన్యాలలామఁ
దనకుమారునకు నుద్వాహంబొనర్చె । ననసాయకున కెన యని బుధులెంచఁ
గొన్నాళ్లు లాపుత్రకుఁడు సుశీలుఁడని । యెన్నఁగా దుశ్శీలవృత్తులఁ బోక
నినుఁ డుదయాచలం బెక్కకమున్న । చని పుణ్యనది చేరి స్నానంబొనర్చి
తగు నిష్ఠతోడ సంధ్యావిధుల్ దీర్చి । స్వగృహంబునకు వచ్చి సప్తార్చి గూర్చి
యౌపాసనముఁ జేసి యటఁ బితృభక్తి । యేపార మ్రొక్కి వారెలమి దీవింప
శ్రుతులు శాస్త్రములు శిష్యులకుఁ దెల్పుచును । ప్రతిభాసమగ్రుఁడై పండితుల్ మెచ్చఁ
జతురోక్తి విద్యాప్రసంగముల్ సేయు । నతిథిపూజాపరుండగు తండ్రి యలరఁ
గ్రమమొప్ప మాధ్యాహ్నికము దేవపూజ । యమరఁ గావించి విద్యార్థులఁ గూడి
జనని వడ్డింపఁగా జనకునిబంతి । ననువంద భుజియించి యపరాహ్ణవేళ
మొనసి మాన్యక్షేత్రమును గృహారామ । మును బశుసందోహమును బరికించి
సాయంతనక్రియల్ సలిపి సద్గోష్ఠిఁ । గాయక సద్గ్రంథపారీణుఁ డగుచుఁ
గ్రమియించు రే లిత్తెఱంగున నతఁడు । శమదమాన్వితుఁడయి చరియించు నంత
దురహంక్రియలకు బంధువు వికారాంబు । పరిపూరితాంధువు పాపభూయిష్ఠ
మోహాలతావాలము మదాన్వితము దు । రూహాస్పదము మన్మథోల్లాసములకు
పాళె మాచారప్రభావరసాల । సాలకుఠార మాశావనిసురభి
సురతవాంఛాంబుదస్తోమనభంబు । గురువివేకజ్ఞానకుధరదంభోళి
అసతీహృదంబుజాహస్కరోదయము । మసృణకామక్రోధమాత్సర్యవసతి
నిండుజవ్వనము సంధిల్లె నానాఁట । నొండు సత్క్రియలయం దుత్సాహ మెడలె
ప్రొద్దెక్క నదియేమి పొమ్మని యింటి । యొద్దనె సంధ్యాదు లొనరింపసాగె
ననువొందసేతు నాజ్యాహుతు లెల్లి । కనుచు నౌపాసనం బతఁడు చాలించె
తన కాస్థ లేమి నిత్యము దేవపూజ । యొనరింప విద్యార్థి నొకని నేమించె
తలిదండ్రు లిదియేమి తామసంబనిన । నలిగి వారల కెదురాడఁగాఁ దొడఁగె
పరదేశులకు నన్నపానీయదాన । గరిమ లేదని వారి గద్దించి తఱిమె
యీచందమున దుష్టహృదయుఁడై నిజకులోచితక్రియ లెల్ల నుడిగి వెండియును

గొల్కొక్క మిదియని కొంటెలఁగూర్చి । యక్కట వారి కయ్యర్థముల్ దెలుపు
ఈజంత చిత్తిని యీనాతి హాసి । నీజాతియని వీథినెలఁతలఁ జూచు
ఋతువైనఁ దద్దోషమెడయదే యితర । రతి సేయుఁడని యన్యరమణుల నడుగు
కనుగొనమే 'స్వర్గకామో యజేత' యనఁగ వేశ్యాయుక్తి నఘమేమి యనును
దగదె 'సర్వంఖల్విదం బ్రహ్మ' యనఁగఁ । దగని కాంతయుఁ గలదా యని పలుకు
తన పురాకృతదుష్కృతముఁ తన్ను జుట్టికొని బెట్టు ప్రేరేప గుణహీనుఁడగుచు
పరిహాసకులయొద్దఁ బలునలయొద్ద । విరిబంతు లమ్మెడివెలఁదుల యొద్ద
జూదంబు లాడెడిచోటులఁ జంద । నాదు లమ్ముచునున్న యంగళ్లయందు
పగలు రేలును నెడఁబాయక తిరుగు । తగు నటవిటచేటతతులను గూడి
యేవేళ నింటికినేఁగునో యెప్పుఁడు । గావించునో భుక్తి గనబడ దతఁడు
ఇంచుకసేపైన నింటిలో నిలక । హించక దినదినం బిటులఁ ద్రిమ్మరుచు
సవికపుధోవతుల్ జాళువాసరులు । చెవులధరించిన చికిలిఘుంటీలు
రాకట్టుపని యుంగరములు ముత్యాల । చొకట్లు హారాన్ బట్టుశాలువ మొలను
గనుపట్టు మేలిబంగరు మొలకట్టు । గొనబుగుండ్లు మెఱుంగుకుచ్చుల హెచ్చు
సన్న నూర్యపుటంపుసంచి బల్ వెండి । సున్నపుకాయయు సొగసుగాఁ బూని
పిడికిఁటనిండి శోభిలు తెల్లటాకు । లెడనెడ మడిచి సొంపెనయ విడెంబు
సేయుచు నొకనాఁడు చెలికాండ్ర జంటఁ । బాయక కేరి లోపలి కేఁగ నచట
నవరొందు విటవిదూషకగాయకాదు । లవురౌర నాముద్దులయ్య వచ్చెనని
పొగడుచు వీథిలోఁబొసఁగునే యిచట । జిగిబిగిగుబ్బల చిన్నిప్రాయంపు
ననబోణి యొకతెయున్నది చూతుగాక । చనుదెమ్మనుచు నొక్కచాన యింటికిని
తోకొనిపోయి యింతులమేలిబంతి । యీకుందరదన నీకే తగు ననుచు
దానిఁగీర్తించి చెంతలనిల్ప నదియు । నానోములు ఫలించె నాభాగ్యమలరె
నాపుణ్య మీడేరె నాచక్కనయ్య । నా పడకింటిలో నవనీయకుసుమ
శయ్యాయుండఁగఁ జిటిచాపపై నిచట । నయ్యలు నివసించుట న్యాయమే యనుచు
సరసోక్తి శుష్కోపచారముల్ గొన్ని । తరచుగా నొడివి కైదండ యొసంగి
పానుపుపైనుంచి పజ్జ మేనొరయ । దానుండి కపురనెత్తావి బాగాలు
మరులు హెచ్చఁగనిచ్చి మడుపు లొక్కొకటి । షరమవినీతి నేర్పడఁ జుట్టిచుట్టి

యిచ్చుచు బిగిగుబ్బ లెగనెత్త మెల్ల । గ్రుచ్చి కౌఁగిటఁజేర్చికొని మోవి నొక్కి
పచ్చవిల్తునికేళిఁ బైకొని వలపు । ముచ్చటాడుచు మోముమోమునఁ జేర్చి
యొక్క ముద్దొసఁగరా యోరి ప్రాణేశ । నిక్కమ్ముగా నేను నిను మానలేను
వెలకొమ్మ ననకు నీవే భర్తవనుచు । పలికి కళల్ రేచి పరవశుఁజేసె
దానిపై మరులెత్తి ధరణీసురేంద్ర । సూనుఁడు తనయింటిసొమ్ముకకొంత
కోకలు రూకలు గొనిపోయి యిచ్చు । నాక నెచ్చెలులకు ననుఁగుదమ్ములకుఁ
దను దానిగూర్చిన తాపికాంద్రకును । దనివిదీఱఁగఁ గోరుద్రవ్యంబు నిచ్చు
తల్లిదండ్రుల నొకింతయుఁ గాననీక । నిల్లెల్ల చెనఁటిగా నెల్లవస్తువులు
కొనిపోయి నటవిటకోటి కిచ్చుటలు । జనకుఁడు విని కోపసంతాపచలిత
హృదయుఁడై తనయింటికేఁగి పెట్టియలు । వెదకి తాఁదాఁచిన విత్తాదికములు
కొన్ని గానక జాలిగుంది ముంగిటనె । యున్న భార్యనుబిల్చియోసి! యిదేమి
పెట్టెలలో దాఁచిపెట్టిన ముదుపు । లిట్టేల విడిలిన నేది ? తద్ధనము
ధానలుల్ పట్టువస్త్రములు శాలువలు । నేవి? నీవెఱుఁగక యెందుఁబోయినవి
కుల ముద్ధరించినకొడుకు వేఁడికొన । నొళువరివై నీవె యొసఁగితో ! లేక
వాఁడె కొంపోయెనో: వంచకుండగుచు । నేఁడెఱింగితిమి వాని మహత్త్వమెల్ల
వేదశాస్త్రంబులు వెల్లిఁబో విడిచి । వైదికాచారమ్ములవమ్ము గావించి
తెలిగంటి యింటిప్రతిష్ఠఁ బోకార్చి । వెలయాండ్ర యిండ్లలో విహరింపసాగ
నా సరివారిలో నగుబాటు వచ్చె । నీ నడికోర్చి నేనిఁక నిల్వఁజాల
సర్వంబు వర్జించి సన్న్యాసి నగుచు । నుర్విఁ జరింతు నీవుండాడవలదు
ఊరకుండుమటన్న నువిద భీతిల్లి । తోరంపుగన్నీరు దొరుగ నిట్లనియె
ప్రాణేశ యిట్లేల పదరి యిల్వెడలి । పోనెంచెదరు చెల్లబో! యల్కతోడ
నలిగి యిల్ విచ్చిడు మనువారు గలరె।కులనాపకుఁడు వాఁడుకొడుకె? తలంప
నేమాయనుచు నుంటినిది నే నెఱుంగ । నీమాట మీరానతియ్యగా వింటి
నిలువెడలఁగఁగొట్టుఁ డిఁక రెంటమాటఁ । దిలకించి నేను బోధించిన వినక
మతకరితనములు మానఁడేనియును । బ్రతికెడి; మీకేలఁ బరదేశమరుగ
నని మ్రొక్కి ప్రార్థించి యకోపమణఁచి।వనిత వాఁడెప్పుడువచ్చునో యనుచు
నెదురుచూచుచు నున్నయెడఁ దండ్రిలేని।కదలికఁగని మ్రుచ్చుగతి నిల్లుసొచ్చె

చనుదెంచిన కుమారు జనని వీక్షించి । కనుదోయి మిణుఁగురుల్ గదుర నిట్లనియె
నోరి పితృద్రోహి యోరి నీచాత్మ । యోరి దురాచార యుచితమే నీకు
పగలు రేలు ప్రయాసపడి తండ్రి చీమ । పగిదిఁ గూర్చిన సొమ్ము పట్టాంశుకములు
గొనిపోయి గొంటువై కొంటెరండలకు । ననుదినం బిచ్చి కామాంధకారమునఁ
దిరిగెదవే మంచిది మతేమి యేటి । కరుదెంచి తింటికి నరుగు మచ్చటికె
తోడి బాడబులెల్ల దొరకొని కేరఁ । గోడెపాయపు మత్తుగొని చరించెదవు
తులువవుగాన నీదోయిటిప్రాల । యెలనాగి యీడేరి యింట నుండఁగను
అక్కన్య నొక్కనాఁడైనఁ గన్నెత్తి । చక్కఁజూతువు దుష్టసంగతి మరఁగి
నిరతంబు చరియించు నీచర్యలెల్ల । నెఱిఁగి మీతండ్రి నేఁడింటికివచ్చి
చెడుగనౌ నిన్నుజూచిన దోషమనుచు । నెడఁద నాగ్రహము సహింపఁగాలేక
సన్న్యసింపఁగడంగెఁ జాలఁ బ్రార్థించి । దైన్యంబుమీఱఁ బాదములపైఁ బడినఁ
గినుకమానక నన్ను గెలయుచుఁ జనియె । వినగదరోరి ! వివేకవిహీన
అని పెక్కుదుర్భాష లాడుచునున్న । జనని గనుంగొని శంకలే కతఁడు
ఆతల్లిఁ బదముల కవనతుండగుచు । జేతులుమొగిచి నిల్చిమృదూక్తి ననియె
జననిరో! వినుమొక్క సహవాసదోష । మున నట్టిదుర్గుణంబు జనించెఁ దనకిఁ
దెలిసె మీరిపుడు బోధించుటఁ జేసి । కలనైన నట్టిమార్గములకేఁ జనను
నీమాట జవదాట నిక్కువంబనిన । నామాత కృపచేత నంగీకరించి
మమత నెప్పటియట్ల మజ్జనభోజ । నము లమరించి యన్నా! బుద్ధిగలిగి
మీతండ్రి మనసు రా మెలఁగు మటన్న । నాతఁ డౌఁగాకని యవుడింట నుండె
ఉన్నమాత్రమె కాని యూహాలోఁ గేరి । చిన్నారిపొన్నారి చెలువల యందు
గుమిగొని వెంటాడుకొంటెలయందు । భ్రమణమందుచుఁ దొట్రుపడుచు వర్తించె
కొడుకు నిక్కముమంచిగుణి యాయె ననుచు । కడునమ్మి తండ్రియుఁ గన్నతల్లియును
మంచిలగ్నమున సమర్తశోభనము । దంచితమతిఁ జేసి రక్కుమారునకు
కోడలికిని బంధుగులు మేలనంగ । వేడుకల్ మీఱఁగా వివిధవైఖరుల
ప్రీతిలేక సమర్తపెండ్లికుమారి । చాతుర్యవతిగాదు జడురాలటంచు
వలసియొల్లక యింటివారి నిర్బంధ । మొలయఁగాఁ జెరసాల నున్నచందమున
గిట్టివేసినయట్లు కర్కూర్తి నిట్టు । నట్టు పోఁగూడమి నారేయి గడపె

తన తండ్రితో సమిత్ప్రసవాదికములు । గొని తెత్తునని సానికూఁతురి నొకతె
నా తెరువునఁ జూచి యట చేతికెంపు । రాతియుంగర మిచ్చి రమియించి వచ్చె
తులసి తే నటఁబోయి దొమ్మరిపడుచుఁ । దిలకించి తాను రాతిరి ముల్లెవిడిచి
కొన్న మాడలలోనఁ గొన్ని యొసంగి । పొన్నపూఁబొదలోన భోగించి వచ్చె
సానిమిటారికి జక్కులవారి । చానకుఁ గనియారజంపుబిత్తరికి
కూఁతాడిదానికిఁ గొంకక వలచి । యాతఁ డింటఁ గ్రహించు నర్థంబులిచ్చి
తళుకు గెందమ్మిపొందళపు బల్ రవుతు । కలన వినోదించి కమ్మక్రొవ్విరులు
కొన్ని పొట్లములతోఁ గొనివచ్చి యింట । నున్న విద్యానిధియొద్దఁ దా నునుము
నొకవేళ ముదుపులోనున్న మాల్లెచ్చు। టికిఁ బోయెననుచుఁ దండ్రిగణించి యదుగ
నల్ల యంగడిసెట్టి కప్పిచ్చినాఁడ । మల్లిసెట్టికి నూఱుమాళ్లిచ్చినాఁడ
సంతలో నున్న వసంతసెట్టికిని । గొంత యొసంగితిఁ గూడినవడ్డి
యిదె తెచ్చియిచ్చెద రివిగో! పత్రములు।చదువుకొండనుచు నిజముదోఁపఁ బలికి
దబ్బరచీటులు తండ్రికిఁజూపి । యబ్బారిగడచి వాఁడటునిటు జూఱుఁగు
నేనేమి చిఱుతనె! యింటిసొమ్మేలఁ । బోనిచ్చెదను పాఱుబోతనా! మీకు
సందేహమేలని జనసీజనకుల । మందెమేలంబున మసగప్పి యింటి
బీగముల్ సొమ్మును బెట్టెతాళములు । తాగొని వలసినధనముఁ బోకార్చు
గల్లువాఁకిలి ధనంబెల్లను పీది । చిల్లరవెచ్చముల్ సేయక బుద్ధి
గలిగియుండిన బ్రతుకంగల వింటి । కులకాంతతో ధర్మకుశలుండు వగుచు
గార్హస్థ్యముఁవహించి ఖ్యాతిఁ జెందుమని।యర్థాభంగి గణించి యలతండ్రికొంత
కాలంబు చన జరాక్రాంతుఁడై నొగుల । నాలోన నతనిభార్య క్రమించె మున్నె
సతిచన్న యేటిలో జనకుండుస్వర్గ । గతుఁడైన నగ్ని సంస్కారాది విధులు
గావించి పరవధూకాంక్షలు విడక । నావిప్రతనయుండు నావంకపరిక (?)
చాటును దీఱెనన్ సామెత తనకుఁ । బాటిల్ల వలసిన పగిది వర్తించె
నిది తగు నిదితగ దిదిచెట్ట యనక । కదియు నెవ్వతెనైనఁ గామాంధుఁడగుచు
నది కారణంబుగా నాద్విజాధమున । కుదయించె వ్రణబాధ లుత్పాతముగను
నెడలేని వ్రణబాధ నిటువలె మూలఁ । బడిన భర్తను జూచి భార్య దుఃఖించి
యన్నినాళ్లతఁడు వ్రయముసేయ మిగిలి।యున్న కొంచెపుధనం బువిద గ్రహించి

పరమపతివ్రతాభరణంబు గనుక । పురుషుని దుర్గుణంబులు లెక్కగొనక
తగిన వైద్యులఁదెచ్చి తద్వ్రణహరము । లగుమందు లిప్పించి యనువుగాఁ బథ్య
పానీయము లమర్చి పాటుపడంగ । మానె వ్రణంబులు మఱి కొన్నినాళ్ల
కతఁడట్లు వ్రణబాధ లనుభవించియును। సతి డాగురించి వెచ్చమునకై యున్న
హారాలుగొంపోయి వేశ్యలకిచ్చి దుష్ట । గుణమున గడియించికొనె ఘోరరుజలు
గడియించికొని వాఁడు గాసిపడంగ । ... ... ...
కొదవిన వ్రణచేష్ట లొడల నూరంగ । పదియైదుమారు లుబ్బలపడి లేచి
స్త్రీగోష్ఠి మానమిఁ జేతులఁగాళ్ల । మైఁ గానఁబడె పొడల్ మాటికి రసము
చిప్పిల్లి నెత్తురుచీములు వడియ । గొప్పపుండ్లయ్యెఁ బెక్కొనెఁ జెడుకంపు
నూలనొప్పులు మించ స్రుక్కుచుఁ గుక్కి । కూలి లేవగలేక కొరలుచునుండ
కొసలు గారెడు పుండ్లు రోయక కడిగి । మసలకందులకగు మందులు నోరిమి
కూలికిదంచఁ జేకుఱు తండులంబు । లావేళఁదెచ్చి చయ్యనవండి తనకు
నొడికంబుగాఁ బెట్ట నొకకొన్నినాళ్లు । గడపె నయ్యధముండు కాంతప్రోవునను
ఆలు కూలికిదంచి యన్నంబువెట్ట । నీలాగు కుంటియై యింటిలోనుండి
యొకనాఁడు తనపత్ని నొద్దికిఁ బిలిచి । శుకవాణి! నినువంటి సుగుణాలు గలరె
కాపాడితివి పెద్దగాలంబు నన్ను । నీపట్ల మూర్ఖునై నే నడిచితిని
అదియేల నివుడెంచ నాస యొందున్న । యది మది నదియేమి యని యంటివేని
విను దొల్త నేఁగూడి విహరించినట్టి । కనకాంగియను వేశ్యగల దీపురమున
దానితో నొకసారిఁ దమిగూడియున్న । గాని మనోవ్యథ గడతేర దబల
నీవు దానింటికి నిప్పుడెపోయి । నావిధం బెఱిఁగించి నను నేఁటిరేయి
పిలిచి యేలెడునట్లు ప్రియములు చెప్పి । యెలమి తోడెమ్ము పైఁడి యిచ్చిరమ్మనిన
పతిమాట దాటక పద్మాయతాక్షి । హితబుద్ధినను పైఁడి యేమున్నదిపుడు
గళమున నొక్క మంగళసూత్ర మున్న । దెలనాగ కదియిచ్చి యియ్యకొల్పెదను
మది మీరు సంశయింపక యుండుఁడనుచుఁ । జెదరని పతిభక్తిచే నాసుశీల
పురిఁజుట్టి పేటలోఁ బొసఁగెడి కేరి । కరిగి యక్కడఁ గనకాంగి యిల్లడిగి
వడిఁ జొచ్చిపోవ నవ్వామాక్షి మేని । బెడఁగు కన్నులతళ్కు పెద్దపిఱుందు
బిగి గుబ్బచనుదోయి బింబాధరంబు । తొగరేనిగేరు ముద్దుమొగంబుఁ జూచి

యింత చక్కనికాంత యెవ్వరో మాసి । యెంతయు లేమిచే నేఁగుదెంచినది
కమలయో పార్వతీకాంతయో యజుని।రమణియో యింద్రునిరాణియో కాక
యిలనున్న కాంతల కీరూపురేఖ । గలదె యం చెదురేఁగి కనకాంగి యపుడు
రావమ్మ మాయమ్మ రతనాలబొమ్మ । యీవేళ నీవేల యిందువచ్చితివి
నీనామమెయ్యది నీభర్త యెవ్వఁ । డీనలఁకువ చెంద నేమికారణము
పసపు కాటుక బొట్టు పదివేల సొమ్ము।లసమాంగి నీవు బ్రాహ్మణకాంత వేమొ
అనియెంచి లోపలి కయ్యింతిఁ దోడు । కొనిపోయి మణిపీఠిఁ గూర్చుండఁబెట్టి
తగుభక్తిఁ గర్పూరతాంబూల మొసఁగ । మగువ యిట్లనియె నోమంజులవాణి
పేరు సుశీల నాప్రియుఁడు దుర్మేధుఁ । డూరిలో దొరలెల్ల నుపచరింపంగ
మనిన విద్యానిధి మా మామగారు । కనకాంగి వచ్చినకార్యంబు వినుము
మా యింటియాయన మగువ!నిన్ దొలుత।బాయకున్నాఁడట బహుదివసములు
నీమీఁదివలపున నిను నేఁడుదలఁచి । కోమలి యీరేయి కూడియుండుటకు
కామించి పనుప నిక్కడికి వచ్చితిని । నా మనవిది విని నామెడ పుస్తె
పైఁడిగాఁగొని పిల్వ ప్రాణేశు, నడువ । లేఁడు నేఁడెచ్చెద లేమ! యిందనిన
నా పతిభక్తికి నాశ్చర్యమంది । బాపురే! నీసాటిపడఁతులు గలరె
కలకాలమును నీమొగంబు చూడక యె । తులువయై తిరిగె నద్దోసి పాపందు
పోలఁతిరో యిపుడు ముప్పూల కెవ్వరైరి । కులకాంత నీవుగల్గుటగదా! బ్రతికె
నెందఱెందఱి కిచ్చె నింటిధనంబు । ముండ రేయింగఁ డేమును జెప్పిచెప్పి
వేసరితిమి సుమీ! విమలాంగి యింత । గాసిలఁ జేసెగాఁ గడపట నిన్ను
నాదోసకారి మోమైనను జూడ । రాదమ్మ ! నీవిందురా వానిఁబిల్వ
సమ్మతించితి నిదిసత్యమ్ము సుమ్ము।కొమ్మ యీరేయి తోడ్కొనిరమ్ము పొమ్ము
మాయక్క నీమెడ మంగళసూత్ర । మీయెడఁగొన నంతయెఱుక మాలితిని!
వలవదు పొమ్మని వనిత యావిప్రు । చెలువకు రవికయుఁ జీరయు నిచ్చి
పరిమళద్రవ్యముల్ బాగాలు నిచ్చి । వరుసదప్పక తలవాకిటి దాఁక
తావచ్చి పనిచిన దాన సంతోష।మావహిల్లఁగ నింటికరిఁగి యాత్మేశుఁ
గాంచి యివ్విధమెల్లఁ గ్రమముగాఁ దెలుప।మంచిదంచు నతండు మది నుత్సహించె
వెలయాలిమిన్న యవ్విప్రునిచేత । వలువలు మాళ్లు నవ్వారిగా మున్ను

నోఁచినదగుట సద్గుణమువహించి । యాచెల్వ చెప్పినయందుల కొప్పె
నంతనక్కడ సుశీలాంబుజాతాక్షి । కాంతుని తలయంటి కాఁగిననీళ్లు
కాఁగుల నిడి యటకలిఁబెట్టి పుండ్లు । రేగకుండంగ శరీరంబు నోమి
జలము సయ్యన సుఖోష్ణముగఁ దార్లించి। జలకమార్చి మున్నె సవరగా నుతికి
యెండవేసిన వస్త్రమిడి తడియొత్తి । నిండుతావుల దిశల్నించు గంధంబు
నల వెలయాలిచ్చినది మేన నలఁది । బలుపుండ్ల నీఁగలు పట్టకుండుటకు
చలువబట్టలు గట్టి శయములఁగ్రుచ్చి । చెలువు నెత్తుకువచ్చి స్థిరభక్తి హెచ్చ
మున్ను వండినయన్నమును గూరగాయ । లన్నెలంతుక వెట్టి యతఁడారగింపఁ
గరములు పాదముల్ గడిగి పానుపున । నిరవొందనిడి విడె మిచ్చి వాఁడనుప
ధవభుక్తశేషంబు తాను భుజించె । రవి యంతఁ జరమాంబురాశిఁ బ్రాపించె
చరమదిక్కామిని సంజకెంజాయ । సిరిదొట్టి కెంబట్టుచీర ధరించె
గాటంబుగా నిశాకాంత ధరించు । కాటుకయనఁగఁ జీఁకటి దిశల్ముంచె
బాఱుగా గగనవాగ్భామ ధరించు । తారహారములో నా తాగకల్ మించె
బలురాత్రి యగు నీమెపలుక నింకేటి । పొలుపనిన ట్లబ్జములు ముకుళించె
కలకాలమును రాత్రి గాఁగలదనుచు । వలనొందెనన గలువలు వికసించె
జారచోరుల మానసము లుత్సహించె । సారెకు జక్కవల్ జడత వహించె
పతి తన్నుఁ బ్రేరేపఁ బడతి యూరేయి । యతని వీపునఁబూని యంఘ్రిద్వయంబు
కరములముందుగా గ్రహియించి మించి । సరగ కేరిమిటారి సదనంబుచేరి
హెచ్చరించన సైగయెఱిఁగి యచ్చాన । వచ్చితె రమ్మని వాఁడప్పుడున్న
తెఱఁగును మున్పటిస్థితియును దలఁచి । హరహరా యెంత లోనైతి పిలోన
అంటవయో! శ్రీమహాలక్ష్మిలీల । నింటిలోఁ గులకాంత యీమెవ ర్తిలఁగ
నీభాగ్య మటులుండె నీ కేమిగలిగె । లాభంబు గణికావిలాసంబు వలన
నిచ్చిన రమ్మందు మేమిలేదనిన । విచ్చలవిడి నిల్లువెడలఁ ద్రోయుదుము
మామీఁది మరులేల మాన విప్పటికి । నీమేని గవులేంది నీయున్కి యేంది
చాలు లెమ్మనిపల్కి శయ్యపైనతని । యాలు మెల్లనె డించి యవ్వాలనున్న
కనకాంగి డగ్గఱి కాంతులీడేర్చి । చనుమని పనిచిన శయ్యపైనున్న
పతిని మెల్లన వీపుపైఁ దాల్చి భక్తి । యతిశయిల్లంగ గాంధాంధకారమున

దెరు వొకించుకతప్పి దిగ్భ్రమఁజెంది । యరుఁగ శ్మశానంబు నందొక్కచోట
ననపరాధినిఁ దలయారులు దెచ్చి । కనలువుట్టఁగ ధరాకాంతుతోఁ జెప్పి
వాని బల్కొఱ్ఱపై వైచుటఁజేసి । ప్రాణాంతవేదనఁ బాల్పడివాఁడు
తనువు వీడఁగనున్నతఱి నవ్వధూటి । తనభర్తకాల్ కొఱ్ఱదాఁక వేగమున
నరుదేర వాఁడార్తుఁడై కొఱ్ఱుదాఁకి । కరకరిఁబెట్టిన కష్టుఁడీ ప్రొద్దు
పొడుచునప్పుడె చచ్చుఁబొమ్మని తిట్టి । విడిచెఁ బ్రాణంబులు వింటివె బోఁటి!
అమ్మాటవిని భూసురాంగన బెదరి । యమ్మ నేఁజెల్ల! మాయాతండు ప్రొద్దు
పొడువఁ జావఁగనేల! పుడమి వైధవ్య । మడరఁ దానతిదైన్య మందగానేల
యినుఁ డుదయింపక యిదిమొదల్గాఁగ । ఘనతమోవృత నిశాకాల మాగాక
యేను బతివ్రతనేని లోకమున । భానురశ్ములు గానఁబడకుండుగాక
అని శాపమిచ్చి యయ్యంగన విభుని।గొని యింటికరిగి యెక్కుడుభక్తి నతని
పరిచర్యసేయుచుఁ బాయకయుండె । ధరయు దిక్కులు వియత్తలమును నిండి
కటికచీఁకటి సముత్కటముగా నెరసె।నటభానుఁ డుదయాద్రియాత్ర చాలించె
కనకాద్రి నపసవ్యగతి గ్రహశ్రేణి । వెనుకముందరలుగా విసువుచుఁ దిరిగె
కాలమర్యాదలు గడతేఱగనుక । నాలోనఁ జంద్రోదయంబు గాదయ్యె
కమలగర్భుని దినకల్పమో యనఁగ । తమము గ్రమ్మినదని తలఁకిరి సురలు
మునివరుల్ నక్షత్రముల వీధు లరసి । యనువేదియుండుట కచ్చెరువడిరి
యిట 'దీర్ఘదశ నొందె యీనిశ దైవ । ఘటన మెట్టిదోయని కలఁగిరి నరులు
స్నానసంధ్యావిధుల్ జపహోమనిష్ఠ । లేనలువున ఘటియింత మటంచుఁ
జెక్కుండ్రుగూడుక పెద్దల నడిగి । రొక్కట బ్రాహ్మణు లూహగ నపుడు
దీపికల్ వెలుఁగఁగా దేశదేశముల । భూపతులడిగిరి బుధుల రావించి
యిది కాళరాత్రి యగానేని లోకముల । నుదధు లేటికి ముంచకున్న వటంచు
ద్వీపాంతరముల వర్తిలు పెద్దలాడి । రాపట్లఁ జెలరేఁగియాడె భూతములు
వసుధఁ బిశాచముల్ వ్యాపించు ననుచు । మసలక రుద్రుండు మసనముల్గాచె
చంద్రసూర్యాదులు సకలసంయములు । నింద్రాదిదేవత లెల్లదిక్పతులు
నిదియేమి యుత్పాత మిపుడుధాతకును । నిదురపట్టినదో!యన్వేషింత మనుచు
నందఱు గుమిగూడి యరిగి కొల్వున్న । బృందారకజ్యేష్ఠు పృథుయోగనిష్ఠు

కరుణాగరిష్ఠు సత్కాంతివరిష్ఠు । పరమేష్ఠిఁ గాంచి సద్భక్తి సేవించి
కరములుమొగిచి గద్గదకంఠు లగుచు । పరిపరివిధములఁ బ్రస్తుతుల్ చేసి
హో మృదూక్తిసనాథ! హోలోకనాథ । యీ మహానిశపుట్ట నేమికారణము
రవిచంద్రులకుఁ దీప్తి రాకయుఁబోక । యవని గాఢాంధకారావృత మయ్యె
హావదీక్ష లుడిగె బ్రాహ్మణనిష్ఠ లణఁగె।హావిరంశములు లేక యడలుచున్నాము
విపరీత మిదియేమి వివరింపవలయు । కృపనన్న రాయంచ నెక్కి పద్మజుఁడు
కైలాసమున కేఁగి గరళకంధరున । కా లాగెతింగింప నతఁడును వెంట
గిబ్బతత్తడి దుమికింపుచు రాఁగ । లిబ్బిగుబ్బెతఁ గౌఁగిలించి యేవేళ
వదలని తమిఁజొక్కు వైకుంఠవాసుఁ । గదిసి మ్రొక్కి యిదేమి కటికచీఁకటులు
గ్రమ్మిన తెఱఁగన్న గలకల నవ్వి । యమ్ముకుందుఁడుపల్కె నజరుద్రులార
పరమపతివ్రతాభరణ మొక్కరిత । వరు ప్రాణహాని యోర్వక భానుఁడెపుడు
నరుదేరకుండుగాకని శాపమిచ్చె । నారు లెఱుంగరు దీని నొకకొన్ని యేండ్లు
క్రమియించె నిఁక జాగు గావింపఁజనదు । ప్రమదాశిరోమణిపాలి కందఱము
పోద మిప్పుడెయని భోరునఁ గమల । కైదండ యియ్యగా గ్రక్కున లేచి
యాదండనున్న ఖగాధ్యక్షు నెక్కి । వేదండవరదుఁ డవ్వేల్పులఁ గూడి
మణిమతీపట్టణమహిఁ జేరి యువతి । మణి సుశీల వసించు మందిరాంగణము
ప్రాపించి యోపతివ్రతలమేల్బంతి । నీపాలి కిదె నేఁడు నిఖిలదేవతలు
సకలమునీశ్వరుల్ చనుదెంచినారు । శుకవాణి మొగమెత్తి చూడరావమ్మ!
హరి నేను హరుఁడితం డతఁడుపద్మజుఁడు।సురరాజితఁడు వారుసురలు సన్మునులు
వాఁకిట నిదె యున్నవార మటన్న । నాకాంత భయభక్తు లమర వే లేచి
పతి యనుజ్ఞను వారిపాలికి నేఁగి । నతులుపెక్కు లొనర్చి నయనాంబుజముల
సమ్మదాశ్రులుజాఱ శయములుమొగిచి । యమ్మహామహుల నిట్లని వినుతించె
హరికి దోషమదేభహరికి దయాల । హరికి నీకుఁ బ్రణామమయ్య! లక్ష్మీశ
భవునకు వితతవైభవునకు విగత । భవునకు నీకిదె ప్రణతి గౌరీశ
సురరాజ నిర్జితాసురరాజ! శరణు । సురలార కీర్తిభాసురులార! వినుతి
నను పెద్దఁజేసి యిందఱు నిందువచ్చి । కనుదోయివిందుగాఁ గనుపించినారు
మిముగూర్చి తొల్లి యేమితపంబు జేసి । తిమొ దంపతులమేము స్థిరతేజులార

బహురోగముల బాధపడి లేవలేక।గృహి యింటనున్నాఁడు గృపచూడరయ్య!
నా మొఱ వినరయ్య! ననుగావరయ్య।నామీఁదఁ గరుణచిందఁగఁ జూడరయ్య
అని మ్రొక్కి ప్రార్థించు నమ్మహాసాధ్వి। గనుగొని హరిహరకమలజు లనిరి
అక్కరో! సూర్యోదయము గాకయుండ। నిక్కువడి శపింతురే! యెవ్వరైన
త్రిభువనముల గాఢతిమిరంబు గప్పె। సభయులైరి మహానిశాప్రాప్తి జనులు
కర్మనిష్ఠలుజాఱె క్రతువులుదీఱె। ధర్మమా! నీకివ్విధం బాచరింప
నినుఁ డుదయింప సెల్వీక నీఁగదమ్మ। యనిమిషాదుల కభయ మొసంగవమ్మ!
యనినఁ గ్రమ్మఱ మ్రొక్కి యక్కొమ్మపలికె।ఘనులార! నేనూరక శపింపలేదు
తన యున్నకొర్తి నాధవు నంఘ్రిదాఁకె। నని తెల్లవారినయపుడె యీజనుఁడు
కడతేఱునని శూలగతుఁడాడఁ బ్రొద్దు। పొడువకుండెడుమని పూని నేనంటి
పతిప్రాణములు పెడఁబాసి నేనెటుల। బ్రతుకుదు విధవనై భవ్యాత్ములార!
కొఱతఁ గూలినవాని కుటిలశాపోక్తి। పరిహరించి మదీయపరితాప మడఁచి
నానాథు నాయురున్నతుఁజేసి ప్రాణ। హాని పొందకయుండునట్లుగా మీరు
వర మొసంగిన వివస్వంతుండు పొడము। పరమార్థమిదియన బ్రహ్మాదు లలరి
యీ పతివ్రతఁజూచి యని రోపురంధ్రి!। నీపతి శూలాగ్రనిహతు శాపమునఁ
దపనుండు తోఁచినంతనె ప్రాణమెడలి। యపుడె లేచి సమున్నతాయురారోగ్య
శాలియై నిజబంధుసజ్జనాంభోజ। హేళియై పరలోకహితపుణ్యకర్మ
పాలియై యాచారపరతంత్రవిప్ర। మాళియై విహితధర్మంబులు విడక
వైదికాచారప్రవర్ధనుండగుచు। నా దేవఋషిపితౄణాదులు దీర్చి
కులకాంతవగు నిన్నుగూడి సత్పుత్ర। కులఁ గాంచి యాగముల్ కొన్ని గావించి
వెలయాంద్రతమిని గావించిన కలుష। ములను బశ్చాత్తాపముస నివారించి
కలిమియు భోగభాగ్యంబులు గలిగి। చెలువరో! దేశప్రసిద్ధుఁడై వెలయు
నీకతంబున గుణాన్వితుఁడై తనర్చె। నీకతంబున ధర్మనిష్ఠుఁడై వెలసె
పడఁతి సౌశీల్యసంపద నీవుఁబతియు। గడపట బ్రహ్మలోకంబు జేరెదరు
అనిన సంతోషించి యప్పుణ్యసాధ్వి। యినుఁడిప్పుడే యుదయించుఁగా కనియె
అనినంత నుదయాద్రియను రాజు మౌళిఁ। గనుపట్టు పద్మరాగకిరీట మనఁగ
రోదోంతరమునఁ గార్కొను తమఃపటలి। భేదించి పద్మినీబృందంబునకును

నామోద మొదవించి యర్కుండు పొడమె। భూమివారలకు నింపును సొంపెసంగ
నప్పతివ్రతమీఁద నలరులు గురిసి। రప్పుడుప్పొంగుచు నఖిల దేవతలు
నావేళ బ్రాహ్మణుం డపగతప్రాణుఁడై వసుంధర వ్రాలి యమ్మహామూర్తిమున
దేవతానుగ్రహదృష్టిచే బ్రతికి। కేవలదేహదుర్క్లేశము ల్వాసి
మునుపటికంటె సంపూర్ణ ప్రకాశ। మును శాంతిదాంతులు బుద్ధిపై ఖరులు
గలిగి వేల్పులయంతికమునకు వచ్చి। పులకితగాత్రుఁడై భూమిపై వ్రాలి
అమితసాష్టాంగమ్ము లపుడాచరించి। సమధికభక్తి నంజలిచేసి పలికె
కమలామనోహారం కమలాయతాక్ష। మమృతస్వరూపిణ మహా మాశ్రయామి
శమనగర్వాపహాం చంద్రార్ధజూట। మమలమహేశ మహం భావయామి
భారతీవల్లభం పద్మాసనస్థ। మారూఢతేజస మనిశం భజామి
యని ప్రస్తుతించిన నతని సుమేధుఁ। డని పిల్చి తద్భార్య నపుడు కీర్తించి
యెనలేని సిరులతో నిలమీఁద వెలయుఁ। డని యదృశ్యతఁ జెంది రమ్మహామహులు
వారలేగినతరువాత నాద్విజుఁడు। తారుణ్యవతియైన తనభార్యఁ బొగడి
యత్యనురక్తుఁడై యామెతోఁగూడి। నిత్యకర్మంబును నిష్ఠఁదీర్చుచును
అష్టపుత్రులఁగాంచి యజ్ఞముల్ చేసి। శిష్టవర్తనలతో సిరులొంది వెలసె
నీసుశీలాఖ్యాన మెంతేనిభక్తి। వ్రాసినఁ జదివిన వరుసతో వినిన
వారికి సకలదేవతల కారుణ్య। గౌరవంబునఁ గల్గు కామితార్థములు
అని కీరతనుధారి యగు మహామాత్య। జనమాలి పుష్పమంజరి కెఱింగింపఁ
గీరమా! నీవుపల్కిన పల్కులెల్ల। సారంబులివి సుధాసారంబు లనుచుఁ
బొగడుచు నింటికిఁబోయె నవ్వేళఁది। జగతీశుదూతియుఁ జనె నగరికిని
అని శంభుఁడెఱిఁగింప నవ్వలికథలు। వినిపింపుమని గౌరి వేడ్కతో నడిగె
సారపతివ్రతాచరితంబునం దు। దారమై యెన్మిదియవకథ వెలసె
అని శౌనకాదిమహామునీంద్రులకు। వినిపించె సూతుండు విఖ్యాతలీల

# మానవతి కథ

శ్రీవిశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
దూతికాపహూతయా తొయ్యలిఁ జూచి । యాతరువాతఁ గీరాగ్రణి పలికె
పతులును సుతులును భ్రాతలు హితులు । సతుల మానముగావ శక్తులుగారు
తమ యభిమానంబు తామె కాచికొను । రమణులెపో పతివ్రత లిజ్జగమున
నిందులకొకకథ యేర్పడియున్న । దిందుముఖీమణి యెఱిఁగింతు వినుము
మాహురీపురమున మణికేతుఁడనెడి । సాహసోదగ్రుండు జనపతి గలఁడు
ఆనరేంద్రునకు దైవానుగ్రహమున । మానధనుండన్ కుమారుండు పొడమె
నతఁడింతయై యంతయై వృద్ధిఁబొంది । చతురవిద్యాభ్యాసశాలియై వెలసె
పుత్రుని యౌవనాభ్యుదయంబుఁ జూచి । ధాత్రీశుఁ డతని కుద్వాహంబుసేయ
సమకట్టి బంధురాజన్యకన్యకల । నమరింప ముదుసళ్ల నంపెడుచోటఁ
దనమాన మేతలోదరి తానెకాచి । కొను దానిగాని తక్కువెలందిఁ బెండ్లి
యాడ నొల్లనటన్న నాత్మజుఁజూచి । తోడిబాంధవులు మంత్రులువినఁ దండ్రి
పలికె నిదెక్కడిపల్కు పల్కెదవు । లలన మానంబు వల్లభుఁడేదుగాక
తనమాన మెటువలెఁ దాను గాచికొను । వనిత, యిందులకుసవ్వరె! యెవ్వరేని
అనవిని యటువంటియతివ లేకున్న । మనుజేశ యప్పెండ్లిమానుట మేలు
నిల నిట్టిసతి గలదేమొ నే వెదకి । తెలిసి వచ్చెద సమ్మతించి మీరిపుడు
అనుమతి యిచ్చిననని పుత్రుఁడనిన । జనకుఁడువిని మహాసంతోషమాయె
నీవెంటవచ్చు మంత్రిసుతుండు తగిన । ఠీవితో విభవపటిష్ఠుండ వగుచుఁ
జని నీవు దేశదేశంబుల నరయు । మని వీడుకొల్పిన నమ్మానధనుఁడు
ఆయానృపాల సభాంతరమ్ములకుఁ । బోయి యమ్మాటదెల్పుటయును నగుచుఁ
దనమాన మెందైనఁ దానెకాపాడు।కొను కాంతగలదె! యెక్కుడుశక్తి మగఁడు
పగలునురేలు కాపాడకయున్న । మగువకు మాన మేమర్యాద నిలుచు
నటువంటి రాజకన్యక గానమిచట । నెటకైనఁజని కల్గెనేని శోధించి
పరిణయంబగుమని పలికిరి రాజ । వరులు కొందఱిదేమి వార్తలాడెదరు
కులము రూపును మంచిగుణమును గలుగు । నలివేణి వెదకి పెండ్లాడి పోరాదె
అని కొందఱాడి రిట్లఖిలదేశముల । జననాథులాడ వేసటలేక యతఁడు

వివిధదేశాధీశవితతుల నడిగి । యవల సౌరాష్ట్రరాజ్యమునఁ జెన్నొందు
భువనమోహనమను పురము ప్రాపించి । జవనాశ్వుఁడనురాజు సభఁజేరి యతని
చేతఁ బూజలుగొని స్థిరబుద్ధి మంత్రి । ప్రీతి మీకన్య నపేక్షించి యిటకు
మా రాజపుత్రుఁ డీమానధనుండు । చేరవచ్చెనటంచుఁ జెప్పినందులకు
ననురూపముగఁ దనయభిమాన మేది । కొను కన్యకామణిఁ గోరి వచ్చితిని
అని తాను దెల్పిన నారాజవరుఁడు । తనకన్నెయున్న యంతఃపురంబునకు
వగువారిఁ బంచినఁ దద్వచనములు । మగువకు దెల్పి రమ్మగువ హర్షించి
కామినిమాన మొక్కఁడు గాఁగలఁడు! యీమాట యతిసూక్ష్మ మెఱుఁగువారలకు
నేనె భో నామాన మేలెడిదాన । నీనుడి తెలుపుడా నృపకుమారునకు
అని చెప్పిపంచిన నమ్మాట మాన । ధనునితోఁ దెల్పిరి తండ్రియు వినఁగ
వనితనామము మానవతియని తెలిసి । కొనుట నక్షత్రానుకూల్యంబు లరసి
పరిణయలగ్న మేర్పాటుచేసికొని । మరల రాజసుతుండు మాహురీపురికి
చనుదెంచి హితబంధుసచివా ప్తయుక్తి!జనకుఁ దోడ్కొనివచ్చి సకలోత్సవముల
మానవతీవధూమణిఁ బెండ్లి యాడి । యానాల్గుదివసంబు లరిగినపిదప
కారాదు స్త్రీసమాగమ మాఱునెలలు । దీక్షక యొకవ్రతస్థితి యిదియనుచు
మామగారికిఁదెల్పి మణికేతుతోడ । నామానధనుఁడేఁగె నాత్మీయపురికి
నరణమ్ముగొన కిట్టులరిగి యేడాది । జరిగినపిమ్మట జనకునసుజ్ఞ
పడఁతిఁదోడ్కొనియిదెపర తెంతుననుచు! నొడివిమిత్రాప్తసందోహంబుగొలువ
సౌరాష్ట్రదేశంబు సరగునఁజేరి । వారల నొకచోట వసియింపఁ బనిచి
నవరత్నఖచితకుండలములు చెవుల । నవురొంద నిటలదేశమునఁ జూపట్టు
పట్టెవర్ధనముపైఁ బట్టెడతులలు । పెట్టి జన్నిదములు పిడికెడుపూని
వలిప నీర్కావిధోవతి పింజపట్టి । తళుకుటంచులు ప్రపదములానఁ గట్టి
సరిగకుళ్లాయిమస్తమున ధరించి । సరిలేనిహొంబట్టు శాలువుగప్పి
ఘన విద్వదాకారగరిమ శోభిల్లఁ । దనచంక నొక్కపుస్తకము వహించి
బ్రహ్మవర్చస ముట్టిపడ నేగుదెంచి । బ్రహ్మయో యితఁడని పౌరులీక్షింప
నీరీతి ద్విజరూపమేపార మామ । గారి పురోహితాగ్రణియింటి కరిగి
యతనికి భక్తి సాష్టాంగం బొనర్చి । యతనిచేఁ బూజితుండై యర్హభంగి

ననియె మహాత్మ యార్యావర్తదేశ । మునను౦డి వచ్చితి మురహరిశర్మ
నాపేరు చదివికొన్నాఁడ శ్రుతుల్ మ । హాపురాణజ్ఞుండ నదిగాక శాస్త్ర
వైదుష్యగలదు కేవలతీర్థవాంఛ । నీదిక్కునను జరియించి మాపురికిఁ
జనఁ ద్రోవగనక యిచ్చటికి వచ్చితిమి । యనిన రాజపురోహితాగ్రణి పలికె
శ్రమము దీఱంగ సప్రాణించికొనుఁడు । మము గృతార్థులసేయ మాగృహంబునకు
నేతెంచితిరి కదా యిటభక్తి సలిపి । క్ష్మాతలేంద్రునిఁ జూడ మాపటివేళ
అందాఁకఁ జనుదెంచి యాశీర్వదించి । సందీప్తశాస్త్రప్రసంగంబు గొంత
గావించి యతనిసత్కారంబు వడసి । పోవలెనన మంచిబుద్ధి మీరేమి
యానతిచ్చిన నట్లులాచరింతు నని । యానృపతనయుఁ డాయన నివాసమున
నాఁడు మజ్జనభోజనము లొనరించి । నాఁడేలు రాజుచెంతకు మాపటింత
నాసాధుమణితోడ నరిగి పైఁబసపు । పూసిన టెంకాయఁబూని సమీప
గతుఁడైన నారాజు కనుగొని లేచి । యతిభక్తి నమ్రుఁడై యర్హాసనమున
నివసింపఁజేసిన నెమ్మివసించి । వివిధపూజలుగొని వేదమంత్రములు
ననువొందఁ బఠియించి యాశీర్వదించి । తనచేతిటెంకాయ తరువాత నిచ్చి
సంగతోక్తులు సొంపొసంగ శాస్త్రప్ర । సంగంబు గావింపఁ జాల హర్షించి
యల్లుఁడౌ టెఱుఁగక యతఁడు మనీషి । వల్లభుండనియెంచి వసుధేశ్వరుండు
అతని నామము దేశ మల్లపురోథ । యతనిచేఁ దావిని నట్లెఱింగింప
భాగ్యమాయె మఱేమి బ్రాహ్మణప్రవర । యోగ్యుఁడవదిగాక యుక్తిమంతుఁడవు
రవితేజ! భారతరామాయణములు । వివిధపురాణముల్ విన నిచ్చఁగలదు
మీచేత వినియెద మీరిందునిలిచి । వాచాలకతఁ దెల్పవలెనని వేఁడి
ధనవస్త్రభూషణోత్కరము లర్పింపఁ । గొని సమ్మతించి యక్కుహనాద్విజుండు
తన భార్యచిత్తంబు తాను శోధించు । పని కర్హము పురాణపఠనం బటంచు
మంచిలగ్నంబున మఱునాఁడె యుత్సాహించి రామాయణంబెలమిఁ దెల్పుటకు
పూని ప్రసంగింప భూపాలునాజ్ఞ । మానవతీకాంత మాతయుఁ జెలులు
తాను నవ్వలనుండి తగుభక్తి వినఁగ । నానాఁటి కాతఁడన్నగరి లోపలికి
పోవుచు వచ్చుచుఁ బాలఁతులు పూజ । గావింప వింత లేక చరింపుచుండె
నంతఃపురమున నిట్లతఁడు పురాణ । మింతయుఁ బ్రౌఢిమ నెఱిఁగింపుచున్న

కొన్ని మాసముల కక్కువలయాధీశుఁ । డున్నప్రోలికిని మదోత్కటుండనెడు
నతని మేనల్లుఁ డుద్యదనేకసైన్య । యుతుఁడయి దిక్కులనున్న భూవిభుల
బలిమినిర్జించి కప్పములుగ్రహించి । యల మేనమామకన్యను మానవతిని
పరిణయంబగు వాంఛ భరియించి వచ్చి । పురబాహ్యగత వనభూమిని విడిసి
జవనాశ్వుచెంతకు సచివునిఁబంప । భువనమోనపురంబున కాతఁ డరిగి
పేరోలగంబున్న పృథివీశుఁ జేరి । యారాజు మన్ననలంది సొంపొంది
యుచితాసనమునఁ గూర్చుండి యిట్లనియె। ప్రచురవిక్రముఁడు మీ భాగినేయుండు
అల మదోత్కటుఁడు నానావనీశ్వరుల । గెలిచి దిగ్భాసితకీర్తిచేఁ బొలిచి
మానవతీకన్య నిమతఁ బెండ్లాడ । గానెంచి మీసముఖమునకు నన్ను
బనిచె మేనల్లుండు పటుబలాధికుఁడు । ఘనవాహభోగభాగ్యధురంధరుడు
అతనికంటె సమర్థుఁ డర్హుఁడౌనట్టి । పతి గలండోటు! నీబాలిక కనినఁ
జెలునవ్వునవ్వి యాత్మీతినాథుఁ డనియె । నెలుగరో నాపుత్రి నేడాదినాఁడె
మానధనుండను మహినాథసుతున । కేనిచ్చి పెండ్లి సేయించిన తెఱఁగు
పరిణయంబైయున్న బాలిక మరలఁ । బరిణయార్థము వేఁడు బాంధవుల్ గలరె
తనకు గావలసినఁ దానల్లనాఁడె । నను బల్కరించి కన్యకఁ బెండ్లియాడి
పోవలదంటినె! పొలఁతులు తనకు । వేవేలుగలరు మున్ వెలఁది నిమ్మనుచు
నడిగించెనే యెన్నఁడైన నిదేమి । కడపగ మ్రింగిన కళ్లకుఁ జవులు
వేఁడునే యెటువంటి వెఱ్ఱివాఁడైన । నేఁడేటిచింత మీనృపశిఖామణికి
నీ కార్యమెఱిఁగించి యిటకుఁదోడ్తెమ్ము । రాక దవ్వుల లాఁతిరాజు చందమున
పురబాహ్యమున వసింపుట పాడియగునె! । యరమరసేతురే యని మంత్రిమణికి
గంధమాల్యాదు లొసఁగటనిచ్చి నీతి । బంధుఁడన్ మంత్రి వెంబడి ననుపుటయు
నతనిఁగూడి మదోత్కటామాత్యవరుఁడు । చతురోక్తి జవనాశ్వజనపాలమౌళి
పలికినపలుకు లేర్పడఁదెల్ప నాతఁ । డలిగి నాయెఱుకలే కన్యభూపతికి
గన్నె నేగతినిచ్చెఁ గలిమియు బలిమి। యెన్నఁడయ్యెను మామ యిదియెట్టులోర్తు
నవమతిచేసె నన్నతనిప్రోలతని । భవనంబు ముట్టుకోల్ పట్టి రాజ్యంబు
గైకొన కేనూరకయ యేలపోదు । నీ కార్యమెఱిఁగింపు మీవని పలుక
జవనాశ్వభూపాలు సచివుఁ డిట్లనియె । సవినయోక్తుల నీభుజాశౌర్యమహిమ

మామపైఁజూపుట మర్యాదయగునె । ధీమంతుఁడవు నీకుఁ దెలియనిదొకటి
యున్నదె! సైరింపుమోయన్న యొక్క । కన్నియకొఱకింత ఘాత సేయుదురె
యిన్నినాళ్లాయె నీ వీకన్నె నొసఁగు । మన్నది గలదె? నేఁడాత్మ నిదేమొ
యొకచింతపొడమి తెంపూన నెంచెదవు । వికటభావము మాని వీటికి వచ్చి
యత్తమామలఁగని యందుండి వారి । చిత్తంబు లలరించి సిరులుప్పతిల్ల
బహుమానములుగాంచి పఱతెంతుగాక । మహినాథ! యని పెక్కుమాటలు దెలుప
నవివిని సైపక యతని గర్జించి । యవివేకమతిగాన నవలఁ ద్రోయించి
శకలాటఘోటఘూర్జర సింధురాజ । నికరంబు వినఁబల్కె నేఁటరేపటనె
జవనాశ్వు పురము రాజ్యము గొనవలయు । జవనాశ్వకరిరథసహితులై మీరు
కోట నల్గడల వంకుల నానికొనుఁడు । చేటుపాటిలుఁగఁ డీక్షితిపతి యనుచు
దారుణనిస్సాణధణధణంధణమ । హారావములు మద్దెళావళిజనిత
తతధింధిమింధిమిధ్వానముల్ శంఖ । శతకభుంభుంభూంప్రచండఘోషములు
కేతనపటపటాత్కృతులు తురంగ । జాతహేషలు మదస్తంబేరమోగ్ర
చటులఘీంకారముల్ స్యందనస్ఫురిత । పటుఘంటికార్భటుల్ భటసింహనాద
పటలంబు బ్రహ్మాండభాండమ్ము నిండ । నటఁ గోటనలుగడ లాక్రమించుటయు
నామూర్ఖు వృత్తాంత మంతయు మంత్రి । చే మున్నువిని కొంతచింత వహించి
జవనాశ్వమేదినీశ్వరుఁ డాప్తబంధు । నివహంబుగూడి దీని కుపాయమేమి
కఠినచిత్తుఁడు మదోత్కటుఁ డాప్తులెల్ల । శత్రులు మహాచమూసమితితోఁగూడి
బహుదేశముల నొరిల్ పఱతెంచినారు । గహనంబు వారితోఁ గలహింప మనకు
నుచితోక్తి వేఁడిన నూకొనఁ డతఁడు । కుచరితుం డిఁక నేమొకో యనుచున్న
వేళ వేఱొకదూత వెసఁబిల్చి మామ । పాలికిఁ బనిచె నప్పురుషవర్తనుఁడు
పనిచిన జవనాశ్వుపాలికి వచ్చి । యనియె దూతమనుష్యుఁ డవనీశ ! వినుము
మేనల్లునకును గూర్మికుమార్తె నిచ్చి । తేని కోపముమాని యీక్షణంబుననె
సేనలఁ దివియఁబంచి స్వదేశమునకు । దాను బోయెద నిది తథ్యం బటంచు
దెలుపుచున్నాఁడిది స్థిరబుద్ధిఁ దలఁచి । పలుకు మిమ్మాటకుఁ బ్రత్యుత్తరంబు
నావిని సభికులంద ఱిదేటిమాట । లీ వసుంధర విన మిట్టిదురుక్తి
యొకనిఁ బెండ్లాడినయుత్పలగంధి । నకట! గోరెడు దుర్మదాంధులు గలరె

పరిణయశ్రీగన్న బాలిక నెటుల । ధరణీశ్వరుఁడొసంగుఁ దానెట్టు లెనయు
నని పెక్కువిధముల నందఱుఁబలుక । విని దూతఁగని ధరావిభుఁ డిట్టులనియె
గారానిపనిఁబూని కఱకులుపలుక । నీరానివస్తువు లిచ్చుటయెట్లు?
పరకాంతఁగోరిన పాపవర్తనుఁడు । దురములో విజయమొందుట దుర్లభంబు
నెఱుఁగనయ్యెడి నీఁకనేల రేపటికి । నరుణోదయమువేళ ననికి వచ్చెదము
ఇమ్మాట మీదొర కెఱిఁగింపుమనుచు । నమ్మహీశుఁడు భూషణాదులొసంగి
దూత నంపించె నద్దూతచే నతఁడు । మాతులు నుడివిని మసలక యుండె
నాఁటి మాపటిపూట నరనాథపుత్రి । పాటి యెఱుంగని భావ దుర్ణయము
వాని రాయిడికి నోర్వని తండ్రికలఁక । తా నదివిని యేకతంబున నున్న
జనకునిపాలికిఁ జనిమ్రొక్కి యతని । యనుమతి శయ్యచెంతను గూరుచుండి
నానిమిత్తంబున నరనాథచంద్ర । యీనెగులొదవె మీకిందులకేల
వనటఁజెందెద రొకవంచనోపాయ । మున మదోత్కటుగర్వము హరించుదాన
నాపనికై మురహరిభట్లఁ గొంత । సేపు నాచెంత వసించునట్లుగను
సెలవియ్యవలయు నాసేయు కార్యంబు । తెలిపెద రవల సందియమేల యనిన
నమ్మ! కానిమ్మని యప్పురాణజ్ఞు । సమ్మతిఁ బిలిపించి స్వామివారింత
తడవు నాపుత్రిచెంత వసింపుఁడనుచు । కడఁగి ప్రార్థించినఁ గానిమ్మటంచు
నాపద్మనయనతో నంతఃపురంబు । లోపలికరిగి తళుకడాని పసిఁడి
గద్దియనున్న యాఘనుని చెంగటికి । ముద్దియవచ్చి కేల్మోగిచి యిట్లనియె
సద్యఃప్రసన్నతాసన్నస్వభావ! । విద్యానిధాన! నావిన్నపం బొకటి
యాలకింపఁగ వలె నల మదోత్కటుని । పాళెంబునకు మీరుపయనమై కదలి
యారవ్వకాని నేకాంతంబునందుఁ । జేరి యీరేయి నచ్చిగురాకుబోణి
నినుగూడి వర్తించు నీవిందు నిలక । చనవలె మఱునాఁడె సైన్యమ్ముతోడఁ
బరకాంతనగుట నీపని రహస్యముగ । నెఱిఁగింపఁబంచితి నిది మనంబునకు
సమ్మతంబైన నిశావేళ వత్తు । నమ్మికయిమ్ము దుర్ణయము సేయనని
యిమ్మాట యెవ్వరి కెఱిఁగింపవలదు । నెమ్మదినిడుమని నేఁబల్కినట్టి
పలుకులుగాఁ బల్కి భాషాప్రమాణములుగొని యతివేగమునను రావలయుఁ
బనిపంపె నీరాచపడుచని కోప । మునుపకుండెడిదని యుపచరించుటయు

మనసు కలుక్కన మాయాద్విజుండు । వనితల నమ్మఁగావచ్చునే యకట
తనమాన మెప్పుడు దాఁగాచికొందు । ననియె సత్యంబేడ దనృతోదరులకు
నిది జంతయవనేల యిప్పుప్పన్కెల్లఁ।దుదముట్టఁగని మీఁదఁదోఁచిన యటుల
నాచరించెదనని యయ్యింతిమోము । చూచి యాదంభభూసురుఁ డిట్టులనియె
మంచియుపాయమ్ము మదిఁదలంచితివి । కాంచనగాత్రి! యీక్రమమునఁ గాని
యీ డప్పరముదీఱ దీమాటవిన్న । నీడేరెఁ దనకోర్కెల్ల నటంచు
కామాంధుఁడగు మదోత్కటుఁడు హర్షించు।నేమినమ్మక మిప్పుడిమ్మన్న నిచ్చు
వానిచెంతకుఁ బోయివచ్చెద ననుచు । దాని వీడ్కొని వేషధారి రాసుతుడు
తటుకున నమ్మదోత్కటుదండఁ జేరి।పటకుటీరంబులో బహునృపుల్ గొలువఁ
గొలువున్నవానిఁ గన్గొని రెండుజంభ । ఫలము లాశీర్వాదపరిణతి నొసఁగి
దగ్గఱ కురుజవంట యతండు సూప । నగ్గురుమతిశాలి యందుఁ గూర్చుండి
మనుజేశ! మీమేనమామగారింట । చనవుమీఱఁ బురాణసంహిత లెల్ల
దినమును వినిపించు ద్విజుఁడ మాటాడఁ । బనిగలదు రహస్యపద్ధతి ననిన
నక్కుహనాద్విజన్మాగ్రణితోడ । గ్రక్కున నొక్కయేకాంత దేశంబు
చేరి యేమానతిచ్చెద రానతిండు । ధారణీసురకులో త్తమ! యన్న నతఁడు
మానవతీకాంత మాటలుదెలుప । నానందమంది వాఁడంతియచాలు
నొకయింతసేపు నాయొద్దఁగూర్చుండి । సకి ముచ్చటాడిన సకలసైన్యములఁ
దివియించి కేపె నా దేశంబుఁ జేర । నవనీసురో త్తమ! యరిగెద నిజము
నాగురువులయాన నాతండ్రి తోడు । వేగమ్మతో డ్తెమ్ము విమలాంగి ననుచు
బాసలు పెక్కులు పచరించి కత్తి । వేసిదాఁటిన హర్షవివశాత్ముఁడగుచు
పడకింటి విరిమల్లెపాన్పున నొంటి । నుడిగంబు లెవ్వారినుండగానీక
యలబలం బడచి యేకాంతభావమున । నిలువుమచ్చెలి నహర్నిశీఁ దోడితెత్తు
నీకోర్కెలీడేరు నేఁడని పల్కి । యాకించొసంగు రత్నాంబరాభరణ
గంధమాల్యాదులు గైకొనివచ్చి । సింధురయాన కాస్థితియెల్లఁ దెలిపె
తనపోఁగునకుఁజిక్కె దర్పాంధుఁడనుచు।గనకాంగి యలరి యాఘనునితోఁబలికె
నేఁడు ప్రాల్మాలక నిద్దురమాని । వాఁడున్నయెడకు దేవరవారు నన్ను
దోడ్కొనిపోయి యందులవింతలెల్ల । వేడ్కతోఁజూచి నావెంబడి మరల

రావలెనంచుఁ బ్రార్థనచేసి మసల । కావేళ జలకంబులాడి క్రొంజిలుగు
చలువవల్వ ధరించి సముచితాభరణ।ములు దాల్చి యంతకమున్న యేర్పఱిచి
లాహిరివస్తువు ల్బలువుగాఁ గూర్చి । దేహంబు మఱపించు తియ్యనిమదిర
నిండారఁ బసిఁడిగిండిని నించి మూసి।యుండుట నదివేఱె యొకచేఁ గ్రహించి
కపటభూసురు వెనుకనె పోయి పాళె । మవుడు ప్రవేశించి యల మేనబావ
పడకిల్లుఁ జొచ్చినఁ బరితోషమంది । వెడవింటిమన్నీఁడు విరితూఁపు లేయఁ
గడు సొమ్మసిలి దాని గబ్బిపాలిండ్లు।నొడలి క్రొమ్మెఱుఁగులు నుదుటుచూపులును
దిలకించి పులకించి తెలిగంటికోర్కె । ఫలియించె నీవిందుఁ బఱతెంచినంత
రమ్మని కపటవిప్రస మేతయైన । యమ్మానవతిఁ జేరనరుదేర నగుచు
బావ! నీవెప్పటిపాన్పున నుండు । మావిప్రవరునితో నిప్పీటలందు
నేము గూర్చుండెద మించుకసేపు । నీమదితమకమ్ము నిలిపికొమ్మనుచుఁ
బ్రేమగన్పడ నాడి పెండ్లాడియున్న । కోమలి నియ్యక కూడదటంచు
మామపై దండెత్తు మహిపతుల్ గలరె! । యేమనవచ్చు నీయొఱుక యటంచు
దగునేరుపునఁ గొన్ని తచ్చనలాడి । వగకాఁడవౌదు బావా! భోజనంబు
చేసితివే! దప్పి చెందితివేమొ । భాసిల్లు చక్కెరపానకం బిదిగొ
యనువొందఁ బుచ్చికొమ్మని గిండి యొసఁగఁ। గొని యమ్మదాంధుఁడు కుత్తుకబోవఁ
ద్రావె నమ్మదిర యంతయు నిమిషమున । నావేళ నిదురమం పావహిల్లుటయు
లాహిరిఁ జొక్కి మొల్లలశయ్యఁ బ్రాలె । మోహంబు తలకెక్కి మూర్ఛిల్లినటుల
నీవింతఁ జూచితిరే! మహీదేవ । తావఱేణ్య యటంచుఁ దరుణి నవ్వుచును
నొడలెఱుంగక పడియున్న యజ్జడుని । కడకేఁగి తలయంపి గనుపింప నంప
పొది కత్తివాతియమ్ము బరీనఁ దిగిచి । కొదకక మీసముల్ గొప్పగడ్డమ్ము
తలయు రేవులు వాఱఁ దడయక గొఱిగి । సొలవక మసిబొట్లు సున్నంపుబొట్లు
మొగమున నిడి వీనిమూర్ఖత కిట్టి । వగ సేయవలెనుమీ! వసుధామరేంద్ర!
ముగిసె మీసలు గడ్డము వికారమయ్యె । సిగపోయె నికవీఁడు క్షితిపతి ననుచు
నలుగురిలోనున్న నగుబాటుగాదె । తెలతెలవార నిద్దేశమ్ము విడిచి
యేకాకియైపోవు నెక్కడికేని । నీకడ నిలనేల యేగుదెంచనుచు
మహీసురాకృతినున్న మగనిఁ దోడుకొని । రహిమీఱ నప్పతివ్రత యింటికరిగె

దాని పతివ్రతాధర్మంబు చూచి । మానధనుండు సమ్మదవార్ధిఁ దేలె
తెలతెలవారఁగా దేహంబు తెలిసి । యల మదాంధుఁడు నిల్వుటద్దంబునందు
తనమోము గనుఁగొని తహతహఁ జెంది । చెనఁటి యంతయు నేర్చెఁ జీ ల్లల్ల! యిట్టి
వైకృతంబున సరివారలు గేర । నేక్రిందఁ జరింతునింక నటంచు
పరిపరివగలఁ జేడ్పడి యట్టిలేచి । మురిమురిచీఁకటి ముసుఁగు వేసికొని
కలఁకతో నెవ్వరుగానక యుండఁ । దొలఁగి యప్పుడెపోయె దూరదేశంబు
తనువున భూతిపూఁతయు మెడలింగ । మును గావిబట్టలు మొలనుధరించి
కకపాలమూని జంగమువలె వాఁడు । సకలదేశమ్ములఁ జరియింపుచుండె
వానిఁగానక తెల్లవారిన వెనుక । సైనికుల్ హితులును సకలభూపతులు
మామ యింటను బరామర్శించి యచట । లేమియు దెలిసి బల్మిదొరంగి పురికి
పోయెనో! దొరలేనిపోటల మసల । కీడెదనని తమయిచ్చగాఁ జనిరి
తనపుత్రిచే మగోత్కటుఁడు సిగ్గుటుట । విని జవనాశ్వుండు వేడుకఁ జెంది
వెనుకఁజిక్కిన సేనవెన్నాడి తఱిమి । ఘనభూషణాంబరకరిరథాశ్వములు
కొని గెల్పుఁ జేకొని కూఁతురి బాగడి । కొనుచుఁ బురాణసద్గోష్ఠి రంజిల్లె
తనభార్య హృదయశోధన మాచరించె। గనుక వేడుకఁగూడి కలఁక పోనాడి
మానధనుండు కోమలి నేలు కాంతు । మానసమునఁ బొడమ నృపాలుతోడ
భూపాల! యూరికిఁ బోయివచ్చెదను । నీపజ్జ సుఖముచెందితిఁ గొన్నినాళ్లు
అనుమతి యియ్యవే! యనియాతఁ డొసఁగు । కనకభూషణవస్త్రగంధమాల్యములు
నెలమిఁ గైకొని పురోహితున కొసంగి । యల మానవతికిఁ దదంబకుఁ జెప్పి
చని తనవాఁడున్న స్థలముఁ బ్రాపించి । ఘన గజరథతురంగమ భటావళులు
నిరువంకఁ గొలువగా నెప్పటిరూపు । ధరియించి నవమన్మథవిలాసుఁ డగుచుఁ
గొన్ని దినమ్ములకును దనమామ । యున్న ప్రోల్ చేరి బాహ్యోద్యానసీమ
విడిసిన నవ్వార్తవిని జవనాశ్వుఁ । డడరెదు వేడ్క మహావైభవమున
నల్లున కెదురేఁగి యతిభక్తి యుప్ప । తిల్లనాతఁడు మ్రొక్క దీవన లిచ్చి
కవుఁగిటఁ గదియించి ఘనరథారూఢుఁ । డవు నమ్మహాత్మతో నాత్మీయపురముఁ
జేరి భద్రాసనాసీనునిఁ జేసి । వారి యోగక్షేమవార్తలు నడిగి
యంతఃపురంబున కతనితో నేఁగి । యింతికిఁ గూతురి కింపుసంధిల్ల

జామాతతోడ మజ్జనభోజనాదు । లామహీశుఁ డొనర్చె నత్యాదరమున
నీరీతి నల్లునినింట నుంచికొని । యా రాజదేవేంద్రుఁ డట నొక్కనాఁడు.
ఆ మానధనునితో నాత్మజఁ గూర్పఁ । గామించి తగు నిషేకముహూర్త మొకటి
హితపురోహితునిచే నేర్పడఁ దెలిసి । యతివైభవమునఁ బ్రయత్నంబుఁ జేసి
యమితదానములు బ్రాహ్మణభోజనములు । క్రమమొప్ప సేయించగా నాఁటిరేయి
బంగారుమేడపైఁ బడకింటిలోనఁ । జెంగల్వపాన్పునఁ జెలిఁ గరంగించి
పరిపరిరతులచేఁ బ్రౌఢఁ గావించె । వరున నాసతి మూఁడువలపులు వలచె
రతిమన్మథులవలె రమణియు రమణుఁ । డితరేతరప్రేమ నినుమడించంగఁ
గొన్నాళ్లు వివిధభంగుల వినోదించి । రన్నాతిఁ దోడ్కొని యాత్మీయపురికిఁ
జన నిచ్ఛగించిన జామాత తలఁపు । గని జవనాశ్వంబు కరిరథహరులు
పరిపరివస్తువుల్ పరిమళపేటు । లరణంబుగా నిచ్చి యాత్మజామణికి
పసవు నిమిత్తమై పసగల యూళు । లొసఁగి దాసీదాసయూథంబుతోడ
బహుపరిజన వీరభటసహస్రములు । రహినిచ్చి మాయమ్మ! రతనాలబొమ్మ
బుద్ధులప్రోడవై భూమిలోఁగడు ప్ర । సిద్ధిఁ జెందుము నీ సుశీలసంపదల
పెక్కండ్రుతనయులఁ బ్రేమతోఁగాంచి । చక్కగా నేలుము సామ్రాజ్యమనుచు
జాలిమై దీవించి పనుపఁ గన్దోయి । జాలువారెడు నశ్రుజలధారతోడఁ
గన్నతల్లికి మ్రొక్కి కౌఁగిలివడసి । యన్నాతి వీడ్కొని యాత్మేశుఁగూడి
కనకరథంబెక్కి కటకంబు వెడలి । వెనుకముందర సైన్యవితతులు గొలువఁ
చనుచుండి రొకదివసంబున రాజ । తనయుఁ డాసతిఁజూచి తరుణి యిద్దఱము
నుచ్చైశ్శ్రవముఁ బోలు నొక తేజి నెక్కి । ముచ్చటాడుచు సేన ముందరఁ బోవ
వెనుకఁబోవగఁ జాలవేడుక పుట్టె । ననినఁ గానిండని యదిసమ్మతించె
నంతట రాజాజ్ఞ నంకొక్క సాది । వింత కాంతులమించు విడికెంపురవల
జిగిహెచ్చు కళ్యంబు చికిలివజ్రాల । మొగచుట్టు సుప్పాణిముత్యంపుఁబనుల
మచ్చైనజీనంబు మేటికిరీటి । పచ్చరాపల్లంబు బంగారుతరటు
గొనబునీలముల రక్కొనుతలాటంబు । ఘనమైన గోమేధికపుదృష్టిదండ
మినుకు వైడూర్యంపు మేలంకవన్నె । యనువందు సింగాణి యస్త్రసంపూర్ణ
తూణంబు సరసబంధురగతుల్ గలిగి । రాణించు నొకయశ్వరత్నంబు దెచ్చి

ముందరనుంచి కేల్మోగిచిన రాజ । నందనుఁ డరవిందనయనతో నెక్కి
సేనల ముందరఁ జెచ్చెరఁ బనిచి । మానినితోఁ దగుమాట లాడుచును
వెనుక నొంటిగఁబోయె విధివశంబెవరి । కినిఁ ద్రోయరాదు పంకేజాక్షి! వినుము
ఈరీతి నడవిలో నిద్దఱుఁజనఁగ । సారసాక్షికి దప్పిజనియించి నీళ్లు
కావలె ననిన నక్కడ నింతి డించి । యావలితరువున నశ్వంబు గట్టి
బంగరుగిండి చేపట్టి నీళ్లకు । రంగట నరయుచు రాసుతుం డరిగె
పతి యొంటిఁ దనుడించి బలుకానఁ జొచ్చి।యతిరయంబునఁ జన్న నతివ భీతిలుచు
ప్రాణేశు నేనేలఁ బనిచితి నొంటి । గా నేలనిల్చితి! గహనంబునందు
కటకట దప్పియెక్కడఁబుట్టె! దైవ । ఘటన యేమో! బుద్ధికలఁగెడి ననుచు
నడలుచునుండగా నచ్చోటి కొక్క । గడుసుకిరాతుండు కామాతురుండు
భల్లాతుఁ డనువాఁడు పఱతెంచెఁ జేత । విల్లునమ్ములు పూని వేఁటవేఁపులును
జనుదేర, వచ్చి యాసౌందర్యవతినిఁ । గనుగొని యాశ్చర్యకలితుఁడై పలికె
నెవ్వరిదానవే! యిగురాకుబోణి । యివ్వనంబున నొంటినేల యున్నావు
నీ నామమెయ్యది నీకులంబేమి । నీనాథుఁ డెవ్వఁడు నిజముగా నిపుడు
వినిపింపుమనిన నవ్వేలఁది సౌరాష్ట్ర। జననాథు కూఁతుర సౌవీరనృపతి
మానధనుండు నామగఁడు మానవతి । నానొప్పుదాన నానాథుఁ డిచ్చోట
జలకాంక్షియై పోయెఁ జతురంగబలము । లలబలంబులు మీఱ నరిగెడి నవిగొ
యిదెవచ్చు నాపతి యీవెవ్వరనిన । మదమత్తుఁడై వాఁడు మదిరాక్షి దనకు
నిక్కట్టునను జిక్కె నిప్పుడె దీని । గ్రక్కునఁ గొనిపోయి కలియుదు ననుచు
నుల్లంబునఁ దలంచి యువిద! నాపేరు । భల్లాతుఁడంద్రు నాపాళె మిచ్చటనె
యెల్లకిరాతుల కకిమీఁడ నేను । పల్లవాధర! భోగభాగ్యసంగతుఁడ
బహుధనాఢ్యుఁడఁ బ్రాణపదముగా నిన్ను।రహి నేలుకొనియెద రమ్ము నావెంట
నని పట్టికొనిపోవ నండకు రాఁగ । దన పతియునురాక తడసె సేనలును
దూరంబుచనె మదాంధుఁడు వీని నిచట । వారింపఁ గలిగినవా రెవ్వరనుచు
నలివేణి తలఁచి నన్నంటక యవల । నిలువుము వచ్చెద నీవెంట ననుచుఁ
గాంత ధీరోదాత్త గావున వానిఁ । జెంతఁ జేరగనీక చెచ్చెరఁ దేజి
నెక్కి చాటకుఁదోల నెడచొచ్చి బోయ । యెక్కడికేఁగెద వింతి! నీవనుచు

ఖత్తులాణము వాఁగె గ్రహియించి పొదల। మొత్తంబులోఁ బడి మొఱకుఁదనానఁ
జెట్టులు గట్టులుఁ శిలలు వాగులును । బుట్టలుగడచి కొంపోయి తానున్న
పాళెంబు చేర్చినఁ బణఁతి చిత్తమునఁ । దాలిమివీడక తల్లడపడక
వానితో నసిమె నోవనచరప్రవర! । నీనిలయమున న న్నిఁలుపగా వలదు
ఏ నొకవ్రతము వహించి యుండుదును । గాన వనస్థలిగాని గేహమున
వసియింపనొల్ల నావ్రత మాఱునెలలు । విసువక నాకుఁ గావింపఁగా వలయు
నేకవారము భుజియింతు హవిష్య । మేకాగ్రనిష్ఠ వహించి నిత్యంబు
బ్రాహ్మణపూజ సల్పఁగవలెఁ దగిన । బ్రాహ్మణజనసపర్యయు సేయవలయు
గారీవ్రతంబిది కడతేరుదాఁక । కోరికఁ బురుషునిఁ గూడగా రాదు
చందనమాల్యముల్ సమకూర్పవలయు । నెందఱు బ్రాహ్మణు లేఁగుదెంచినను
నందఱి కిష్టమృష్టాన్నముల్ పెట్టి । పొందుము కడపట భోగభాగ్యములు
బలిమిచేసితివేనిఁ బ్రాణముల్ విడుతు । తెలియుము నావ్రతస్థితి నూతినీళ్లు
వెల్లువఁబోనె! నీవీఁటిలోఁ జిక్కి । చెల్లంబో! యికనెందుఁ జేరెద ననుచుఁ
బలుకఁ బుళిందభూపతి సమ్మతించి । మెలనాగఁ దనయింటి మెలఁదోఁట నునిచి
వలసిన ధనధాన్యవస్తువు లొసఁగి । పలుమంది ద్విజులను బ్రాహ్మణస్త్రీలఁ
బిలిపించి వారి కభీష్టవస్తువులు । పలుమారు నిచ్చుచు భక్ష్యభోజ్యములు
బెరయ మృష్టాన్నముల్ పెట్టుచు నిటులఁజరిపెఁ గాలము వ్రతచ్ఛలమున నతివ
అంత నక్కడ నీళ్లకరిగిన యవని । కాంతకుమారుండు గహనాంతరమున
బహుదూర మరిగి యప్పట్టున నొక్క । మహితాంబుపూర్ణమౌ మడువు నీక్షించి
యానిర్మలోదకం బలఁతేఁబోఁ ద్రావి । చానకు గిండితో జలములు గొనుచు
పరువునవచ్చి యప్పట్టున సతిని । తురగంబు గానక తొందుడు కొంత
చని చూతునని మెల్ల జాడలు వెదకి । కనుపడకున్న నక్కడ త్రోవఁదప్పి
భ్రాంతిఁజెందుచుఁ గాడుపడి నలుగడల । నెంతయుఁ దిరుగుచు నిమ్మహాటవుల
నెందని శోధింతు నెక్కడ కేఁగి । యిందునిభానన నీక్షింతు నేను
ముందరఁజను సైన్యముల జాడఁ బట్టి । చందనగంధి తాఁ జనియెనో యనుచు
నమ్మార్గమునఁ జని యటఁజను భటుల । నెమ్మి నీక్షించి కంటిరె! వాలుగంటి
యిచ్చోటి కరుదెంచెనే యని యడుగ । వచ్చుటలేదు భూవల్లభ ! యిటకు

మిమ్మొడఁబాసి యమ్మోలతయెందరిగె । నిమ్మహాటవి నన్న నెటఁగింతు మీకు
వెనుక మీరరుగుఁడు వెసనని వారిఁ । బనిచి సౌరాష్ట్రభూపతి యూరుసేరి
యక్కడి ప్రజలచే నలివేణి లేమి । నిక్కంబుగా విని నెగులొంది కుంది
యిఁక నేమిసేయుదు నింటినిఁ బాసి । యకట యొటిగి నూరి కరుగంగరాదు
మామయింటికిఁ జన్న మాటలు వచ్చు।కోమలి నెవ్వఁడు గొనిపోయె నొక్కొ
సతి నొంటిగా డించిచనిన రాఘవుని । కతయయ్యె మోస మేఘనులకు వచ్చు
నెవ్వరిచెంత కేనేల పోయెదను । నవ్వరే! వినువారు నాబుద్ధి కనుచు
నారాజసుతుఁడు దేశాంతరంబరిగె । నారూఢగతి భిక్షుకాకృతిఁ బూని
మునుపుగాఁజని సైన్యములు మానధనుఁడు।వనజాక్షిగానక వనములోఁ దిరుగు
చందంబు మాహురీశ్వరునకుఁ దెలుప । నందను వెదుకఁ గొందఱఁబంచె నతఁడు
జవనాశ్వుఁడును పుత్రి జామాత నరయ । నవని నల్గడలకు ననిపె చారులను
అంత నాలుగునెల లరిగినపిదప । కాంత లుబ్ధకునింటఁ గలధనంబెల్ల
వ్రతదంభమున విప్రవరులకు నొసఁగి । యతనియిల్ శుద్ధశూన్యంబు గావించె
కుడువక కట్టక కూర్చినధనము । పడఁతిపాల్ చేసితి భ్రాంతిచే ననుచు
వాఁడును మదిలోన వగచుచునుండె । నాడువారికి బ్రమయనివారు గలరె!
ధనహీనుఁడైన లుబ్ధకు కొల్వువిడిచి । చనిరి బోయలు పరస్థలముల కపుడు
భల్లాక్షునింట శోభనగాత్రి రాజ । పల్లవాధర చిక్కుపడి యున్న తెఱఁగు
ఆయింతి యన్నదానాది దానముల । సేయుచు నబ్బోయఁ జెందకయున్న
సౌశీల్యమును విప్రజనులచే హూణ । దేశాధిపతి బలద్విపుఁ డాలకించి
వైరిగావున వానివధియించి యప్ప।యోరుహాననఁ దెత్తు నుద్వృత్తి ననుచుఁ
జతురంగబలయుక్తిఁ జని యొక్కరేయి।యతని పాళెముఁ ముట్టి యహితులఁ గొట్టి
పాళెంబు చూఱలుపట్టించి వాని । యాలయంబును గొల్లలాడించి పొంచి
పట్టఁబోయినఁ బట్టువడక వాఁడులికి । యట్టె సందులఁబట్టి యడవిలోఁ బఱచె
వానిగానక హూణవసుధేశ్వరుండు । మానవతీవఘూమణి యున్నయట్టి
యెలపోఁటకేగి ప్రాణేశ్వరి వగుచు । నెలనాగ నన్నేలవే! యని బలిమి
సేయవచ్చిన నోరసిలి యోయి రాడ! । డాయకు నన్ను దృఢవ్రతం బొకటి
కల దాఱునెలలైనఁ గడతేరు పిదప । ఫలియించు నీకోర్కి పదరకు మనుచు

నల బోయతోడ మున్నాడి నట్లాడ । వలపున నన్నియు వాఁడొప్పికొనిమె
మేలి యాణి సుపాణి మెఱుఁగుముత్యముల । పాలకిమీఁద నబ్బాలిక నునిచి
కొనిపోయెఁ దానేలు ఘోట్టాణపురికిఁ । గొనిపోయిదాని నిష్కుటవీధి నిలిపె
ముకురాస్యపైఁగల మోహంబు వలన । సకలంబు గోల్పడి శబరుఁడాలీల
పాళెంబువిడిచి పెన్ భయమున జోగి । వాలకంబునఁ బోయి వసుధఁజరించె
హూణుని తోఁటలోనుండి యక్కీర । వాణి నానాఁటికి వానింటఁ గలుగు
ధనముల మఱిల గోధనములఁ బుచ్చి । కొని ధరాదేవతాకోటి కర్పించె
బంగారుచేటలు భవ్యహారములు । చెంగావికోకలు చీనాంబరములు
సలలిత రత్నభూషణ సహస్రములు । మలయజ మృగమద మాల్యాదికములు
పరమేశ్వరీసమర్పణముగా నిచ్చు । వరుసతో ముత్తైదువలకు నీమమున
నన్నదానమునకు నారాజువీట । నున్న యుగ్రాణంబు లూచముట్టుగను
గొని సెల్వుచేసె నెక్కుడుదానములకు।మునుకొని బొక్కసంబులు రిత్తఁజేసె
భద్రమా నీకని పౌరులకొసఁగి । భద్రేభశాలలు పాడుగావించెఁ
గనక రథాశ్వముల్ గడమ గాకుండఁ । దను నాశ్రయించు పెద్దలపాలు సేసె
నుత్తరిత్తిగ నిట్లు హూణేశు నగరు । రిత్తగావించె నార్నెలలకు మునుపె
ధనహీనుఁడైన యాధరణీశు విడిచి । చనిరి రాణువువారు సరిపోవు నెడకుఁ
గలిమియు బలిమియుఁ గడతేర్చెఁగనక । నలివేణి హూణుని యదటణఁగింపఁ
దలపోసి తమయూరఁ దగువిప్రు నొకనిఁ । బిలిపించి జవనాశ్వపృథివీశు పేరఁ
దనవ్రాల జాబేకతంబునవ్రాసి । పనిచిన నతఁడు భూపతికి నొసంగె
ఆ కమ్మవలన నిజాత్మజ తెఱఁగు । భూకాంతుఁడెఱిఁగి గొబ్బున సేనతోడ
ఘోట్టాణపురిఁ జేరి కోటలోఁ జొచ్చి । పట్టణంబంతయుఁ బాడు గావించి
హూణేశుఁ బట్టంగ నుద్యుక్తుఁడైన । త్రాణలేమి నతండు తలఁగె ముందరనె
తన వశంబుగ హూణధరణీశు దేశ । మును పురంబును గొని పుత్రికయున్న
ముక్కంటి సతిగృహంబునకు రాఁజూచి । యక్కన్య తనతండ్రి కానతయైన
అక్కున నిడుకొని యమ్మ! నీకెంత । యిక్కట్టువచ్చెనే! యేఁడ నీవిభుఁడు
యెక్కడికేఁగెనో యిది దైవఘటన । తక్క కెవ్వరికైనఁ దప్పింప వశమె
నీవు వ్రాసినకమ్మ నేఁజదివికొని । యీవివరంబెల్ల నెఱిఁగియున్నాఁడ

మంచి దిక్కెడ నేల మనపురంబునకు । చంచలేక్షణ నీవు చనుదెమ్మటంచుఁ
గన్య రథారూఢఁ గావించి వివిధ । సైన్యసమేతుఁడై జవనాశ్వుఁ డరిగి
తన ప్రోలుచేరి యాత్మజ నాదరించి । పనిచె నల్లునియున్కిఁ బరికింపఁ జరుల
నల హూణవిభుఁడు రాజ్యము గోలుపోయి । చెలువేది జంగమై సీమపై నరిగె
వింటివే! తరువాతి వృత్తాంత మతివ । దంటనాఁ జను మదోత్కటుఁ డనువాఁడు
భల్లాక్షనామలుబ్ధకుఁడును హూణ । వల్లభుండును నిట్లు వైభవం బెడలి
జోగులై ముగురును క్షోణిఁ ద్రిమ్మరుచు । బోగులఁగని మనంబున దుఃఖపడుచు
శివరాత్రి యేతేర శ్రీశైలమునకు । మువ్వురును జని జంగములవలె నునికి
హరహరా! యని మల్లికార్జునుఁ బొగడి । హరభక్తులొసఁగు భిక్షాదులఁ దినిసి
యొక్కరొక్కరె దైవయోగంబు కతన । నొక్కదిక్కునఁ గూడి యోసరించకయె
పఱతెంచియొక మంటపమునఁ గూర్చున్న । తఱిమానధనుఁడు ముందర నెయచ్చోట
జంగమాకృతినున్కి సవిధదేశంబు । నం గూరుచుండి ఖిన్నత నున్నవారిఁ
గని యాతఁడనియె నెక్కడనుండి యిటకుఁ । జనుదెంచి రీగురుస్వామి యెవ్వాఁడు
లింగముల్ సిగలఁ దాలిచి భూతి యలఁది । జంగములౌటిది సంప్రదాయంబొ!
క్రొత్తఱికమొ యెఱుంగుట కడిగితిమి । చిత్తంబులం దల్క సేయకుఁడయ్య
అనినఁ దొల్తఁ బక్కీరియైన కేకయుఁడు । తను వినుమని మానధనుని కిట్లనియె
అనఘాత్మ! నేఁ గేకయక్షోణి యేలు । ఘనవిక్రముఁడ మదోత్కటుఁ డనువాఁడ
నా మేనమామ నందనయై తనర్చు । వామలోచన మానవతియను కన్య
మానధనుండను మాహురీశ్వరుని । సూనునిఁ బెండ్లాడి సొంపొందుచున్న
స్థితి యెఱింగియు బుద్ధిచెడి నన్నుపూని । యితరుని కీవచ్చునే! దీని ననుచు
మఱలెత్తి దండెత్తి మాహపాలించు । పురము రోధించినఁ బొలఁతి యారేయి
ముందర నొకవిప్రముఖ్యునిఁ బనిచి । పొందు చేసెదనంచు బొంకి సారాయి
తెచ్చి త్రాగించిన దేహంబుమఱచి । చచ్చినచందాన శయ్యపైఁ బడినఁ
గత్తివాయమ్మున గడ్డంబు మీస । లుత్తరించిన దై మదోద్ధతి తీఱ
సిగగోసి మోమునఁ జెక్కులయందు । వగవగ బొల్లిడి వడి నింటికేఁగెఁ
దెల్లవాఱినఁ దనదేహమ్ము దెలిసి । కల్లరియై యది గావించినట్టి
దుడుకులు గాంచి తుందుడుకు వహించి । సుడిఁబడి యెవ్వరు చూతురో! యనుచు

మునుఁగిడి వేఁగుజామున లేచి సైన్య । విసరంబు రాజ్యంబు విభవంబు విడిచి
యీరీతి జోగినై యిలఁ జరించెదను । నారీతిలకమిట్టి నగుబాటు చేసె
నా తెఱంగిదియన్న నగి రాజతనయుఁ । డాతలనున్న భల్లాతు నీక్షించి
నీవిధంబేమి విన్పింపుమటన్న । నా వనచరభర్త యతని కిట్లనియె
నా మానవతియను నతివయె విపిన । సీమ నొంటిగఁ దేజిఁ జెంతఁ గట్టికొని
బాటలోనున్న నప్పథమున నేను । వేఁటాడివచ్చుచు వెలఁది చెల్వంబు
గనుగొని భ్రమసి చక్కనివార యేయు। వనతూఁపులకు లొంగి నయము దొరంగి
యెవ్వతె వొంటిగా నేలయున్నావు । జవ్వని యివ్వనస్థలమున ననిన
జలము దే విభుఁడేఁగె సైన్యముల్ ముందె। యలబలంబులుచెంది యరిగెడి నదిగొ
వరుఁ డిదె వచ్చె నెవ్వఁడవు నీవనిన । మఱలెత్తి యొంటి నిమ్మగువ చిక్కనని
యల తేజిపై నెక్కి యవ్వలఁబోవ । చలమునఁ బోనీక సరగున వాగె
పట్టి తోడ్తెచ్చితిఁ బాళెంబుచేర । నట్టులఁజేరి యుద్యానంబులోన
నెలకొను వ్రతమను నేమంబుఁబూని । యిలు ఱత్తచేసె నింకేమనువాఁడ
నంతలో హూణదేశాధీశ్వరుండు । కాంతకై వచ్చి నాకటకంబు సొచ్చి
చెలియఁ జూజియుఁబట్టి చెలిఁ గొనిపోయె । నెఱుఁగ నవ్వాలికథ యేనిట్టులైతి
ననిన హూణేశ్వరుం డతనిహస్తమ్ము । మునుకొని తనహస్తమున నప్పళించి
పకపక నగి బోయపాళెంబువారి । యెకిమీడవా! మఱి యేమి బాగాయె
నీవు చెడ్డటుల హూణేశుఁడు చెడియె । నావలికత విను మతఁడెపో! తాను
వ్రత మాఱునెలలని వచియించి యల్ల । సతి ధనధాన్యముల్ సకలవస్తువులు
పౌరులపాల్సేసి భ్రమయించి తండ్రి । గారి రప్పించి నాకటకంబుతోడఁ
గలరాజ్య మంతయుఁ గట్టించి పుట్టి । నిలుఁజేరె పగఱచే నేఁ బట్టుపడక
తప్పించికొన్నది దైవంబె యెఱుఁగు । చెప్పెడిదేమి యా సిలుగులకత్తె
మొగమాయలకుఁజిక్కి మోసపోయితిమి।ముగురను గూర్చెగా! ముండదైవంబు
దక్కనయట్లుండి తటవటల్ చేసి । చిక్కక మనలను జెఱిచె నజ్జంత
చెంతఁ జేరగరాదు చేసంటరాదు । జంత గాదది మహాసాధ్వీమతల్లి
దానిఁ బెండ్లాడిన ధవుఁడెంతవాఁడొ । వానిదే భాగ్యంబు వానిదే ఘనత
అని వారు దెలుప నిజాంగన తెఱఁగు । విని మానధనుఁ డాత్మవికసింపఁ బలికెఁ

బరకాంతఁ గోరిన పాపకర్మమున । సిరులు దొలంగె నిచ్చోటు పాటిల్లె
నింక మీకు శుభమ్మెలెనయు నెవ్వగల । నింకకుఁడన ముప్పు రెలమి నిట్లనిరి
ఇనతేజ ! నీనామమేమి నీవెవ్వ । రనికి యెక్కడ నేడనుండి వచ్చితివి
సిరులు మాకిఁక నెట్లుచేకూరు ననిన । దరహాసమున మానధనుఁ డిట్టులనియె
మానవతీవధూమణి కేను ప్రియుఁడ । దానిఁబాసితి వనస్థలి నొంటివిడిచి
సతిఁబాసి యూరికిఁజనఁగ శంకించి । వెతఁజెంది తిరిగెద వివిధదేశముల
మీరు దెల్పఁగవింటి మెలఁత క్షేమంబు । మీరు హితుల్ గారె మీ కీడులంత
యా కాంతకతమున నైనది గనుక । మీకు రాజ్యములిచ్చి మిముఁ బ్రోదిసేతు
నని వారినూరార్చి యారేయి గడపి । తను వారుపొగడుచుఁ దనవెంట రాఁగ
మఱునాఁడె పైనమై మాహూరీపురికి । నరిగి యమ్మగురితో నయ్యకు మ్రొక్కి
వారుచెందిన దురవస్థయుఁ దన యొ । యారి పాతివ్రత్య మంతయుఁ దెలుప
గుణవతియగు తనకోడలి మహిమ । మణికేతుఁ డాశ్చర్యమగ్నుఁడై పొగడి
ఆ మదోత్కటుని భల్లాతు హూణేశు । ప్రేమ లాలించి వారికిఁ గట్టనిచ్చి
యలంతఁదీఱిచి భోజనాదు లమర్చి । పొలుచు నెప్పటివేషముల వారు గొలువ
మణికేతునృపశిఖామణి పుత్రుఁగూడి । గణుతింపరాని మూఁకల జోక గూడి
భువనమోహనపురంబున కేఁగి యచట । జవనాశ్వనృపతి పూజల సంతసించి
తన మాన మ్మారె తాఁ గాచికొనియె యనఘ నీసుత సాధ్వియని ప్రస్తుతించి
యా మగువ నిమిత్తమై యార్తిఁ జెంది । రీముగురని వారి నేర్పడఁ దెలిపి
యిదిగో! నీమేనల్లుఁ డీమదోత్కటుఁడు । ముదితచే నవమతి మొనసి కీడ్పడియె
ధవళాశ్వుఁడనెడి నీతమ్మునిపుత్రి । నవనీశ! పెండ్లి సేయఁగవలె ననుచు
నాయన కమ్మోహనాంగినిఁ బెండ్లి । సేయించి రాజ్యమిచ్చి బహూకరింపఁ
బనిచి భల్లాతుని పాళెంబొసంగి । ధనకనకాదులఁ దనియించి పంపె
ఘోట్టాణపుర మేలికొను హూణదేశ । పట్టభద్రుండనై ప్రబలు మటంచు
నల బలద్విపుని హృష్టాత్మునిం జేసి । కలిమిబల్మి యొసంగి కరుణ వీడ్కొలిపె
గొడుకునుగోడలిఁగూర్చిసంతోష । మడరంగఁగొన్ని నాళ్లచ్చోటనుండి
వియ్యపురాజుచే వీడ్కొల్పు వడసి । యయ్యవనీశ్వరుం డఖిలసైన్యములు
గొలువ మాహూరికేఁగి కొడుకు రాజ్యమున।నిలిపి కోడలిఁజూచి నెలఁత! నీవలనఁ

బుట్టినంటికిఁ గీర్తిపాడలె నీచొచ్చి । నట్టియింటికి మహాఖ్యాతియు గలిగ
నతి యొక్కరిత మహేశ్వరుఁజెంది ఖ్యాతి । నతిశయంబొంద నీ వాబిడ వలెను
సతియను పేరు ప్రశస్తంబు గాఁగ । క్షితి వెలసితి పతిశ్రీనిధులైన
పుత్రులఁగని శుభంబులు చెందుమనుచు। స్తోత్రంబు గావించి సుఖమున నుండె
ఆ దంపతులు నాయురారోగ్యభాగ్య । రాజితులై పుత్రరాజితో మనిరి
యీకథ వినువారి కిష్టార్థసిద్ధి । చేకురు హరుకృపచే నని చిలుక
సరసోక్తి పుష్పమంజరి కెఱింగింప । నరుదంది యక్కాంత యరిగె లోపలికి
దూతిక చని రాజుతో నెఱింగించె । నాతఁడి నీయితిహాసం బటంచుఁ
బరమేశ్వరుఁడు దెల్పఁ బార్వతి యలరి।తరువాతకథఁ దెల్పఁదగు దేవ! యనియె
ననయపతివ్రతా చరితంబునందు । ఘనత నేకాదశకథ పూర్ణమయ్యె

## విధివిఘాతల కథ

శ్రీవిశ్వపతి దయాంచితమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁగోడఁగ
మఱునాఁడు దూతి వెంబడివచ్చు వైశ్య । తరుణి వీక్షించి చిత్తజు తేజి పలికె
పతినిఁ బాసియు మానభంగంబు గాక । బ్రతికిన సతుల యుపాఖ్యానతతులు
వినఁదగు వినుతొల్లి విధివశంబునను । దనపతిఁ బాసి వృథానిందఁ జెంది
యలమటఁబడి తుద నత్యంతసౌఖ్య । మొలసినసతి కథ యొక్కటి గలదు
అది యెట్టులన్న నార్యావర్తభూమి । పొదలు రమాస్పదపుర మప్పురమునఁ
గనకధ్వజుండను క్ష్మాభర్త గలఁడు । ఘనుఁడాతనికి గుణాకరుఁ డరిధ్వాంత
హరణోగ్రకరుఁడు రత్నాంగదుం డనఁగ । బరగు కుమారుండు భాసిల్లుచుండు
ఆరాజసుతుఁడు స్వయంవర వేళ । శూరసేనాధీశసుతను శుభాంగి
వరియించి రతిఁగూడి వలనొందు మరుని । కరణి శృంగారసంగతులఁ జెలంగె
వారిద్దరికి సరివలపులు గనుక । కూరిమి ముచ్చటల్ కొసరుమాటలును
జిలిబిలినవ్వులు చిన్నారివగలు । కళలంటుహరువులు కలికిచెయ్వులును
బిగికౌఁగిలింతలు బెళకుచూపులును।సొగసువైఖరులును సొలపుమొక్కులును

రతిఁజొక్కుచిన్నెలు రాకొట్టువగలు । మితిలేనిమురువులు మెలిగొన్న మేలి
తనువుల హెచ్చరింతల వింతచూపు । లునెరయ ? హోరాత్రులును విహరింప
వినువీధిఁ జనుచున్న విధియు విధాతయును వారిమమత లోహో రే! యటంచుఁ
గనుగొని రిట్టిసంగతు లెందుఁగలవె । యనువిధాతకు విధియనియె నవ్వుచును
నింత మోహమునహియించి యీకాంత । సంతతంబును విడఁజాలకయున్న
రాకొమరునికి నీరసము పుట్టించి । నీకు మెప్పొనరింతు నిజముగా ననిన
నలివేణి వెతఁదీర్చి యధిపుతోఁ గూర్తు । గలదె పన్నిదమన్నఁ గలకల నగుచు
ఆవిధి పలికె నేనతివను రట్టు । గావించి పతిచుతిఁ గలఁచిన వెనుక
నీయింతిఁ బతిఁగూర్చి తేని నిన్వినుతి । సేయుచు దీనికిచ్చెదఁ బుత్రపౌత్ర
ధనకనకాదులు తగువైభవములు । నని ప్రతిజ్ఞయొనర్చి యరిగి రిద్వరును
అంతఁ గొన్నిదినమ్ము లరిగినపిదప । కాంత శుభాంగి శృంగారమ్ముసేయు
వేళ నద్దములోన విధివశంబునను । జోలుమొగంబు జుంజురువెంద్రుకలును
కడుమిట్టనుదురు వంకరబుఱ్ఱముక్కు । మిడిగ్రుడ్లు కొంకరమీసముల్ సొల్లు
గాఱెడిసెలవులు కడుఁబొట్టిపెదవి । కారుమేనును మరకటపుమూఁతియును
నుల్లిగడ్డము వెలికుఱికిన పండ్లు । పిల్లికన్నులు స్రుక్కిబిగిదక్కియున్న
చెక్కులు బలుదొప్పచెవులును గలుగు । నొక్కపీనుఁగురూప మఃదుగకఁదోప
వెరగంది యదిచూడ వెఱచి యద్దంబు । పరకటవైచి యేపడఁతుల తోడ
నాచందమెఱిఁగింప కలివేణి యట య । థోచితస్థితి నుండె నొగిఁ గొన్నినాళ్లు
ఱద్దంబు చూచినయపుడెల్ల నిటుల । ముద్దియకు వికారముఖము గాన్పింప
వేఱొకయద్దంబు వీక్షింప నందు । నారీతిఁ గన్పించునంచున నులికి
యిది యేమిపాపమో! యేమిగానున్న।యదియొ యిందున నిట్టి యద్భుతంబెందు
కనివిని యెఱుఁగ నెక్కడనుండి తనకుఁ।గనబడియెడినో!యీకష్టంపుమోము
బాలి నద్దముజూడఁ బాసె నటంచు । జాలి చెందుచునుండె సతి తనలోన
విపరీతగతి చెంది విధి యేపఁదలఁప । నపనయింపఁగ శక్యమా! యెవ్వరికిని
బలవద్విరోధులపై దండుపోవఁ । దలఁచి రత్నాంగదధరణీశుఁ డపుడు
మెఱుఁగుబోణి వసించు మేడపై కరిగి।విరులపాన్పుననుండి వెలఁది నెమ్మొగము
మొగమున గదియించి ముద్దిడుకొనుచు । వగలాడి! దండుపోవలసిన దిపుడు

నెలపదిపూటల నేనేఁగుదెంతు । నిలువనోపుదునటె! నిన్నెడఁబాసి
పరితాపము సహింపు పటుబుద్ధి ననుచు । తరుణి నూఱడఁబల్కి తల్లిదండ్రులకు
నాకార్యమెఱిఁగించి యతఁడు దండరిగె । వీఁక నసికీసివితతి తన్గొలువ
పతి దండుపోయినఁ బడఁతి వియోగ । వతియాటఁ దాలిమివదలి చింతిల్లి
జలకంబులాడక చలువలుగట్ట । కలికభాగమునఁ జెన్నలరఁ గస్తూరి
తిలకమ్ముదిద్దక తిన్నఁగాఁ హీన । పలికింప కెలదోఁటఁ బరికింపఁజనక
చెలులముచ్చటఁ జెవిఁజేర్పక కలికి । చిలుక లాలించక చిగురుపానుపున
నొడలుచేరిచి యసురుసురని యెపుడు । వెడవింటి దునెదారి విరవాది యంప
జడికిఁ దేఁటులయలజడికి లేగాడ్పు । వడికిఁ జిల్కలగోరువంకల నుడికి
విరహాగ్నిసుడికి నావిభుఁ డెన్నఁడింక । బఱతెంచునో! యంచు బడలుచునుండె
నాతరువాత రత్నాంగదధరణి । నేత శాతకృపాణనిహతి నరాతి
జాతి నుగ్గొనరించి సంగ్రామరంగ । జేతయై జయలక్ష్మి చేత నుబ్బుచును
నేతెంచె తనపురి కెల్లసామంత । జాతంబు తన డంబు సంస్తుతుల్ సేయ
పతిరాకవిని ప్రియంపడి శుభాంగియును । వెతమాలి యవ్వేళ వేగఁబన్నీట
జలకమ్ములాడి మేల్ సరిగ పైఠాణి । జిలుగువల్వ ధరించి చికిలిముత్యాల
గొనబు కట్టడపు కంగుల మేలిరవికయును దొడి కస్తూరి హాయలుగా నొసటఁ
దిలకంబుదిద్ది యందియలు మున్నైన । పలుసొమ్ములూని పైపై గుబాళించు
ఘనసారమిళితమౌ కలపంబు లలఁది । తనరుచు నిలువుటద్దంబున నీడ
చూడగా మునుదోఁచు చోద్యంపురూప । మాడనుండియు జరీలన దిగజాఱి
బడుగుదనంబునఁ బడిన నప్పడఁతి । గడగడ వణఁకుచుఁ గన్నీరుదొరుగ
అమ్మనేజెల్ల! యీయద్ద మందుండి । యిమ్మెయి నిప్పినుఁ గెక్కడవచ్చె
నెవ్వరి కెఱిఁగింతు నిఁక నేమి సేతు । నివ్విధం బరసిన నేమను విభుఁడు
బంగారువంటి నాబ్రదుకు దైవంబు । భంగమొందింప నిప్పనిఁ జేసెనేమొ
అని విన్నన్నై నాథుఁడరుదెంచు వేళఁ । గని చిటిచాపలోఁ గ్రక్కున శవము
చుట్టి గోడనుజేర్చి శోభనగాత్రి । పట్టభద్రున కెదుర్పడి చెలుల్ తెచ్చు
హారతులెత్తి యాయన బారసాచి । కూరిమి తనుగనుంగొని కౌఁగిలించు
కవుగింటితో సెజ్జకడఁజేరి యచట । నివసింపఁ బేదపెన్నిధిఁ గన్నయట్లు

నోడిమీఁద నిడుకొని యుదుటుచన్గుబ్బ । లెడఁదఁ జేరిచికొని యెలనవ్వుదేర
పుక్కిటి విడెమిచ్చి పొలఁతి! నీ న్యాయ । మొక్కనిమేషంబు యుగమయి తోఁచె
నీవెట్టులుంటివో! నెలఁత నన్ బాసి । యీవలఱకని పల్కునెడ దయలేని
పాపంపువిధి త్రోయ బడుగుమేనట్టి । చాపలోనుండియు జట్టున జాఱె
జాఱిన మాయంపుశవము కాల్కేలు । కారుమబ్బునుబోలు కాయంబుఁ జూచి
యింతిమోమీక్షించియిదియేమియనుచు।నంతమోహాముమఱియంతరోషముగ
గద్దించి యడిగిన గడగడ వణఁకి । యెద్దియు ననలేక హెచ్చినభీతి
నూరక యుండిన నుర్వీశసుతుఁడు । దారుణకోపాగ్నిదందహ్యమాన
మానసుండై యోసి మఱుమాయలాడి।యీ నీచమానవు నిందుఁ దెచ్చికొని
యిన్నాళ్లు భోగించి యేవచ్చువార్త । విన్నప్పుడే పట్టి వీనివధించి
చాపలోఁజుట్టి యిచ్చటి గోడమూలఁ । దాపెట్టి భీతియింతయు లేక నాకు
నెదురువచ్చితి నివాళీయంగఁ దూర్తి! । యెద నిన్నునమ్మోడి దెట్టుల ననుచు
శూరసేనన్నృపాలసుతవని యేరి । కోరి వరించితిఁ గుటిలబుద్ధివని
యెఱుఁగక మోసపోయితినోసి! నోసి । యెరపరికములేక యీనీచనరుని
పొందెట్లు గోరితె పొలఁతుల మొఱఁగి । యిందెట్లు తెచ్చితివే! వీని, నకట
కరఖడ్గమున నిన్ను గడికండలుగను । నఱికివేయక తీరునా ! కోపమనుచు
తరవారు నరమూసి తరుణికంఠంబు । నఱక నుంకించి యంతట దైవవశత
నొకశాంతి పుట్టిన నొర కత్తినైచి । చకితమృగీవిలోచన నింటిలోన
ననుచితంబు వధించుటడవిలో దీనిఁ।దునిమివేయుటకు మంత్రులఁ బంతు ననుచు
ఆ మేడదిగివచ్చి యమాత్యుకుఁ దెలిపి । భామిని గొనిపోయి బలుకానలోనఁ
జంపిరండని మహాసచివుల భటుల । నంపిన వారుహర్మ్యమును ప్రవేశించి
చెలి యేడుజేనలు జేనపై యడఁగి । నిలలేక నిలువునకీసుగాఁ గరఁగి
నేలపైఁ బడియున్న, నీరేజభవుని । వ్రాలు దప్పింపఁగా వశమానె! యనుచు
సకలభూషణములు సడలింపఁబంచి । యొక కట్టెమంచ మందువిడ నుంచికొని
పురజనుల్ పురపురఁ బొక్కి వాపోవ । గరిసింహశార్దూలగండభేరుండ
గండకశలశల్యఖడ్గాదిజంతు । కాండప్రచండమహా కాననం బొకటి
చేరి యచ్చోట నచ్చపురాకుబోఁణి । నా రమణీమణి నానీలవేణి

నా జగన్మోహిని నాసాధ్విఁ జూచి । యేజాడ నిన్నాతి కీయుపఖ్యాతి,
వచ్చెనో దీనిభావము దైవమెఱుఁగు । నిచ్చటఁ జంపరా దీసతి ననుచుఁ
దమలోనఁ దలఁచి ప్రధానులు గొంద । అమలాంగి నొక్కమహాశిల నుంచి
భామరో! నీవ్రాఁతఫల మెట్టులుండె।నామాడ్కిఁ జరియింపుమని యందు విడిచి
యువిదఁ జంపితిమని యొకమృగరక్త । మవనీశసుతుకడ కపుడె గొంపోయి
చూపిన నతఁడు సంక్షుభితాత్ముఁడగుచు । నాపద్మముఖియె యిట్లవగడమందె
నితరకాంతలఁ జెప్పనేల యటంచు । మతి వివాహాపేక్షమాని వర్తించె
నారీతిఁ దను మహోగ్రాటవి విడిచి । వారుపోయిన తరువాత నన్నాతి
యామహోన్నత శిలయందువసించి । హా మనోహర! హా శుభాకారధుర్య!
హా మేరుగిరిధీర హా కీర్తిసార । హా మహోదార! నాయందలిప్రేమ
మఱపించెగా నేఁడు మాయదైవంబు । దరిదాపులేక యీతను వోముటెట్లు
ఎవ్వరిదాననై యిందు వర్తింతు । నెవ్విధి బ్రతుకుదు నెందుఁ జొత్తునని
వాపోవగా దైవవశమున నొక మ । హాపవనము పాదపావళి గూల
పుట్టలు పిరియంగఁ బొద లిట్టునట్టు । గొట్టుకపోవ దిక్కుల దుమ్ముగ్రమ్మఁ
జెరువులుదెగ నేర్లు చీకాకుపడఁగ । కరిసింహశరభముల్ గడగడ వణఁక
వినువీధి మేఘముల్ విచ్ఛిన్నములుగ । పెనుగట్టులను శిలల్ పెడపెడ జాఱ
నుద్ధతివిసరి యయ్యుత్పలగంధి । హృద్ధాటి గొనిపోయి యించుకలోన
పున్నాగవతియను పురవీధి వైచె । నన్నన్న! విధి కసాధ్యక్రియల్ గలవె?
యీలీల పురవీధి నెలనాగ తేలి । గాలిచేఁ దూలి యక్కడమూర్ఛ సోలి
కూలి యుండఁగ గనుంగొని తత్పురంబు । పాలించు సురథభూపాలుని తల్లి
తనయొద్ది చెలులఁగొందఱఁ జూచి వీధిఁ । గనుగొంటిరే పెనుగాడ్పునఁ దూలి
యెక్కడనుండియో యిటవచ్చిపడిన।దొక్క చక్కెరబొమ్మ యో కొమ్మలార
పరవశభావంబు పాయగాఁజేసి । తరుణిఁ దోడ్తెండు చూతము మాటలాడి
యనవిని నృపమాత యనుమతి నపుడె । చని చెలుల్ శిశిరోపచారసంగతుల
సతి మూర్ఛదెలిపి యోసఖి రాజమాత।మతికృపఁ దోడి తెమ్మనె నిన్నురమ్ము
మావెంటనని సుధామధురవాక్యముల । నా విమలేందుబింబాస్యఁ దోడుకొని
తమ దొరసాని ముందర నిల్పవినయ।మమర శుభాంగి యాయమ పదాబ్జముల

వ్రాలి కన్నీరుజాఱంగ నిల్చియున్న । యా లేమఁ జూచి యిట్లను రాజమాత
గాలికొట్టినఁ బడి కలికి యిచ్చోట । గూలి తెవ్వతెవు నీకులమేమి నీకుఁ
బేరేమి యెవ్వనిప్రియురాల వేల । నీరు కన్నులఁగ్రమ్మ నీవడలెదవు
పేర్పడ నెఱిఁగింపవేయన్న మైచె । మర్పఁ గేల్మోగిచి యమ్మగువ యిట్లనియె
దేవి! నేను వసంతతిలకాభిధాన । నై వసుధేశుల యంగనలకును
సవరొందఁ గైసేసి సైరంధ్రినగుచు । నివసింతు వనవీథి నేఁడొంటిరాఁగఁ
జెడుగాలి గొట్టి నన్ జేడ్పడఁజేసి । పడఁద్రోచె నిచట నీపంపునఁజెలులు
బ్రతికింప నీసమీపంబు చేరితిని । హితమతి ననుమతి యిచ్చితివేని
మీనగర వసించి మీకన్నెలకును । నేను శృంగారింతు నేర్పుదలిర్ప
మగవారి పనికిఁ బంపక యెంగిలిడక । తగవొప్ప నన్నవస్త్రంబు లొసంగి
సంతరింపుము నీవె జనయిత్రి ననిన । నంతరంగమున దయారసం బెసఁగఁ
దరుణి! నీతెఱఁగెల్ల దాచి చెప్పెదవు । పరుల కెవ్వరును నిబద్ధి దెల్పుదురె
య్యైన నందులకేమి యతివ మానగరి । లోన సైరంధ్రికొల్వు వహించి నిలుము
చామ! నీకన్నవస్త్రంబు లేమికొదవ। నీమది కింపైననియతి నుండుమని
లాలనచేసి సిల్పఁగ నామెయొద్ద । నాళీకనయన కొన్నాళ్లు వర్తించె
పతిఁబాపి నిందలపాల్సేసి యితర । సతులఁ గొల్పించి నీచత సంఘటించి
గాసిబెట్టిన విధి కాంతపైఁ గరుణ । బాసి విధాతతోఁ బలికె నిట్లనుచు
నింతియకాదునుమీ యింతకేను । వింతబన్నము లొదవింతు నీవెటులఁ
దప్పించెదవొ చూచి తప్పింపుమనిన । నప్పుడావిధి కిట్టులనియె విధాత
యేమేమి యాపద లీవుచేసెదవొ । యామహాపదలెల్ల నట్టునిట్టనక
యిప్పుడెగావింపు మిఁకమీఁద నేను । దప్పించువిధ మద్భుతముగఁ జూచెదవు
అనినఁ గానిమ్మని యవ్విధివేత్త । తనమది నొకకుత్సితక్రియఁ దలఁచి
యారాజుభార్యకు నాశుభాంగికిని । గూరిమి మిగులనెక్కుడుగా నొనర్చె
పగలురేలు శుభాంగిపై రాజపత్ని। యగు కళావతికి నెయ్యము తియ్యమగుట
జలకంబువేళ భోజనవేళ వీణ । యెలమిమీటెడువేళ నెలదోఁటకేగు
వేళ నిద్దురపోవువేళ శుభాంగి । తోలియ్యమై సురథు వధూటి యుండె
నరమరలే కిరువురటుల వర్తిలఁగ । సురథునిసతి యొక్క శుక్రవారమునఁ

దలయంటఁగ శుభాంగిఁ దలుకునఁబిలిచి। కలభూషణములు గ్రక్కున సడలించి
యామెచేతికొసంగి యవి దాచుమనిన । గోమలి నట్టింటిగూటిలో నుంచె
అతివకుఁ దలయంటి యాటకలి వెట్టి । చతురతఁ బన్నీటజలకమ్ము లార్చి
తడియొత్తి ఛిద్రవస్త్రమొసంగ తిలక । మిడి కలపమలంది హెచ్చుక్రొవ్విరుల
సరులు వేసలిఁజుట్టి సతి ధరియించు । గురుభూషణము లున్నగూటి చెంగటికి
నాసాధ్వి చనుచున్న యటమున్నె గోడ । వ్రాసినయట్టి సిరాదేవి చెడ్డ
విధిపనుపున మ్రింగివేయుట వలన । నధికరత్నస్ఫురితాభరణములు
కనుపించకున్న గ్రొక్కటపడి యిచట।నునిచిన సొమ్ములేమో కాన మనుచుఁ
దల్లడించగ రాజతరుణి యిదేమి । చెల్ల నీచేతికిచ్చిన భూషణములు
నీవెఱుంగకయుండ నెందుఁబోయినవి । యీనఱకును లేని యీపెద్దతనము
రానేల బోఁటి యూరక గుట్టుగాఁగ । మానితాభరణముల్ మసల కిమ్మనుచు
నయభయమ్ములుదోఁప నరనాథుదేవి । యయిన కళావతియనిన శుభాంగి
మోము వెల్వెలఁబోవ ముకుళితహస్త । యై మేనుగంపింప నడలుచుఁ బలికె
బోఁటి యాసొమ్ము లప్పుడె నడియింటి । గూటిలోపల నుంచి గొబ్బున నీకు
దల యంటవచ్చి యిందాఁక నీకడనె। నెలకొనియుంటి నీనిలయంబు నేను
చేరితినే యింతసేపు నన్నిపుడు । మీరు సొమ్ములకుఁబంపిన వచ్చి గూటి
కడఁజూచి సొమ్ములుగానక దిగులు । పడి ముందు వెనుకదోఁపక యున్నదాన
చనవరినై యుండి జడియక పాప । మనకయో! యిట్టిద్రోహంబు సేయుదునె
చెడుబుద్ధి నను రట్టుసేయఁగాఁదలఁచి।గడుసులెవ్వరు సొమ్ము గ్రహియించినారొ
అది పరామరిశింపు మదిగాక దైవ । మదయమై మునుజేసినందుకు దోడు
నిపుడేమి యిడుమల నిడఁదలఁచినదొ । కపటంబు ద్రోహంబు కల్ల నావల్లఁ
గలుగ దిక్కడఁ గొంతకాలంబు మెలఁగఁ।దెలిసియుండుదువు నాస్థితి నీవటంచు
పలుకు నక్కోమలి పలుకుల కలిగి । చెలువ! నీమీఁదమోసిన సందియంబు
నగరిలోఁదిరుగు నందఱిమీఁదఁ బెట్టఁ।దగవౌనె! యీదొంగతనము లెవ్వరికిఁ
గలుగవిచ్చటఁ బెట్లకట్లను బడక । చలముసేయక సొమ్మొసంగు మూరకయె
ముదితరో! ముచ్చుకె మూరెడునోరు । గద! సొమ్ములెత్తుక కాఱులాడెదవు
అని గువ్వకరిగొని యందఱుగ్రమ్మ । కొని దిసంతులుగొట్టఁ గొమ్మ మాటాడ

నేరక ధృతిదూలి నిర్విణ్ణయగుచు । నూరకయుండె నెంతోముగ్ధ గనుక
వారిసందడి రాజవరుతల్లి విన్న । ధైరయంబునఁ బిల్వనంపి యిదేమి
సద్దని కూరిమిసకియల నడుగ । నద్దేవితోఁదెల్పి రదివిని వగచి
యలచెలిఁ బిలిపించి యంతరంగమునఁ । బలికె నేటికి రట్టుపడియెద వబల
చెల్లబో! చేతికిచ్చిన సొమ్ములాడిసి।యిల్లుమ్రింగెనో యట్టె యెగసి యెందైన
రెక్కలువచ్చిపారెనో! విన్నవారు । నిక్కమౌనందురో నిన్ను నమ్ముదురో!
యెక్కడ దాచినా వెలిఁగింపు మురక । నక్కటా యిదిసైచునా! రాజువిన్న
ప్రాణంబుపై వచ్చు పాపంబుసొమ్ము । చే నేమియగు నిది సిగ్గుచేటంతె
దిక్కులే కొంటి వీధినిబడి యున్న । నెక్కొనుకరుణచే నిన్ను దెప్పించి
యాదరించిన ఫలంబంతయుఁ గలిగె । నీదుర్గుణమె కాదె నిన్నింత చేసె
నని పెక్కుభంగుల నారాజమాత । తనుఁ బ్రబోధించినఁ దనువెల్ల వడఁక
నడలుచువచ్చి యయ్యమ్మ పాదములఁ।బడి దీనయగుచు నప్పుడతి యిట్లనియె
నోయమ్మ నాయునికి నోర్వఁగాలేక । మాయపువిధి యిన్నిమతకముల్ పన్నె
నొరుల పంచలఁ బడియుండఁ జేసియును । గరికరి మాన కీగతి నేఁచసాగె
లెక్కింపరాని బల్వెలగల సొమ్ము । దక్కనే యది తప్పిదారి దాఁచినను
నిమ్ముగా సొమ్ముకయెడనున్నఁ బ్రజల।నమ్మమి యొక చోట నాటియుండు నను
మాట నీవెఱుఁగవే మాయమ్మ యనుచు । మాటిమాటికి బోటి మనికితపడఁగ
నమ్మాటలాలించి యులరాజు దేవి । ద్రిమ్మరి యిది నీలి దీని కెక్కడిది
తగవును ధర్మంబు దబ్బరదాసి । మొగమోడియుండిన మొఱకుదనంబు
మాని సొమ్మిచ్చునే మనకని కినుకఁ । బూని దుర్విధివశంబునఁ గృపమాని
దీమసంబునఁ బట్టితెప్పించి నిట్ట । గోమునఁబెరిగిన కొమ్మ కోమలపు
కరములురెండు వెన్కకుఁ దవియించి । కఱకుముప్పిరిత్రాళ్లఁ గదియకట్టించి
తరటులఁగొట్టించి తఱచు నెత్తురులు।దొఱుగ హేయనియేడ్చు తొయ్యలిఁ గినిసి
యోసి! మాసొమ్మిచ్చి యూరక యిల్లు। బాసి పొమ్మొటకైనఁ బ్రాణంబుతోడ
సొమ్మొసంగక వడి సుళ్లఁ బెట్టినను।ముమ్మరమ్ముగ మేను మురియఁగొట్టింతుఁ
జెక్కింతుఁగండలు చిద్రుపలుగాఁగ । గ్రక్కింతు నెత్తురుల్ గారలఁబెట్టి
కూడునీళ్లిడక మిక్కుటపుటాఁకటను । మాడింతునని యవమానపూర్వముగ

దుర్భాష లాసురథుఁడు పల్క బాల । నిర్భరశోకాగ్ని నెఱిదక్క స్రుక్కి
మాఱాడకున్న నమ్మానవేశ్వరుఁడు । కారాగృహమున సంకెలలఁ బెట్టించి
దినదినమ్మును బట్టితెప్పించి కొట్టు । చును బెట్టుబాధింప సామ్మ నేనెఱుఁగఁ
జంపినఁజంపుండి సడిదీఱ ననుచు । గంపితగాత్రియై కాంత వాపోయె
నిఁటుల నాలుగునెల లెల్లయాతనలు । ఘటియింప డప్పి నాఁకటఁ గుందికంది
సంకెళ్లఁబడి చెఱసాలలో నొగిలి । పంకనిర్మగ్నయౌ పద్మినివోలె
గాసిల్లఁగ విధాతఁగని విధియనెడు । దోసకారి ప్రతిష్ఠదోఁప నిట్లనియె
కంటివె యీవాలుగంటిని రాచ । యింటిలో నైచి నేనేచిన తెఱఁగు
స్వైరిణియనునింద సమకూర్చి పతికి । నీరసంబాదవించి యిల్లెడఁబాపి
యడవిలోఁ బడఁద్రోచి యాయాసపెట్టి।కడపటఁదెచ్చి యొక్కనృపాలు నింటఁ
బనులుగావింపఁ బాల్పఱచి పైదొంగ।తనము మోపనొనర్చి తత్కారణమునఁ
బలు తిట్లగొట్లను భంగమొందించి । యలమటఁబెంచి కారాగారసీమ
సంకెళ్ల వేయించి జాలిఁగుందించి । బింకంబడంచి డప్పికి నీళ్లు, గుడువఁ
గూడు, నొక్కపుడు చేకుఱఁజేసి ప్రతిన।యీడేర్చుకొంటి నీవిఁక దీని దొంగ
తనముమానిచి నిందఁ దలగించిమగని।నెనయఁజేయుముచూత మిపుడు నీమహిమ
అనిన నవ్వి విధాత యవ్విధికనియె । గనికరంబేది యీకల్యాణి కకట
యిడరాని యలమటలిడి పెక్కునెతలఁ । బడఁజేసితివి దుస్స్వభావంబు తోడ
నింతియకాకింక నేమైనసేయఁ । జింతించితివొ తుదఁజెందెనో! ప్రతిన
తెలియఁజెప్పుమటన్న స్త్రీ కింతకంటె । కలదె! దుర్దశ సేయగల సేఁతలెల్లఁ
జేసితి ఱంకు మ్రుచ్చిమి కల్లఁజేసి । యీసతిఁ బతిగూర్చు టే ప్రయాసమను
విధినిఁజూచి విధాత వెండియుఁబలికె । నధికసౌశీల్యగుణాన్వితమైన
మోఁతఱంకు మ్రుచ్చిమియుఁదొలఁగించి।చెలువుగూర్తునొకింత సేపులోఁజూడు
మీ దంపతులకొక్క లీడేర్తు ననుచు । గాదె తొల్తఁ బ్రతిజ్ఞ గావించి తీవు
నది మఱునకయుండు మరుగుదెమ్మనుచు।సదయుఁడై యప్పోట సకలదుఃఖముల
పాలై చెలంగెడు బాల లాలింప । నాలోచన మొనర్చె నమ్మఱునాఁడు
సురథునితల్లియు సురథునిసతియు । సురథభూపతియును జుట్ల నెచ్చెలులు
పరిచర్యసేయ నప్పటసాల నుండి । హరిరాణిఁ బూజించు నవసరమ్మునను

అందు గోడను వ్రాయనమరు శ్రీదేవి । యందఱుఁజూడ శుభాంగి మున్నిడిన
మేలిసొమ్ములు దిగమ్రింగిన దగుట । నాలోన ఖంగుఖంగన వెళ్లఁగ్రాసె
నిది కళావతి సొమ్ములెల్ల మున్ మ్రింగి।నదియేమొ శ్రీదేవి యన్నియు మఱలఁ
గరుణించెనని చెలికత్తియల్ దెలుప । ధరణీశ్వరుఁడు వానితల్లియు సతియు
వెరఁగంది రానందవివశులై రంతి।పురములోఁ గలసతుల్ పురుషు లందఱును
నిందీవరాక్షి! సొమ్మీక్షించి యలరు । నందనుగని సునందాదేవి పలికె
పరదేశమునసుండి పఱతెంచి మనల । నెఱనమ్మియిచ్చోట నెలకొన్నసాధ్వి
పైదొంగతనమిడి పాపంపుసొమ్ము । కై దుఃఖపెట్టితి మయ్యరో తరచు
మొదట నవిశ్వాసములకు నిధాన । మదిగాక కొలలకు నాలవాలంబు
తల్లిబిడ్డలనె భేదముసేయు నెలవు । కల్లలకెల్ల నాకరము ధనంబు
ఒదిగి కనపడక సొమ్మొకచోట నున్న । నుదుటా నవిశ్వాస మొకచోట నుండు
ననిమున్నె నాతోడనాడె నబ్బోటి । వినియును దెలియ కివ్విధిఁ గలంచితిమి
పట్టభద్రుని కూర్మిపట్టికిఁ గాక । యిట్టిసౌందర్యాదు లితరకాంతలకు
గలుగునే! నిడువాలుగన్నుల బెళఁకు।తళుకుచెక్కులటెక్కు దానికే యమరు
చిలుకఁగేరెడు పల్కు చిఱునవ్వుగుల్కు।తలిరుమీఱెడు మోవి దానికే యమరు
నే రాజుదేవియో! యిచ్చోటి కేమి । కారణంబున వచ్చి గాసిఁ జెందినదో!
తలిరాకుబోఁణికా! తరటుల పెట్లు । చిలుకలకొల్కికా! చెఱసాల నున్కి
చందనగంధికా! సంకెళ్లతగులు । ఇందునిభాస్యకా! హేయంపుఁ దిట్లు
దొరసానికా! కూడుదొరకని మనికి । కరిరాజగమనకా! కడలేని నెగులు
పట్టింప కిటువంటి పాపంబు గట్టి । కొంటిమేగద తెల్విగూడి యింకైన
బందిగంబునఁ గాసిపడు కుందరదన।నిందు రప్పింపుమోయి కుమార యనినఁ
దల్లిమాటలువిని తల్లడపడుచు । నల్ల భూవల్లభుం డప్పుడె లేచి
చెలులు కొందఱుగొల్వఁ జెఱసాల కేఁగి । వెలఁదుక సంకెళ్లు వీడఁగొట్టించి
బయలుదేరిచి గాసివడి మాసి దీన । యయితలవాఁచి బిట్టడలుచునున్న
యాయింతి గనుగొని యకటసీమహిమ । లోయక్క! తెలియలేకూరక నిన్ను
బాధలఁబెట్టి పాపము గట్టికొంటి । వేధ మున్ వ్రాసినవేధ నిట్లయ్యె
నింటిలోపలికి రమ్మిఁకనని వాలు । గంటి యచ్చెలులసంగతి వెంటరాఁగ

ద్రోడ్కొని వచ్చిన తొయ్యలిఁ జూచి । వేడ్క సునందాది విమలాంగు లెల్ల
నెదురేఁగి కౌఁగిటనిడి బుజ్జగించి । సదయత నామెకు జలకమ్ము లార్చి
సరసాన్నపానీయసంతుష్టఁ జేసి । కరములు వార్చఁగాఁ గపురంపు విడెము
గైరవ ఖ్యదయభాస్కరు లుంచి యొసఁగి। నేరంబు సైపవే! నీరేజగంధి
రామ! నట్టింటి సీరాదేవి వలన । నీమహాపద జనియించె నీకనుచు
నా సొమ్ము వచ్చిన దంతయుఁ దెలుప । నాసడి తీఱెగా! నాకంతె చాలు
నమ్మలార! యటంచు నామె నెమ్మనము।నిమ్మళించఁగ నుండె నెలప్రాట లచట
నాతలఁ గొన్నినాళ్లరిగిన వైరి । జేత రత్నాంగదక్షితినేత సకల
దిక్కులు గెలిచి కీర్తిద్యుతుల్ విరుల।స్రక్కులవలె నల్దిశలు గ్రమ్మకొనఁగఁ
దన బావయగు సురథక్షితీశ్వరునిఁ । దనదు కూరిమిసహోదరిఁ గళావతిని
గనుగొనఁ దలఁచి తత్కటకబాహ్యోప । వనమునఁ దన పరివారంబు నిలిపి
తగు మంత్రివరులతోఁ దా నేఁగుదేర । నగరబాహ్యమున కన్నరపతి వచ్చి
యతనిఁ గౌఁగిటఁ జేర్చి యాప్తసామంత । హిత బంధుమిత్ర సమేతంబు గాఁగ
పున్నాగవతికి సొంపునఁ గొనిపోయి । యున్నత మణిసౌధ యూథంబు చేతఁ
బొలుచు నంతఃపురంబున పొన్నుపనుల।దలుకొత్తు నొక్కసౌధంబున నుంచి
వివిధోపచారముల్ వేడ్కఁ గావించు । నవసరమ్మున సునందాన్విత యగుచు
అక్క కళావతి యరుదేర లేచి । గ్రక్కున మ్రొక్కినఁ గౌతూహలమున
నక్కునఁ జేర్చి రత్నాంగదు వార । లొక్కట దీవించి రుచితవాక్యముల
సంతటఁ గుశలమ్ములడిగి యొండొరులు । కొంతసేపచ్చటఁ గొలువుగా నుండి
ప్రొద్దువోయెను లెమ్ము భోజనమ్మునకు । నొద్దివారలకు సెలవొసఁగు మటంచు
నల బావ సెలుప నాయన మంత్రులకును । సెలవిచ్చి యమ్మేడఁ జెచ్చెర డిగ్గి
జలకమ్ములాడి భోజనశాలఁ జొచ్చి । యలరు బంతిని దమయప్ప వడ్డింపఁ
బరిపరి కూరల భక్ష్యభోజ్యముల । పరితుష్టులై పాణిపద్మముల్ వార్చి
ఘురతకాల్జముఖాణములపైఁ దివాసు । లొరుగుబిల్లలు గల యొక పటసాల
నిరవొంది యిరువంక నివురాకుబోండ్లు । సురటీలు మేలి వీచోపులు పూని
యూడిగంబు లొనర్ప నొక ముద్దులాడి । పీడియంబొసఁగఁ బల్వేడుక నున్న
తరి శుభాంగీభామ తద్రత్నధామ । పరిసరంబున కొకపని నెపంబూని

పఱతెంచె నితఁడు నాపతియొ వేఱొకఁడొ । పరికింతు నిపుడను భావంబుతోడ
పఱతెంచి యతనిఁ దప్పక చూచె నొక్క । మఱుఁగుననుండి కోమలి యిట్లుచూచి
యితఁడె నాప్రాణేశుఁ డిన్నాళ్లకౌర । యితనిఁ గన్గొనఁగల్గె నెదతాప మణఁగ
మఱుఁడు ప్రేరేప నిమ్మహీపతి యెదుటి । కరిగిన నలనాఁటి యవగడం బెంచి
యలుగునో! యలుక లేకది యేమియనుచుఁ । దెలియ నన్నడుగునో! తెలిసిన వెనుక
నెలమి లాలించి నన్నేలునో లేక । యిలువెడలిన సతి యిఁక నేల యనుచు
విడనాడి మోడిగావించునో! యిటుల । నెడయఁజేసిన దైవ మిఁక మీఁద నైన
గృపయుంచి పతిఁగూర్చి యీ మనస్తాప । మపనయించక యున్నె! యాశంక యేల
నావల్ల నేరమున్నగదా తొలంగి । పోవలె నెదుటికిఁ బోయినఁ జూచి
యేమనునో నూత మిప్పుడపోక । తామసించిన మీఁదఁ దప్పు గార్యమని
యాలోచనమొనర్చి యల్లన భూమి । పాలసూతి వసించు భవనంబు ద్రోవ
నరుగుచునున్న రత్నాంగదుఁ డట్టె । పరికించి నివ్వెరపాటు వహించె
పులకలు మైఁబర్వఁ బూఁబోణి పాద । ములనీటు మీఁగాళ్లమురువు సన్నంపు
నడుము పేదఱికంబు నాభి పొంకంబు । గడుసు పాలిండ్లబింకము బాహులతల
చెలువంబు తళుకు లేఁజెక్కుల టెక్కు । సోలఁపు వాలు మెఱుంగుఁ జూపుల కైపు
కనుబొమల్ గన్న చక్కఁదనంబు నుదుటి । గొనబు డాల్ నగుమోము గోము నెమ్మోని
మించు రాయంచ లమించు నెన్నడల । సంచు వేమురు గాంచి సౌందర్య మెంచి
యిందుబింబాస్య యిదెవ్వతో దీని । యందంబు గన్న శుభాంగి యట్లమరె
నచ్చొత్తినటుల నయ్యతివ మై పుణికి । పుచ్చికొన్నటుల నిప్పొలఁతి యొప్పెడిని
నాయింతి యానాఁడె యడవిపాలయ్యె । నీయెడ కదినెట్టు లేఁగుదెంచినది
దాని చక్కఁదనంబు దాని లేఁబ్రాయ । మీనెలంతకుఁ గల్గ నీక్షించినపుడె
యవుర! తోఁచె శుభాంగియను సంశయంబు । భువి లేరె మానిసిఁబోలు మానిసులు
నింత చింతిలనేల యీమె వృత్తాంత । మంతయు వినియెద నప్పచే ననుచుఁ
దన చెంతనున్న సోదరిమోముఁ జూచి । యనియె నిచ్చెలి! యెవ్వ కలినీలవేణి
దీనికులం బేమి దీని పేరేమి । యీనాతి పతి యెవ్వఁ డెన్నినాళ్లాయె
నిచ్చటి కరుదెంచి యేపని సేయు । నిచ్చంద్రముఖి తెల్పు మిది యెల్ల ననిన
నక్కళావతి పల్కె నన్న! యిక్కాంత । యెక్కడినుండియో యీపురవీధి

గాలివాటునఁ బడఁగని మనయత్త । చాలఁగూరిమి సఖీజనముచే దీనిఁ
బిలిపించి యూరేమి పేరేమి యనిన । జలజాక్షి సైరంధ్రిజాతి దా ననెను
తల్లిదండ్రులపేరు తనయూరిపేరు । వల్లభుఁ దెలుప దేవగను వేఁడినను
ఆనాఁటినుండి యియ్యతివ సైరంధ్రి।యై నన్ను బెడఁబాయ కనిశంబు మెలఁగు
గన్నెత్తిచూడ దెక్కడ మగవారి । నిన్నెలంతుక భుక్తి యేకవారంబె
దీని సౌశీల్యంబు దీని సద్గుణము । లేను నెచ్చెలులతో నెపుడు వర్ణింతుఁ
దిలకించెదము పెక్కుదినముల నుండి । తెలియంగఁ బరమపతివ్రత యిదియె
యిది యెవ్వరనుచు నన్నీవడిగితివి । యిదియేమి గుర్తెఱుకేమైనఁ గలదె
పలుమారు దీనిఁ దప్పకచూచు టేమి । కలదు లేదింత నిక్కము డాఁచలదుఁ
నీకు నాతోడు విన్పింపుమటన్న । నాకూర్మితోడుతో నతఁడిట్టులనియె
అక్క నేమును వివాహంబైన యట్టి।యక్కన్యను శుభాంగి యందురు దాని
చిన్నెలువన్నె లీచివురాకుబోఁణి । కున్న నివ్వెరపడి యురక కన్గొనుచు
భ్రమసి నిన్నడిగితిఁ బరపురుషాభి । గమనంబు దానివంకను గానఁబడిన
నలిగి యమాత్యుల నంపితి నడవిఁ । బొలియింపుఁడని యట్ల పొలియించి వారు
చెలియరో నెత్తురుచీరఁ దెచ్చిరది । తిలకించి యాభ్రమ దీఱి యుండితిని
నిప్పుడాసతి రూప మీకాంత యందుఁ । దిప్పక కనుగొని తహతహఁ జెంది
యిదియేమిపొలిసినదెటులఁదోఁచినదొ।యదిగాదొ యిదిలేక యన్యకామినియొ
అని వితర్కించెదనని యయ్యెదంత । మనుజుండు దెల్పఁగా నక్కజం బంది
యక్క యిట్లనియె నన్నా! నీయమాత్యు।లిక్కాంతను వధింప నేమిటి కనుచు
నడవిలో విడిచి నీకామాట మఱుగు।పడఁ దెల్పిరేమొ యీ పద్మాయతాక్షి
పరపురుషాపేక్ష భావంబు నందుఁ । బొరయ దొకప్పుడు బుద్ధి నూహింప
నీ సందియంబేల యేకాంతమునకు । నీసతిఁ బిలిపించి యీవడుగు మని
యనుజుని ధర్మహర్మ్యమునకుఁ బనిచి । జనపతిదేవి యాసైరంధ్రిఁ బిలిచి
యలివేణి యీమేడకరిగి శీఘ్రమునఁ । గలపంబుగిన్నెయు గమ్మక్రొవ్విరులు
గొని తెమ్ము పొమ్మన్నఁ గోమలి మంచి । దని పతితో రహస్యముగ మాటాడ
నెడ గల్గెనిపుడని యెంచి విధాత । కడుఁ దొరసేయ నొక్కట మేడయెక్కి
వినయంబు భయమును విశ్వాస మెనయ।తనప్రాణవిభుని ముందర నిలుచుటయు

మెఱమెర మదిగ్రమ్మ మెలఁత నీక్షించి।యరమర బెరయ నాయన యిట్టులనియె
యెవ్వరిదానవే! యిగురాకుబోఁణి । యెవ్వతెవీవు పేరెయ్యది నీకు
నీవిధం డెవ్వాఁడు నీకులంబేమి । యీ వంతయును దెల్పు మీవంత మాని
యూఁచక వాఁచక యున్నకార్యంబు । దాఁచక తెల్పినఁ దగవరి వనుచు
నిన్ను మెచ్చగవచ్చు నిజముగా ననినఁ । గన్నీరుమున్నీరుగా వెక్కి వెక్కి
యడలుచు నధిపుని యంఘ్రిపద్మములఁ।బడి యశ్రువుల నర్ఘ్యపాద్యంబు లిచ్చి
మరులుతో నష్మానమగువను నన్ను । మఱువఁజేసెను గదా! మాయదైవంబు
నాపాలి పెన్నిధానంబవు నీవు । నాపేరు మఱచితె! నాప్రాణనాథ
నే శుభాంగినిగానె నిన్నెడఁబాసి । క్లేశమందెద నన్యగృహమున నుండి
తొలిజన్మమున దంపతుల నెవ్వరెవరిఁ । జెలిమిమానిచి పాయఁజేసి యుంటినొ
ఆపాపఫల మిప్పుడనుభవించితిని । నీపదాబ్జములాన నినుమాని యితర
పురుషుని నేస్వప్నముననైన నఁదలఁప । పరమేశ్వరుఁడె సాక్షి పలుమాట లేల
యిట్టి పతివ్రతనైన నఁచోఁ జాప । చుట్టి నాఁడొకపురుషుని దాఁచుటేమి
యని యడిగితివేని నాకథ వినుము । వినిపింతునని తనవృత్తాంత మెల్లఁ
బడఁతుక తెల్పి నేఁ బడరాని బాధ । పడి నేఁడు మీపాదపద్మము ల్గంటి
నీది యథార్థము నమ్మరేని మున్ సీత । సొదఁజొచ్చి నట్లగ్నిఁజొచ్చి వచ్చెదను
శూరసేననృపాలసుతనై జనించి । యీరట్టుతోఁ బ్రాణమెటుల ధరింతు
బాస లేమిటికని వాటింప కలుక । చేసితిరేని మీశ్రీపాదయుగళి
చేరువ విడిచెద జీవంబనంగ । నారాజు మదిసందియము దీర కపుడు
వెరగంది యుండగా విధితో విధాత । యరుదెంచె నవరత్నహారాళి తోడ
మణికిరీటముతోడ మార్తాండతులిత । ఘృణి ధగద్ధగిత శారీరాభ తోడ
పరిపూర్ణ చంద్రబింబ సమానవదన । దరహాస చంద్రికాధవళిమ తోడ
పఱతెంచి యతనికిఁ బ్రత్యక్షమైన । నరుదంది లేచి సాష్టాంగముల్ చేసి
హేమాసనమున నయ్యెద్దతి నునిచి । కై మోడ్చు నిటలభాగంబునఁ జేర్చి
భవ్యవచఃప్రౌఢిఁ బ్రస్తుతుల్ సేయ । నవ్యాహతైశ్వర్యమస్తు భూపాల
యే మెవ్వరమొ యని యీవెంచవలవ।దీమూఁడుజగముల హెచ్చుప్రాణులకుఁ
బాలుచు శుభాశుభంబులు పుణ్యపాప । కలనచే ఘటియింపఁగల దేవతలము

ఈ కాంతవిధి, వినుమేను విధాత । నేకాగ్రమతిఁ జరియింతు మిజ్జగతి
నీవు నీసతియున్న నెనరు మోహంబు । భావించి వీరలఁ బాయగాఁజేయఁ
దరమూనె! యనిన మద్వచనంబు మెచ్చ।కరరే! యిదెంత కార్యము వీరి నిదిగొ
యెడఁబాయగాఁజేసి యిఁక నీలతాంగి । నిడుమలఁ బడఁజేతు నీక్షింపు మనుచు
నీవిధి నాతోడ హెచ్చుప్రతిజ్ఞఁ । గావించి యద్దంబు గనుగొను నపుడు
కనఁబడఁజేసె వికారంపురూపు । వనిత నందున నీవు పైవ్రేణి యనుచు
నిలు వెడలించితి విచటికివచ్చి । యలమట పడఁజేసినది విధికృతము
ఈ యపనమ్మిక లెల్లనడంచి । తోయజముఖిని నీతోఁ గూర్తు ననుచు
విధితోడఁ బ్రతినగావించితి నేను । మధురభాషిణి యిది మహనీయశీల
అతివ నీతో నిప్పుడాడిన మాట । క్షితినాథ! సిద్ధంబు సిద్ధంబు నమ్ము
మానాఁటి శవరూప మాయెడ మీఁదఁ । గానిపించెనె నీవుగంటివే మరల
నదిమాయగనుఁ కదృశ్యంబయ్యె నపుడె।యిదిగొ చూడుము దివ్యదృష్టి యిచ్చితిమి
అనిన రత్నాంగదుం డానందమంది । తనలోనఁజూచి యెంతయు దబ్బఱగుట
తెలిసి వారలకు విధేయుఁడై పూజ । సలిపె నప్పుడు విధి సతిఁజేరఁ దిగిచి
యక్కునఁ గదియించి యక్కనావలనఁ।బెక్కుపడలుడాసెఁ బ్రియు నెడఁబాసి
యలమటఁబొందితి వడలకు మింక । నలరెద వైదువవై పెక్కుసమలు
బహుయాగకర్తయై ప్రబలు నీభర్త । బహుపుత్రకులఁ గాంచి పరగెద వీవు
బహు భోగభాగ్యసంపదలతో మీఁ రు । వహికెక్కుడని పెక్కువరము లొసంగి
యా రాజసుతు బావ నలకళావతిని । వారి బాంధవులను వారినెచ్చెలుల
నందఱఁ బిలిపించి యాశూరసేన । నందని చరిత మందఱు వినఁ దెల్పి
యపుడె పునర్వివాహంబు సేయించి । కృపతో విధివిధాత లేఁగి రవ్వేళ
సావిత్రికెనయైన సతిఁగూడి మోహ । మావహిల్లంగ రత్నాంగదుం డపుడు
అక్కయు బావయు నాదృతిసేయ । నక్కడఁ గొన్నినా ళ్లధివసియించి
వారి వీడ్కొని బహువాహినుల్ గొలువ।నామూధమహిమ రమాస్పదపురము
తాఁ జేరి తల్లికిఁదండ్రికి మ్రొక్కె । నా జగన్నుతశీలయైన శుభాంగి
యత్తమామలకుఁ బ్రియంబున నెఱఁగి । యుత్తమసతినమ్మ యువిద నీవనుచు
వారెంచ నెచ్చెలుల్ వర్ణనసేయ । శూరసేనుఁడువచ్చి సుముఖుఁడై పొగడె

నెందునఁ గొఱంతలే కెల్ల సౌఖ్యములఁ। జెంది భర్తనుగూడి సిరులొంది వెలసె
నీశుభాంగిచరిత్ర నెలమితో విసిన । ధీవిశాలులకు సుస్థిరభోగభాగ్య
మహిమ లిష్టార్థసంపదలు చేకూరు । మహనీయశీలలై మగువ లొప్పుదురు
అని కీరమణి తెల్ప నలరి యారమణి । వినఁగల్గె సత్కథ వేడుక ననుచు
నాచిల్కఁ బొగడుచు నరిగెలోపలికి । నాచరిత్రము దూతి యధిపుతోఁ దెలిపె
నని శంభుఁడెఱిఁగింప నవ్వలికథలు । వినిపింపుమని గౌరి వేండియు నడిగె
సరసపతివ్రతాచరితంబు నందు । ఘనమై పదేనవకథ పూర్ణమయ్యె

## సులోచన కథ

శ్రీవిశ్వపతి సమంచిమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
బోఁటిరో! మఱునాఁటిప్రొద్దు మాపంటి । పూఁట దూతికపిల్పఁ బువుగుత్తిఁ పేరి
చెలువ చెంగటికి వచ్చిన నాదరించి।యలచిల్క నును తేనియలు చిల్కఁ బలికె
దన భక్తినిజమైన దైవంబు మెచ్చు । ననుమాట కొకయితిహాసమ్ము గలదు
అది పతివ్రతకథయై యొప్పు వినుము । మదిరాక్షి! గౌళభూమండలం బేలు
తరణితేజుఁడు కీర్తిధాముఁడన్ రాజు । పరవీరసంహారపటుబాహుబలుఁడు
అతనికి మణిరేఖయను భార్యయందు । సుతయొక్కతె జనించె శోభనగాత్రి
ఆకన్యకు సులోచనాహ్వయం బిడియె।తన్మ్కమనుఁడు సులోచనకాంతిఁ జూచి
యాసులోచన దాను లనిశంబు ప్రోఁది । చేసి పోషింపఁగాఁ జిగురువిల్కాని
చికిలి క్రొవ్విరితూఁపు చెలువున మించె।సుకుమార తనువిభా శోభిత యగుచు
నయిదేండ్ల నక్షరాభ్యాసవిలోల । యయి నేర్చె నేడేండ్ల నఖిలవిద్యలును
సంగీతవిద్య సాక్షాత్కారమౌ తె । అంగున జంత్రగాత్రము లభ్యసించె
పాట లాగతిఁదలిర్పఁగ నాట, నమర । పాటలాధరలకుఁ బ్రతి యన మించు
తా నభ్యసించు విద్యలలో మురారి । పూనిన త్రిభువనాద్భుతవిలాసములు
గనివిని యతనిపైఁ గాంక్ష జనించి । వనిత శ్రీహరిని వివాహమౌదు నని
హరికథలె పఠించు హరినే తలంచు । హరినామమె స్మరించు హరినె భజించు

మాంపాహి లక్ష్మీశ మాంపాహి కృష్ణ।మాంపాహి గోవింద మాంపాహి శౌ।
యని యెన్నిదేండ్ల ప్రాయముగన్న మొదలు । వనజనాభుని నిట్లు వర్ణనసేయ
వినితండ్రి యిదియేమి విధము మాయమ్మ।కనకాంబరునిమీఁద ఘనభక్తి గ్రమ్మ
నతని గణించెద వాశయంబేమి! । మతిదాఁచక గణింపు మాతోడ ననుచుఁ
దొడమీఁద నిడుకొని తోరంపుఁబ్రేమ । నడిగినఁ జెలి మందహాసచంద్రికలు
తన ముఖపూర్ణసుధాకరు నందుఁ । గనుపింపఁ బల్లవాగ్రాస కషాయ
కలకంఠ కలకంఠిగతి నిట్టులనియె । తెలిపెద వినుమయ్య ధృతిజితాహార్య!
శ్రీలక్ష్మి నెడఁదనుంచిన మహామహుని । నీలమేఘముఁబోలు నెమ్మేనివాని
తత కటీతటబద్ధ తపనీయ వసను । సతతత్రిలోకరక్షణ గుణోల్లసను
హరి నుగ్రదైత్యభహరిని సుధాల । హరిని గేరుమ్మదూక్తి నలరుబాగరిని
నలచి పెండ్లాడగా వలెనని యెపుడు । దలఁతు నాభాగ్య మేదారి నున్నదియొ
యనిన గాళనృపాలుఁ డలఁతినవ్వాలయఁ । దన ముద్దుకూఁతును దప్పకచూచి
తల్లి! నీవిదియేమి తలఁచితి వాత్మ । చెల్ల! నిన్నెటువలెఁ జేపట్టు శౌరి
ఫాలాక్షుఁ డజుఁడును భావింపలేరు । నీలవర్ణునిఁజూడ నీ నాతరంబె
బాలవుగావున భ్రమపుట్టె నేమొ । యేల చాలింపవే యీమాట లనిన
కన్నతండ్రినిఁ జూచి కలకల నవ్వి । యన్నీలవేణి యిట్లనియె నోయయ్య!
హరి నీవుచెప్పినయటుల దుర్లభుఁడు । పరమాత్ముఁడగు కనంబడఁ డెవ్వరికిని
నైన నమ్మినవారి కతిసులభుండు । వీనులవిందుగా వినుపింతు వినుము
గోపాలబాలికల్ గోరిన వారి । వ్రేపల్లెఁ జేపట్టి విహరింపలేదె
నయగుణబృంద బృందను నేలలేదె । దయ పదియార్వేల తరుణులు తన్ను
వలచినఁ బెండ్లాడి వారితోఁగూడి । యలరఁడే! నునుగంధ మర్పించెననుచు
మున్నుగుబ్జను మోహమున నేలికొనఁడె । వెన్నునిచర్యలు వినలేదె కృతుల
నతని భజింపఁగా నస్మదపేక్ష । హితమతి నోనఁగూర్చు కేల పోవిడుచు
ననిన మాయమ్మ! మహాభాగ్య మాయె।నని సమ్మతించి యాయన దాని మెచ్చి
ముద్దిడుకొనియె నమ్ముదితకు నంత । నద్దిరా యనఁ బూర్ణయౌవనం బొదవె
గచనిచయము మధుకరరుచిఁ గేరె । కుచములతీరు లికుచముల మీఱె
చెక్కులు బంగారుచెక్కుల మించె । పొక్కిలి నునుపొన్నపువ్వు హసించె

మోము పూర్ణేందుగోము నిరాకరించె। కాముని మేల్ తూపు గర్హించెఁ జూపు
బింబంబునకుఁ బ్రతిబింబమై మోవి । డంబూనె భూమిఁవిడంబించెఁ బిఱుఁదు
గగనంబు సొబగు గ్రుంగఁగ నయ్యె కౌను। చిగురుల నడుగు లేచి గురుత్వ మందె
దాని లేఁబ్రాయంబు దర్శించువారి । కానందకందమై యతిశయం బందె
నంతట నొక్కనాఁ డలినీలవేణి । కాంతలు పెక్కండ్రు గదిసి కొల్వఁగను
నొక్క యుప్పరిగపై నోలగంబున్న । చక్కఁగవిల్తు మెచ్చని వన్నెకాఁడు
కమలాకరుండను ఘనసురసుతుఁడు । కమలాసమాన నక్కన్యను జూచి
యిది రతియో! లేక యింద్రుని సతియొ । యదిర! శృంగారసాధిదేవతయొ
యల్ల మోహినియొ! రంభాదులకైనఁ। జెల్లఁబో! యిటువంటి చెలువంబు గలదె
యని మోహవిభ్రాంతుఁడై యింటికరిగి । మనసిజ శరపరంపరలచేఁ గరఁగి
విరహతాపంబున, వేదురుగొన్న । నరుని తెఱంగున నలఁకువ చెంది
యుచితక్రియల్ మాని యూరకయున్న। యచటికిఁ దత్సఖుండగు పురోచనుఁడు
విశ్వకర్మకులుండు వివిధశిల్పముల । విశ్వజనుల్ మెచ్చ వెలసినవాఁడు
చనుదెంచి యతఁడున్న చందంబు గాంచి । యనియె నిట్లని కమలాకర! నేఁడు
నీవున్నవగయేమి నీకేల వచ్చె । నీవెత, నేఁగల్గ నేల యీజాలి
యెంత దుర్ఘటమైన నే ఘటియింతు । వంతఁజెందక వేగ వచియింపు మనినఁ
దనమోము తెలిసి యాతఁడు వేగలేచి । నెనరైన సఖుఁడవు నీకు దాఁపుదునె
యేపనియైన నీవేర్పడ వినుము । భూపాలు సదనంబుపొంత వచ్చుచును
మేలుప్పరిగమీఁద మెలఁగుచునున్న । బాల, సులోచనాభామను గంటి
కనుగొనినప్పుడె గాత్రంబు మఱచి । ననవిల్తునకుఁజిక్కి నలఁకువ స్రుక్కి
యిటువలె నున్నాఁడ నేమందు ననిన । బటుబుద్ధి సొన్నారిపలికె నిట్లనుచు
నా రాజకన్య శ్రీహరిఁదక్క నితర । పూరుషులను దాను బొందనటంచు
బాలత్వముననుండి ప్రతినపట్టినది । ప్రోలెల్ల నెఱుఁగు నెప్పుడు నీవువినవె
నిన్నేలఁ గామించు నృపకన్య యైన। నున్న దిందులకొక్క యుపమ యాకొనుము
నీయింటిధనమును నీకున్నమణులు । నాయింటిసొమ్మును నారత్నచయము
నొక్కటఁగూర్చి నేనొనరించు గరుడి । నెక్కి వెన్నునివేష మీవు ధరించి
వనజాక్షి మేడపై వ్రాలెడి నటుల । నొనరింతు సూత్రప్రయోగంబు వలన

నందున నిన్ను శ్రీహరియని యెంచి । మందయాన వరించు మరులావహిల్ల
దీమసమ్మున సొమ్ము రెమ్మని యతని । హేమరత్నానఘు లెల్ల గ్రహించి
తన యింటిసొమ్మెల్లఁ దానొనగూర్చి । కనకమయంబుగా గరుడి నొనర్చి
మకరకుండలములు మహనీయరత్న । మకుటంబు కౌస్తుభమణిహారలతయుఁ
గంకణంబులు భుజాంగదనూపురములు । కింకిణీజాలసంకీర్ణ కాంచికయుఁ
గరమొప్పఁ గృత్రిమకరములు రెండు । దరచక్రశార్ఙ్గగదానందకములు
కనకాంబరము శిల్పకలనఁ గల్పించి । దనుజారిరూపు ప్రత్యక్షమైనట్లు
గావించి మఱియు సింగారించి జాళు । వావన్నెపులుఁగుపై వాని నెక్కించి
యిరవొంద వినువీధికెగిరెడు సూత్ర । మెఱింగించి జడియక యోగమటంచుఁ
బలికిన సూత్రంబు పాణిఁదెమల్చి । వినువీధికెగసి యవ్విప్రనందనుఁడు
బాలికయున్న యుప్పరిగపై వ్రాలె । నాలోనఁ జెలు లమ్మ! హరి వచ్చెననుచు
భయభక్తి వినయసంభ్రమయుక్తిఁ దెలుప । రయమున లేచి యా రాజకుమారి
ముంగురుల్ సెదర నెమ్మోము సెమర్ప । నంగముల్ వణఁక హొన్నందియల్ మొరయ
కంగుల రవిక పక్కన వ్రక్కలుగను । శృంగారరసమెల్లఁ జింద నేతెంచి
బలుకాంతి దిశలెల్ల బంగారు సేయ । ఛలనైనతేఁయుపై సవరొందు వాని
కరగతశంఖచక్రంబులవాని । హరువొందు కౌస్తుభహారమ్ము వాని
వలెవాటుగాఁ బదార్వన్నె పచ్చడము । చెలువొప్ప ధరియించి చిగురుకెమ్మోని
చిఱునవ్వువెన్నెలల్ చిలికెడువాని । నెఱచందు నిరసించు నెమ్మోమువానిఁ
గనుగొని యితఁడె సాక్షాద్విష్ణుఁడనుచుఁ । దనువెల్లఁ బులకింపఁ దటుకున లేచి
పన్నిటఁ దత్పదాబ్జంబులు గడిగి । కన్నుల హర్షాశ్రుకణములు దొరఁగఁ
దన పటాంచలమునఁ దడియొత్తి బత్తి । దనర నాదండ కైదండ యొసంగి
పడకింటిలోఁ బువ్వుబాన్పున నుంచి । తడయ కాతనిరాక తండ్రికిఁ దెలుప
నతఁడును హర్షించి హరి యల్లుఁడాయె । గృతకృత్యత ఘటిల్లె నిపుడని తలఁచి
తగువారితోవచ్చి దర్శించి పెక్కు । నగలఁ బూజలొనర్చి వైకుంఠవాస!
కేశవ! మాధవ కృష్ణ ముకుంద । యీశ! హృషీకేశ! యిభరాజవరద!
నాకోర్కె లీడేరె నాతపంబలరె । నాకులం బతిపావనంబయ్యె ననుచు
వంది కైవడి పెక్కువగలఁ గీర్తించి । చందనగంధి నజ్జవరాలిమిన్న

చారులోచన సులోచన దారవోసె । నారూఢభక్తిఁ గృష్ణార్పణంబనుచు
నందున నానందమంది యాద్విజుఁడు । మందహాసమున నమ్మనుజేశుఁ జూచి
తొలిజన్మమున మీరు దొడ్డతపంబు । సలుపుట నేను సాక్షాత్కరించితిని
నీకూర్మితనయ యిందిర యంశమునను । నీకుఁ గల్గుటఁజేసి నే వరించితిని
సకలదేశాధీశసమితి జయించి । యిఁక సుఖస్థితినుండు మిలరాయ! యనుచు
నా మామ వీడ్కొల్పి యతులగుణాభి । రామ సులోచనారామఁ జేపట్టి
యలరుఁబాన్పునఁ జేర్చి యంగజకేళి । నలరించి వివిధసౌఖ్యము లందుచుండె
హరి యిల్లటపుటల్లుఁ డాయెనటంచుఁ । గరముద్ధతి వహించి గౌళభూవిభుఁడు
కురుమద్ర గాంధార కుకుర కాశ్మీర । కరహాట మరహాట కర్ణాటలాట
శకభోట చోళపాంచాల సాళ్వాది । సకలదేశాధీశసమితి గైకొనక
ప్రల్లదంబులుపల్కి ప్రాభవంబెసఁగ । నుల్లాసమున మించ నుర్వీశులెల్ల
జతగూడి గౌళదేశవిభుండు మనల । మతినించుకెంచక మత్తిల్లినాఁడు
హరి యల్లుఁడాయె నటంచుశౌర్యమున । వెరవక యందఱ వేధింపఁ దొడఁగె
హరికైననేల భయముఁజెంద మనకు । హరిచేతఁజచ్చిన నపవర్గ మొదవు
చావక గౌళభూజాని గెల్చిన మ । హావిభవఖ్యాతు లబ్బు నీక్షణమె
యని వితర్కించి సమస్తభూపతులు । ఘనగజరథతురంగ భటాళిఁ గూడి
బహుళతరాక్షోహిణీపరివృతులగుచు । సహితభీకరుఁడైన యగ్గౌళవిభుని
పురి చుట్టువిడిసి యార్పులు నింగిముట్ట । మురజ వాదిత్రగోముఖ శంఖపటహ
భేరీధణంధణల్ పిక్కటిలంగ । వీరహుంకారముల్ విస్తరిల్లంగ
నని యొనరింప రమ్మని దూతనంప । విని కీర్తిధాముండు వెలవెలఁబోయి
వివిధదేశాధీశవితతి నొకండ । బవరంబుఁజేసి నేఁబరిమార్పఁగలనె!
వెతయేల నాయింట వెన్నుఁడున్నాఁడు। జితదైత్యుఁ డతనికి క్షితిపతు లెదురె!
హరి కెఱింగించెదనని లేచి యంతి । పురమున కరుగునప్పుడు రహఃకేళి
చెలియాకుమడుపులిచ్చినఁ బంటఁగొఱికి। వెలఁది! యీఁదగునంచు వేఁడెడువానిఁ
గపటమురారి వైఖరి నొప్పువానిఁ । జపలత గడియ కాజలజాక్షిఁ బిలువ
నాయింతి తమయయ్య యదె వచ్చెననుచు। నాయనకెఱిఁగించియరుగుదెంచుటయుఁ
బరనృపుల్ బహుసైన్యపరివృతులగుచుఁ। బురిఁజుట్టుకొన్నారు పూబోఁడి యిపుడు

ఈమాట మురవైరి కెఱిఁగింపు మనిన। భూమీశుమాట లప్పొలఁతి దెల్పుటయు
విని గుండెదిగ్గన విప్రనందనుఁడు। వినిశితాస్త్రము చెవి వేసినట్లైన
దిగులొంది యొకలేనిదిటవు దెచ్చికొని। మగువ! దైత్యులఁ ద్రుంచుమచ్చక్రమునకు
నీనరాధము లెంత! యిందఱ నిపుడె। నేను శిక్షింతు మీనృపతి రక్షింతుఁ
గనుఁగొందుగాకని గ్రక్కున లేచి। కనకమయాకారగరుడుని నెక్కి
వలమురి డాకేల వేయంపుఁగత్తి। వలకేల ధరియించి వడి దివంబునకు
నల సూత్రమెగఁబట్టి హైరణ్యకాంతి। కలితగరుచ్ఛటల్ గగనాంతరమున
ధగధగలీనంగఁ దనుకుచు నాత్మ। జగతీసురుండు విచారింపఁ దొడఁగె
నిక్కంబు హరినని నృపతికుమారి। నిక్కైక్కవడి వరించి యిన్నినాళ్లుండి
కడపటఁ బగవారిఁగని భీతిఁగూరి। విడిచి పోవగరాదు విడిచిపోకున్న
నీరాజుల జయింప నేసమర్థుఁడనె। యూరక పోనేల! యుదువీధి నుండి
హరిబిరుదులు కొన్ని యభినుతుల్ చేసి। వెరపించి చూచెద వీరుపోకున్న
మఱిమీఁద నేనొకమార్గంబు పట్టి। పఱచెదగాకంచు భావంబునందు
యోజన గావించి యుగ్రుఁడై యల్ల। రాజులఁ జూచి దుర్వారోక్తిఁ బలికె
నోరోరి! దుష్టసముద్యములార। యోరిదుర్మదులార! యోరాజులార!
యెఱిఁగెఱిఁగియు మీర లేవసియించు। పురముఁ జుట్టుకొనంగఁబోలునే! చెపుడ
నాశక్తి వినలేదె! నాచక్రధార। నాశమొందిన మురనరకాది దైత్య
వీరులకంటెను వీరులె! మీరు। చేరెఁగాలము మీకు సిద్ధ మీమాట
యిందఱ నొకపెట్ట నిదె గదాహతిని। మ్రందింతునో! లేక మత్కరోద్దండ
కోదండనిర్ముక్తఘోరకాండముల। భేదింతునో! మహాసితఖడ్గధారఁ
గడికండలుగఁ జేసి గండడంపుదునో। కదువడి నిపుడె చక్రము ప్రయోగించి
మీతలల్ ఖండించి మీజోళ్లుతోళ్లు। చేతులు డొక్కలు చించి వ్రేయుదునో!
పలుమంది నూరక పరిమార్చు టేమి। ఫలమని కృపతేటపడఁ దెల్పినాఁడ
నామాటవిని పోయిన శుభంబు గలుగు। హామికఁ బోకున్న ననుభవించెదరు
మున్ను బ్రాఁజదువులు ముచ్చిలించికొని। మున్నీరుఁ జొచ్చు సోముకుని ద్రుంచితిని
కూర్మమై ఖరిఁ దఱిఁగొండ నెత్తితిని। దుర్మదుఁ గనకాక్షుఁ ద్రుంచి యీభూమిఁ
గిరినై ధరించితిఁ గినిసి హిరణ్య। నరసింహమూర్తినై నఖములఁ జీఱి

యశని నందనునిఁ బ్రహ్లాదు నేలితిని । శతమఖునకుఁ యాచనఁ జేసి బలినిఁ
గొలిచితి మూఁడడుగుల ముజ్జగముల । నిలనున్న రాజులనెల్లఁ గ్రోధమున
ముయ్యేడుమారులు ముట్టి కీఁటడిచి । యియ్యనా! విప్రుల కీధరమెల్ల
దశరథరాజనందనుఁడనై పొడమి । దశకంఠుఁద్రుంచిన తత్కథ వినరె!
బలరామమూర్తినై పాపకర్ములను । గెలిచినకడిమియుఁ గృష్ణరూపమున
బూనిచేసిన మహాద్భుతకరక్రియలు । వీనులనిడరేమొ వికటాత్ములార!
బుద్ధరూపమునఁ ద్రిపురదైత్యాహృతి స । మిద్ధతేజము గూర్పనే! కపర్దికిని
గలికినై యిఁకమీఁద ఖలుల నడంపఁ । గల క్రమంబెఱుఁగరె! గర్వమింకేల
నన్నెదిరించి యెంతటివారికైన । మిన్నకపోరాదు మిత్తిచేఁ బడక
ప్రాణముల్ వలసినఁ బారిపొండనిన । నానరేంద్రులు దుర్మదాంధులై యనిరి
జలజాక్ష! నీచేతఁజచ్చినఁ దమకుఁ । గలుగు వైకుంఠలోకము ధ్రువంబుగను
నిహలోకసౌఖ్యంబు లేము వర్జించి । యహిశాయి! నీతోడనాజి యొనర్ప
వలసివచ్చితిమి దేవరచక్ర మనిపి । గెలువు మందటివంచుఁ గేకలువైచి
పరశు పట్టిస గదా ప్రాస శరాస । శర ముద్గర కృపాణ శక్తి త్రిశూల
చక్రాది బహువిధ సాధనకోటి । విక్రమంబునవైచి వీఁకఁ జూపుటయు
విప్రకుమారుండు వెలవెల నగుచు । నాప్రహరణముల కళు కానహిల్లఁ
బొడవుగా బంగారుపులుఁగు సూత్రమున । నుడువీధి కెగఁబట్టి యో దేవదేవ!
యోనందనందన! యోసదానంద! । నానెగుల్ దీర్పవే నలినాయతాక్ష!
హరియోడెఁ బగవారి కను సపకీర్తి । హరియించికొమ్మని హరి స్మరింపుచును
బారిపోవఁ దలంపఁ బద్మతోఁగూడి । నారాయణుఁడు జగన్నాథుఁ డావేళ
నల్ల వైకుంఠమ్మునందు దృ్యాత్రికి । యొల్లాసియైయుండి యొకనవ్వు నవ్వె
నగిన వెన్నునిఁజూచి నలినాక్షి లక్ష్మి । ఖగవాహ! నవ్విన కారణంబేమి
యానతీవలె నంచు హస్తంబుఁబట్ట । శ్రీనివాసుఁడుపల్కెఁ జెలువరో! వినుము
సాళభూవిభు కూర్మికన్య సులోచ । నాలలనామణి నన్నె కామించి
యితరులఁ బెండ్లాడ నేనొల్ల ననుచు । సతిభక్తిఁ దలఁపగా నక్కన్యఁ జూచి
వలచి విప్రుఁడొకండు స్వర్ణకారకుని । వలనఁ గాంచనపక్షివర్యుని బడసి
మచ్చిహ్నములె పూని మణిసౌధమునకు । వచ్చివ్రాలిన ధరావరపుత్రి చూచి

యలరె నేనని వాని నాత్మఁదలంచి । తలిదండ్రులకుఁ దెల్పి తదనుజ్ఞ వడసి
యావిప్రసుతుఁ జూచి వార్షింపుచున్న । కావరంబువహించి గౌడభూవిభుఁడు
అల్లుఁడాయె ముకుందుఁడనిధరావిభుల। నెల్ల దూషింపుచు హెచ్చియుండఁగను
నారాజుపై వచ్చి యవనీశులెల్ల । వీరత్వమున హెచ్చి విడిసి మాతోడ
పోరికిరమ్మన్న భూసురాత్మజుఁడు । పారిపోవుచును న్యాయ భారమిఁడియె
నదివిని నవ్వీనవని శ్రీదేవి । హృదయేశ! యువ్విప్రుఁడే మీరటంచు
నెరనమ్మి వరియించె నృపపుత్రి యతఁడె।హరియని పూజించి రత్నహారములును
పగతురెల్ల నితఁడె పద్మాక్షుఁడనుచు । జగడంబుగావింపఁ జనుదెంచినారు
ఈవేళ మీరింత కృపయుంచి విప్రుఁ । గావకుండిన నపఖ్యాతి మీకొదవు
హరి యోడెననెనను నపకీర్తి యడఁగ । కరచక్ర మనుపవే ఖలుల ఖండింప
నా మనవాలించి నలినాయతాక్ష! । భూమిభారమ్ము బాపుము వేగ ననుచుఁ
గడవన్నె పొందమ్మిగద్దియ నుండు! పడఁతి దెల్పినవిన్నపం బాదరించి
కనకాంగి! యిదిమంచి కార్యంబు దెల్పి। తని పల్కి యాదినారాయణస్వామి
తనచెంత శతకోటితపనవిస్ఫూర్తి । యొనర వర్తించు నాయుధచక్రవర్తి
ఖలదానవచ్ఛిదాగత దివ్యకీర్తి । చలితార్తి శ్రీసుదర్శనమూర్తిఁ జూచి
యోసుదర్శన దేవ! యుద్ధతి నిపుడె । భూసురాత్మజుని పంపునఁ బోయినటులఁ
బోయి గౌడనృపాలుపురిఁ జుట్టికొన్న । దాయల నందఱ దగ్ధంబుఁజేసి
పఱతెమ్ము పొమ్మనిపనిచిన నదియు । ఖరకరశతకోటికాంతులతోడఁ
బ్రళయకాలాభీల పాథోదజాల । గళదుగ్ర దీర్ఘనిర్ఘాత నిర్ఘోష
పాటిత బ్రహ్మాండభాండ ప్రణాశ । నాటోపయుత మనీషాయత భీత
భూతజాతసమేత భువనాద్భుతావ । దాతగరుద్వీతి దర్పకారాతి
పురుహూతముఖనుత స్ఫుటవిస్ఫులింగ । తరళీకృతాపారతారకంబగుచుఁ
బఱతెంచి వినువీధి బ్రాహ్మణసుతుఁడు । వెఱగందఁ దత్పాణి విడివడినటులఁ
గనుపించి పురిచుట్టు గలహించుచున్న । మనుజనాథుల క్షణమాత్రంబు లోన
పరిమార్చి రథముల భస్మీకరించి । కరులఁ గీటణగించి ఘనతురంగములఁ
జెండాడి సుభటులఁ జీకాకుచేసి । దండిజోదులఁగూల్చి ధ్వజముల వ్రాల్చి
ఛత్రచామరములఁ జక్కుగావించి । గాత్రఖండముల నల్గడల నిండించి

నెత్తుటియేరు లన్నెలవులఁ బరపెఁ । గత్తులతేనికిఁ గలదె! దుర్ఘటము
ఈరీతి విమతులనెల్ల మర్దించి । యారూఢరుచి సహస్రారంబు మరలి
యావిప్రు వలగొని యందఱుఁ జూడ । శ్రీవల్లభునిచెంతఁ జేరె నవ్వేళ
హరికళ ద్విజపుత్రునందు వర్తించె । సిరి శోభగా విలాసినియందు నిలిచె
భావనాశక్తిచేఁ బతి విష్ణుఁ జేసె । నావనితకుసాటి యవనిలోఁ గలరె!
తల్లియుఁదండ్రియుఁ దగినచుట్టంబు । లెల్ల సులోచన నెంచి రవ్వేళ
హరిమూర్తియై కమలాకరుం డలరె । గరిమతోఁ దనకుఁ జక్రము పంపుసేయ
ధరయెల్లఁ బోషింపఁ దనమూమ నునిచి । హరి యకారణకరుణాతిశయంబుఁ
బొగడుచుఁ గాంతతో భువిసౌఖ్యమంది।ఖగవాహుఁ బ్రాపించెఁ గడపట నతఁడు
శ్రీలక్ష్మిలోఁ బ్రవేశించె నాలేమ । వాలుగంటిరో! పతివ్రత సులోచనయె
యీసులోచనకథ యెవ్వరు వినిన । శ్రీసతి వారింట స్థిరలీల నిలుచు
హరికరుణయు గల్గునని చిల్క దెలుపఁ।బొరిఁబొరి హర్షించెఁ బుష్పమంజరియు
నని శంకరుఁడుదెల్ప నవ్వాలికథలు । వినిపింపుమని గౌరి వేడ్కతో నడిగె
సరసపతివ్రతాచరితంబునందు । గరిమఁ బదాఱవకథ సాంగమయ్యె

---

## కాళిగుడిలో సతి పతిని వరించిన కథ

శ్రీవిశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
మరునాఁటి సంధ్యాసమయమున రాజ । వరుదూతి వెనువెంటవచ్చి నిల్చున్న
రంజితహాసవిభ్రమజితపుష్ప । మంజరి నప్పుష్పమంజరిఁ జూచి
చిలుక పల్కులఁదేనె చిలుక నిట్లనియె । కలకంఠి! పతి దైవగతి నెడఁబాసి
నలఁకువఁ బడియు మానము నిర్వహించు । వలనుచేఁ గామించువారి వంచించి
క్రమ్మఱఁ దనభర్తఁగలిసి వర్తిలిన । కొమ్మ సత్కథయొండు కోవిదుల్ దెలుప
వినియుందు నదినీకు వినుపింతు వినుము । వినవిన వీనులవిందుగాఁ దొల్లి
భోటదేశమున నపూర్వసంపదల । నీటొందు మాణిక్యనిధి యన్ పురంబు
సుమనోవిలాస భాసురభోగ కలన । నమరావతినిబోలు నమ్మహాపురము

అలఘు పుణ్యాబనేశ్వరానంద గరిమ । నలకాపురముబోలు నప్పట్టణంబు
ఉరుతరశ్రీపురుషోత్తమఖ్యాతి । హరిపురి కెనవచ్చు నన్నగరంబు
ఘనులు శతక్రతుకర్తలు ధనదు । లనఁగ సత్వసమగ్రు లైశ్వర్యపరులు
గలుగుటవలన నెక్కడ నీడులేక । వెలయు నప్పురమేలు వీరసేనుండు
వినతాత్మపన పరవీర సేనుండు । ... ... ...
నావీరసేనున కర్ధాంగలక్ష్మి । యై విభాసిలుశోభనాంగి యన్ భామ
అభామ హరిభామ హరుభామఁ బోలి । యాభామనోజ్ఞయై యతిశయం బందు
పౌలోమిఁబాయని పాకశాసనునిఁ । బోలిరోహిణిగూడి పొలుచు పూర్ణేందు
క్రియు నోప శోభనాంగిసంగలోలుఁ।డయిసుఖంచియు నపత్యములేమి నతఁడు
జాలిఁజెందఁగ నయాస్పదుఁడను మంత్రి । యేల చింతించెద విందువంశేంద్ర!
యిందు శేఖరుఁగొల్వు మిచ్చునీవలచు । నందను ననిన డెందముకందళింప
దినదినమ్మును బార్వతీపతిపూజ । లొనరింపఁదొడఁగె మహోత్సవం బెసఁగ
నంతటఁ గొన్నినాళ్లరిగిన నొక ని । శాంతంబునందుఁ జంద్రావతంసంబు
నల్లనిమెడకప్పు నందివాహనము । తెల్లని మైచాయ దేవీసమేత
వామాంగభాగమ్ము వలనొప్ప వచ్చి । శ్రీమహాదేవుఁ డాక్షితిపతి ముోల
నిలచిన నతఁడు నెంతేభక్తి వినయ । కలితుఁడై బహునమస్కారముల్ చేసి
వివిధార్చనములు గావించి కేల్మోగిచి । యవిరళపులకాంకురాంకితుం డగుచు
భవనాథ! విభవానుభవ! నాగహార । భవనాశ! కైలాసభవనాఢ్య! శరణు
రాజీవముఖరూపరాజీవరాక్షి । రాజీవపూజ్య పరాజీవ శరణు
శరదరద్యుతి! మదాశర దరాపాది । శర! దక్షహననదావశరద! పరాకు
నందనాపేక్ష డెందమునందుఁ జెంది । నందున నేఁడెద నపవర్గ మొసఁగ
గలనిన్ను కల్పవృక్షముఁజేరి కాయ । వలెనన్న వేదురువలె నందులకును
నిందుశేఖర! నగ కీయవే యొక్క । నందను సుగుణయా నందని నొకతె
ఖలుల నొంచంగల కరవాల మొకటి । నతయు మన్నింపవే! వరద యటన్న
నలరిశంభుఁడుమంచిదటువలెఁగలుగు।తొలుదొల్తఁజంద్రాంగదుండనుసుతుఁడు
జననాథ! యామీఁదఁ జంద్రరేఖయను । దనయ గల్గెడి నడిదం బడిగితివి
యిదిగో యిచ్చితి గొనుమిది పాపమతుల।విదళించు పుణ్యతావిమలమానసుల

నఱకిన తెగడందున నెఱింగికొనుము । నరుల పాపములు పుణ్యము లని తెలిపి
తరవారియొసఁగి యంత ర్హితుండైన । హరుకృప కలరుచు నారాజవరుఁడు
తనయింతి కాళంభుద త్తవరంబు । వినిపించి సముచితవృ త్తి వ ర్తిలఁగఁ
గొన్నాళ్ల కారాజుకొమ్మ గర్భంబు।చిన్నెలు వహియించి శివు కృపాస్ఫూర్తి
నవమమాసమున నందనుఁగాంచె నొకని।రవిచంద్రకవిగురుప్రముఖగ్రహములు
పదునొకండవచోట భాసిల్లువేళ । నిది సుజాతకమని హితు లాడ్కులెంచ
నహికెక్కఁ బుత్రోత్సవంబు గావించి । మహినేత జాతకర్మము మొదలైన
శుభకర్మము లొనర్ప సుతుఁడు వర్ధిల్లె । నభినవశ్రీలఁ జంద్రాంగదుండనఁగఁ
గనకాంగి చంద్రరేఖానామకన్యఁ । గనియెఁ గొన్నాళ్ల కాత్మపతికాంత
కలశాబ్ధివీచిక గన్నహిమాంశు । కళయొ! మాధవలక్ష్మిగన్న చాంపేయ
కళికయో! నవమల్లికావళిగన్న । యలరుగు త్తియొ! రసాలానూన శాఖ
కాంచినచిగురాకొ! ఖనిగన్నమణియొ।యంచితకవిజిహ్వ నగు సూ క్తిరమయొ
కాదంబినీగర్భగతినుండి దోఁచు । సౌదామనీలతాచ్ఛాయయో ! యనఁగ
నాలీల నుదయించి యాబాల పెరిగె । బాలచంద్రుని రేఖ ప్రబలు చందాన
నడలునేరిచెఁ గొన్నినాళ్లకుఁ దొట్రు । పడుచుఁ దా జిలిబిపలుకులు నేర్చె
నాటలాడఁగనేర్చె నటమీఁద ముద్దు । పాటఁ బాడగనేర్చె ప్రతిభ వహించి
చదువుకొనేర్చె విశ్వాసంబుమదినిఁ । బొదువ మాధవశర్మపొంత నక్కన్య
యన్నివిద్యలు నేర్చె నాచంద్రరేఖ । యన్న చంద్రాంగదుం డలరువిల్కాని
చెన్నున యౌవనశ్రీ తులకింప । గన్నతండ్రిఁ బ్రమోదకలితుఁడై చూచి
మాళవేంద్రుని పుత్రి మల్లికాగంధి । శ్రీలొప్పఁ బెండిలిచేసెఁ బుత్రునకుఁ
బెండ్లాడి తండ్రిచెప్పినరీతిఁ గొన్ని । యేండ్లు మిత్రామాత్య హితబంధుయు క్తి
వెలసి దోశ్శ క్తి దిగ్విజయంబొనర్చి । కలిమియు బలిమియు గలిగి వ ర్తిలఁగ
నాసుపుత్రునకుఁ బట్టాభిషేకంబు । చేసి యంతట వీరసేనుఁడిట్లనియెఁ
బ్రజలఁబాలించుట పరమధర్మంబు । సుజనుల మంత్రులఁ జుట్టాల హితుల
నెఱిఁగి పోషింపుమేమెడఁ బ్రమాదంబుఁ।బొరయకు మార్యులబుద్ధుల వినుము
నీ కూర్మిచెలియలి నీలోత్పలాక్షి । శ్రీకాంతకెనయగా సుశీల నేమఱక
యరయుము పెండ్లిప్రాయంబైన వెనుక । సిరులుల్లసిలఁ జంద్రసేనుపుత్రునకు

హేమవర్మునకె యిమ్మేట ఘనసార । నామపురం బాజనస్తుతుం డేలు
నని తెల్పి భార్యతో నతఁడు తపంబుఁ । బొనరించుటకు వనభూమికిఁ జనియెఁ
దల్లి యుఁదండ్రియుఁ దపమున కరుగ । నల్ల చంద్రాంగదుం డర్మిలి తోడ
గురునిచెంగట నేర్చికొనె విద్యలెల్ల । పరిపరియాటలు పాటలు నేర్చె
బాలయయ్యును గళాప్రౌఢిమ వెలయ । నాలేమ కుదయించె నంతజవ్వనము
గమకపూవిల్తుఁడు బంగరుచాయయొడలు। కొమరొందు పెందొడల్ కులుకునెన్నడలు
సరసవిలాసముల్ సారెకుఁ జూచి । మరులొంది యొకనాఁడు మాధవశర్మ
యేకతంబున నున్న యింతి కిట్లనియె । నీకులుకు నీపలుకు నీమేనితళుకు
నీయొంపు నీపెంపు నీమోము సొంపు । నీయొడల్ నీతొడల్ నీచిన్నినడలు
నీచక్కదనమును నీదుజవ్వనము । చూచినఁ దమిమించె సొలపగ్గలించె
మారుఁడు క్రూరుండు మదినిల్వనీఁడు । చేరరావే! నేఁడు చిగురాకుబోఁడి
పుక్కిటివిడెమిచ్చి పూఁపచన్దోయి । యక్కున గదియించి యధరామృతంబు
దయచేసి నామనస్తాపంబు దీర్చి । ప్రియునిగా! నేలవే బింబోష్ఠి! యనుచు
బలిమితోఁ గెంగేలుపట్టిన నదిగొ । చెలివచ్చెనని యుళ్కుచెందించి కేలు
విడిపించికొని మ్రొక్కి వెనువెనుకకేఁగి।పడఁతి యిట్లనియె నో బ్రాహ్మణప్రవర!
సకలవేదంబులు సకలశాస్త్రములు । సకలపురాణముల్ చదివిన మీకు
నీకుచ్ఛితపుబుద్ధి యేల జనించె । మీకుఁ గూఁతురనుగానె! మీకు నన్ గన్న
నీరసేనునకును వేఱెంత గలదె! । ఘోరపాతక మెంచికొన కల్పసుఖము
కొఱకు రద్దొడిగట్టికొనఁ దగదయ్య । గురుసార్వభౌమ! సద్గుణివి గదయ్య
పదరక నావిన్నపము వినవయ్య । మదిఁ గోపతాపముల్ మానగదయ్య!
యని నయవినయప్రియాలాపసరణిఁ । దను వేఁడుచున్న నత్తరుణిపై నలిగి
యా దుర్విచారుఁ డిట్లనియె నోపడుచ! । నాదు ముచ్చటదీర నన్నుఁగైకొనక
వెడఁగుబుద్ధులు నొడివెదవేమె యిట్టి । చెడుమాట లెవ్వరిచే నేర్చినావు
నీకు గల్గినబుద్ధి నీవెంచునీతి । మాకు లేదటె యోసి! మటుమాయలాడి
మంచిది నిను దుష్టసుతియని తప్పు । లెంచి కాఱడవిఁ ద్రోయించక యున్న
నేను బ్రాహ్మణుఁడనే! యింకమీఁదఁ దెలియ । నౌనది నీకని యక్షిగోళముల
చిటచిట నిప్పుకల్ చెదర దంతములు । పటపట గొఱుకుచుఁ బ్రతినగావించి

యచ్చోటువాసి చయ్యన లేచిపోవు । కుచ్చితు నతనిఁగన్గొని చంద్రరేఖ
కరములు ముకుళించి గద్గదకంఠ । పరిణతస్వరమునఁ బలికె నిట్లనుచుఁ
దగవుదప్పినపని తలఁచిన మిమ్ము । తగదన్న నింతక్రోధము పూననేల?
మాయన్నతో దుష్టమతియని దెల్పి।త్రోయింతు నడవులందు నటంచుఁ బ్రతిన
చేసితి రీరేమిచేసిన, మీరు । డాసిన దెవరితోడను దెల్పనేను
నా భాగ్యమిటులుండె నన్నేమిసేయ । నీభూమి విధిసృజియించెనో! యటుల
ననుభవింపఁగవలె నన్యులు చేసి । రననేల! మీరాడినందుకు వెఱచి
కలుషంపుఁబని కొడిగట్టఁగా నోప । నలుక మీరేమిసేయఁ దలంచినారో!
యవియెల్ల గావింపుఁడనిపల్కి యతని । కవనతయై కన్య యరిగె లోపలికి
యొదుపుదప్పిన సర్పమోయన విప్రుఁ । డెడఁద ఘూర్ణిల నింటికేఁగె నంతటను
వనలక్ష్మి ప్రథమర్తువైభవం బెనయు । ననువునఁ గొన్నాళ్ల కాచంద్రరేఖ
ప్రథమర్తువైన వారంబు తారయును।దిథియు మంచిదియైన తెఱఁగెఱింగియును
మది మచ్చరముగ్రమ్మ మాధవశర్మ । యిది శుభదిన మనియె నృపాలుతోడ
ననుజపైఁ బ్రేముడి నమ్మాట సరకు।గొనక రాకొమరుఁ డెక్కుడుగ వేడుకలు
సేయించెఁ జెలినిగై సేయించె సదయుఁ।డై యెంచె తలిదండ్రులనిన వాక్యములు
రెండవపరియును ఋతువయ్యె చంద్ర । మండలానన యొక మంచిలగ్నమున
నదియును గారానిదని రాజుతోడ। నదయుఁడై యెఱిఁగించె నాద్విజాధముఁడు
ఇందునఁ గీఁడేమి యెఱిఁగింపు మవని । బృందారకేంద్ర! యీబిసరుహగంధి
తగుపతిఁ బెండ్లాడి తనయులఁ గాంచి।పొగడొందదా! యన్న భూపాలసుతునిఁ
గని యేకతమున నాకష్టాత్ముఁ డనియె। మనుజేంద్ర! చెలి ప్రథమర్తుదినంబు
వారంబుతారయు వచియింపరాదు । క్రూర మీదినమంతకును విపత్కరము
ధనవస్తువాహన ధాన్యాదికముల । కిన తేజ! హానియగా నిదియింట నున్న
నిది సహోదరియని యింటనుంచికొని । యదవదఁ జెందక యతివ వంచించి
యడవిలో విడిచిరమ్మందున నీకుఁ । గడుశుభంబగు కల్లగాదు నాపలుకు
అన గుండెదిగ్గన నతఁడుశోకించి । యనియె విప్రునిఁజూచి హరిహరి! యెంత
పాపంపుఁ బనిసేయఁ బనిచెద వకట । నీపల్కుచేకొని నెనరింతలేక
చెల్లెలి నడవిఁద్రోసిన విన్నవారు । చెల్లఁబో! దూషణసేయకుందురె

చూచికొండము మీఁద క్షోణీసురేంద్ర! । యాచెల్వచే నేమిహాని యయ్యెనని
నీవేళ మీరింటి కేగుఁడటన్న । నావిప్రుఁడు గలంగి యవనీశతనయ!
పొలఁతిపై కోపంబుపొడమి తెల్పితిని! । కలిగినమాట నిక్కముగఁ జెప్పితిని
యనఘ! బంగరుకత్తియని మెడఁగోసి । కొనవచ్చునె! యిదేమి కూర్మిచెల్లెలని
యాపద కొడఁబడనగునయ్య! యనుచుఁ । జూపిమోపి యతండుసుద్దులుగొన్ని
చెప్పిన నొకకొంతసేపు చింతించి । యొప్పినమనసుతో నుర్వీశసుతుఁడు
ఆలాగె రేపు వేఁటాడువ్యాజమున । బాలఁ దోఁకొనిపోయి భయదకాంతార
సీమలో దించివచ్చెద మీకుఁదెల్పఁ । దామసించుటలేక తగవుగాదనుచు
నావిప్రు వీడ్కొల్పి యరిగె లోపలికి । దైవికం బొకరికిఁ దప్పింపనళమె!
మఱునాఁడుప్రొద్దున మహిపాలసుతుఁడు । కరియానఁ జంద్రరేఖను జేరఁబిలిచి
పొలఁతిరో! మజ్జనభోజనక్రియలు । సలిపి నేవేఁటాడఁజనియెద నిపుడు
వచ్చెదవే! చూచివత్తువుగాని । యచ్చటి మృగయావిహారవైఖరులు
అన విని చంద్రరేఖాంభోజవదన । తనమనంబున విప్రదండశోకంబు
నేమిబోధించెనో! యెన్నఁడులేని । దీమాట యితఁడాడ నేమికారణము
దైవసంకల్పంబు తప్పించికొనఁగ । నావశమే యని నగుమొగంబెత్తి
అన్న! మహాభాగ్యమాయె నీవేఁటఁ । గన్నారఁ గనుగొనఁ గడువేడ్కగలదు
పోయివత్తము రమ్ము బోరన ననుచు । నాయన కటు భోజనాదు లమర్చి
తానును భుజియించి తగు వస్త్రభూష।ణానూన గంధమాల్యములఁ జెలువొంది
చంద్రాంగదునితోడ జవనాశ్వ మెక్కి।చంద్రాననామణి చనియెఁ గానలకుఁ
జని పొదల్ నదులును శైలముల్ గుహలు వనములు కొలఁకులు వల్మీకములును
జూచుచు శరముల సూటిదప్పక యె । రాచూలి మృగముల రంతడంచుటకు
మెచ్చుచు ఫలము లక్కలి నన్న కోసి।యిచ్చినఁ జవిగొని యింపుఁ జెందుచును
శారికల్ పద్యముల్ చదువ నాకొనుచు । కీరికల్ పలుకఁ గోకిలములుగూయఁ
దుమ్మెదల్ మ్రోయ సంతోషించి వినుచు।గమ్మను వాసనల్ గ్రమ్ము పూఁబొదల
చెంతల నిలుచుచుఁ జెలి యన్నతోడఁ । గొంతసేపు చరించె ఘోరాటవులను
నెండచే వసివాడి యిగురాకుబోఁడి । యండఁబాయక తురంగారూఢుఁడైన
యన్నఁ గన్గొని డప్పియయ్యెడి నిచట । నున్నదేనిఁ దటాకమొకటి చూపుమని

యడిగిన సోదరి నతఁడు వీక్షించి । పడఁతి! డస్సితివిదె పద్మాకరంబు
నిక్కడనున్న దే నెఱుఁగుదు ననుచు । నక్కన్యతో నొక్క యంబుజాకరము
చేరి గుఱ్ఱముడిగ్గి చెలియలి డించి । నీరు నిర్మలమిది నెలఁత! త్రావుమని
పలుకఁ గొలంకులోపల డిగ్గి పాద । ములకాంతి మెట్లు కెంపులమెట్లు గాఁగ
నిడువాలుఁజూపుల నిగ్గులందడరి । మెడ నెడఁ గలువల నినుమడిసేయఁ
దన గుబ్బచనుదోయి తమ బంధుజాతి । యనుచు జక్కవపిట్ట లట్టె పైకెగయ
నీమాడ్కి డిగ్గియ కింపుతో డిగ్గి । భామిని కరపదప్రక్షాళనంబు
గావించికొని యుదకము దప్పిదీఱఁ । ద్రావి యందమరు కెందామరల్ రెండు
కరదీప్తి కెనయౌటఁ గైకొనె ననఁగ । ధరియించి వెలువడి తటభూమి నిలువఁ
దరువుల క్రీనీడఁ దళుకు తివాసి । పఱచి మున్నుగఁ బొంకపఱచినవాఁడు
గావున యన్న యక్కరొ· యింతసేపు । నీవిందు శయనింపు నీశ్రాంతి దీఱఁ
దరువాతఁ బోద మిద్దఱ మూరి కనుచు । తరుణికిఁ గపురంపుతావి వీడియము
ప్రియమున నొసఁగ హాన్ బెడఁగు తివాసి।పయి శయనించె నప్పద్మాయతాక్షి
యంతలో హాయికిఁదోయములు।త్రాగించి।శ్రాంతిదీఱిచి తానుజలపాయియగుచు
నలరులతో జడయల్లు దంభమునఁ । జెలియలి నిదురఁబుచ్చె నృపాలసుతుఁడు
అడవిఁ బేరెండలో నటునిటు దిరిగి । బడలి నిద్దురవోయెఁ బడఁతి మైమఱచి
మంచి నిద్దురఁబోవు మానిని గాంచి । వంచకుఁడగు విప్రువచనంబు లెంచి
చెల్లబో! నాకూర్మిచెల్లెలి నబల । కల్ల లెఱుంగని కమనీయశీల
పల్లవాధర గోల బాల నీలీల । నిల్లుఁబాపి దయావిహీనభావమున
నొంటి నిక్కానలో నుంచి నేనెటుల । నింటికేఁగుదు నిద్ర యింతలోఁ దెలిసి
నను చెంతగాన కన్నా! యెందుఁబోయి । తని యెంతగుందునో! యతిభీతిచేత
నెక్కడి కరుగునో! యెవ్వరిచేతఁ । జిక్కునో! యడవిలోఁ జెలి దిక్కులేని
యొడలిదియేలని యూహలోఁ గలఁగి।విడుచునో! ప్రాణముల్ విపినమార్గముల
నయ్యయో! పెండ్లిపాయముదాని నొకని।కియ్యక యడవిలో నిటు లొంటిడించి
చను నన్న గలఁడె! భూస్థలిఁ దానుదక్క।నని పెక్కువగల నాయన వితర్కించి
యడవిలో విడిచి రమ్మని చెప్పె ద్విజుఁడు । విడువక పోరాదు విధి వ్రాసినటుల
నిది మెలంగెదు తెగి యింతకుఁబూని।తుదకు గొంచించుట దుష్కార్య మనుచు

నార్యులు దెల్పుదురని నిశ్చయించి । ధైర్యంబుపెంచి సోదరి నందు డించి
కరవాలమూని యాకడ నాలుగడుగు । లరిగి పోవుటకుఁ గాళ్లాడక తిరిగి
పఱతెంచి నిదురించు బాలనీక్షించి । మరలె తేజీ నొక్కమ్రాఁకునఁ గట్టి
యీతేజిపై నెక్కి యెక్కడికైన । రాతిరిఁబోవచ్చు రమణి కటంచుఁ
దనలోఁదలంచి యాతఁడుచన్న వెనుక । వనిత నిద్దుర లేచి వాలుకన్దోయి
విచ్చి నల్దిక్కు లన్వేషించి యన్న । నచ్చోటఁ బొడగాన కతిభీతిఁ జెంది
కొలఁకుల గెలఁకుల కుంజపుంజముల । పులినభాగంబుల భూరుహచ్ఛటల
చేరువ తో(పు) శిఖరిదేశములఁ । జేరుచు బెట్టుగాఁ జీరుచు పేద
యడుగులు దొట్రిల నశ్రుపూరములు । జడిగొని చెక్కులఁ జాలువాఱఁగను
నన్న చంద్రాంగద! యయ్యయో యడవి।నన్నొంటి డించి మిన్నకపోవఁ జనునె
పగదాననా యేమి! పలుకవు దైవ । మగచాట్లఁ బెట్టె నన్నడవి పాల్సేసె
నెక్కడ వెదకుదు నెక్కడఁజొత్తు । నిక్కాఱడవి నొంటి నేనెట్లునిలుతు
దైవమా! విప్రుండు దలఁచిన యటుల । గావించి తాతఁడుగాబోలు! నీవు
కాకున్నఁ బ్రతిన యాఖలుఁ డూనినటుల । నీకానలోన నన్నేలఁ ద్రోసితివి
యని పెక్కుభంగుల నార్తయై వనరు । వనరుహనయనకు వామాంగకములు
చలియించె మఱి శుభశకునముల్ గొన్ని।తుళకించినవి చూచి తొయ్యలి మదిని
వెరగొంది యివిగొన్ని వింతలుపుట్టె । హరు వరంబునఁ బుట్టినట్టి నాకిట్టి
యడలు పుట్టంగరా దయ్యాశ్వరాజ్ఞ।బొడుమునో యిఁకమేలుప్రొద్దుగ్రుంకెడిని
కనువెలుంగునన యెక్కడికైనఁ బోవఁ । జను తేజిపై నెక్కి "ఝూ" పరమేశ
యని వాగె గదలింప నది యేపథమునఁ।జనియెడినో యందె చనియెద ననుచుఁ
దన యన్న వేషంబు తాను ధరించి । వనిత యశ్వమునకు వలగొని మ్రొక్కి
యెక్కి వాజి గదల్ప నించుక నిలక । జక్కఁ దూరుపుబాట జరిగె నంతటను
రవి యస్తమించెఁ దొరపుసంజకావి । చివురుకెంజాయ పశ్చిమవీథి నించె
కటికచీఁకటులు దిక్కుతటు లావరించెఁ । బటుకాంతితోడ నంబరవీధి ముంచె
దైవమే శరణని తరళాయతాక్షి । యావేళఁ దేజిపై నటఁబోవఁబోవ
నడవిలో ముందట నందొక్కచోట । మిడుఁగురు పురుగుల మెఱుఁగు లేకముగ
వెలుఁగొందుగతి నొక్కవెలుఁగు గాన్పింప।నలివేణి యిదిసన్నమగు దీపరుచియొ

ఖద్యోతకాంతియో! గదియంగఁ బోయి యీద్యుతిఁ గనుగొందు నిఁకనని తలఁచి
పరువున నశ్వంబుఁ బఱపి యచ్చోటి । కరిగిన నొక్క కాళికాయతనంబు
పొలుచు చతుర్ద్వారముల మించు బోరు।తలుపులతో సుధాధవళకాంతులను
రాకేందునగు గోపురములతో గొప్ప । ప్రాకారములతో నభస్థ్సలి నొరయుఁ
దోరంపు సాంబ్రాణి ధూపవాసనల । తో రమ్యదీపపంక్తుల మించు గర్భ
గృహము వాకిళ్లతో కేవలవిభవ । మహిమతో నటఁగనంబడిన హర్షించి
యాశ్చర్యరసమగ్నుడై తేజి డిగ్గి । పశ్చిమద్వారాగ్రభాగంబు నందు
దీపించు కొలనిలోఁ దేజికి నీళ్లు । జోపి తానును బరిశుద్ధాంఘ్రిపాణి
కమలుడై స్వాదూదకంబులు ద్రావి । రమణి తత్తటమున రాజిల్లు తోఁపు
లోన గుజ్జుముగట్టి లోపలి కరిగి । యానందమునఁ గాళికాంబిక కెరఁగి
హస్తముల్ ముకుళించి యస్తోకఫణితిఁ । బ్రస్తుతించెఁ బరాకు భర్గప్రోయాల!
సాష్టాంగ మంబ! మహాదేవి! శరణు । యిష్టప్రదాయిని! యీశ్వరి వినతి
తల్లివినీవె నాతండ్రివి నీవె । యెల్లబంధులునీవె యేలిక వీవె
యనదనై చేరితి నంబ నీపాద । వనజముల్ నన్నేటువలె మనిచెదవో
యన్న నన్నొంటి కాఱడవుల విడిచి । చన్నాఁడు నను గన్న జననీజనకులు
మున్నెపోయిరి బాల్యమున నిట్టియెడరు।గన్న నన్నికఁ బ్రోవగదవె! మాయమ్మ
యని దీనయై మ్రొక్కి యశ్రుపూరములు।గనుగవ దొఱఁగ గద్గదకంఠి యగుచు
నడలుచున్న నయ్యంబ కారుణ్య।మడరఁ బువ్వులురాల్చె నట దీపమునను
గాళిక ప్రేరేప గాళియుఁ బలికె । మేలగుపద్ధతి మెలఁత దేహమునఁ
బులకాంకురమ్ములు పొడమెఁ బూజారి।యల దేవిఁ బూజించి యంతకు మునుపె
చేరువఁ దనపల్లెఁ జేరుటఁ జేసి । యారేయి నెవ్వారు నట లేమిఁ జేసి
విజనస్థలంబని వెఱచుచు దేవి । భజన మేమఱక మున్ బాహ్యనిబద్ధ
వాజిపైనున్న తివాసు మున్నుగను । దాజవంబునఁ దెచ్చి తద్గర్భగృహము
వాకిటఁ బఱచుక వరుసతో నాగ్గు । వాకిళ్ల తలుపులువైచి బిగించి
అంబయె నాకు సహాయం బటంచు । నంబుజముఖి దివ్వెలారిపోకుండఁ
జక్కగా నిడి తనశయ్య శయించె । దిక్కుమాలినచోట దేవుఁడే దిక్కు
ఆరేయి ఘనసారమను పురంబేలు । శ్రీరాజితుఁడు చంద్రసేనుని సుతుఁడు

హేమవర్ముఁడు మహామృగయా వినోద । కామియై మంత్రిశేఖరపుత్రుఁడైన
యచలునితోఁగూడి యడవికి నేఁగి । యచట ననేకమృగావళి నొంచి
యిరువురు నొక్కచో నిఱులుగల్పించు । కిరుల రెంటిని విలోకించి నీవొకటి
యేనొకటిని వధియింత మటంచుఁ । దాను ప్రధానినందనుఁడు నేర్పాటు
గావించికొని తురంగములపై నెక్కి । యావరాహముల నుద్ధతి వెనుకొనిరి
యొకటి దక్షిణమున కుఱికిన మంత్రి । సుకుమారుఁ డతిజవస్ఫురణతోఁ దఱిమె
తూర్పుఁబట్టిన పందిఁదుని మెుఁదమిద । లిర్ప రాజసుతుండు లివ వెంబడించెఁ
జరమదిగ్వ్యాపినదేశం బదిచేర, । నరిగె భూవరసుతుం డట రవి గ్రుంకె
పాఱెడి నదెయిదె పందియటంచు । నారాజసుతుఁడు గాఢాంధకారమున
బాటయొక్కటి కనఁబడిన నాబాట । ఘోటకారూఢుఁడై కొదకక చనియెఁ
జని మూఁడునాల్గు యోజనములు గడచి । కనియె ముందట దీపికాప్రకాశంబు
గని యందుదీపంబు గానగయ్యెడిని । జనులెవ్వరైన నచ్చట నుందురనుచు
హాయము నిబ్బరముగా నటఁ దఱిమికొని। ప్రియమునఁ గాళికాగృహభూమిఁ జేరి
చేరి తూరుపు సరసీతటంబందు । వారువం బతఁడు సత్వరమున డిగ్గి
యలసె గుఱ్ఱంబని యంబువుజోపి । కొలనిచెంగటి తోఁట గుఱ్ఱంబుగట్టి
తన దప్పిదీఱ నందలినీరు గ్రోలి । చనుదెంచి కాళికాసదనాంతరమున
తలుపుసందున దివ్వె తప్పకచూచి । జలజాక్షి గాజులచప్పు డాలించి
విరిబోణి యల్కుడు వినఁబడుచున్న । దిరవొందినా రీడ నెవ్వరో యనుచుఁ
దలఁచి స్వాంతమున గొంతభయంబుగదుర। నెలుఁగెత్తి యటులనే హేమవర్ముండు
ఎవ్వరీగుడిలోన నిపుడున్న పుణ్య । లివ్వాకిలిపుడొకయింతఁ దీసినను
గొంతసేపిచ్చటఁగూర్కి నే వేఁగి । నంత నేఁగెద నూరికని పల్కరింప
నొంటి నున్నదిగాన నుత్పలగంధి । కంటికి నిదురరాక భయంబువలన
గుండె దిగ్గనవడంకుచు నేటిబ్రతుకు ! । కొండొకదాననై కూర్మినెచ్చెలులఁ
బాసి దాదులఁబాసి భ్రాతనుబాసి । భూసురుకతమునఁ బొగిలెద ననుచుఁ
గలికి సంభ్రమునీళ్లు గరిటెలఁగొలిచి । కొలిచి వేదనఁగుంది కంది లోఁగంది
యున్నదిగాన ద్వారోపాంతసీమ । పిన్నయెలుంగుతోఁ బిలుచురాసుతుని
పలుకులు విని మాఱుపలుకక యున్న।నళుకుఁ జెందియుఁ జెంద కతఁడుపల్మారు

వాకిలిఁ దెరువుఁ డెవ్వరు పుణ్యులార! । రాకొమరుఁడఁగాని రాకాసిగాను
అడవిలోఁ గాడ్పడి యరుదెంచినాఁడ । బడలినానని పెక్కుభంగుల వేఁడ
నాపల్కు లాలించి యలివేణి యితఁడు । రాపట్టిననియె నేరాజనందనుఁడొ
తెలిసి వాకిలి మఱిఁ దీసెదననుచు । నలసి నిద్దుర లేచి నటువలె లేచి
వాకిట నిటఁ బిల్చువార లెవ్వారొ! । నీకుఁ బేరేమి యీనిశ నొంటి నిటకు
రాఁ గారణంబేమి రాజపుత్రుఁడవె । నాఁ గల్కితో రాజనందనుం డనియె
పురుషుఁడవో లేక పొలఁతివో తెలియ । దెఱిఁగింతు నావిధంబెల్ల నాకొనుము
ప్రాచ్యదేశ క్షమాపతి చంద్రసేనుఁ । డచ్యుత పదభక్తుఁ డతని కేసుతుఁడ
హేమవర్మాఖ్యుఁడ నిట వేఁటవచ్చి । యీమహాటవిఁ ద్రోవయెఱుఁగక తిరిగి
దీపంబు వెలుతురు దిలకించి యలరి । యీపజ్జఁ జేరితి నెంతలేదనఁ
వాకిలిఁదెఱచి నావంతఁ దెలిచిన । నీకు మేలగునన్న నెలఁత హర్షించి
తనతండ్రి తెలిపిన ధరణీశసుతుఁడె । చనుదెంచె నిద్దేవి సత్కృప ననుచు
నందెలు ఘలుఘల్లుమనఁ గరకంక । ణాందోళనార్భటు లందంద నిగుడ
వడి లేచివచ్చి యవ్వాకిటితలుపు । గడియలు తిగిచి రాఁగదవయ్య! యనుచు
నతఁడు లోపలికిరా నంతటిలోన । నతివ వాకిలిమూసి యవ్వల నిలిచె
నిలిచిన దాని పెన్నెఱికప్పుఁ గొప్పు । తళుకుఁ జెక్కులు మోముదమ్మి మెఱుంగు
కెమ్మోవికావి పొక్కిటి చక్కదనము । నెమ్మేనిచాయ లానృపసూతి చూచి
యిదిభద్రకాళియో! యిది దేవసతియొ। యిదిమోహినియొ! లేకయీవిలాసములు
కలుగునే! మానవకాంతల కనుచు । దలఁచి భయంబునఁ దనువువడంక
నూరకనిలుచున్న నుర్వీశసుతు నొ। యారంబు మొగముసోయగము పేరురము
విరివియుఁ దనుకాంతివిభవంబు బాహు । పరిఘుల నిడివియుఁ బలుచనిమోవి
హరువును బిడికిటనడఁగెడు నడుము । మురుపును జెవులతో ముచ్చటలాడు
నిడువాలుఁగన్నుల నీటు పెందొడల। బెడఁగును బలుమారుఁ బ్రియమొప్పఁ జూచి
తనువల్లి పులకించఁ దమకంబుమించ । ననబోణి మోహించి నాన వహించి
యితఁడె నాపతియైన నేనెకా! భాగ్య । వతినంచు నూహించి వడఁకుచునున్న
యితని భీతి యడంతు నిఁకనని యెంచి । యతివ దగ్గఱచేరి యతనిచే నున్న
జముశాణ మచ్చోట నవలొందఁ బఱచి । భ్రమమూని కూర్చుండు పార్థివతనయ!

బడలికదీఱఁ గప్రపువీడె మిదిగో । జడియక కొనుమని సరసోక్తి నొసఁగి
నన్ను గన్గొనినయంతనె చిన్నవోయి।యున్నాఁడ వదియేమియో!యని యడుగ
కలఁగిన హృదయంబు గట్టిచేసికొని । పలికె రాకొమరుఁ డోపద్మాయతాక్షి !
సరిలేని రత్నభూషణములు పూని । సరిప్రొద్దువేళ నీశాంభవి యొద్ద
నొంటిగానున్న నీయునికిఁ గన్గొనిన । గెంటదే! ధైర్యంబు గిరిభేదికైన
నెవ్వతె వీవు పేరెయ్యది నీకు । జవ్వని యెక్కడ జన్మదేశంబు
తలిదండ్రు లెవ రొకింతయు భీతిలేక । నిలువఁ గారణమేమి నేఁడీస్థలమున
దిబ్బ దాడక యథార్థము దెల్పుమనిన । నబ్బిసరుహగంధి యతని కిట్లనియె
జనవంద్య! భోటదేశం బేలురాజు । వినయనిధానుండు వీరసేనుండు
నాజనకుఁడు మజ్జనని శోభనాంగి । రాజశేఖరుని వరప్రభావమునఁ
జంద్రాంగదుండను సత్కుమారకునిఁ । జంద్రరేఖాభిఖ్య నవరొందు నన్ను
గని పెంచిరంత నాగాదిలియన్న । ఘనయౌవనస్ఫూర్తి గాంచి వర్తిలఁగ
నతనిఁ బట్టముగట్టి యరిగె మాతండ్రి।యతివఁ దోడ్కొని తపం బాచరించుటకుఁ
దలిదండ్రులేఁగిన తరువాతఁ దండ్రి । వలెఁ బ్రోచెనను గారవమున మాయన్న
యీడేరినట్టి నన్ హేమవర్మునకు । వేడుకఁ బెండ్లిగావించెద ననుచు
మాతండ్రి యనుమతి మాయన్న దలఁచు।నాతఁడవో! లేకయన్యుఁడో!యెఱుఁగ
నింక నేవచ్చిన హేతువు వినుము । మందరధీరుండు మాయన్న నేఁడు
వేఁటాడ రాఁ జూడ వేడుకపుట్టి । ఘోటకారూఢనై కూడి వచ్చితిని
అల మహాటవిలోన నశ్వంబుడిగ్గి । పలుమెకంబుల వెంటఁబడి యాతఁడరిగె
నతనిగానకయొంటి నడవిలోనుంటి । నతిభీతి రవిగ్రుంకినందాఁక వినుము
అన్న రాఁడాయె నేఁడవిలో నొంటి । నున్న కీఁడగునని యుత్తమాశ్వంబు
పై నెక్కివచ్చి యీభవనంబు చేరి । యేనున్నదాన నావృత్తాంత మిదిగో !
అడవిలో దిక్కులేదాయెగా యనుచుఁ । గడు ఖిన్నమతి నుండగా నింతలోన
నీవు వచ్చితిగాన నెదభీతి మానె । నావిని చంద్రసేనతనూజుఁ డలరి
యయ్యింతితోడ నిట్లనియె నీకేల । యియ్యెడ సందేహ మిందీవరాక్షి
హేమవర్మాఖ్యుఁడ నేనె నామీఁద । నీమదియున్నది నే నెఱింగితిని
తడవేల యింక గాంధర్వతంత్రమునఁ । బడఁతి ! నన్నిపుడె చేపట్టఁగా రాదె

యరుణోదయమువేళ నశ్వంబు నెక్కి । పురమునకేతెమ్ము పోద మిద్దఱము
మీాయన్న బలశాలి మృగభీతిఁ జెందఁ । డాయనకై ఖేదమంద నేమిటికి
నని కేలుగ్రహియింప నతివ లజ్జించి । చనునె! మహాకాళి సన్నిధానమున
నటువంటి పనులుసేయఁగ నుత్సహింప । గటకట నీవెఱుంగని నీతిగలదె
నీభార్యనే నీవునిజము నాపతివి । యీాభద్రకాళిక యెదుటనిల్పినది
నాభాగ్యమునఁ గన్గొనంగల్గె నిన్ను । శోభనోత్సవముల సొంపొందఁగలము
నీ యధీనంబు నానెమ్మేను నిందు । ప్రాయంబు తోఁచినపగిదిఁ జేపట్టి
యేలుకొమ్మని బాల యేర్పడఁబలుక । గాళికాంబాసమ్ముఖమున నాతఁడును
దగుబాసలిచ్చె నంతట నవ్వధూటి । మగవేషమూని యమ్మహిపాలసుతుఁడు
తేజినెక్కినఁ దనతేజి తానెక్కి । రాజీవసఖుఁడు పూర్వనగాగ్రసీమఁ
గనుపించకయమున్న కాళికిమ్రొక్కి । ఘనసారపురికి నాథునుఁగూడి చనియె
తెరువున వింతలుదెలుపుచు నతఁడు । సరసోక్తులాడుచు స్వపురమార్గమున
నక్కన్యఁ దోకొని యరుగుచునున్న । దక్షిణంబుననుండి తన్మంత్రిసుతుఁడు
అడ్డబాటను దురంగారూఢుఁడగుచు । దొడ్డవేగమునను ద్రోవకు వచ్చి
దొరదిక్కుఁజూచి యెందులకేఁగి యెచట।నిరవొందితివి రాత్రి యే నిన్ను వెదకి
కానక దంష్ట్రి చిక్కకపోవ నొక్క । కాన నిల్చితి నంధకారంబు నెరయ
మరల నిన్గనుగొన్న మదిఖేద మణఁగె । నెఱిఁగింపు మీాఘనుం డెవ్వఁడటన్న
నా రాజసుతుఁడను నచలప్రధాన! । యీారాతు నాసఖుం డిరుపుర కొక్క
కాళిగేహమున సఖ్యము సంఘటిల్లె । బాళితో నన్నెడఁబాయంగ లేక
యరుదెంచుచున్నవాఁ డర్ధరాత్రమున । నిరవుఁజూపె నితండు హితశీలుఁడనిన
నది నిజంబుగ నెంచి యమ్మంత్రి వెంటఁ । గదలిరా ఘనసారకటకంబుఁ జేరి
యారాత్రి శుభలగ్న మార్యులుదెలుప । వారిజాక్షిని హేమవర్మ పెండ్లాడె
మఱునాఁడు మంత్రికొమారునితోడ । నెఱిఁగించె నక్కాంత వృత్తాంతమెల్ల
నీరీతిఁబెండ్లాడి హేమవర్మయు । మారమణుం డారమణితోడఁ గూడి
పరిపరివిధముల బంధభేదముల । సురతకేళిని దేలె సుఖలోలుఁడగుచుఁ
కేళిసౌధములందుఁ గృతకాద్రులందు । లీలావనములందు లేఁజిగురాకు
శయ్యలయందుఁ గాసారదేశముల । నుయ్యాలలందు మేలుప్పరిగలను

జంద్రశాలలయందుఁ జలువలుచిందు । చంద్రాశ్మవేదికాస్థలముల యందు
సొలవ కొండొరుఁజూచు సొలఁపుఁజూపులకు । జిలిబిలినవ్వులు చేరికల్ గాఁ
గమకించు తమ నిండుకౌఁగిలింతలకు । సమరసవైఖరుల్ సహవాసములుగఁ
గళలుట్టిపడు తమ కలయికలకును । గళరవస్ఫురణంబె కైవారముగను
మురువుమీఱిన తమ మోవినొక్కులకు । సరససీత్కారంబు సంబంధులుగను
దమకంబునఁదనర్చుతమముచ్చటలకు । సుముఖచుంబనగతుల్ చుట్టమ్ములుగను
నిరువురుఁ బెనఁగొను నింపుసొంపులకుఁ । బరవశభావంబు బలుభూషణముగ
చెక్కులు గొనగోళ్లఁ జెనకనిచ్చుటకు । పుక్కిటివీడియంబులె లంచములుగ
నొక్కటఁబొలయల్క లుడుగఁజేయుటకు । నొక్కకైమ్రొక్కు లేయుంకువల్ గాఁగ
నమ్మరుఁ డాడించునట్టి జంత్రంపు । బొమ్మలో! యనురాగములె వధూవరుల
యాకృతుల్ దాల్చెనో యన వేఱులేక । యీకైవడి రమించి రేడుగాలంబు
అంత దౌహృదవతియయ్యె నయ్యవతి । కాంతుఁడు సంతోషకంధి నోలాడ
నంతకుమున్నె చంద్రాంగదధరణి । కాంతునిపేరిటఁ గమ్మ వ్రాయించి
హేమవర్ముఁడు పంప నెలమి నాలేఖ । నామహీశకుమారుఁ డటఁ జదివికొని
తనసోదరికి మున్ను దలఁచిన విభుఁడె । యెనగూడె నిది దైవయోగంబు గాదె
నాపుణ్యవశమున నాతోడు మంచి । కాపురం బూను టాకర్ణింపఁగలిగె
చెడుబుద్ధి విప్రుండుచెప్పిన గోల । నడవిలో విడిచితి నదయభావమున
మత్సహోదరి ప్రథమర్తుకాలంబు । కుత్సితంబని ఛాలఁగ్రోధించి తెలిపె ?
నాచండ మరసెదనని రహస్యముగ । ధీచతుర్ముఖులైన ద్విజుల రప్పించి
తనసహోదరి సమర్తదినంబు దెలుప । విని వారలిది మహావిభవప్రదంబు
ఆకన్య భోగభాగ్యములచే ధన్య । యై కుమారులఁగాంచి యభివృద్ధిఁ జెందు
మగఁడెల్లపుడును ప్రేమమున లాలింప । జగతిలో బహుకీర్తిసంపద లెనయు
చెలఁగి కీఁడని యిదిచెప్పిన యట్టి । ఖలులెవ్వరని వారు ఘనశాస్త్రవిదులు
గావునఁ దెలుప నాకర్ణించి పటురు । షావేశ చలితాత్ముఁడై పురోహితుని
తప్పిదం బౌకదాది తన కేకతమునఁ । జెప్పిన నిప్పులుచెదరఁ గన్గొనల
నావిప్రురప్పించి యలిగి కొట్టించి । వేవిధంబులఁ దిట్టి వెతలఁ గుందించి
యిలుముట్టుకోల్ పట్టియీయూరనుండ । వలదుపొమ్మని వెలువడఁగొట్టఁ బనిచెఁ

బుత్రమిత్రకళత్రములతోడఁ గూడి । ధాత్రీజనమ్ములందఱు నిందసేయ
నపకీర్తిఁగంది దేశాంతరంబందె । విపరీతమతికెందు వెతలందకున్నె!
యటుల మాధవశర్మ నార్తిఁగుందించి । తటుకున మఱిఁదికిఁ దనసహోదరికి
బహురత్న భూషణాంబర వస్తువాహ । సహితంబుగా నొక్కజాబు వ్రాయించి
యనిచిన కరిహయస్యందన సుభట । జనకన్యకాసహస్రంబులఁ గొనుచు
నతనిమంత్రి సునీతి యరుదెంచి యుచిత । గతి హేమవర్మునిఁగని యరణంబు
మీభావ మీకుఁ బంపెనటంచుఁ బలికి।జాబొసంగిన సంతసముఁజెందె నతఁడు
నలచంద్రరేఖయు ననుఁగునెచ్చెలులఁ । గలసి మాధవశర్మ గాసి చెందినది
వారు దెల్పఁగ విని వసుధామరునక । హో! అట్టుప్రాపించెనోటు నామీఁద
నురక ద్వేషించి నన్నూరికిఁ బాపె । మొఱకుల కాపదల్ మొనయవే యనుచు
నన్న విచారించినందుల కలరు । చున్నంతఁ గొన్నాళ్ల కుత్పలగంధి
నవమాసములు నిండిన కుమారునొకని।ధవుఁడురంజిలఁ గాంచెఁ దదనంతరమున
దాదులు మిక్కిలిదయ దయివార । నేఁద రానుతుఁడు రెండేండ్లవాఁడయ్యె
మాణిక్యపురినుండి మరకతవజ్ర । మాణిక్యములు గొంచు మణిమర్మవిదులు
కొందఱు ఘనవర్తకులు చనుదెంచి । యిందురేఖాసమన్వితు హేమవర్మఁ
గాంచి చంద్రాంగదక్ష్మావల్లభుండు । పంచిన మణులు తప్పక యొప్పగించి
యతనిలేఖనొసంగ నదిగొని చదివె । పతిచెంత నక్కాంత బహుమానఫణితి
నందలివక్కాణ యధిపుఁ డాలించి । యిందుముఖీమణి నీక్షించి పలికె
దనకు రాఁదీఱ కీర్తితటి నీవుగనిన । తనయుని నినుఁజూడఁదలఁచి మీయన్న
పరివారయుక్తి గొబ్బునఁ దనపురికి । నరుగుదెమ్మని వ్రాసియంపించెఁ గాన
పోయివచ్చెదవె! పూఁబోణి నీహృదయ।మీయెడ నెటులున్న దెఱిఁగింపు మనిన
నన్నాతి యిటులనె నధిప! మావదిన । నన్నను గనుగొన నాకాంక్షగలదు
కరిరథహయభటోత్కరము నావెంట । బఱతేర మాయన్న పట్టణమ్మునకుఁ
జని యట నొక్కమాసము నిల్చిమరలఁ । జనుదెంతు మీపాదజలజసన్నిధికి
నని త్వరఁజేసిన నాగాక యనుచు । దనభార్య వెంటఁ బ్రధానినందనుని
పొమ్మని సెలవిచ్చి భూరిచిత్రాంబ । రమ్ములు మణినికరమ్ములు వివిధ
వస్తువాహనము లవ్వారిగా నిచ్చి । సుస్తనీరత్నంబు సుతునితోఁ గూడ

ననుపమపల్యంకికారూఢఁ జేసి । పనిచెఁ జతుర్విధబలములతోడఁ
బనిచినఁ బతియాజ్ఞఁ బ్రమదాలలామ । ఘనసారనగరంబు గ్రక్కున వెడలి
దాదులు నెచ్చెలుల్ ద్వారపాలురు భ । టాదులు తనవెంటనంటి యేతేరఁ
గొన్నిగ్రామంబులు కొన్నిపల్లియలు । కొన్నిపట్టణములు గొన్నియేఱులును
గ్రమియించి యొకనాఁటి రాతిరిపూట । ప్రమద యందొక రెడ్డిపాళెంబుఁ జేర
నయ్యూరు చంద్రాంగదాధీన మగుట । నయ్యెడఁ దగుకాఁపు లతిభక్తియుక్తి
నెదురుగావచ్చి యయ్యింతికిఁ దగిన । సదనంబు విడిదియొసంగి కావలయు
నులుపాలు పట్టించి యున్నసేవలకు । వలయుఁ బదార్థముల్ వరుసనిప్పించి
యాదరంబొనరింప నచలుఁడన్మంత్రి । యాదేవి సౌందర్య, మాపె చిన్నారి
ప్రాయంబుగని మోహాపరవశుండగుచు । నేయనువున దీనినెనయుదు ననుచుఁ
బురి వెడలినమొదల్ బుద్ధినూహించు । పరమదుర్జనుఁడౌట బైటిచావడిని
దగుగుఱికాండ్రతోఁ దానువసించి । తెగువమై నేఁటిరాతిరి యెట్టులైనఁ
బొలఁతిఁ బ్రబోధించి భోగింతుఁ గదిసి । బలిమిగాపింతు నొప్పకయున్న ననుచు
నలసి నిద్రించు నాయకులను భటులఁ । దిలకించి సేన లంతికమున లేమి
కరవాలహస్తుఁడై గ్రక్కున లేచి । తరివేచి ద్వారముల్ దాటివచ్చుటయు
వాకిటిగొల్లండు వైధేయుఁ డతని । రాకఁగన్గొని సత్వరమున లోపలికి
నీవేళవచ్చుట కేమికారణము? । దేవి భోజనవేళదే మఱెవ్వరికిఁ
జనరాదు నిలుమన్న, సచివుఁడిట్లనియె । నను నివారించునంతటి బల్లిదుఁడవె
దౌవారికాధమ! తలఁగిపొమ్మనుచు । కావరంబున నొరకత్తి దూయుటయు
నంతఃపురము గాచునటువంటి నన్నొ । కింతఁ గైకొనక నీ వీనిశావేళ
రాణివాసముఁ జొచ్చి రావలదనఁ గ్రొ । వ్వాణంబు దూసితేపాటి దీబుద్ధి!
చూతము నఱకుమంచును జోరనీక । యాతఁడు గద త్రోవ కడ్డంబువైచె
నడ్డంబువైచియు నట్టె డాచేయి । యొడ్డిన నాతని యుప్పలవాయి
నఱకె నమ్మంత్రినందనుఁడు కరాసి । సొరిగి వాఁడిలఁగూలెఁ జొటజొట నచటఁ
దొరఁగె దోరమగు నెత్తురుకాల్వ లిటుల । నఱకి లోపలికేఁగి నరనాథుదేవి
సకియ వడ్డింప భోజనముగావింప । నొకయింత యళుకులే కుద్ధతివాఁడు
మగువచెంగటి పట్టెమంచంబు మీఁదఁ । దగవేది కూర్చుండి దర్పించిపలికె

భోజనంబిపుడటే పువ్వారుబోడి! । రాజులేఁ డేమికార్యముగ నింద్రాక
జాగు చేసితివి నీజవ్వనంబునకు । నీగుణంబునకు నీ నెఱతనంబునకు
హేమవర్ముఁడు తగఁ డే వన్నెకాఁడ । నీమీఁద దయవాఁడ నీచిత్త మెఱిఁగి
కామతంత్రంబులఁ గరఁగింప నేర్తు । భూమికి బొక్కసంబునకు నే విభుఁడ
నీవు నన్ జేపట్టితేని యీక్షణమ । భూవిభుఁ బడఁబెట్టి భోగింతు నిన్ను
దొరసానిఁజేసి, నాదోఃప్రతాపంబు । తరుణి! నీవెఱుఁగ వెంతబలాఢ్యుఁ డైన
గడికండలుగఁ జేయఁగలఁ బోరిలోన । నెడసేయ కిపుడె నన్నేలికొమ్మనుచుఁ
బైఁ బడవచ్చినఁ బకపక నవ్వి । యాబాల వీఁడు కామాంధకారమునఁ
దగవును ధర్మంబు తప్పియున్నాఁడు । తగదు కోపింప నిత్తఱిఁ బ్రియోక్తులను
దప్పించికొనుటగదా! నేరుపనుచు । నప్పుడు చింతించి యాద్రోహి కనియె
పదర నేమిటికోయి! ప్రజ్ఞానిధాన । మొదటనే మదవతీమోహనాంగుఁడవు
నెఱమంత్రి వదిగాక నెలఁతలభావ । మెఱిఁగి మరుల్కొల్ప నీవె నేరుతువు
నీవంటి సరసుండె నెఱిదిక్కు వేఁడ । భావజుఁ డలుగులపాలు సేయఁగను
వలదనఁగలరె యేవనజాక్షులైన । చలచిత్తులకు మాకు సత్యమెక్కడిది
పట్టె మంచంబుపైఁ బవళించియుండు । మిట్టట్టనకఁ దాల్మి నించుక సేపు
యిదె భోజనంబాయె నే లేచివచ్చి । కదిసి నీకోరికఁ గడతేర్తు ననుచు
వలపుపుట్టఁగఁ బల్కి వాని వంచించి । చెలి భోజనమొనర్చి చేతులువార్చి
కదువడి నినుపపెన్ గడియల నమరుపడకయిల్ సొచ్చి యెప్పటిఁ గవాటములు
బిగియించి యదరక బెదరకయున్న । వగలాడిఁ బేర్కొని వాఁడిట్టులనియె
వంచనచేసి కవాటంబుమూసి । పంచాస్త్రిచేఁ గాసిబఁడ నన్ను ద్రోసి
యిచ్చోటువాసి నీవేఁగినఁ బోవ । నిచ్చెదనే! యోసి యిపుడని డాసి
తలుపుదట్టిన నభేద్యంబై యొకింత । చలియించకున్న నచ్చటఁ బాసిచనక
వనిత వాఁకిలితెరవక నన్నుసరకు । గొనకుండితేని నీకొడుకు నీక్షణమ
కరఖడ్గహతి గడికండలుగాఁగ । నఱకుదుమనన్న నన్నాతి భీతిలక
యోరి! స్వామిద్రోహి! యోరినీచాత్మ । దారుణక్రియలకుఁ దలఁకక నీవు
శిశుహత్య సేసినసేయుము క్రోధ । వశుఁడవై యిట్టి దుర్వ్యాపారఫలము
నెచ్చెర ననుభవించెద విఁకమీఁద । మచ్చికగల నెరమంత్రి వటంచు

నినునమ్మి నావెంట నృపకుమారుండు । పనిచినంతయుఁ గల్గెఁ బలుమాట లేల!
యేలినపతి కిటు లెగ్గొనరించు । కూళల నెందుఁ గన్గొన మీవుదక్క
నిసువు నీచేత మ్రందిన మ్రందుగాక । యొసఁగుదు నే! మానవోరి! నీకనుచుఁ
గలసి తిట్టఁగ వాఁడు కినిసి చేకత్తి । జళిపించ హా! సాహసంబేల బాలు
డాయకుమనుచు నడ్డమువచ్చు దాదిఁ । ద్రోయుచుఁ గణఁతల దోఃకృపాణంపు
పరుజునఁ బొడిచి కోపమునఁ దిట్టుచును । బరవశఁ గావించి బంగారుతొట్ల
నిదురించు బాలుని నిశితఖడ్గమున । నదయుఁడై ఖండించి యచ్చటఁ బ్రజలు
కొందఱు పడిలేచి కూఁతలువేయ । నందుండ వెఱచి వాఁడరిగెఁ జావడికి
సావడినాయకుల్ సందడియేమి । యీవేళ ననిన వాఁడేమి లేదనియె
వాఁడు పోయినతరువాత నప్పువ్వు । బోఁడి లోపలియిల్లు భోరన వెడలి
పటసాల కరుదెంచి పడియున్న దాది । నట ఖండితుండైన యర్భకు నవలి
వాకిటఁ ద్రెళ్ళిన నైధేయుఁ జూచి । యీకుటిలాత్ముని హితుఁడని యెటుల
నమ్మితినో! రాజనందనుఁడని వగచి । క్రమ్మఱఁ బతిసమ్ముఖమున కాతుణమె
చననెంచి యుత్తమాశ్వముదేర సాధ్వి । పనిచి హొన్సరిగంచుపాగ ధరించి
పడదల్రోఁ గత్తి కబ్బాయి మున్నైన । యడిపూలములను రౌతంగి వహించి
ధనరత్నభూషణోత్కరము లేమఱక । పెనుమూటగాఁ గట్టి పెరటిలో మున్నె
పాదియుంచిన నిజాశ్వముమీఁద వైచి । యూపటఁ దక్కుపదార్థంబు లరయు
కొఱఁకింటిలోపలఁ గొంతసేపున్న । సరిప్రొద్దగుట డస్సి సాధ్వి నిద్రించె
అంతలో నొకచోరుఁ డాయింటివెనుక । నంతకుమును పె ద్రవ్యము మ్రుచ్చిలింపఁ
దలఁచి వేచియునికి దత్తడిమీఁది పెరిక । హరియింపఁ జేరినయపుడె యక్కాంత
సరగునఁ జనుదెంచి సాహిణీయనుచుఁ । దురగంబుకడ నున్నదొంగను జూచి
యోరి సాహిణి! మనయూరికిఁ బోవు । దారిదప్పకయె ముందఱ నీవుచనుము
నీవెంటఁ బఱపెద నే తేజి ననిన । నావంచకుఁడు మంచిదని వాజిఁ బట్టి
ఘనసారనగరమార్గంబు దప్పించి । తనయూరికేఁగు బాటను బట్టిచనియెఁ
దలఁతు రూకక మహోద్యమముల నరులు । తలఁచినయటులేల దైవంబు తలఁచు!
తప్పుద్రోవను మ్రుచ్చు దనుగొనిపోవ । నిప్పగిది లతాంగి యిది తనప్రోలి
తెరువనిచనిచని తెలతెలవారఁ । బెనుతోలు కుళ్లాయి పెట్టిన తలను

మందులముడి క్రొటమలసిన సిగయుఁ । గందెనచాయయుఁ గలమేనివానిఁ
గని నీవుసాదివిగా వేటివాఁడ? । వెనసిగుఱ్ఱమువెంట నెటులవచ్చితివి?
యిప్పుడీవచ్చిన దేయూరిత్రోవ । చెప్పరా? యని గరిసించి గద్దించి
యడిగినదానికి నవ్వాఁడు గొంత । జడిసి యిట్లనియె నేచౌర్యంబువలన
బ్రదుకుదు నలరెడ్డిపాళెంబులోన । వెతదీఱఁ గన్నంబువేసి యనేక
ధనము గ్రహించిపోఁదలఁచి మీయింటి । వెనుకనుండెడి నన్నువీక్షించి సాది
మన యూరిత్రోవ నిమ్మావు గ్రహించి । చనుమన్న మీయూరిజాడ నేపోక
తొరమీఱిమీ యూరిత్రోవఁదెచ్చితిని।దురగంబు,నన్నుఁదుదుంకుకుఁజెందియును
గలికి ధీరోదాత్తగావున మదినిఁ । గలఁకచెందక చోరుఁగని యిట్టులనియె
నోరి! నీయుండెడి యూరిమార్గమున । వారునమ్ము గ్రహించివచ్చితి ననిన
సంతోషమయ్యె నిచ్చటికి నీపల్లె । యెంతదూరముగల దెఱిఁగింపు మనినఁ
బగటికి నేనున్నపల్లెకుఁ బోవ । నగు రావలయునన్న నౌనుగాదనక
వానివెంబడిఁ గొంతపడిఁ జని యెండ । నైన ముందరఁ గమలాకరం బొకటి
వనవీధిఁ గనుగొని వానితో ననియెఁ । జన దెండలోఁబోవ సరగున నీవు
నియ్యంతికపుఁబేట కేఁగికావలయు । బియ్యంబు పప్పును బెరుగును నెయ్యి
మొదలైనవి పదార్థములు గొనితెమ్ము । వదల కిక్కడ నేను వంటసేతు నని
వానిచేతికి నొక్కవరహా యొసంగఁ । బూని వాఁడదిగొనిపోయె పేటకును
నంతలో నిక్కాంత యాత్మరూపమునఁ । జెంతనున్న కొలంకుఁజేరి స్నానంబు
గావించి మఱి భద్రకాళిఁ దలంచి । దేవి యొక్కఖలుండు తెగటార్చె సుతుని
నీవొసంగిన బిడ్డనికి హానిపుట్ట । గావచ్చునే యనికరములు మొగిచి
సేవించి ప్రార్థనసేయఁగా మునుపె । దేవి మంత్రి కరాసిఁ దెగిన తత్సుతుని
గరుణతో బ్రతికించి గ్రక్కునవాని । పరిసరస్థునిఁజేసి పాలింపుచుండె
ఆ రెడ్డిపాళెంబునం దచలాక్షుఁ । డారాజమంత్రియు నఖలసైనికులు
తెల్లవారకమున్నె దిగ్గనలేచి । యల్లరాజవధూటి నభ్యంతరమున
వెతకి కానక తొట్ల వెల్లువఁగొన్న । సుతునిరక్తముఁజూచి చోద్యంబు నంది
సతియేది!సుతుఁడెందుఁజనియెనో!యనుచు।వెతఁజెందనమ్మంత్రివికటాత్ముఁడగుట
వారితోననియె నివ్వనజాక్షి నిజము । గా రాజసతిగాదు కాళీగృహమునఁ

గని నడురేయి నిక్కము రాజకన్య । యని పిశాచినిఁ బెండ్లియై మనరాజు
భ్రమసెగదా! కాఁపురముచేసె కొన్ని।సమ లిందుఁదెలిసె రాక్షసియిది యగుట
తనకుమారునిఁ బట్టి తానెభక్షించి । తనద్వారపాలుని దాదిని గొట్టి
పడవైచి చనియె నిబద్ధియిమ్మాట । పుడమితేనికిని దెల్పుదము రండనుచు
సేనలతోఁగూడి చెచ్చెరఁ బోయి । మానవేంద్రున కాక్రమంబు దెల్పుటయు
నతఁడు మోహంబున హాహాకార మెసఁగ।నుతునెంచి సతిమంచిసొబగు వర్ణించి
యడల, వాఁడనియె దయ్యముగూర్చి జాలి।బడనేల? భూపాల! భార్యయంచనిన
నది దయ్యమైనఁ జంద్రాంగదుండేల! । ముదిగొ సైదోడని ముదమొప్ప మాకు
నరణంబువనుచు రత్నాభరణములు । కరిరథాదులు, బోనగ త్తియ లేల
యడలెద! రక్క మమ్మందఱఁ బాసి । కడు గూర్మిమాని యెక్కడికేగి తనుచు
నిదమిత్థమని నిశ్చయింపరా దనుచు । నదవదపడఁగఁ గూహకపుమాటలను
దొర వంతమాన్చె నద్దుష్టమానసుఁడు । తరువాత గొల్లయు దాదియు నచట
జనములు సేదదేర్చఁగ మూర్ఛదెలిసి।కొని గాయములుమాని కొన్నినాళ్లకను
దమయక్క విఘనిచెంతకుఁ బోక యెందు । గమనించెనో యని కడుఖేద మంది
యరిగిరి దేశంబు లందరయుటకుఁ । గరియాన చంద్రరేఖ తెఱంగు వినుము
చోరునిఁ బేట కచ్చోప్పున ననిచి । వారిజానన సరోవరతీర వృక్ష
రాజికలోన వార్వము గట్టివైచి । వాజిపై బర్వు లవ్వలివంక దాఁచి
యొక పొదరింటిలో నున్నఁ జోరుండు । సకలపదార్థముల్ సయ్యనఁ గొనుచుఁ
బఱతెంచిపొదలోనఁబదివన్నెహొన్ను । మెఱుఁగులుమైఁబర్వమీటాంగదుదాని
తళుకుఁజెక్కులదాఁ దలిరువిల్కాని । కలికి గేరెడుసోయగము గలదాని
నలకాంత నళికాంతరాక్రాంత చంచ । దళికాంత నైల్యభాగలకాంతఁ జూచి
యిది తలోదరియాట యెఱుఁగక్రీవఱకు । మది నక్కియుండితి మగవాఁడటంచు
వగపేల! ధనమణివ్రజముతో నిపుడు । జిగిబిగి గుబ్బలచేడియ దొరకె
నీవన్నెలాడితో నింటికి నేఁగి । కేవలశ్రీలొంది క్రీడింతు ననుచుఁ
జేరవచ్చిన వానిచిత్తం బెఱింగి । యారాజవదన యిట్లనియె నీకేల !
వెరగంద, నేఁరాచవెలఁదుక నౌదుఁ । దొరకితి నీచేతఁ దుందుడుకుడిగి
యోయి!నన్ గొనుచునీయూరికిఁబొమ్ము।పోయినప్పుడెయిత్తుపొసఁగమద్ధనము

నావిని శబరుఁడెంతయు సంతసించి । నీవుచెప్పినయట్ల నే మెలంగెదను
సందేహమొందక చనుదెమ్మటంచు । మందలించిన మంచిమాటల వాని
నమ్మించి పోక యన్నముచేసి తాను । నెమ్మి భుజించి వానికిఁ దుష్టిగాఁగ
నన్నంబు వెట్టి రాతంగ్గు వహించి । యన్నళినదళాక్షి హయముపై నెక్కి
భానుఁడు చరమాబ్ధిఁబడి మున్గువేళ । వానివెంబడిఁదదావాసంబుఁ జేరి
చేరి యశ్వముడిగ్గి చెంతఁగట్టించి । భారముల్ డింపించి పడకయిల్లొకటి
వాఁడుసూపిన నందువసియించి మంచి । వేఁడిపాల్ చక్కెర వివిధఫలములు
తెచ్చి యర్పించినఁ దృప్తివహించి । యచ్చోరుఁడిలుసొచ్చి యరుదేరఁ జూచి
వానితోననియె నీవలపు నే సతము । గానమ్మటకు శంకగల దొండువినుము
నీసొమ్ము నాసొమ్ము నీవునేననెడి । యాసలు భేదమ్ములడఁచినఁగాక
మనసురంజిలదు నీమదివేఱులేక । యెనయఁగోరెదవేని యిదిగొ నాధనము
నీచెంతనుంచెద నీవుగడించి । దాఁచిన సొమ్ముతో దాఁచుమీక్షణమె
యనినఁ గోమలిమాట లర్థాతురుండు । గనుకవాఁడూకొని కడుసంతసించి
తనయింటి ధనమెల్ల దాఁచక తెచ్చి । పెనుకుప్పగాఁ బోసె బిత్తరి యెదుట
పోసినఁ దనసొమ్ము ప్రోఁగుతోఁ గలిపి । యీసొమ్ముదాఁపు మీ వెచ్చోటనైన
మీఁద నీకొకటి నెమ్మి గణింతు ననిన।నా దొంగబంటు భాగ్యంబాయె ననుచు
నా గృహాంగణభూమి యటఁద్రవ్వి పెద్ద। కాఁగులో మణులు నిష్కములునుబోసి
తామూఁతఁజేసి యేర్పడకుండఁ బాతి।యామన్నుపైఁ గప్పి యరుగుదెంచుటయు
భామిని యాదొంగబంటును బిలిచి । యీమెయి నీకొక్క హితము దెల్పెదను
గోడచేర్పు తలాపుక్రోటి క్రిందటను । బైఁడికరాటంబు పాతి వచ్చితిని
అందులోపలఁ బదియాఱు వజ్రములు।పొందుగా నుంచి యెప్పుడుదాఁచి యుందు
నవి ప్రాణతుల్యంబు లందొక్కటొకటి । భువియెల్ల నేయు నిప్పుడె నీవు పోయి
రేపు మాఁపటికిఁ జేరి గృహాంతరంబు । కాపులు గనకుండఁ గన్నంబు వేసి
భరణి గైకొనివేగ పఱతెమ్మ టన్నఁ । బరితోష మొప్ప నప్పాటచ్చరుండు
తన యింటియాపె కత్తరళాక్షిఁ జూపి । మనదొరసాని యమ్మగువపై భక్తి
గలిగి యీయింటికిఁ గావలసినవి । యెలమితోఁ గొని తెచ్చి యిమ్మని చెప్పి
యా యర్ధరాత్రంబునందె వాఁ డరిగె।త్రోయ నేర్తురె!పొలంతులమాయ జనులు

ఆరాజవదనయు నానెడు రేయి । చోరునిసతి నిద్రచొక్కిన నుండ
సరగున లేచి యాసకలధనంబు । పెరికలో నైచి యోపిక తేజిమీఁద
నల్లన నుంచి రౌతంగు వహించి । యల్ల గుఱ్ఱము నెక్కి యనిలవేగమున
నేమని చెప్పుదు నింతి యగ్గలిక! । యామద్వయమున నాతామడఁ జనియె
నంత సూర్యోదయం బగుటయు నవని । కాంతకుమారునిగతి త్రోవఁ బట్టి
చనుచున్న నొకవణిగ్జనుఁడు తన్మార్గ । మున వెంబడించి యోభూపపుత్రుఁడవు
ఎక్కడికేఁగెద వీ తేజి నెక్కి । యొక్కరుండవు భటవ్యూహంబు లేదె
యన విని మా సేనలన్నియు వెనుక । చనుదెంచుచున్న వెచ్చటికేఁగె దీవు
ఏజాతి నీది పేరెయ్యది యనిన । నా జలజాక్షితో నవైశ్యుఁ డనియె
అనఘ! నే వైశ్యుండ నర్థదత్తాఖ్యుఁ । దనరుదు తావు సౌదాసపట్టణము
సరకు లమ్ముటకు నిచ్చటి పేట కరిగి।మరలి పోయెద రమ్ము మాయూరిత్రోవ
సకలపదార్థముల్ సమకూర్తు ననిన । ముకురాస్య మంచిది ముందర నీవు
త్రోవఁ జూపుచుఁ బొమ్ము తోడ నే తెంతు।నీవెంట నని పల్కి నిబ్బరంబుగను
నల తేజిఁ బఱప మధ్యాహ్న మగుటయు।నలినాక్షి బడలి ముందర నొక్క సరసి
వనమధ్యమునఁ జూచి వైశ్యున కనియె । చనగూడ దవల నిచ్చట నిల్వవలయు
నలఁత వుట్టెడు తండులాది పదార్థ।ములు గొని యతిశీఘ్రముగను రాఁగలవే!
యిట భోజనము చేసి యేఁగుద మనుచు। బటుబుద్ధినొకకొంత పైకం బొసంగ
నావైశ్యుఁ డొకపల్లె కరిగి వంటకును । గావలసిన వెల్లఁ గ్రక్కునఁ దెచ్చె
నంతలో మగవేష మాయింతి మాని । యంతికసరసి స్నానాదులు దీర్చ
నావైశ్యనందనుం డట్టె వీక్షించి । యీవింత కని విని యెఱుఁగ మెచ్చటను
నిందాఁక నృపపుత్రుఁడే యని యుంటి । నిందుముఖీమణి యిది మోహనాంగి
దీనిఁ జూచినఁ జాలదే యింద్రపదవి । యైన నిరర్థకం బది యెంచనేల!
యని నోరు దెఱచుక నట్టె చూడఁగను । వనిత క్రేఁగన్నుల వాని వీక్షించి
భ్రమానిమద్వన నుండి మది చోద్యపడుచు।మానక చూచుట మర్యాదయగునె?
జలములాడఁగ, రాచజాతి కోమలిని । వలదు సందియమంద వైశ్యకుమార!
వంటవారువు లైన వడి భుక్తి సలిపి । యింటికిఁ దోకొని యేఁగుము నన్ను
నీవెంటఁ జనుదెంతు నీకోర్కెఁ దీర్తు । నావిని వైశ్యుఁ డానందంబుఁ జెందె

పొలఁతి మున్నుగ దాను భోజనక్రియలు । సలిపి పూరుషవేష సంగతి గన్న
యంగన తేజిపై నరుదేర మనసు । చెంగలింపఁగ వాఁడు చేరె మందిరము
మందిరమ్మునఁ జేరు మసగప్పినటుల । నిందుముఖీమణి యింటిసొమ్ముల్లఁ
దనసొమ్ముతో గూర్చి తగుపెట్టె నునిచి । విను మిది సెల్వు గావింపఁగా రాదు
నీచేతి కొసఁగెద నేను ముమ్మాల । ఆ చెక్కడపు టుంగరం బొకటిపుడు
అదిగొని మణిదత్తుఁ డలరెడు జాల । పద మను నగరంబు ప్రాపించి యతని
చేతి కొసంగు మిచ్చినవేళ యెఱిఁగి । యాతఁడు నూఱువే లప్పుడె యొసఁగు
నది గొనిరమ్ము పొమ్మని వీడుకొలుప । నదనమా ధనకాంక్ష నయ్యుంగరమ్ము
గొని వేఁగుజామున గొబ్బునఁ గదలి । చని రెండుజాలకు జాలపదమ్ము
ప్రాపించి యంగడిబచ్చులలోన । నేహొందు మణిదత్తుఁడితఁడని యెఱిఁగి
చెంగటఁ గూర్చుండి చేతియుంగర మొ । సంగిన నది చూచి సందేహమంది
యీయుంగరమ్ము నీకెక్కడ దొరికె । నోయి! వైశ్యకుమార యున్నదున్నటులఁ
దెలుపుము కొంక కీదేశాధినాథుఁ । డలఘువిక్రముఁడు చంద్రాంగదనృపతి
ధరియించు భూషణోత్తమ మిది యనిన। వెఱచి వైశ్యుఁడు వణిగ్విభున కిట్లనియె
నెవ్వరిదో యిది యెఱుఁగ నే నిన్న । జవ్వని యొక్కతె జవనాశ్వ మెక్కి
మాయిల్లుఁ జేరి యీ మణిభూష యొసఁగి । నీయొద్ది కిది గొని నేఁడె పొమ్మనఁగ
వచ్చితినన నవిశ్వాసంబు మదిని । హెచ్చఁ గోమలియెవ్వ? రెటుల నీసొమ్ము
నీచేతి కిచ్చె సందేహాస్పదంబు । రాచవారల యుంగరము గొనువారు
గలరె! పోబడి యెఱుంగక నీవు పోవ । వల దుందు మని తలవరులకుఁ జూపి
యావైశ్యనందను నప్పగించుటయు । దైవమా యని వాఁడుతల్లడింపుచును
చెఱసాలనుండె నచ్చెలి నాఁటిరేయి । సరిప్రొద్దుకడ లేచి జవనకంభాణ
రత్నంబుపై ముత్తెఱంగుల ధనము । యత్నంబుతో వైచి హాయసమారూఢ
గతి దక్షిణపుఁద్రోవఁ గైకొని చనఁగ । లతకూన యెదుట భల్లాతకీవనము
గనుపించుటయుఁదురంగముచాల డస్సి।యునికియుబలుతమం బుత్కటం బగుట
తెరువు దోఁపక యున్న తెఱఁగును జూచి । తరుపరంపరలోనఁ దత్తడి డిగ్గి
బరువులు డించి నిర్భయవృత్తి నుండె । పరమేశ్వరీ! నీవె ప్రాఁపుదాఁపనుచు
నా యరణ్యమ్ములో నశ్వత్థతరువు । పాయకుండెడు నొక్క బ్రహ్మరాక్షసుఁడు

తనచెంత నున్న కాంతమొగంబుఁ జూచి । యనియె నిట్లని వింటివా! వాలుగంటి
చిత్రపురం బేలు క్షితితలేశ్వరుఁడు । చిత్రవాహనుఁ డుగ్రసింహవిక్రముఁడు
ఆరాజు రేపు వైద్యావళినెల్ల । కారుణ్యరహితుఁడై కలుగానుగలను
పడవైచి హింసించు పనిఁబూనినాఁడు । కడుపాఱఁ దినవచ్చు క్రవ్యంబు మెదడు
నిక్కువం బనినవానికి వానిభార్య । యక్కజపడి పల్కె నయ్యయో! రాజు
పౌరులౌ వైద్యులఁ బట్టి చంపింపఁ । గారణం బేమయో! గణియింపు మనిన
ఆ బ్రహ్మరాక్షసాధ్యక్షుఁ డిట్లనియె । నబ్ధాశిగంభీరుఁడైన యాతనికిఁ
గలకంఠి చిత్రరేఖానామ భామ । గల దావధూటి కుత్కటశిరోభార
వేదన యావిర్భవించె నందులకుఁ । గా దేశమున నున్న ఘనవైద్య వరులఁ
బెక్కండ్ర దొగ పిలిపించి యీనొప్పి । యక్కఅపడి తీర్చునట్టి ధన్యునకు
సాము నాత్రప్రాజ్యరాజ్యంబులో నిత్తు । శ్రీమించ నేలింతుఁ జిత్రపురంబు
జనులెంచ నంచు హాజారంబునందు । ఘనత భాషాలేఖ గట్టించినాఁడు
అయ్యాశ ప్రేరేప నౌషధం బెఱుఁగు । నయ్యలందఱు వచ్చి యైదాఱు నెలల
గడువు పెట్టుక నొప్పి గడతేర్ప బాధ । పడుచున్నవా రేమిపలికెద నతివ!
గడువు నిన్ననె తీఱెఁ గల్లుగానిగలఁ । బడవేయ ధారుణీపతి పూనె ననఁగ
నానొప్పి యెందున నావిర్భవించె । దాని కెయ్యది చికిత్స యెఱుంగ వలయు
నీడ నెవ్వారు లే రెఱిఁగింపు మనిన । వాఁడును నన్నొప్పి వచ్చిన తెఱఁగు
తెలిపెద వినుము పార్థివకాంత మున్ను । జలజాకరంబున సఖులతోఁ గూడి
జలకేళిఁ దేలెడి సమయంబు నందు । జలజమొక్కటి గొని సతి మూర్కొనంగ
జెలగ యొక్కటి ప్రవేశించెఁ దన్నాస । మెల్లఁత కపాలంబు మెదడుఁ ద్రాపించి
పెల్లుగాఁ బిల్లలఁ బెట్టె నానాఁట । పిల్లలు మఱి పెక్కుపిల్లల నీనె
గులగుల తల నిండుకొని మెదడెల్లఁ । బలపలగా నవి భక్షింపఁ దొడఁగె
నందున నొప్పి మహాఘోర మయ్యె । నిందులకుఁ జికిత్స నెఱిఁగింతు వినుము
చెప్పుతట్టాకు దెచ్చి రసంబు పిడిచి । యొప్పుగా నూనెతో నొకపరి కాఁచి
నాసికాపుటమున నస్యం బొకింత । చేసి యాతైలంబు శిరమునఁ బోసి
యుప్పుటాకునఁ జూర్ణ మొనరించి చేలఁగప్పి యప్పుగ వేయగా ముహూర్తమున
జలజల జలగలు జాఱు వేవేలు । తల నుండఁగూడ దాతైలంబువలన

నప్పొగచే నొక్కఁడైనను నిలువ । కప్పుడె పడు నేల నవియెల్ల పడినఁ
దల చుల్కనగు నొప్పి తగ్గి హాయిమని । చెలికి నిద్దుర వచ్చు సిద్ధ మీమాట
యనిన నీక్రియ నెవ్వరైనఁ గానరొకో । యని బ్రహ్మరాక్షసునంగన పలికె
నావార్త లది రాత్రియగుట నాలించి । భూవరకాంత గొబ్బునఁ దేజి నెక్కి
యావిపినము దాఁటి యటు పోయిపోయి। దేవేంద్రుదిశ గ్రహాధిపుఁడు గాన్పింపఁ
జిత్రపురాంతికసీమకు నేఁగి । రాత్రితా నాబ్రహ్మరాక్షసి వలన
వినిన యౌషధములు వెస సంగ్రహించి।కొని వైద్యవేషంబు కొమరొప్పఁదాల్చి
యిలరాయల పురోధ యిలు సేరి యతని।వలన రాజును గాంచి వైద్యులమీఁద
నలుగ నేఁటికి రాజ! యజనిమేషమునఁ । దలఁగింతు నీ దేవితలనొప్పి యనుచు
నాచికిత్స యొకింతయైనఁ దప్పకయె । యాచరింపఁగ దదీయఘ్రాణవీధి
దొరగె జలూకలు తోరంబుగాఁగ । పరిపరిరూపుల బహుసహస్రములు
జెలఁగ యొక్కటియైనఁ జిక్కకయుండ । వెలువరించిన శిరోవేదన దీటి
యాయిందుముఖి హాయిమని నిద్రఁ బోయె।నీ యద్భుతపువైద్య మెక్కఁడనైనఁ
గలదెయటంచుభూకాంతుండు మెచ్చి।పొలఁతియాటెఱుఁగక పురుషుఁడేయనుచు
సిరులొప్పఁ బట్టాభిషేకంబుఁ జేసి।పురముతో సామ్రాజ్యమున సగం బొసఁగఁ
జిత్రపురం బేలెఁ, జిత్రవాహనుఁడు । చిత్రాంబరాదులా చెలువ కొసంగి
యవల జయాస్పదంబను పురినుండి । పువుబోణితోఁ గూడి భువి యేలుచుండె
పగలెల్లఁ బురుషరూపంబు వహించి । మగువ కొల్వున నుండి మహిజనం బలర
రాజ్యంబు పాలించు రాతిరియైన । ప్రాజ్య విలాససంపద కాంత యగుచు
నంతఃపురంబులో నది వసియించుఁ । గొంతకాలం బిట్లు కువలయనయన
క్రమియించి పతిఁ బాసి కటకట యిటుల।కమలాక్షి బ్రదుకుట కడుకష్ట మనుచుఁ
దలఁచి యా పట్టణద్వారంబులందు । నలుగడల స్వకీయ నవనీయరూప
కలితతా ప్రతిమలఁ గావింపఁ బంచి । యలవాకిళుల నిల్పుఁడని నియోగించి
భటుల నాయాద్వారపాలురఁ జూచి । పుటభేదనద్వారములఁ జొచ్చి వచ్చు
పురుషు లెవ్వారైన బొమ్మలఁ జూచి । పరితపించిరయేని బహుమతి వారి
గొబ్బున నిటకుఁ దోడ్కొని రండటంచు । నబ్బురంబుగఁ జెప్పియంపిన వారు
హెచ్చరికై యున్నయెడ నొక్కనాఁడు । మచ్చరం బుడివోయి మాధవశర్మ

తన యాలుబిడ్డలు దన వెంట రాఁగ । జనుదెంచెఁ బురి ప్రాగ్దిశాద్వారవీధిఁ
జొచ్చి వేవేగవచ్చుచుఁదళుక్కు లొలుక। పెచ్చుబొమ్మనుజూచి యాయింతివలనఁ
గాదె విపద్దశ ఘటియిల్లెఁ దనకు । నీదెస కాయింతి యెటుల వచ్చినదొ!
యిచ్చట నీబొమ్మ నేల నిల్పిరొకొ! । యచ్చున వేసిన ట్లమరియున్న దని
బ్రమసి పల్కఁగ ద్వారపాలు రాద్విజుని । ప్రమదచెంతకుఁ బదంపడి కొనిపోవ
నతనిఁ కన్గొని లేచి యవనతయగుచు । నతిభక్తి నర్ఘ్యపాద్యాదు లొసంగి
యుచితాసనంబున నునిచి క్షేమంబు । రుచిరోక్తి వేఁడి గురుండు మా కనుచుఁ
దన సఖవారి కందఱికినిఁ దెలిపి । ధనధాన్యవస్తువుల్ దనియఁగ నొసఁగి
యునిచిన వెత దీఱియుండె నాద్విజుఁడు । వనితసౌశీల్యంబు వర్ణించికొనుచు
నంతటఁ గొన్నినా ళ్లరిగిన వెనుక । నింతి యక్కట! యెడ కేఁగెనో యనుచు
నల్ల గొల్లయు దాది యప్పురిఁ జూడ । నుల్లంబునఁ దలంచి యుత్తరద్వార
భాగంబు సొచ్చి యాబంగారుబొమ్మ । బాగు విలోకించి బాపురే! యిదిగొ
మనయక్కఁబోలు బొమ్మనుగంటిమనుచుఁ।గనుదోయిన శ్రులుగార నేడ్చుచును
గనుగొనుచున్న నక్కడిభటుల్ చూచి । చనుదెండు మారాజుసన్నిధి కనుచు
వారిఁ దోడ్కొనిచన్న వారి నీక్షించి । వారిజానన హర్షవారిధిఁ దేలి
గాయముల్ మాని యేకైవడి బ్రతికి । యీయెడఁ జేరితి రేమయ్యెమంత్రి ?
మన ధరావిభుఁడు సేమమున నున్నాఁడె।ననుగూర్చి యేమనె? నాఁటి కార్యములు
వినియుందు రే యన్న వెలఁది కేకాంత।మున గొల్ల యనియెఁ గేల్మోగిచి సంప్రీతి
నమ్మ! మూర్ఛిల్లి గాయములతో నున్న।మమ్ము గాపాడి గ్రామస్థులా ఘనులు
పనిచిన ఘనసార పట్టణమ్మునకుఁ । జని మీరు లేకున్నసన్న యెఱింగి
యాదుష్టమంత్రి కృత్యములెల్లఁ దెల్ప । రాదు రాజునకని రంతు సేయక యె
తిరిగి వచ్చితిమి నిన్ దేశదేశముల । నరయుటకొఱకన్న నతివ హర్షించి
వారి లాలించి భూవరునితో మంత్రి । దారుణక్రియలెల్లఁ దప్పక తెలుప
నున్నారు గద! మీర లుడుకేలయనుచు । మన్నించి వారి నెమ్మది చల్లఁజేసి
యెప్పటివలెఁ జెంత నిడుకొని ప్రోచె । నప్పద్మలోచన యంతటఁ గొన్ని
దినములు చన ముచ్చు దేశదేశముల ।కనకాంగి వెదకి యెక్కడఁ గానలేక
నచ్చిత్రపురమున కట నొక్కనాఁడు । వచ్చి తాఁబశ్చిమద్వార దేశమున

నిలిపినబొమ్మ నెంతే భ్రాంతుఁ డగుచుఁ। దిలకించి యిటువంటి తెఱవయెకాదె
తనసొమ్ము గైకొని తను గాకుచేసి । చనియె మోట్టో యని జాలి చెందుటయు
వాని దుఃఖముగని ద్వారపాలకులు । భూనాథుకడకు గొబ్బున రమ్మటంచుఁ
దోకొనిచన్న నాదొంగ వచ్చుటకు । రాకేందుముఖి చాల రంజిల్లి పలికె
నేమోయి! నాయండ నిన్నినాళ్లేల । తామసించితివి రత్నము లబ్బెనోటు
నీసొమ్ము నాసొమ్ము నేను దెచ్చుటకు । గాసి చెందితివేమొ కటకటా! నిన్ను
వనటఁ గుందించితి వ్యర్థంబుగాఁగ । వినుము నీసొమ్మఱవీసమ్ము వోదు
అంతఃపురంబులో నది దాఁచియున్న । దంతయు నొసఁగెద నడలకు మనుచు
వాని నూఱడఁ బల్కి వస్త్రాదు లొసఁగి । నానాఁటి కళనంబు నగరఁ బెట్టించి
యాదరింపంగ వాఁ డమ్మ! నీవనుపఁ । గాదన కారాత్రి గమనించి రెడ్డి
పాళెంబు చేరి యాపడకయిల్లెల్ల । గాలించి వజ్రముల్ గానక తిరిగి
వచ్చితి నింటికివనిత! నీవార్త । చెచ్చెరఁదెలుపనీ సీమలదిరిగి
దిగులొంది వచ్చి నిన్ దిలకించినపుడె! నగులెల్లఁ దీఱె మై నిలిచెఁ బ్రాణములు
అని వాఁడు తెల్పఁగా నతివ లేనగవు । తన నెమ్మొగంబునఁ దళుకొత్త నున్న
తఱిఁ గొన్నినాళ్ల కాదక్షిణద్వార । సరణి వైశ్యసుతుండు చనుదెంచి యచట
పొలుపొందు బంగారుబొమ్మ నీక్షించి । కళవళం బొదవ గద్గదకంఠుఁ డగుచు
చేరి నాయిలు చక్కఁజేసిన యమ్మ । గారి నిచ్చటఁ జూడఁగల్గెగా! యనుచు
కన్నీరు మున్నీరుగా నేడ్చుచున్న । యన్నగరస్వామి యార్తి వారించి
ద్వారపాలకు లేలవగచెదు రమ్ము । మారాజుకడ కని మసలక యతని
సభకుఁ దోకొనిపోయి స్వామి పరాకు। సభయుఁడై యీసెట్టి చనుదెంచెననుచుఁ
బొడ గనుపించినఁ బొలఁతి లాలించి । యడలక కూర్చుండు మని సెలవిచ్చి
వానితో ననియె నో వైశ్యకుమార । నీనిలయముఁ జేరి నీ యింటిధనము
సకలమ్ము దెచ్చి యిచ్చట దాచినార । మొకటియు సెల్వగా దోడకు మన్న
నొరుల వంచనచేసి యున్న సొమ్మెల్ల । హరియించి తెచ్చిన యదియేమి? యనిన
గల దిందులకు నొక్క కారణం బదియుఁ। దెలియనౌ మీకెల్ల దీమసంబుననె
యది యటులుండె నీ వానాఁడు జాల । పదమున కేఁగినపని యేమి యయ్యె
నెఱిఁగింపు మనిన వాఁడిట్లను నచటి । కరిగి యుంగరమియ్య నలవర్తకుండు

చెలనుంచె నిది రాజుచేతి సొమ్మనుచు । దొరయు నీసొమ్మెడ దొరకె నటన్న
నెలనాగ యొక్కతె యిచ్చిన దింట । నెలకొన్న దనిన నానృపతియు నిన్ను
పరికింప సుభటులఁ బనుప నిల్చేరి । మఱి నీవు పోయినమాట యాలించి
యది జగజంత యెందరిగెనో మేము । వెదకెద మీవును వెదకు మటంచు
పోయి రవ్వారలు పోయిన వెనుక । నీయున్కి తెలియక నిఖిలదేశములు
తిరిగి యిచ్చటి కరుదెంచితి ననిన । హారిహారి! నీవెంత యార్తిఁ జెందితివి
నాకతంబున నని నలినాక్షి యతని । యాఁకలియును దప్పి యడఁగ మృష్టాన్న
పానీయము లమర్చి భ్రాతవు నీవు । నీనిఖిలార్థంబు నీకొసంగెదను
ఈచోట వెతఁబడ కిరవొందు మనుచు । నాచిత్రవాహను నతని దేవేరి
మఱునాఁడె పిలిపించి మైత్రితో నంతి । పురమున నుంచి యాభూపతిఁ జూచి
సతి యాదినుండియుఁ జతురోక్తిఁ దనదు।కత దెల్పి మనవి యొక్కటి వినవలయు
మాయన్న పేరఁ బ్రేమమున జాబొకటి।వ్రాయించి యతని శీఘ్రమున నిచ్చటికి
రప్పింపుఁ డవలికార్యము మఱి మీఁదఁ । జెప్పెద ననవిని చిత్రవాహనుఁడు
దాని పతివ్రతా ధర్మంబునకును । దాని యోర్పునకునకును దాని నేర్పునకుఁ
దన వధూమణియును దాను మెచ్చికొని । తనయవు నీ వేము తల్లిదండ్రులము
తలఁకకు చంద్రాంగదక్షితీశ్వరునిఁ । బిలుపింతుఁ గమ్మ పంపించి యాక్షణమె
హేమవర్మని నిట కేఁబిలిపించి । నీమది రంజిల్ల నినుగూర్తు ననుచు
గారవించి ప్రియోక్తిఁ గమ్మ వ్రాయించి । యారాజసుతునకు నంపిన నతఁడు
తన సహోదరి దీనదశ గని వగచి । తన బంధుమిత్రసంతతిఁ గూడి వచ్చె
వచ్చిన భోటభూవర కుమారునకు । నచ్చిత్రవాహనుం డపుడెదురేఁగి
యనురక్తిఁ దోడ్తెచ్చి యంతఃపురమున।ననుజ ముందర నిల్ప నామె శీఘ్రమునఁ
జనుదెంచి యన్నకు సద్భక్తి మ్రొక్కి । కనుదోయి కాటుకకన్నీరు దొరుగఁ
నడలఁగా నూరార్చి యన్నాతి చెంత । నిడుకొని యనియె నాపృథివీశసుతుఁడు
అక్కరో! నేఁ బిల్వనంపినఁ బ్రోవ । నక్కటా యకుటిలాత్మనిచేతఁ
దనయుఁ గోల్పోయి దుర్దశల స్రుక్కితివి।కనుగొంటి నిను తొంటి ఘనపుణ్యగరిమ
వగవకు మని చిత్రవాహనుఁ జూచి । జగతీశ! శుభలేఖ సయ్యన నిపుడె
వ్రాయింపు మాహేమవర్మన కనిన । నాయన నాపుత్రియగు హేమగాత్రి

నిను మరల్ గొన్నది నీకు వివాహ।మొనరించెదము మంత్రయుతముగ రేపె
రావలయును ముహూర్తము సమీపించె । భూవరాత్మజ చిత్రపురమున కనెడి
యరిదివక్కణ నేరుపమర వ్రాయించి । సరస హారిద్రాభ సమకూర్చి పెండ్లి
శుభము దెల్పెడుకమ్మ నూత్మబుద్ధియగు।సుభటుచే నిచ్చి పంచుటయు వాఁడరిగి
ఘనసారపురము గ్రక్కునఁ జేరి యచట । ఘనసారనిభకీర్తిఁ గరమొప్పువాని
నాత్మజాయా వియోగాగ్నిచేఁ గంది।యాత్మజాకృతి నెంచి యార్తుఁడౌవానిఁ
గని మ్రొక్కి కమ్మ చెంగటనిల్పఁ జదివి । కొని సంతసించి యగ్గురుశుభవార్త
సభవారి కెఱిఁగించి సపరివారముగ । నభినవోద్వాహ లీలాసక్తి నరిగె
తనకుఁ బాటిలుకీఁడు దాఁగాన లేక । జనియె నమ్మంత్రియు జననాథు వెంట
నీరీతిఁ దనసేన లెల్లను గొలువ । భేరీమృదంగ గంభీరఘోషముల
నచ్చిత్రపురము డాయఁగఁ బెండ్లికొడుకు । వచ్చిన విని చిత్రవాహనుతోడ
నెలమిఁ జంద్రాంగదుం డెదురుగాఁ బోయి।సలలితోక్తుల నుపచారముల్ చేసి
తోడ్కొని తెచ్చి బంధుగులతోఁ గలసి।యాకుచ్చితపుమంత్రి యరుదేరఁ జూచి
తన్మానాథ! నీమంత్రిసత్తముం డితఁ । డేనా! మహామహుండే పో యటంచు
నలుకతోఁ బలుకుచు నంతఃపురంబు । చెలులు నివాళింప శ్రీలొందు నొక్క
భవనాంగణమున కీపగిదిఁ దోడ్తెచ్చి । నవరత్నఖచితాసనంబున వేడ్క
నునిచి తామందఱు నుచితాసనముల । ననుపమస్థితి నుండి రాసమయమున
నపుడు చంద్రాంగదుం డాడినమాట । విపరీతగతిఁ దమ వీనులసోక
వెగడొంది దిగులొంది విముఖుఁడై యుండె।తగవుమాలినయాప్రధానాధముండు
గొల్లయు దాదియుఁ గొలిచి వెన్వెంట । నల్లనఁ జనుదేర నాచంద్రరేఖ
ఘనభూషణాంబర గంధమాల్యముల । తనకాంతి దిక్కులఁ దళతళలీన
తనవల్లభునిఁ గాంచుతమకంబు మించఁ । జనుదెంచెఁ దనుజూచు సచివుని గుండె
దిగ్గుమనంగ నీతీఱున వచ్చి । యగ్గుణవతి పతియంఘ్రిల వ్రాలి
ఘోరని యేడ్చె నయ్యుర్వీశ్వరుండు । జాఱు నశ్రువులతో సతిఁ జూచి యడలె
నీచందమున దైన్య మెనసినవారి । నా చిత్రవాహ చంద్రాంగదుల్ సూచి
యడలు వారించి యాయతివ తాఁగన్న।కొడుకును దిని కాళిగుడి దయ్యమగుటఁ
జనెనని నీమహాసచివుండు దెలుప । వినియది నిజమని వేదురఁబట్టి

యితని మన్నించితి హితవరి యనుచు । మతిశాలి వితనిక్రమం బెల్ల నీవు
హేమవర్ముఁడ! విను మీగొల్ల చేత । నాముద్దిచేనని యనియెడి వారి
పలుకులువిని గొల్ల పతిసమ్ముఖమున । నిలచి పరాకయ్య నృపసార్వభౌమ!
చనవరియని నమ్మి సతివెంట నితనిఁ । బనిచితి రల రెడ్డిపాళెంబు నందు
చావడిలోనుండి సరిప్రొద్దువేళ । నీవంచకుఁడు వేగ నింటిలోఁ జొచ్చి
వచ్చిన లోపలివాకిలి నుండి । యిచ్చోటి కీవేళ నేల వచ్చెదవు ?
రాతిరిఫూటను రాణివాసమున । కేతేరఁ బనియేమి ? యిట నిల్వుమనిన
నోఱదూసి స్వకరాసి నుప్పలవాయి । నఱకె మూర్ఛిల్లితి నరనాథయనుచు
నవ్వాలఁజని యీతఁ డాచరించినది । యవ్వ యీయమ తెల్పు నవధరింపుఁడన
నాదాని చయ్యన నటకరుదెంచి । చేదోయి ముకుళించి క్షితిపతి కనియె
గొల్లను నఱకి యీకుటిలుండు జడియ । కిల్లుచొరంబడి యేతెంచు వేళ
నోరాజ! భుజియింపుచుండె మాయక్క । వీఁడేఁడిక్కైయె వీఁడు వినయంబు మాలి
సతియొద్ద పట్టిమంచమునఁ గూర్చుండి । యతిగర్వమున నిప్పుడా! భోజనంబు
ఎలనాగ! యిందాఁక నేమిచేసితివి । చెలువుఁడులేఁ డేమిచేసికోఁ గలవు
బాల! నన్నేలు భూపాలు మర్దించి । యేలింతు నీచేత నెల్లరాజ్యమ్ము
అని కొన్నిదుర్భాషలాడి పైఁబడఁగఁ । జనుదేర వారించి సతి యోసరించి
తఱిగాదుగానఁ గ్రోధము లోననడఁచి। తొరంమీఱ లేచి చేతులు వార్చియట్టె
పడకయిల్ చొచ్చి లోపలితల్పు మూసి । గడియలు బిగియించి గద్దించి వీనిఁ
బలుతెఱంగులఁ దిట్టఁ బలుతల్పు ద్రోవ । నలవిగాకున్న వీఁడాగ్రహం బెసఁగ
వాకిలి తెఱవక వలచిననిన్ను । గైకొనకున్న నీ గాదిలిసుతునిఁ
గరఖడ్గమునఁ గడికండలు చేసి । యరుగుదునన జడియక నీపురంధ్రి
యోరి! స్వామిద్రోహి యులుకక నీవు । దారుణక్రియ లెన్ని తలఁచి చేసినను
మానమిత్తునె నీకు మర్యాదమాని । హీనాత్మ! చేసెడిదెల్ల సేయుమని
పలికినఁ దొట్లలోపల నిద్రవోవు । నలపట్టి తలపట్టి యడిదంబు దూసి
నఱకవచ్చిన బాలునఱకి నీవేల । నరకుఁడా! కూలెదు నరకాగ్ని ననుచు
నడ్డమై బిడ్డనినాఁగిన నన్ను । దొడ్డకోపంబునఁ ద్రోసి చేకత్తి
ఘరుజునఁ గణఁతలఁబట్టి వేపొడిచి । నఱకెను రెండుఖండములుగ సుతుని

హా యని యదిచూచి యస్రంబు దొరుగ । నోయయ్య మూర్ఛిల్లి యుర్విఁ గూలితిని
దదనంతరమున నీధర్మేతరాత్ముఁ । డదయుఁడై యచటఁ బాయక యుండ వెఱచి
యరిగిన తెఱఁగు మాయక్క యెఱుంగు । ధరణీశ! యాపెచేత వినుండటంచు
దాది తెల్పిన నశ్రుధారలు దొరుగ । నాదేవి సభవార లరుదందఁ బలికె
తనయుని నఱకుట దాసిమూర్ఛిలుట । గనుగొని యచ్చోటఁ గలదాసి జనులు
కుయ్యో మొఱ్ఱో యని కూఁతలు వెట్ట । నయ్యెడ నిలక వీఁడరిగె వెల్పలికి
పడినగొల్లని మూర్ఛపాలైన దాది । పొడగని యందుండఁ బోవదటంచు
నీవిధంబెల్ల మీకెఱిఁగింపఁ దలఁచి । యావేళఁ బైనమై యశ్వరత్నంబు
జత్తాయితము సేయఁ సాహిణిఁ బనిచి । యుత్తమమణి భూషణోత్కరంబెల్లఁ
గట్టి యత్తేజిపైఁ గ్రక్కున వైచి । యట్టిట్టు వలయు పదార్థముల్ గొనుమఁ
జనుదెంచునంతలో సాది నిద్రించె । మనుజేశ! యీవాంగ మటుమాయలాఁడు
ఎక్కడినుండియో, యేతెంచి పొంచి । జక్కఁ జెంగటనున్న సాహిణి యనుచుఁ
దిమిరమ్ముగ్రమ్ముట తెలియగాలేక । నమర నేమున్నె రౌతంగు వహించి
వచ్చి తేజీనెక్కి వాగెఁ గదల్చి । హెచ్చరికై యూరికేఁగెడు బాట
తప్పక నీవు ముందఱ నేఁగుమనిన । నొప్పి యీతస్కరుం డూఁకతప్పు
తెరువునఁ దనయూరుదిక్కుగాఁ బోవ । నరుణోదయం బైన యంతటవానిఁ
జోరునిగాఁ దద్వ్యచోరీతి నెఱిఁగి । యోరి నేవత్తు నీయూరికి ననుచు
వాని వెంబడిఁ బోయి వానివంచించి । యేనుబోయిన జాడయెల్లను మీకు
వేఁడె యింకిట విన్నవించు నటన్న । వాఁడు చేతులు మోడ్చి వసుధేశుఁ బలికె
మాయమ్మ చెప్పినమాట నిబద్ధి । యోయయ్య! మగరూప ముడిగి యీయమ్మ
తరుణియై సరసిలో స్నానంబు సేయఁ । బరికించి మోహించి పాకంబు సేయఁ
గోరుపదార్థముల్ గొని తెచ్చి యిచ్చి । యీరామ వెంటరా నింటికిఁ బోయి
నాసొమ్ము నీసొమ్ము నా వేఱుగలదె । నీసొమ్ము దెమ్మని నెనరు గాన్పింపఁ
బలికి నాయింటిలోపలి ధనంబెల్ల । సొలవక గొని తనసొమ్ములోఁ గూర్చి
ధరఁ ద్రవ్వి పాతించి తస్కర! యొకటి । మఱచివచ్చితి నిన్నమాపటి పూటఁ
బడకింటిలోఁ దూర్పుభాగంబు నందుఁ । బుడమి మంచము క్రిందఁ బూడ్చివచ్చితిని
పదియాఱు వజ్రముల్ పరుగునఁ బోయి । సదనమ్ముఁ జొచ్చి వజ్రములు దెమ్మనిన

నే నిల్లుపెడఁబాసి యేఁగినయంత । మానిని సొమ్మెల్ల మసలక కొనుచుఁ
దురగమ్ము పై నెక్కి తొరమీఱ నరిగె । మఱునాఁటి రే యల్లమందిరం బెల్ల
గాలించి వజ్రముల్ గానక మరలి । యాలయమ్మునకు రా నంతకు మునుపె
ధనమెల్లఁ గొనిపోయె తాటోటుకత్తె!యని యింటియాబిడ యడలంగఁ దొడఁగె
నదివిని హాదైవమా యని యడలి । యెదబడి దేశంబులెల్లను వెదకి
యీయూరఁ జూచితి నీయమ్మవారి।మాయింటి నెడఁబాసి మఱియెందుఁ జనెనొ
యెఱుఁగ నవ్వాలికథ యేనన్న వైశ్య । వరుఁడు కేల్మోగిచి భూవరున కిట్లనియె
కాతువేషమున నీరమణి మాయమ్మ । యే తేరఁ జోరు నల్లైనను బ్రమసి
మనసుచలింపఁగా మత్పురంబునకుఁ । గొనిపోయి నేమున్నుగూర్చిన ధనము
నీయమ్మ ధనములోనిడి పెట్టెనుప । నయ్యెడ నేమంచిదని సమ్మతించి
యువిద యారే యొకయుంగరం బొసఁగ।నవనీశ! యదిగొని యల జాలపదము
బచ్చు చేతికొసంగి బందిగానఁ బడి । యచ్చట బడలి చంద్రాంగదువలనఁ
దప్పి యింటికివచ్చి ధనమెల్లఁగొనుచు । నిప్పద్మలోచనయేఁగిన తెఱఁగు
నింటివారలు దెల్ప నెదబడి యడలి । యొంటిగా ధరయెల్ల నుడుగక వెదకి
యిచ్చోటఁ బొడగంటి నిద్దేవి నవల । నెచ్చోటి కేఁగెనో యెఱుఁగ నేననిన
నాచెల్వ యనియె నే నర్ధరాత్రమున । భూచరఖేచరాద్భుతకరంబైన
జెడితోపొకటి వీక్షించి భీతిలక । యాడనే వసియించి యతిదంపతుల
వలన వింటిని చిత్రవాహను దేవి । తలనొప్పికగు నౌషధక్రియలెల్ల
విని వైద్యవేషంబు వెసధరియించి । కొని యిమ్మహారాజు కొమ్మయాదలను
నెలకొన్న జలగల నిమిషమాత్రమున । వెలువరించిన శిరోవేదన దీఱి
యలరెడు సతిఁజూచి యవనీశుఁ డితఁడు । పలుమారు మెచ్చి యీపట్టణంబిచ్చి
సగమురాజ్య మొసంగి సంప్రీతిఁ బ్రోవ।మగతనంబూని సామ్రాజ్య మేలెదను
వంచనచేఁ జోరవైశ్యుల ధనము । గొంచువచ్చిన దేమిగుణ మదియనిన
వంచింపకుండిన వారు మోహాము వ । హించినవారౌట నెడఁబాసి చనరు
వారిచే నాగుణవైఖరుల్ దెలియఁ । గారణం బిదియని కపటమార్గమున
నిటువలెఁ జేసితి నిది నావిధంబు । కుటిలుఁడౌ నీమంత్రి ఘోరకృత్యంబు
గావింప నినుఁబాసి ఘనవిపద్దశల । నీవగ బడలితి నిన్ని నాళ్లనుచుఁ

దనదేవి తెలుప నద్ధరణీశసుతుఁడు । కనలుతో నమ్మంత్రిఁగని ధిక్కరించి
చెంగటిభటుల నీక్షించి యీదుష్ట । సంగుని నీదురాచారుని గ్రూరు
నీ యగమ్యాగంత నీబాలహంత । నీయధమాధము నీమహాచపలు
పట్టి కొంపోయి బల్ బండపైఁబెట్టి । కొట్టి కండలు కోసికోసి గద్దలకు
గాకములకు శునకములకు నైచి । యీకష్టు నోటి కండిం దుప్పఁజల్లి
యంత ఖరారూఢుఁడగు వీని నగర । మంతయుఁ ద్రిప్పి కుక్కచ్చులఁ బొడిచి
వెడలఁగొట్టుఁడటన్న విని వీరభటులు । కడుగిన్క నమ్మహాకష్టునిఁ గట్టి
కొనిపోయి కండలు కుక్కలకిడినఁ । దినవయ్యె! గ్రద్దలెంతే యోకిలించె
నరయ స్వామిద్రోహి యగువాని యెఱచి । యరుచిపుట్టక తినునా! కుక్కలైన
రాజుచెప్పిన యత్తెఱంగునఁ జేసి । భూజనుల్ నిందింపఁ బురమెల్లఁ ద్రిప్పి
వెడలఁగొట్టిన వాఁడు వివశుఁడై యొక్క ।యడవిలోఁబడిపోయి యట హానిఁజెందె
చోరునిధనము వైశ్యునిసొమ్ము మఱల । నారాజముఖ తనయన్నయు విభుఁడు
గని మెచ్చ రెట్టింపుగా నిచ్చి తగిన । ఘనభూషణాంబరగంధమాల్యములు
కరుణించి ననుగూర్చి కడుగాసిఁ బడితి।రరుగుఁ డూళ్లకు నన్నలారా యటంచు
వారివీడ్కొని గురుస్వామిఁ బూజింప । గా రాజసుతు భద్రకాళి యవ్వేళఁ
దెచ్చి యొప్పింప నద్దేవికి మ్రొక్కి । యచ్చంద్రరేఖ నిజాధీశుఁ గూడి
భయభక్తియుక్తి సపర్యలు సేయ । దయఁజూచి యక్కాళి ధరణీశుఁ బలికె
హేమవర్మనృపాల యీచంద్రరేఖ । సామాన్యయని తలంచకు మహాసాధ్వి
యీకాంత సౌశీల్యమెంచ నశక్య । మీ కుమారుని మంత్రి హీనుఁడై తునిమి
నపుడె నేబ్రదికించి యధిప! యిన్నాళ్లు । నుపలాలనము సేయుచుండితి సుమ్ము
సతిగూడి సుతుతోడ సకలసౌఖ్యముల । నతిశయిల్లు మటంచు నానతిచ్చుటయు
నాహేమవర్మ హస్తాబ్జముల్ మొగిచి । గేహినీయుక్తిశక్తిని బ్రస్తుతించె
సభవారలెల్ల నాశ్చర్యంబు నొంద । నభినవ శృంగారహారిణి యైన
యా కాళికాదేవి యంతర్ధిఁ జెందె । భూకాంతుఁ డింతితోఁ బుత్రుని మరలఁ
బడసి కృతార్థుఁడై బాంధవుల్ పొగడ।గడువేడ్క నక్కటకమునఁ గొన్నాళ్లు
నాచిత్రవాహ చంద్రాంగద సహితుఁ ! డై చంద్రరేఖతో నధివసియించి
వారి వీడ్కొని సైన్యవర్గంబు గొలువ । భోరున ఘనసారపురమున కేఁగి

యెనలేని భోగంబు లింతితోఁగూడి । యనుభవింపుచు సుఖయై ప్రవర్తిల్లె
నీకథ వినువారి కీప్సితార్థములు । చేకుఱు ననుచు రాచిలుక దెల్పుటయు
విని పుష్పమంజరి వెరగందె దూతి । యను చిల్కఁ బొగడుచు నుర్విశుఁ జేరి
యాకథ వినిపించెనని చంద్రధరుఁడు । మాకామినికిఁ దెల్ప మఱి తరువాత
కీర మేకథ యెఱింగించె నో! యొ । యారి కక్కథ తెల్పుఁడని యడుగుటయు
సనయపతివ్రతాచరితంబునందు । నిది పదేడవకథ యిల ఖ్యాతిఁజెందె
* శ్రీవిశ్వపతి దయాంచితమతి గారి । కావలికథ యిట్టులని యానతిచ్చె.

---

# కలభాషిణి కథ

శ్రీవిశ్వపతి సమంచితమతి గారి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
నవ్వలినాఁటి సాయంతనవేళఁ । బువ్వగుత్తి యభిఖ్యఁ బొరసిన బోఁటి
యవ్వతోఁ దనుజేర నరుదేరఁ జూచి । నవ్వుచుఁ గీరరత్నం బిట్టులనియెఁ
జెలి మనమును బల్కు చేత యొక్కటిగఁ। జెలువుని పరిచర్యసేయు సాధ్వికినిఁ
బ్రఖ్యాతిగల దిహపర లోకములను । సౌఖ్యముల్ గలుగు వాసనపుత్రి తొల్లి
యొక రాజసుతునకు నొద్దికై మనుజు । డొకట యెట్టుల భర్తయగుఁ దనకనక
విలసిల్లె నక్కథ వినిపింతు వినుము । కలదుర్వి శృంగాటకంబను పురము
ఆపురంబేలు రత్నాంగదుం డనెడు । భూపాలుఁ డతనికిఁ బుత్రాష్టకంబు
ప్రభవించె నందులో భాగు వహించె । నభినవమన్మథుం డష్టమసుతుఁడు
అతనికిఁ బెండ్లిసేయఁ దలంచి తండ్రి । సుతు లేడ్గురును రూపసుందరీమణుల
వరియించి రింక వివాహంబు నీకుఁ । బరమోత్సవము దలిర్ప నొనర్పవలయు
నెటువంటి కన్యక నిచ్ఛయించెదవు । తెటుకునఁ దెల్పుమా తనయ యంచడుగ
నతఁ డిట్టిదిట్టిని యన కూరకున్న । నతని యగ్రజు లేడ్గు రపహాసింపుచును
నయ్యతోఁ బలికి రియ్యభినవమదనుఁ।డయ్య! యింద్రకుమారి యబ్బినఁ గాని
యితరకన్యల వరియింప నటంచు । వ్రతమూనినాఁ డందువలన నుత్తరము

---

* ఇచటఁగొన్ని కథలు లోపించి యుండవచ్చును

మీా కియ్యకున్నాఁడు మిన్నక యనిన । నాకొడుకులకు రత్నాంగదుం డనిమో
పాలఁతుల చిత్తంబు పురుషుల భాగ్య । మలవియె! తెలియ బ్రహ్మాదులకైన
నరయ నీతనికి భాగ్యము గల్గియున్న । దారకకయున్న యింద్రుకుమారి యెంత
తరణికుమారియా తపతియన్ తరుణి । వరియింపలేదె సంవరణునిఁ దొల్లి
యమర గంధర్వ విద్యాధర నాగ । రమణులు వొందరే! రాజనందనులఁ
బరిహాసింపనిఁ కేల బాలుని మీాఁద । లురకయుం చలతనయుల నదలించె
నయ్యపల్కిన యుచితానులాపమ్ము । లయ్యన్నలను పరిహాసోక్తులెల్ల
నారాజనందనుం డాలించి యపుడు । మాఱుమాటాడక మౌని యట్లుండె
యిటువలెనుండి యయ్యెడ భ్రాతృకథిత।పటుతరారుంతుద భాషణాస్త్రములు
మదినాట నిద్దురమాని యారేయి । యొదవిన కినుకతో నొకరీతిఁ గడపి
మఱునాఁడు ప్రొద్దున మసలక లేచి । శరచాప ఖడ్గాది సాధనోద్ధారి
యగుచు నుదఙ్ముఖుండై బోయిపోయి । జగదద్భుత తపఃప్రసక్తి వర్తించు
తృణభుజుండను రాజఋషి తపోవనము । గణనేతర ద్రుమోత్కర లతాభవన
భాసిత పల్లవప్రసవ మరంద । వాసనానూన పక్వఫల ప్రతాన
పరితుష్ట పరభృత భ్రమరకీరాది । భరితగీతవిభీత పాంథధావనము
పరికించి హర్షించి పటుతపోనిష్ఠ । భరియించి మించు నప్పారికాంక్షికిని
గరము భక్తిని నమస్కారముల్ చేసి । కరములు మొగిచి చెంగట నిలుచున్న
వాని సౌందర్యంబు వానిధైర్యంబు । వానిగాంభీర్యబు వానిశౌర్యంబు
గని మెచ్చి కూర్చుండఁగా నియోగించి । మునిపల్కె నోరాజముఖ్య కుమార
యేమి దలంచి నీవింను వచ్చితివి । నీమనోభీష్టంబు నిజముగా మాకుఁ
దెలుపుమటన్న ధాత్రీనాథసుతుఁడు । పలికె మాయన్నలు బలభేదిసుత న
గాని వేఱొకకన్యకను బెండ్లియాడఁ । గా నొల్లఁడితని కడఁగి మాతండ్రి
సన్నిధిఁ దెగడినఁ జాలరోషమున । నన్నలు నవ్వినయటు లింద్రసుతను
వరియింతునని యిందువచ్చి మీాపాద । సరసిజంబులు గంటి సంయమిప్రవర
కలదె! యింద్రునకుఁ జక్కనికన్య యిపుడు । గలిగినగాని నేకైవడి నైనఁ
గైకొనుపాటి భాగ్యము నాకుఁ గలదె!।మీాకుఁ దెల్లముగదా మీా యోగదృష్టి
నరసి యానతి యియ్యనగు నయ్యా! యనినఁ । గరుణతో నమ్మునిగ్రామణి పలికె

సరసి వచ్చినవాఁడ వవనీశతనయ! । నిలువుము మాయొద్ద నేఁటి కటంచు
నతిథిపూజ ఘటించి యలఁత వారించి । యతనితో ననియె నాయన మఱునాఁడు
వాయుభక్షకను మునీశ్వరుఁడు మాయన్న । యోయి యీడకు దశ యోజనదూర
వనమున నున్నాఁడు వడి నేఁగి యతనిఁ । గని నన్ను వేఁడిన క్రమమున నడిగి
శతమన్యుకన్యక చందంబు దెలియు । మతఁ డుపాయము దెల్పునది లభించుటకు
నా విని యతనికి నతిఁ జేసి కదలి । యా వాయుభోజను నాశ్రమంబునకు
మఱునాఁడె యభినవమన్మథుం డరిగి । గురుభక్తి నతనిఁ గన్గొని ప్రణమిల్లి
యాత్మచరిత్ర మాద్యంతంబు దెలుప । నాత్మ రంజిల్లి యయ్యతి వాని కనియె
నితరుల కలవిగా దిప్పనిఁ బూన । క్షితినాథసుత నీవు జిష్ణుకుమారి
కామించినది హెచ్చుగలదు కారణము । సామాన్యులకుఁ దలంచ వశంబె! యిటులఁ
గ్రతుశుల్కయను దేవకామినీమణికి । శతమన్యునకు మున్ను జనియించి వెలయు
మదనమంజరియన్ కుమారి యొక్కరిత । యది జగన్మోహిని యామంజువాణి
నీకు లోఁబడఁ జేయ నేర్చు మాయన్న । లోకవంద్యుఁడు దయాళుఁడు సూర్యభోజి
యతఁ డున్న వని పదియామడ దూర । మతివేగమున నేఁగుమని వీఁడుకొల్ప
భాగ్యమాయె నటంచుఁ బార్థివసుతుఁడు । ఋగ్యజుషాది వరిష్ఠ మౌనీంద్ర
జనశరణ్యంబును జాతివైరములు । మొనయని ఖగమృగంబులకు నాకరము
పరమపావనమునై భాసిల్లు సూర్య । కిరణభుగ్వనము నీక్షించి నేతెంచి
యతని యంఘ్రులకు సాష్టాంగం బొనర్చి । యతఁడు దీవింపఁ గృతాంజలి యగుచుఁ
దన యభిలాష మంతయు విన్నవింప । విని యెంతపని యిది వీరాగ్రగణ్య!
యక్కన్య నీకు లోనగు నుపాయంబు । నిక్కంబు తెలిపెద నీవది వినుము
సఖులతో మదనమంజరి కేళిసలుపు । నొకసరోవరమున నురువడి నీవు
చని పొంచి దాని వస్త్రవిభూషణములు । గొనిరమ్ము నీవెంటఁ గునుకుపర్వనను
నదివచ్చి కొన్నివాక్యము లాడు దాన । బెదరక తిరిగి యా బిసరుహనయన
దిక్కు జూపక చను దేర నిన్వలచు । నక్కడి కిపుడె నీవరుగు మటంచు
నేణాక్షి కొలఁకున కేగెఁడు త్రోవ । వేణుకాంతారంబు విధమును దెలిప
పాదలేప మొసంగి పనిచిన నరిగె । నాదిత్యుఁ డుదయించు నప్పుడె లేచి
యరిగి రాసుతుఁడు మధ్యాహ్నమౌ నంత । నరుదైన వేణుమహాటవిఁ జూచె

చూచి యవ్వాకిలి సొచ్చి యవ్వలికి । నేచినతమి నేఁగి యింటులఁ గూడి
దీర్ఘిక జలకేళిఁ దేలెడిదాని । దీర్ఘవిలోల దృగ్దీప్తులదాని
కళుకునెమ్మొయిచాయఁ గమలాకరమునఁ । బొలుచుబంగరురంగు పొసఁగించుదాని
చెలులు దోయిళ్లముంచి జలమ్ముఁ జల్ల । నళుకక చల్లుపో రాడెడిదాని
భావజు మోహనబాణమో యనఁగ । యౌవనలక్ష్మిచే నలరారుదాని
మదనమంజరిఁ గాంచి మాటున పొంచి । పొద నదిదాఁచిన భూషణావళులు
రవిక పావడయు జర్తారుచీరయును । జవమున గ్రహియించి చంక నుంచికొని
పరువిడఁ జూచి యబ్బామిని చెలులు । సరగున మదనమంజరిఁ జూచియనిరి
జవ్వని వస్త్రభూషణ సుచేలాదు । లెవ్వఁడో! గొని యదె యేఁగుచున్నాఁడు
భోరున వెనువెంటఁ బోవక యున్న । తీఱదు పొమ్మన దిగులొంది కన్య
స్వ కరసరోహ చ్ఛాదిత సుకుచ । లికుచయు విపులనాళీక పలాశ
బద్ధ కటీరభూభాగయునై వి । రుద్ధభూషణముల రోషమ్ముదోఁపఁ
గొలను వేవెడలి పోకుము రాకుమార! । నిలునిలు మనుచు వెన్వెంట రాయంచ
కైవడినడ మించఁ గొనుచలించ । సౌవర్ణరుచి తనుచ్ఛాయ రాణించఁ
బలికె నెక్కడ నిట్టిపౌరుషక్రియలు । గలవె! కాంతలు జలకములాడు వేళ
వత్తురే మగవారు వచ్చినఁ దొలఁగ । కిత్తెఱంగున వల్వ లెత్తు కేఁగుదురె!
యే దుష్టబుద్ధి నీకిది ప్రబోధించె । మీఁదనౌ హాని యేమియుఁగాన వకట
యెంత దవ్వరిగెద వీవు మానవుఁడ । వింతలోనిదె సుర లెఱిఁగి రాఁగలరు
చెడిపోక నామాటఁ జెవినిడి విడుము । తొడవులు కోకలు దుడుకు లిందేల!
అని బెదరించి మాటాడు నవ్వేలఁదిఁ । గనుగొనె నిలిచి భూకాంతనందనుఁడు
నిలిచి కన్గొనువాని నెలఁత శపించె । బలుశిలవై యిందు పాదుకొమ్మనుచు
నెలఁతశాపమున దాని విభూషణములు । వలువలుఁ బడవైచి వాఁడు రాయయ్యె
తన భూషణాంబరతతి ధరియించి । యనిమిషాంగన వయస్యలఁగూడి చనియె
నిలువురాయై వాఁడు నేలఁ బాఁతుకొని । నిలచియుండఁగ మౌని నిజశిష్యు నొకనిఁ
గనుగొని యదియేమొకాని రాసుతుఁడు । చనుదేరఁడయ్యె వాసవపుత్రి బెట్టు
కనలి మాటాడినఁ గడుభీతి మరలి । కనుగొని శాపంబు గాంచినాఁడేమొ!
తెలియుదమని యోగదృష్టి నీక్షించి । నిలువురాయైన వాని తెఱం గెఱింగి

వగచి మునిముఖ్యుఁడన్ వరశిష్యుఁ బిలిచి । జగతీశసుతుఁడు పాషాణత్వ మందె
తారూప మణఁగించి రాజూపమర్చి । భోరునఁ దోడ్తెమ్ము పొమ్మని యపుడె
జల మభిమంత్రించి చయ్యనఁబనుపఁ । గలశంబు చేకొని గ్రక్కున నరిగి
శిలయైన వానిపైఁ జిలికించినంతఁ । జెలఁగె నెప్పటిలీల క్షితిపాలసుతుఁడు
జటిలశేఖరు మంత్రశక్తి నెప్పంటి । పటురూపము ధరించి పఱతెంచె మఱల
నా సూర్యభుజునకు నభినుతిసేయ । నాసన్నగతుఁ జేసి యతఁ డిట్టులనియె
నేను దెల్పినమాట నేలపాల్సేసి । మానిని నేటికి మరలి చూచితివి ?
తిరిగిచూచిన నది తిట్టకేలుడుగు । వెఱతురే! కాంతల వికటభావలకు
నెనిమిది దివసమ్ము లిచ్చోటనుండు । మని పెదఁ బిమ్మట నతివ యున్నడకు
నిన్నని తనచెంత నృపపుత్రు నునిచి । కొన్న నుండెనతండు కొమ్మచెల్వంబు
చిన్నిపాయంబును జిలుకపల్కులును । జిన్నెలువన్నెలు చింతించికొనుచు
వాసవపుత్రియు వానిశృంగార । హాస విలాస హేలాదులు దలఁచి
వెతఁజెందెఁ జక్కనివిభునిఁ గన్గొన్న । యతివ మనోజార్త యగు టబ్బురంబె
తదనంతరంబునఁ దపనాంశుభుక్కు । సదయుఁడై యెదుట రాజకుమారుఁ బిలిచి
భృగువాసరము నేఁడు పృథివీశతనయ । వగలాడి యల సరోవరమున నిపుడు
సఖులతో జలకేళిసలుపుచు నుండు । నకలంక మామకీనౌషధశక్తి
నిప్పుడ నీవేఁగి యించుక కొంచ । కప్పడంతి విభూషణాంబరావళులు
గైకొని యదియెన్ని కఱకు లాడినను । వీఁకతో బెదరించి వెఱపుఁ జూపినను
దీనత నెరపినఁ దిరిగిచూడక య । హీన సత్వరమున నేఁగుదెమ్మనుచుఁ
బనిచినఁ జని పురోభాగమ్మునందు । వినువీథి ముట్టిన వేణుకాననము
గని కవాటము నిరర్గళత భేదించి । ఘనఖడ్గహస్తుఁడై గ్రక్కునఁ జొచ్చి
పొంచి సరఃప్రాంతమున కేఁగి యచట । నుంచిన వస్త్రాదు లొకట గ్రహించి
చనుచున్న మదనమంజరియె యీక్షించి।యనుఁగునెచ్చెలులతోననియెనవ్వుచును
జెలులార! సొమ్ములు చీర లెత్తుకొని।యలనాఁటిద్రిమ్మరి నేఁడదె!పోవఁదొడఁగె
పాషాణరూపంబుఁ బాసి యాత్మీయ । వేష మెట్లందెనో వీఁడమ్మచెల్ల!
హారికిశోరమురీతి నతిజవస్ఫూర్తి । పఱవుఁబాఱెడు వీనిఁబట్ట నాతరమె
యయిన నీతటిఁ జాలమని మునుపట్ల । బయలు దేరి తదీయపద్ధతిఁ బట్టి

కొంతదవ్వేఁగి రాకొమర! యిదేటి । వింతఁజేసెద వాత్మ వెఱపింతలేక
సురసార్వభౌముని సుకుమారి ననుచు । నెఱుఁగవే! మొన్న నీ వీదుండగంబు
చేసి పాషాణతఁ జెందుట మఱచి । తే! సాహసక్రియ లివ్యోడఁదగునె!
మగువల వలచినమగలు వస్త్రములు । వగవగ సొమ్ములు వహి నొసంగుదురు
కట్టినకోకలు కలభూషణంబు । లిట్టుల నీవలె నెత్తుకేఁగెదరె!
నానుడి వినక మిన్నక పోయెదేని । నేను దిట్టకమాన నిఁకనని కెరలి
పలుకుచు వెంబడిఁబడి వచ్చుదాని । పలుకుల కళుకక ప్పార్థివసుతుఁడు
మునివరుని నిదేశమున ధైర్యమూని । చనుచున్న వాని నిశ్చయమాత్మ నెఱిఁగి
ననబోఁణి వాని సౌందర్యరూపాభి । జన శౌర్యగాంభీర్య చాతుర్యములకుఁ
గరము సంతోషించి కాముని కుసుమ । శరపరంపర నొచ్చి సరసోక్తిఁ బలికె
నేల జాలియొనర్చె దెఱుఁగవు తగవు । బాలల వలపించు ప్రౌఢిమ యిదియె!
యలసితి వురక బిట్టరుగక నిలుము । వలచితి నీకు భావజుపాద మాన
నాకన్నులాన చెంతకు నేను వచ్చు । దాఁక పరాఙ్ముఖత్వంబున నైన
నేలకొను మచ్చోట నీవు గణించు । పలుకులు విని నీదుపనుపు చేసెదను
మాయయ్యయాన సుమీ! యింక మించి।పోయితేని నృపాలపుంగవ! యనుచు
నానవెట్టిన నతఁ డవలిమో మగుచుఁ । జాన గన్గొనక నిశ్చలవృత్తి నుండె
అతనికి నెదురుగా నరిగి యబ్బోఁటి । యతిమోహపరవశయై తనగుబ్బ
చనునోయి యతని వక్షస్థలి నొరయ। మొనసి కౌఁగిటఁజేర్చి మోమున మోము
గదియించి నీప్రియకాంతగా నన్ను । గొదకక యిఁక నేలికొమ్మని పలికి
యతఁడొసంగిన భూషణాంబర మాల్య।తతులు సుగంధముల్ ధరియించి మించి
యొక్క పూఁబొదరింటి కొయ్యన నేఁగి । చక్కరవిలుతుండె సాక్షిగా నతని
వలచి గాంధర్వవివాహక్రమమునఁ । గలసి మన్మథరాజ్యకర్తనుఁ జేసి
యాజన్మమునకు విస్మివె నావిభుఁడ । వో జగన్మోహన! యూఱడు మింకఁ
దడవాయె వచ్చి మత్సఖు లల్లకొలని । కడనున్నవార లక్కడికిఁ బోవలయు
మక్కువతో నన్ను మఱువకు మనుచుఁ।బుక్కిటివీడియంబు గ్రహించి యతని
యధరామృతముగ్రోలియలంతఁదీర్చికొని।మధురోక్తులాడునమ్మగువ సెమ్మోము
ముద్దిడుకొని ప్రియంబున నతండనియె । ముద్దియ! ననుబాసి ముదితల డాసి

యీవు నీవీటికి నేఁగిన నెటుల । నే వసియింపుదు నిట నొంటిగాఁగ
హాయనత్రితయి మిత్రాదులఁ బాసి । యాయాస మొందితి నబల! నీకొఱకు
నిన్నాళ్లవలెగా దోకించుక నీవు । నిన్నుఁగానకయున్న నిలవు ప్రాణములు
నీయాన గజయాన! నిజ మిదియనిన । నాయింతి దరహాసితాస్యయై పలికె
అభినవమదన! నీయందంబు గనిన । యిభయాన యెటు రతీశుభయానఁ బడక
ప్రాణముల్ వహియించి బ్రదుకునిన్నాళ్లు సి! యేనునీవలెఁగాదె! యెటులోర్వఁగలను?
ఇందుల కొకచంద మెఱిఁగింతు వినుము । చింద మేనొకటి నీచేతి కిచ్చెదను
అది సుస్వరముగ నీవమర నూఁదినను । కొదకక వత్తు నీకోరిన యెడకు
నా కంబువు దలంచినప్పుడె వచ్చు । నీకరంబున కది నీవు పొమ్మనిన
నాకంబున కరక్షణంబులోఁ బోవు । నీకు దూతికయిదె నేఁడె పొమ్మనుచు
నల శంఖమిచ్చిన నతఁడు గ్రహించి । తలఁచిన యపు డతిత్వరత రమ్మనుచుఁ
గంబువుతోఁ గంబుకంధరి ననిచి । యంబుజాప్తకరాశనాశ్రమంబునకుఁ
జనుదెంచి యమ్మునీశ్వరునకు మ్రొక్కి । జననాథతనయుఁ డంజలిచేసి పలికె
స్వామి! దేవరకటాక్షమున నసాధ్య । యా మహేంద్రకుమారి యబ్బె నాకిపుడు
నాకోర్కె లీడేరె నావంత దీఱె । లోకస్తుతులు దయాళువు లైనయట్టి
త్వాదృశుల భజించువారు కృతార్థు । లౌదురన్ మాట యథార్థంబు గాదె
యనిన సంతోషించి యతని సమీప । మున నుంచికొని సూర్యభోజనుం డనియె
వలువయెత్తుక నీవువచ్చుచో వెంట । నెలనాగ తావచ్చి యే మాటలాడె
తిరిగిచూడక దానిదెస నీవురాఁగఁ । దరుణి యెట్లగపడి తమకించి కలసె
వినిపింపుమనిన నావృత్తాంత మెల్ల । మనుజేశసుతుఁడు క్రమంబునఁ జెప్పె
నొక్క శంఖమొసంగి యూఁదిన వత్తు । నెక్కడనున్న నీయెడకన్న నుడియుఁ
దెలిపిన భ్రాంతిచెంది మునీశ్వరుండు । తెలివియుఁ దన విరక్తియు తీర్తచేసి
ఆ శంఖమిమ్ము మా కవనీశతనయ । యేశత్రుకోటులనేనిఁ గీటడఁచఁ
గల గదాదండ మొక్కటి యిత్తునీకు । నిలయెల్ల నందున నేలగాఁ గలవు
నొకకాంతవలన నీకొదవు మేలేమి । సుకుమార!యనిన రాసుతుఁడు చింతించి
తెక్కలివహాని మతిభ్రమఁ జెందె । నక్కట! చూచితె! యంగన లనిన
నెంతటివారల కీరీతిఁ బొడము । భ్రాంతి, యాగద సుప్రభావమేర్పడఁగ

వినిమొదగాకని వెండియుఁబలికె । ననఘ! యీగద శత్రుహతిఁజేసి మరల
నెవ్వరిఁజేరు నా కెఱిఁగింపు మనిన । నవ్వాయుభోజను నన్న యిట్లనియె
సీగద శత్రుల నేపణఁగించి । వేగంబె నినుఁజేరు విస్మయం బొదవ
గదయిత్తు శంఖంబు గ్రక్కున నూఁది । ముదిత రప్పింపు నాముందఱె కనిన
నా రాజసుతుఁ డింద్రజార్పితశంఖ । మారవం బొనరింప నతివలఁ గూడి
దివ్యయానంబుపై దేవి వచ్చుటయు । భవ్యమౌ దానిరూపముఁ జూచిమెచ్చి
గదయిచ్చియతనిశంఖముఁబుచ్చుకొనియె । ముదితయప్పుడుబొమముడిపాటుతోడ
నానృపాత్మజున కుపాయ మొకండు । తా నేత్రసంజ్ఞ చేతనె తెల్పి చనియె
నాయుపాయ మెఱింగి యతియు ననుజ్ఞ । సేయ వీడ్కొని రాజశేఖరసుతుఁడు
కొంతదవ్వేఁగి యక్కుటిలవిచారు । కంతువేదనఁ దీర్తు గదచేత ననుచు
బిరబిరఁద్రిప్పి యప్పెనుగద వైవ । దురుసుగా నదివచ్చి దుర్భావుఁడైన
ముని కాళ్లుసేతులు మోమును దలయు । మునికొని తాఁకిన మూర్ఛిల్లి యతఁడు
కొంతతెప్పిఱి చాలు కొమ్మ యటంచుఁ । జెంతదాఁచినసంకుఁ జెచ్చెరవిడిచె
సంకుతో గద తనశయము ప్రాపింపఁ । నంకిలిదీఱి రాజాత్మజుం డవల
వాయుభోజను తపోవనముఁ బ్రాపించి । యాయనయడుగుల కధినతుండైన
పోయినపని యేమి భూపాలపుత్ర! । కాయమో పండో! నిక్కము దెల్పుమనిన
స్వామివారలదయాంచత్కటాక్షంబు।మామీఁదఁగలుగగా మత్ప్రయోజనము
కాయయౌనే! పండుగాక యటంచు । నాయన కెఱిఁగించె నక్కార్యమెల్ల
నెఱిఁగింప సతిఁజూడ ఋషివేఁడ నతఁడు।దరమూఁదినంతఁగాంతయుమింటఁదోఁచె
నా రూపసంపద కాతఁడు భ్రమసి । యోరాజసుత ! శంఖమొసఁగితి వేని
నక్షయకంథ నీకర్పింతు ననిన । నాక్షణంబున శంఖ మాతని కొసఁగి
యక్షయకంథ భుజాగ్రమం దమర । నాక్షితీశకుమారుఁ డవ్వలఁబోయి
గద మానిపైఁ బ్రయోగముచేసినంత।నది మోదె ముక్కు మోమంతయుఁబగుల
నందున భీతుఁడై యమ్మునీశ్వరుఁడు । చిందంబ! మీరాజుచేతికె పోతుమ్మొ
తరళాక్షి నెయ్యంబు దయ్య మెఱుంగు । నెఱుఁగ కక్షయకంథ నిచ్చితినేను
తమయన్న భ్రమసి గదాదండ మిచ్చి । తమి మోసపోయినదారి నటంచు
దరముతో దరము ముందరఁ బనుచుటయు । శరణార్థి నతని నొంచక గద మరలె

గదయు శంఖముఁ జేరఁ గ్రహియించి యతఁడు। ముదముతోఁ దృణభోజి ముందరికరిగి
మ్రొక్కి కరంబులు మొగిచి నిల్చున్న। మక్కువ దీవించి మహిపకుమార!
నీకోర్కె ఫలియించెనే? మదగ్రజుఁడు। నీకుపాయము దెల్పెనే? యింద్రకన్య
నీవశంవదయయ్యెనే? యనియడుగ। నావార్తలన్నియు నతనికిఁ దెలిపి
యువిద శంఖారవాహూతయై వచ్చు। సవిధంబునకు మునీశ్వర! యన్న నతఁడు
నాశంఖ మూఁదుమన్నా! యెటువంటి। దో శక్రతనయ కన్దోయి రంజిలఁగఁ
గనుగొనియెదనన్నఁ గానిండటంచుఁ। దనచేతిశంఖ మాతఁడు సవర్ణముగ
నూఁదిన నగుచు నయ్యుత్పలగంధి। ప్రోదిని సాకారయయ్యెనో! యనఁగ
ఘనపదలక్ష్మి సాక్షాత్కారమయ్యె। ననఁగ నంగజుని మోహనబాణశక్తి
స్త్రీరూపమై చనుదెంచెనో యనఁగ। సౌరకాంతామణి స్వర్ణవిమాన
మానితయై కనంబడిన మోహాంధుఁ। డై నీతిదలఁపక యన్నలు పడిన
పాటెఱుంగక తృణభక్షుఁ డుండగుట। బోఁటిచక్కదనంబు భువనమోహనము
నిది వచ్చుటకు శంఖమిచ్చితి వేని। వసలక పాదుకాద్వంద్వ మిచ్చెదను
ఎందు నీవరుగ నూహింపుదు వాత్మ। నందుఁ గొంపోయి నయ్యన నిన్నుడించు
నిది తపశ్శక్తిచే నేను సాధించి। నదిసుమీ రాజనందన! యని యొసఁగఁ
గరము వేడుక పాదుకలుగొని యతఁడు। కరముననున్న శంఖము మౌని కొసఁగి
సురరాజుసుత తన్నుఁ జూచి మెచ్చికొన। నరిగి యొక్కెడనిల్చి యగ్గదవైచె
నది గదవలె మౌని కార్తిగల్పింప। నిదిగద! తన బుద్ధిహీనత యనుచు
కకపాల నున్నశంఖము విసర్జించె। వికలతఁ దనకీర్తి విడిచినయట్టుల
శంఖంబు, గదయును సన్నిధియైన। శంఖంబువే గదాశ్రయకంథలొదవె
యోగవాగలుగల్గె నొదవె నిష్టార్థ। మేఁగెద వలసినయెడ కింకననుచు
నాఘనుఁ డూహించి యమరేంద్రకన్య। గా ఘనస్తనయుగ ఘట్టితాత్మీయ
వక్షఃకవాటుఁడై వలసినపురము। లీక్షింపుచును మది కింపైనయెడల
నెలపదిపూటలు నిలుచుచు ధనము। వలసినవారి కవ్వారిగా నిడుచుఁ
బాదుకాద్వంద్వ ప్రభావంబు వలన। నాదట నెంతదవ్వైనఁ బోవుచును
నిందుకాంతంబన నింపొందు పురము। సందర్శనము సేయఁ జాల వాంఛించి
యాపురమధ్య దీవ్యచ్ఛివాగార। గోపురద్వారంబుఁ గోరి ప్రాపించె

ప్రాపించి తనమేని బడలిక తీఱఁ । దాపింఛ కురవక దాడిమీవకుళ
పనస తిందుక పారిభద్రాది వృక్ష । ఘనలతావృత సరఃకమల కల్హార
గంధబంధుర శీతగంధవాహములు । మంథరగతిఁ బూన్ప మనసు రంజిలఁగ
నిరవొందియున్న నయ్యెడ కొకవేశ్య । విరిబంతిగొని గుడివెడలి యేతెంచి
యా రాజనందను నాకృతిఁ గాంచి । కీరవాహుఁడా! యని కేల్దోయిమోడ్చి
కరగతంబగు బంతికానుక యిచ్చి । తరుణీమనోజ్ఞ! యేస్థలమున నుండి
యేఁగుదెంచితిరి పేరెయ్యది మీకు । నాగవాసమున నున్నది మంజువాణి
యాటపాటలమేటి యబ్బోఁటినాటి । బోఁటి లే దింద్రునిపురములోనైన
నది రూపవతియను నభిధాన మూని । నిదురకు వెయ్యేసి నిష్కముల్ దివియు
మిమ్ముఁజూచిన నదిమెచ్చి రమించు । రమ్ము చూపెద నీకు రమణిగేహంబు
అనిన మంచిదియని యబ్బోఁటి వెంటఁ । జని రత్నఘంట హాజారమ్మునందుఁ
గని యది వాయింపఁగా విని వేశ్య । జనని కుచేష్టిత సౌజన్యరహిత
చేఁబేదయల్లుండ్రఁ జేరి రానీని । దూబ మందులమారి దుడుకుబజారి
మదిరచొక్కునఁ బెక్కుమాట లాడుచును । వదరుఁబోతని విటవర్గముల్ రోయ
జాతి మోకాళ్లపైఁ జన్నులు వ్రేల । నూరెల సెలవులఁ జొల్లు గాఱఁగను
పట్టినకోల చూపడ నమ్మగారి । పుట్టంబు గూనివీఁపునఁ గొంతజాఱఁ
బుక్కిటితమ్మ చప్పుడుమీఱఁ దినుచు । నొక్కట వాకిటి కుద్ధతినరిగి
రాకుమారునిఁజేరి రావయ్య! యన్న । ధాకార! మాకుఁ బ్రత్యక్షమైనట్టి
భాగ్యదేవతవని పలుమాఱుఁ బొగడి । యోగ్యమె! యిచ్చోటనుండ నీయిల్లు
నీవాకిలియ్యింతి నీసొమ్ము వింత । గావింతురే ? యింత ఘనకీర్తిమంత
విచ్చేయుమన నవ్వి వేయివరాలు । పచ్చనిబట్టతో బాగుగాఁ గట్టి
యాముద్దికొప్పించి యతివలు వెంట । రా మందిరముసొచ్చె రాజనందనుఁడు
నా సురూపవతీలతాంగియు నెదురు । గా సఖీజనులతోఁ గ్రక్కున వచ్చి
యొనయఁగాఁ గైదండయిచ్చి బంగారు । పనుల రంగగు మేడపైకిఁ దోడుకొని
పోయి ప్రాఁగెంపులబోదెలు చందు । దాయరుగులు మగదాకొణిగలును
సకినెలపట్టెమంచము దోమతెఱయు । జికిలి సూర్యపుటంపుజిగి తలగడలు
బలువౌ చతుష్షష్టిబంధచిత్రములఁ । దళుకొత్తుగోడలుఁ దగు పదార్థములు

గలిగి చందనమాల్య కలితవాసనల । విలసిల్లు పడకయిల్ వేడ్కతోఁ జేరి
చలువపాన్పుననుంచి సరసకస్తూర । మిళిత తాంబూలంబు మెప్పరా నొసఁగి
చక్కెరవిలుకాని చక్కఁదనంబు । నెక్కసక్కెములాడు నేలికవీవు
నాపుణ్యవశమున నానివాసంబు । ప్రాపించితివి కోర్కెఫలియించె ననుచు
నుచితవాక్యంబుల నుపచరింపుచును । ప్రచుర వీణావాద్యపాటవం బూని
పాటల మాటలఁ బరవశుఁ జేసి । నాఁటిరే యొక్కక్షణమ్ము గావించె
నభినవమన్మథుం డారూపవతికిఁ । బ్రభవింపఁజేసె నపారహామోహంబు
నీరాజు నెడఁబాసి యెటువలె నిలువ । నేరుతు ననుబాళి నెలఁతకుఁ బొడమి
పదిపూట లిటు లెడఁబాయక నన్ను । మదనకేళిక నేలి మన్నింపు మనుచు
మనవిదెల్పిన దానిమాట లాలించి । మనుజేశసుతుఁడు నీమాతకు దినము
వేయివరాలిక వెలఁది నీపాన్పు । డాయఁగానీదన్నిటను జాణనీవు
నినుఁబాసి యవ్వల నేఁబోవఁ జాల । వనజాక్షి! పదివేలవరహాలు దెచ్చి
నీతల్లికొప్పించి నినుగూడి యుందు । నాతి! నీమేడపై నాకొక్కవిడిది
సమకూర్పు మచట నాసకలపదార్థ । సముదయం బునిచి స్వేచ్ఛఁ జరింతు ననిన
అలివేణి కడు భాగ్యమాయె నటంచు । నలరాసుతున కొక్కయఱఁ దల్లియాజ్ఞఁ
జూపి యచ్చోటవస్తువులు దాఁచికొని । భూపాలసుత! నన్నుభోగింపు మనినఁ
దలఁచినయపుడు చెంతలనిల్చు గదయు । వలమురియును దాఁపవలవదు గాన
నంతర్థిఁజెందించి యారాజసుతుఁడు । గంతయు యోగవాగలు దాఁచి యునిచె
అంతటఁ గొన్నినాళ్లరిగిన నవని । కాంతకుమారు రొక్కపు విజృంభణము
గని లంజతల్లి యేకతమునఁ బుత్రి । కనియె నీవిటుఁడు మహాధనాఢ్యుండు
నితని వస్తువులెల్ల నీయింటనునిచి । మతి నమ్మియున్నాఁడు మనల నెల్లపుఁడు
వీనివంచించి యీవిత్తంబుగొనఁగ । నేనొక యుపమ చింతించినదాన
నది వానితోఁదెల్పునపు డనుకూల । హృదయవై వేఁడికొమ్మీవు నటంచుఁ
దొలుత గారాబుకూఁతురి బందుగట్టి । యల ముదిలంజ యొక్కపుడు రాసుతుఁడు
నుల్లాసము వహించియుండెడి వేళఁ । గొల్లగొల్లున దగ్గికొనుచు నేతెంచి
యతఁడత్త! రమ్మని యాదృతి సేయ । హితసూక్తిఁ బొగడుచు నిట్లనిపలికె
నాపెన్నిధానమ! నాముద్దులయ్య! । నాపాలివేల్పవై ననుఁబ్రోచుసామి!

యొక విన్నపముగల దూఁకొనవలయు । సకలోకముల నసాధ్యముల్ మీకు
లేవని యెఱుఁగుదు లీలామనోజ! । దేవతాప్రార్థనఁ దీర్చుట లెంత!
నాగలోకమున సంతతముఁ జెలంగు । భోగవతీనది పొంతవసించు
హాటకేశ్వరునకు యామ్యభాగమున । నీటొందుఁ గారుణ్యనిధి హేమదుర్గ
సిరులిచ్చి దురితముల్ చెఱుపునాయమకు।*చెరువులై దుదినాలుసేయింతుమనుచు
మ్రొక్కుకొంటిమి పదుమూఁడేడు లాయె।నక్కాళి రేయి నృపాంతరమ్ములను
బొడసూపి బెదరించి పోవుచునుండుఁ । గడుదూర మటకేము గదలి పోలేము
నీకెంతపని యిది నేఁడు రేపటనె । యా కాళిగృహమున కరిగి మామ్రొక్కు
నెరవేర్చిన సురూపిణికి మహాసౌఖ్య । కర మగునను చు నక్కల్లరి చొల్లుఁ
బొల్లుల కనురూపముగ బోఁటిదెలుపఁ । దల్లిబిడ్డల కుచ్చితం బాతఁ డెఱిఁగి
యిది మహాభారమా! యెల్లిప్రొద్దుననె । కదలి పాతాళదుర్గను జేరఁబోయి
పూజించి యెనిమిది పూటలలోన । నిజముగా మేడ కేనేఁగుదెంచెదను
నా దివ్యవస్తుసంతతు లిందు డాఁచి । పోఁదలంచితి హాని పొందకయుండఁ
బదిలంబుగా మీరు పరికింపుఁడనిన । ముదితయు నమ్మదిముండయు ననిరి
బీగంబువేసి యప్పెట్టియ నిడిన । మీగురువస్తువుల్ మేము ప్రాణముగ
మమత నెప్పుడు పరామరిసింపుచుండె । దము శంకవలదు మూర్ధన్యకుమార!
నెమ్మదితో గమనింపుఁ డటన్న । సమ్మతించినవానిచందాన నతఁడు
నమ్మవచ్చునె! వెలనాతుల చెలిమి । మర్మదుష్కర్మజన్మస్థలుల్ వీరు
నా పదార్థములు మిన్నక కొనఁదలఁచి । యీపనిఁ జెప్పిరింతే దవ్వుఁబోవ
వీరి వంచనఁజేసి వెడలెద ననుచు । నారాత్రి శంఖగదాదులు పనిచి
పెట్టెల రాళ్లను బెళ్లలవైచి । గట్టిగాఁగట్టి బీగములుబిగించి
వాకిటిబీగంబు వైచి శీఘ్రముగ । వేకువ లేచి భావితదివ్యరత్న
పాదుకాద్వంద్వ విభాసిత సజప । పాదపయోజుఁడై పాతాళగంగ
స్మరణగావించి యచ్చట డిగ్గి సకల । దురిత హారాంబు బిందు పరీతశీత
వాతపోతములు పైవ్యాపింప దాన । వీత నూతన తనుస్వేదుఁడై యులరి
యా మహానది గొనియాడి సేవించి । సౌమనస్యంబున స్నానంబుచేసి

* చెరువు – ఆపదలను జెఱుపుటకుఁజేసికొన్న మ్రొక్కుబడి

కాలోచితక్రియల్ గావించి యుందుఁ । జాల మాటగు వికస్వర నవ్యకుముద
ఘూటంబు హాటకాబ్జములు గ్రహించి । హాటకేశ్వరుని గేహంబున కేఁగి
యాలింగమునకు సాష్టాంగ మ్మొనర్చి । కేలుదోయిమొగిడ్చి కెందమ్మివిరులఁ
జెంగలువల పూజచేసి హరాయ । గంగాధరాయ దుష్కర్మహరాయ
శంకరాయ నమోఽస్తు సద్భక్తజనవ । శంకరాయ యటంచు సంస్తుతింపుచును
నాదేవు సన్నిధి నధివసియించి । శ్రీదనర జపంబుసేయుచు నుండె
పెట్టెలలో రాళ్లు పెళ్లలు చూచి । తిట్టుచునుండి రత్తెఱవ లిద్దఱును
అంతటఁ గొంతసేపరిగిన నటకుఁ । గంతుసమ్మోహనకాండంబులనఁగ
మెలుపొందు తొలకరి మెఱుపులో యనఁగ । కళలెఱింగిన చంద్రకళలో యనంగ
రతిదాల్చు రత్నదర్పణములో యనఁగఁ । బ్రతిలేని యపరంజిప్రతిమలో యనఁగ
నలఘు శృంగారరసాధిదేవతల । నలువున నెనమంద్రు నాగకన్యకలు
హరినీలవేణులు హరిణలోచనలు । కరిరాజగమన లొక్కట నేఁగుదెంచి
భోగవతీజలంబుల నీదులాడి । వేగంబె వెలువడి వివిధాంబరములు
మణిభూషలును గంధమాల్యముల్ దాల్చి । ఫణిహారు పూజకు పత్రముల్ విరులు
గొని భక్తియుక్తితోఁ గోవెల సొచ్చి । మనసిజహరుని నుమామనోహరుని
సేవించి పూజించి శివ మహాదేవ । దేవ 'సుశీలంపతిం దేహి' యనుచుఁ
బ్రార్థించి తత్పురోభాగస్థుఁడైన । యర్థేశసుత సమానాకారఘనుని
అభినవమన్మథు నట్టె దర్శించి । యిభయానలెల్ల మోహించి మోములను
గళులుట్టిపడఁ బులకలు మేనఁబొడమఁ । గులుకు సిబ్బెపుగబ్బిగుబ్బ లుబ్బగను
గనుఱెప్ప లల్లార్చి గదిసి యొండొరులఁ । గనుగొని బలుతమకమున నిట్లనిరి
యీమన్మథాకారుఁ డీమహోదారుఁ । డీమహీశకుమారుఁ డెక్కడనుండి
యిచటికివచ్చెనో! యేణాక్షులార! । యచలకన్యాభర్త హాటకేశ్వరుఁడు
మనమీఁదఁ గృపయుంచి మరునకు మరలఁ । దనువిచ్చి తన సన్నిధానంబునందు
నిలుపుకొన్నాఁడో! వింటిమె యిట్టిరూపు । గలచెలువునిఁ బొడఁగంటిమె! యెందు
మన మందఱము వీని మగనిగాఁ జేసి । కొని పెద్దలయనుజ్ఞఁ గూడియుండుదమె
యితఁడె వల్లభుఁడైన నీడేరుఁ గోర్కు । లతులసౌఖ్యము లబ్బునని నిశ్చయించి
యారాజసుతు డాసి యంజలుల్ చేసి । కోరికల్ దొలకఁ బల్కులఁ దేనెలొలుక

పలికి రోనవపంచబాణావతార! । చిలువకన్నెల మేము చిన్నిపాయంబు
పొలివోక చెలఁగెడు పువ్వుఁబోఁడులము । వలరాజు నగు నిన్ను వలచివచ్చితిమి
మా కెనమంద్రకు మగఁడవై మమ్ముఁ । జేకొని యిష్టార్థసిద్ధి గాంచుమని
మనవిగాఁ దెల్పు నమ్మందగామినులఁ । గనుగొని యభినవకందర్పుఁ డనియె
నహికన్యలార! మీ సౌందమ్ముల్ గనిన । వహియింపఁడే ప్రేమ వలరాయఁడైన
మిముఁజూచి నేను గామించుట లరుదె? । కమలలోచనలార! కాదన నొకటి
యెఱిఁగింతు మీ పెద్ద లెఱుఁగకయుండ।మఱిగి మిమ్మెనయుట మర్యాదయగునె!
మీతండ్రులెవ్వరు? మీకుఁ బేళ్లేమి? । యీ తెఱం గిండ్లలో నెఱిఁగించి వారి
యనుమతి ననుఁ బెండ్లియాడిన మంచి । దనిన నాతనినీతి కలివేణు లలరి
యల రాజసుతునితో నని రెందుఁగన్య । కలను స్వతంత్రంబు గలుగదు గాన
యాడితి వీమాట యైరావతాహి । చూడామణికి మేముసుతల మేగురము
అమలయుఁ గమలయు హారిణియు ధరణి।సుముఖయు ననుపేళ్ళ సొంపుచెందెదము
యిది ధృతరాష్ట్రఫణీశ్వరపుత్రి । మదవతి యిది సుకుమారి యన్ పేరి
కోమలి కర్కోటకుని కూర్మిపుత్రి । వామాక్షి యిది రక్తవర్ణునిపుత్రి
సుభగ మేమెనమంద్రునుదతుల మెలమి । నభినవమదన! నిన్నభిలషించితిమి
మాతలిదండ్రులు మాయిచ్చవచ్చు । నాతనిఁ బెండ్లాడ ననుమతి మున్నె
యిచ్చినారది నమ్మవేని మాతండ్రు । లివ్వేటి కిప్పుడె యేఁగుదెంచెదరు
అని తమతండ్రుల నహిసుతల్ దలఁపఁ । జనుదెంచి యాఫణీశ్వరు లాక్షణమున
శివునిసన్నిధిఁ బెండ్లిచేసి యల్లునకు । వివిధభూషణ రత్నవితతి యొసంగి
నర్మహర్మ్యముల నిన్నాతులఁ గూడి । కూర్మి దేవేంద్రునికూఁతురి మీఁదఁ
గలప్రేమమున నేలగాఁదగు ననుచుఁ । బలికి నామాలుచన్న పార్థివాత్మజుఁడు
అమలాది కమలాయతాక్షులఁ గూడి । సమబుద్ధి నంచల సౌఖ్యాబ్ధిఁ దేల్చె
మెలపుతోఁగళలంటి మిక్కిలిసొక్కి । చెలియోర్తు పైబ్రాలఁ జెక్కిలినొక్కి
మునుకొని మోమునమోమును జేర్చి । యెనసి పుక్కిటివిడె మిచ్చి లాలించె
సరసత నిరుపురిచనుమొన లలమి । పరిపరిచెయ్వుల భావంబు గఱచె
నక్కఱ నిద్దఱ నక్కున నుంచి । చక్కెరకెమ్మోవి చవులాని మెచ్చె
నీరీతి నాతఁ డహీంద్రకన్యకల । మారుని కేళి వేమారును గూడి

యిచ్చకువచ్చిన ట్లిటులఁ గ్రీడింప । నచ్చతురుసిఁ జూచి యహివధూమణులు
నొకనాఁడు పలికి రోయుర్వీశతిలక! । సకలవనావళిఁ జరియింతుగాని
పడమటితోఁటలపజ్జకు మమ్ము । నెడఁబాసి యేఁగకు మేఁగితివేని
వైకృతంబొదవు మావచనంబు లాత్మఁ । జేకొనుమనిన మంచిదియని యతఁడు
అందేమివింతలో యరసెద ననుచు । నందఱ వంచించి యరిగె నొక్కఁడును
సరసాగ్రగణ్యుఁ డాజాడన తోఁట । కరిగి చంపకతరు లచ్చోటఁ జూచి
కనకప్రసూన మాఘ్రాణించినంత । మనుజేశసుతుఁ డొక్కమర్కటంబయ్యె
వానరత్వమునకు వ్యాకులపడుచు । నానరేంద్రకుమారుఁ డవ్వలనరిగి
మల్లెపూఁదోఁట సంభ్రమమునఁజొచ్చి।మల్లెపువ్వొక్కటి మరలమూర్కొనియె
నామల్లికాఘ్రాణజానందవశతఁ । దా మున్నటట్ల సుందరవేషుఁడయ్యె
నిది యద్భుతంబని యిచ్చ నెంచుచును।బొదలువేడుకఁ జొచ్చెఁ బున్నాగవనము
పొన్నపూవొకటి గొబ్బునఁ గేలఁజిదిమి।యన్నరేంద్రకుమారుఁడట్లమూర్కొనిన
వికృతవేషుండయ్యె వినికనిమెఱుఁగ । నకట! యద్భుతము లీయారామములను
గనఁబడె నీఁకనేమికలవో! శోధింతు । నని కేతకీవనం బవ్వలఁగాంచి
కోరి గేదఁగిపువ్వు గోసి మూర్కొనిన । జారునిజాకారసంపద గలిగె
నందున నానందమంది యారాజ । నందనుం డీవిరుల్ నాలుగుతెగలు
గ్రహియించి కొనిపోయి గణికలఁ బ్లవగ । మహిళలఁ గావించి మానంబడంచి
యే నొకజోగినై యిల్లిళ్లఁ ద్రిప్పి । దీనతఁ బొందింతుఁ దెగడ భూజనులు.
నన్ను వంచనఁజేసి నాసొమ్ముగొనఁగ । నెన్నిన జంతల నిటుసేయకున్న
యలుక యేగతిఁ దీఱునని యాత్మనెంచి।యలసంపెగలు మల్లియలు పొన్నవిరులు
హొన్నగేదఁగివిరు లొకకొన్ని కోసి । యన్నియు నొకరహస్యస్థలి డాఁచి
నాగకన్యలఁజేరి ననబోఁణులార! । యేఁగంటి పడమటి యెలదోఁటలందుఁ
గొన్నివింత లదేమొకో! తెల్పుఁడనిన । నన్నెలఁతలు పల్కి రయ్యగో! నీవు
పడమటికేఁగి శాపగ్రస్తవనులు । పొడగంటివో యేమి భూపకుమార!
మున్ను చంపకగంధి మున్నైన చిలువ । కన్నెలు తపములక్కడ సేయుచున్న
తొడిబడ దైత్యులు దుడుకులుచేసి । పడసిరి కీశరూప కురూపకములు
సంపెగ మూర్కొన్న శాఖామృగత్వ। మింపుసొంపు దొలంగ నెవ్వఁడే నొందుఁ

బొన్న మూర్ఛఁగొని కురూపుండగు మల్లె । క్రొన్ననఁ గేతకీకుసుమంబు వలన
నావికృతులు దీఱునని యనుగ్రహము । గావించి రాపుణ్యకాంత లట్లగుట
నందుఁబోవఁగ వలదంటి మటంచు । మందయానలు దెల్ప మనుజేశసుతుఁడు
నాఁడు మర్నాఁడుండి నాగకన్యకల । తోడ నిట్లనియె నోతొయ్యలులార!
యిందుకాంతంబన నెసఁగు పట్టణము । నందొకపనియున్న దట కేఁగవలయు
నే నాత్మఁదలఁచిన నెనమంద్రు మీర । లేనున్నచోటికి నేఁగుదేవలయు
నని వారివీడ్కొని యాంత్రాద్రి కదలి । జననాథతనయుఁ డాచంద్రకాంతాఖ్య
పురిఁ బాదుకాయోగమునఁ బ్రవేశించి । జరఠ యింటికినేఁగి సౌధాంతరమునఁ
దగు రూపవతిఁగన్న తల్లిబిడ్డలకు । దిగులుప్పతిలె నేఁగుదెంచెగా మరల
నీ రాజసుతుఁడని, యెదురుగానేఁగి । క్రూరచిత్తలుగానఁ గొంకుచు మ్రొక్కి
యల్ల పాతాళదుర్గాంబకు మ్రొక్కు । చెల్లించి మగిడివచ్చితె? సామి! యనుచుఁ
దెచ్చికోల్మచ్చిక దివిరిభాషింప । నచ్చతురుఁడు మీర లంపినపనికిఁ
బోయి దుర్గాంబికఁ బూజగావించి । యాయమ్మపాదమ్ము లందలివిరులు
గొనివచ్చినాఁడమూర్ఛనుఁడనిముక్కు । లెనయ సంపెగలుంచె నిచ్చలోనగుచు
సంపెగవిరుల వాసన లానినంతఁ । బెంపరి తల్లియుబిడ్డయు నపుడు
పందుకోఁతివిధంబు ప్రాయంపుఁగోఁతి । దండఁ జూపట్టిరి తాను పున్నాగ
కుసుమమాఘ్రాణించికుత్సితాంగంబు। పొసఁగఁ గ్రోఁతులఁద్రాళ్లఁబోదివిబంధించి
బలు భూతిపూఁతయుఁ బాములపెట్టె । తెలిసంకుఁగడెము సందిటఁ బ్రకాశింప
వంకరమైజోగి వాలకం బూని । చంకకోలయు నాగసర మొకకేలఁ
గొని వీథివీథులఁ గ్రోఁతుల రెంటిఁ । గునిసి యాడింపుచు గుంపులై జనులు
చూచుచు నవ్వుచు నూరెలనడువ । నీచిన్నికోఁతి యెంతే నిద్దురకును
వెయ్యేసివరహాలు విటులచేఁ గొనుచు । నియ్యూరఁ బేరువహించిన లంజె
యిప్పుడుక్రోఁతి యయ్యెంతితల్లి యని । చెప్పుచుఁ బ్రజలెంత చిత్రంబటంచు!
వెరగంద నయ్యూర విహరింపుచుండె । తరళాక్షి వింటివె! తత్పురాధిపుఁడు
ఇంద్రసేనుఁడు శౌర్యహృతపరధారు । ణీంద్రసేనుఁడు దర్పమెచ్చ నిచ్చలును
సరిసాటినృపుల మెచ్చక గడిమన్నె । దొరల నెంచక వీఁకతోఁ బ్రవర్తిలఁగ
బరనృపాలురు సహింపక బహుదేశ । ధరణీశ్వరులఁగూర్చి దండెత్తివచ్చి

పటుతర నిస్సాణ భాంకృతు లెసఁగ । పుటభేదనము చుట్టు భోరన విడిసి
బవరంబునకుఁబిల్వ బంధుసామంత । నివహంబుతోడఁ జింతించి యానృపుఁడు
ధీరులై చప్పన్న దేశాధిపతులు । వీరత్వమున దండువిడిసియుండఁగను
వీరితోఁ బోరాడి విజయంబునొంద । నారుద్రునకునైన నలవిగాదేమి
కర్తవ్య మెఱిఁగింపఁగదరయ్య! యనిన । ధూర్తత్వమెసఁగ నేదారలఁ జేకొనక
మనము చరింప నిమ్మాడ్కి వీరెల్లఁ । జనుదెంచి రిందుఁ బొసంగదు సంధి
చెచ్చెర భేదంబు సేయగాఁగూడ । దిచ్చితీఱదు కలహింపగా లేము
ఈ యుపాయములు నాల్గి చోఁటఁ జెల్ల । నోయింద్రసేన! యింకొక యుపాయంబు
గలదు నీపుత్రిక కలహంసయాన । కలభాషిణీనామ కాంతాలలామ
యీ నరనాథుల నేపణంగించు । వాని కిచ్చెదనని వాద్యముల్ మ్రోయ
నిప్పురిఁ జాటింప నేర్పాటుసేయు । మప్పుడె యొకపుణ్యుఁ డరుదేరఁగలఁడు
అని మంత్రిసామంతు లాప్తులు దెలుప । విని మంచిదని భేరిఁ వేయించి నృపుఁడు
ఈపగతులఁ బోర హింసించు దోఃప్ర । తాపశాలికి నిత్తుఁ దనపుత్రి ననుచుఁ
జాటింపఁ బంచినజనులెల్ల నట్టి । యాటోపవంతుఁ డీయవనిలోఁ గలఁడె ?
యింద్రాదులం దొకఁడే తెంచె నేని । నింద్రసేనునిపూన్కి యీడేర్పు ననుచు
గుమిగూడికొని యాడుకొనుచున్న మాట । లమితవిక్రమశాలి యభినవాంగజుఁడు
విని క్రోతులను గట్టివేసినత్రాడు । తనచేతఁ బూని ముందర వెన్కఁ బ్రజలు
చనుదేర ధరణీశుసభఁ జేరవచ్చి । యనియె గంభీరవాచాడంబరమున
జననాథ! నీకన్య సౌజన్య । నెనరుతో నాకుఁ బెండ్లియొనర్చి దేని
నరనిమేషమున నీయరిసేన నెల్లఁ । బరిమార్తు నిజము నీపాదంబులాన
యన నింద్రసేనుఁ డాయన కురూపంబుఁ । గనుగొని వీని కేకరణి నాసుతను
బరిణయం బొరింతుఁ బరజాతివాని । కరమరలేక కన్యక నీయదగునె ?
యని వితర్కింపఁగా నతనిభావంబు । గనిన సువేదియన్ ఘనమంత్రి పలికె
నేకారణమునో యితఁడు వక్రాంగుఁ । డై కానిపించినాఁ డవనీశతిలక !
మహిమ లేకిటులఁ గుమారి నిమ్మనుచు । మహినాథ! యోడక మాటాడఁ డితఁడు
అనుమాన ముడిగి చయ్యనఁ బుత్రినిత్తు । ననుమాటతో శత్రుహతికి సెల్విమ్ము
నావిని ప్రియమంది నరనాథుఁ డతని । రావించి యాశత్రురాజుల నెల్లఁ

గీఁటడంచితివేనిఁ గేవలప్రీతి । పాటించి నీకు నాపట్టి నిచ్చెదను
సభలోనఁ జెప్పితి సత్యమీమాట । శుభమొందెదవు వేయిసుద్దు లేలనిన
నభినవమన్మథుం డటులైన నధిప । సభనున్న యీమంత్రిసామంత బంధు
గణముతో నీవు మొగ్గరమున నిలిచి । రణము వీక్షింపు మూఁటఁ జెంద ననిన
నానందకందళితాత్ముఁడై యింద్ర । సేననృపాలుండు సేనలఁ గూడి
కోట యాళ్వరికట్ట గొబ్బుననెక్కి । ఘోటక రథభట కుంజరచ్ఛటల
నలుగడల్ నిండియున్న విరోధిబలము । తిలకింపుచుండె నెంతే సంభ్రమమున
నభినవమన్మథుం డంతలో నొక్క । సుభటుచే నొకకమ్మచుట్టి యొసంగి
దక్షిణదిశనున్న తనయగ్రజులకు । నీక్షణంబున నిది యిచ్చిరమ్మనిన
నతివేగగతిని వాఁడరిగి యాలేఖ । యతనియగ్రజుల రత్నాంగదాత్మజుల
నినతేజులను గాంచి యిదిలెస్స చదువు । కొనుఁడని యిచ్చిన గొబ్బున వారి
యగ్రజుండగు సుధన్వాఖ్యు డందుకొని । జాగ్రదక్షరపంక్తి చదివె నిట్లనుచు
శ్రీమదనంత విశేషగుణాభి । రాములైన కళాధురంధరులైన
శ్రీనిధులైన రాజతకీర్తిశాలు । లైన సుధన్వముఖ్య నృపాగ్రణులకు
తమతిమ్ముఁ డభినవదర్పకుం డెలమి । యమర ననేకసాష్టాంగదండములు
వెట్టి సేయంగల విన్నపంబేను । నిట్టలంబగు మీదసమిద్ధ కటాక్ష
మహిమ నీవఱకు సేమమున నున్నాఁడ । వహియించు మీక్షేమవార్తలు మాకు
వ్రాయించి పంపించవలె మీరు తడవు । సేయ కీకమ్మఁజూచిన యాక్షణమునఁ
దొలఁగిపొం డామడదూర మవ్వలికిఁ । దెలిసిపిమ్మటఁ జనుదెంతురు గాక
యిదియ విన్నపమన హెచ్చువక్కణలు । చదివి సుధన్వుండు సహజులఁ గూడి
తనసేనలును దాను తలఁగి దూరంబు । చనియెనంతట నొక్కచక్కి క్రోఁతులను
గట్టివేయుచు నవకందర్పుఁ డట్టె । యట్టాలకంబెక్కి యరిసేనఁ జూచి
ప్రచుర ఘనాఘనార్భటి నిట్టులనియె । నిచటికి మీరింద తేలవచ్చితిరి?
ఓరాజవరులార! యుర్విపై బ్రదుకు । వారైన మీమీ నివాసభూములకుఁ
దీసిపొండీరాడ దేవేంద్రు మీఁది । యీసు దలంగిపో కిందుంటిరేనిఁ
గాలమృత్యువుఁ బోలుగద యిదెవచ్చి । యాలమ్ములోన మిమ్మందఱఁ గూల్చుఁ
జెప్పితి నీమాటఁ జెవిఁ జేర్చివినినఁ । దప్పుమృత్యువు సూనృతంబిదియనుచు

బలికిన నాతనిపలుకు లాలించి । కలఁగ కాన్పృపులెల్లఁ గలకలనవ్వి
వంకరచేతులవాఁ డొకరుండు । కొంకక కోటపైఁ గూర్చుండి మనల
బెదరింపుచున్నాఁడు పెనుగద యొకటి । యిదెవచ్చి మిమ్మెల్ల హింసించు ననుచ
నీవింత గల్పించె నింద్రసేనుండు । తా వచ్చి మొనసి యుద్ధము సేయలేక
మంచిది చూత మీమార్గ మటంచు । కొంచ కందఱు గుంపుగూడి రోషమున
బటహ గోముఖ శంఖ పణవాది వాద్య । పటలార్భటుల నభోభాగంబు పగుల
నట్టహాసములు సేయఁగ నవ్వి రాచ । పట్టి గట్టిగఁ జలపట్టి బిట్టదరి
యగ్గదాయుధము దా నాత్మఁ దలంప । నగ్గలంబగు కాంతి నది చేరవచ్చె
చేరవచ్చిన మ్రొక్కి చేకొని దాని । నీ రాజకోటుల నెల్ల నేపణఁచి
పఱతెమ్మనుచు ఘోరభంగి మంత్రించి । బిరబిరఁ ద్రిప్పి దర్పించి వైచుటయు
నదియును బ్రళయకాలార్కబింబంబుఁ । బొదివెడు పరివేషము విధంబు దోఁచ
గిఱగిఱఁ దిరుగుచు గిరిజేశ ఫాల । భరితదృగ్దీప్తుల బయ లావరింపఁ
గడలేని సంవర్తకాలమేఘములఁ । బొడము క్రొమ్మెఱుఁగులఁ బోలి భూస్థలిఁ
నిండి బల్మంటలు నెరయంగఁ గాల । దండ పాణింధమోదగ్రత వచ్చి
యరదంబుల నడంచి హస్తియూథముల । నుఱుముసేసి హయాళి నుగ్గొనరించి
భటుల గాత్రంబులు బ్రద్దలువాపి । కుటిలరాహుత్తుల గొంతు లగల్చి
రథికుల నొంచి సారథుల వధించి । ప్రథనోర్వి మాష్టీల పలలంబు నించి
దొరల ఖండించి కేతువులఁ దుండించి । శర శరాసన పట్టిస ప్రాస ముసల
కరవాల శూల ముద్గర భిండివాల । పరశు తోమర గదా ప్రముఖాయుధములఁ
బొడిపొడిచేసి గుంపులమీఁద నురికి । కడికండ లొనరించి కలహోర్వి యెల్లఁ
గ్రొత్తనెత్తురులఁ వాఁగులువాఱఁ జేసి । యత్తఱి దివిజులారా! వింత యనఁగఁ
బాళెంబులన్నియు భగ్నంబు సేయ । నేలపాలైరి భూనేత లందఱును
గొందఱు పఱచిరి కొందఱు వెఱచి । యిందు శేఖరుఁడేమొ! యీజోగి యనుచు
శరణుసొచ్చిన వారి సదయతఁ బ్రోవ । మరలి యగ్గద రాకొమరుచేత నిలిచె
నామహాత్మునిఁ జూచి హర్షాబ్ధిఁ దేలి । శ్రీమంతుఁ డయ్యింద్రసేన భూవిభుఁడు
తన పుత్రమిత్రబాంధవులతోఁ గూడి । చనుదెంచి కపటవేషమ్మున నున్న
యారాజసుతునకు నంజలిచేసి । వీరాగ్రగణ్య! నీవేషమ్ము గన్న

సందేహ మొదవె నీచండప్రతాప । మెందు హీనులకుఁ దా నెట్లు గల్గెడిని?
అని గ్రుచ్చిగ్రుచ్చి తన్నడిగిన నతఁడు । తనకురూపమిది యథార్థంబని పలికె
నందునఁ జింతించు నధిపుచందంబు । మందయానలు తత్కుమారితోఁ దెలుప
నక్కలభాషిణి యయ్యనుఁ జేరి । మ్రొక్కి కరంబులు మోగిచి యిట్లనియె
నీమహాత్మకు రూప మీవు వీక్షించి । యీమాడ్కిఁ జింతింపనేల? భూపాల!
యితఁ డెట్టివాఁడైన నేమి? ముందరనె । యితని కిచ్చితివి నన్నితఁడె నావిభుఁడు
జాతిహీనుండైన జడమతియైన । నీతిదప్పిన నిఁక నిందింపఁదగునె?
యిదిగో! వరించెద నీతని ననుచు । మదిరాక్షి యభినవమన్మథుఁ జేరి
పన్నీట నాతనిపాదముల్ గడిగి । హొన్ను పువ్వులదండ యురమున వైచె
దాని పతివ్రతాధర్మంబుఁ జూచి । యానందమంది రత్నాంగదసుతుఁడు
తన కురూపము వాయ దట్టిలో నున్న।గొనబు గేదంగితేకుఁ గొని మూర్కొనియె
నందున భువనమోహనమూర్తి యైన । మందరధీరు నమ్మహిపకుమారుఁ
గని మామ మొదలుగాఁగల బంధుజనులు।కొనియాడి రంతనక్కుశలమానసుఁడు
తనయూరు తనపేరు తనమామతోడ । వినిపించి సంతోష వివశాత్ముఁ జేసె
నప్పు డాప్తులఁబంపి యన్నల నెల్ల । రప్పింప నయ్యారిరాజు వారలకు
నెదురేఁగి బహుమాన మెలమిఁగావించె । దదనంతరమున నుద్వాహలగ్నంబు
మఱునాఁటిరేయన్నిమహీసురుల్ దెలుప। పురముతోఁదనయంతిపురముకై సేయఁ
బనిచి లగ్నము సమీపంబైన రాజ । తనయునిఁ గూర్మినందన నందముగను
శృంగారభంగి రాజిలఁజేసి రత్న । రంగవల్లికల విరాజితంబైన
బంగారు చవికెలోపలఁ బెండ్లిపీట । నంగజనిభు నవీనాంగజ నునిచి
స్వకులోచితాచారసరణి నాధన్యు । నకు దారవోసెఁ గన్యక నవ్విభుండు
సకలప్రజానురంజనమహోత్సవము । లొకట నాల్గుదినంబు లొప్పె నప్పురికి
మామయు బాంధవుల్ మంత్రులు వచ్చి।యామహామహుఁ జూచియభినవమదన!
పండుక్రోఁతియు నిండుప్రాయంపుఁగ్రోఁతి । పెండిలిలోఁ దమపెంపు దొరంగి
యలమటఁ బడఁజేయు టర్హంబె? యింకఁ । దిలకింపుఁ గరుణార్ద్రదృష్టి వీరి నని
మనవిచెప్పిన నవ్వి మనుజేశ! వీరు । చెనఁటులై వంచనచేసిన కతన
నీగతి చేసితి నింక నెప్పంటి । లాగు వహించి మెలంగఁ జేసెదను

కనుగొనుండని మల్లికాసమాఘ్రాణ । మొనరింపఁ బంచిన నుగ్మలులైరి
వారిద్దఱును వచ్చి వలగొని మ్రొక్కి । నేరంబు సైచి మన్నింపవే! యనుచుఁ
జాలఁ బ్రార్థించిన జడియక రేఁగుఁ । డాలయంబునకని యనిచి తర్వాత
మరుశంఖరవసమాహూతయై సమర । పరివృఢకన్యను ఫణివరాత్మజలఁ
దలఁపున రప్పించి తత్సహవాస । కలితయౌ కలవాణిఁ గలసి నెయ్యమునఁ
గొన్నినాళ్లమామ కూర్మిఁ బూజింపనన్నిలవున నుండి యరణమ్ముఁ గొనుచు
నన్నలు వెంటరా నన్నులఁగూడి । సన్నాహమున బహుసైన్యంబు గొలువ
శృంగాటకపురంబు చేరి తల్లియు న । నుంగుతండ్రియుఁ దన్ గనుంగొని యలర
వారికి సాష్టాంగవందనంబు లిడి । వారిచ్చు దీవనల్ వరుసఁ గైకొనుచుఁ
దన యన్నలును దాను దల్లిదండ్రులకు । ఘనవస్తువాహనోత్కరము లర్పించి
పదుగురుసతులతోఁ బ్రాజ్యసామ్రాజ్య।పదవిఁ బ్రోచుచు నింద్రుపగిదిఁ జెన్నొందె
నాకలభాషిణి యభినవమదను । వైకృతంబు సహించి వరియించెఁ గాన
నీకథ వినువారి కీప్సితార్థములు । చేకుఱు ననుచు రాచిలుక తెల్పుటయు
నాపుష్పమంజరి యానందకలిత । యై పోయె లోపలి కరిగె దూతికయు.
అని శంభుఁడెఱిఁగింప నవ్వాలికథలు । వినిపింపుఁడని గారి వేడ్కతో నడిగె
సరసపతివ్రతాచరితంబు నందు । నిరువదియొకకథ యిది సాంగమయ్యె

---

## బుద్ధికర్మముల కథ

శ్రీ విశ్వపతి సమంచితమతి గారి । కావలికథ లిట్టులని తెల్పఁదొడఁగె
మంజుభాషిణి పిల్వ మఱునాఁడు పుష్ప । మంజరి సంధ్యాసమయమునఁ జేర
వచ్చినఁ బీటల వసియింపఁ బంచి । యచ్చిల్క నను దేనియలు చిల్కఁ బలికె
వనిత తావలచిన వల్లభుం డెంత । యనదయైనఁ గురూపియైన దైవగతి
సంగహీనుండైన నలసుఁడై యున్న । వెంగలియైన సాధ్వీమణి విడదు
పాయదు సెతవహింపదు కలనైన । సేయ దవజ్ఞ లోఁ జిడిముడి పడదు
కల దిందులకు నొకకథ యది నీకుఁ । దెలిపెద నీవేళ స్థిరబుద్ధి వినుము

ఆరట్టదేశంబునందుఁ జెన్నొందు । భూరివైభవపరాభూతేంద్రపురము
నూత్న నభోరత్న నుతదీప్తియుక్త । రత్నగోపురమగు భద్రావతీపురము
అప్పురంబేలు మేలౌ కీర్తికలనఁ । గప్పురంబు హసించు కమనీయమూర్తి
భద్రసేనుఁడు రణప్రతిహతారాతి । భద్రసేనుండు శుంభద్రసేనుండు
అద్రిధీరుండన నమరు నాయనకు । భద్రరేఖానామ భామిని గలదు
ఆ భద్రరేఖతో నవనిఁ బాలించె । సౌభద్రరేఖ సజ్జనపాలమాళి
అధ్ధరాపతి కమాత్యవరేణ్యుఁ డగుచు । బుద్ధిశరీరుఁడన్ బుణ్యుండు వెలయు
నతనిచేఁ జతురుపాయములు పంచాంగ । గతులు షాడ్గుణ్యవైఖరులు సప్తాంగ
రీతు లెఱింగి దుర్నీతి దొరంగి । యీతిబాధ లడంగి యిల సొంపుచెందఁ
బ్రజలఁ బాలింపఁగా బహుకాలమునకు । సుజనుల పూజచే సోమశేఖరుని
భజనచే నిత్యాన్నపానీయదాన । సృజనచే భాగ్యవిశేషంబు చేత
నిలఁజేని యువతిదౌహృదవతియయ్యె।ఫలియించె సుకృతముల్ ప్రభుమాళికనుచుఁ
బరిచరుల్ పురజనుల్ ప్రస్తుతిచేసి । రరిగె నెలల్కొన్ని యత్తరువాత
నవమమాసమున కాంతామణి కనియె । నవమన్మథాకారు నయగుణాధారు
సుకుమారు నొకని రాజు ప్రమోదవార్ధి । నొకటఁ దేలుచుఁ దత్సుతోదయవేళ
జాతకర్మ మొనర్చి సకలభూదేవ । జాతకమ్ములకు నొసంగిన ధేను
ధన వస్తువాహన ధాన్యంబు లిన్ని । యని ప్రస్తుతింపలేఁ డహిభర్తయైనఁ
బుత్రోత్సవంబిట్లు భూపతి చేసి । పాత్రదాత యనంగఁ బ్రఖ్యాతిఁడాసి
శృంగారనిధియనఁ జెలఁగు పుత్రునికి । శృంగారనిధి యనియెడు పేరువెట్టి
యలరుచు నున్నంత నక్కుమారకుఁడు । చలువపొత్తుల మించు జాళువా మేలి
పని డోల దాదులు బాళితో నునిచి । తనుఁబాడి పోషించ తనుకాంతి మించ
సితపక్షమున వృద్ధిఁజెందు సుధాంశు । గతి వృద్ధిఁబొందె నక్కడ నొక్కనాఁడు
దైవజ్ఞుఁ డొకఁడు శాస్త్రరహస్యవేత్త । భూవిభు సమ్ముఖమ్మున కేఁగుదెంచి
యతనిచేఁ బూజితుఁడై కూరుచుండి । క్షితినాథ! దైవజ్ఞశేఖరుం డనఁగ
ఖ్యాతి చెందినవాఁడగాన నీసుతుని । జాతకమ్ము లిఖింతు సమ్మతియైన
సెలవొసంగుఁడఁటన్నఁ జెంగటి మంత్రి । నిలఁదేఁడు గనిన మేలిది రాజచంద్ర!
యీలాగె వ్రాయింపుఁ డందునఁ గీడు । మేలు నెఱుంగనౌ మీఁదనౌ శుభము

నాయుఃప్రమాణమ్ము నరయవచ్చు నన । నా యవనీశ్వరుం డవుగాక యనుచు
ననుమతి యిచ్చిన నతఁడుకుమారు । జనననక్షత్ర ముచ్చగ్రహస్థితులు
తప్పకచూచి జాతకము లిఖించి । యప్పార్థివునకు రహస్యంబుగాఁగ
వినిపింప మంత్రితో విని ధరావిభుఁడు । తనయుండు పదునెన్మిదవయేట నకట!
చోరశిక్ష ఘటిల్ల స్రుక్కునటంచు । ధారుణీసురకులోత్తముఁడు లిఖించె
నని విన్ననై యున్న యమ్మంత్రి పలికె । మనుజేశ! యవలిక్రమంబెల్ల వినుము
దండితుండయ్యు నీతనయుండు పిదప । నిండువైభవముల నిఖిలోర్వి యేలు
నని వ్రాసినాఁడన్న నతనికిఁ దగిన । ధనభూషణాదు లద్ధరణీశుఁ డిచ్చె
బాలుఁడు నానాఁటఁ బ్రబలుఁడై పెరిగి । యాలోన సకలవిద్యలు నభ్యసించె
శాస్త్రముల్ స్మృతులును సత్పురాణములు। శస్త్రాస్త్రపాండిత్యసంపదల్ నేర్చె
పదియురెండేడుల ప్రాయంబు చెంది । పొదలు వినీతితోఁ బుత్త్రుండు మెలఁగ
భద్రసేనుఁడు చూచి బాలుఁడింకే యు।పద్రవంబులకు లోఁబడి స్రుక్కునొక్కొ!
కన్నుల నది చూడఁగా నోపననుచు। విన్ననై మంత్రి కవ్విధమెల్లఁ దెలిపి
పట్టాభిషేకంబు పట్టి కొనర్చి । యిట్టి తీర్థములాడి యే వత్తుననుచుఁ
దన భార్యతోఁగూడి తాను ప్రోల్ వెడలి । తనయుని మంత్రికిఁ దా నప్పగించి
తల్లియుఁ దండ్రియుఁ దనుఁబాసి చనిన । నల్ల బుద్ధిశరీరు నాజ్ఞ రాసుతుఁడు
అవనిఁ బాలింపుచు నర్థరాత్రముల । భవనంబు వెడలి కృపాణంబు పూని
దట్టిచల్లడములు దాలిచి నీలి । పట్టు ముసుంగిడి పట్టణంబెల్లఁ
జరియించి మఱి వేఁగుజామున నెవ్వ । రెఱుఁగకుండఁగఁ బడకిల్లు ప్రాపించు
నడురేయి పురశోధనం బిట్లుసేయఁ । దొడరుట రాత్రి నిద్దురలేమి నతఁడు
కొలువున మంత్రితోఁ గూర్చుండి యుఱక । పలుమారు నావులింపఁగ విలోకించి
యామంత్రి యిటులేల నావులించెదవు । భూమీశసుత! నిద్రపోవటో! రాత్రి
యెందుఁ జరింపుదు? వేమి నీచర్య । సందియంబాదవె దాఁచక తెల్పు మనినఁ
బురశోధనంబు సల్పుదు రాత్రులెల్ల । దురితవిదూర! యందున నిద్రలేమి
నావులింతలు తఱచయ్యె నటన్న । భూవరసుతుఁ జూచి బుద్ధిశరీరి
అన్న! రాత్రి చరించు టర్హంబుగాదు । పిన్నవాఁడవు వెంట భృత్యులు లేక
నొంటిఁద్రిమ్మరు టేమియుద్యోగ?మింక।నింటియొద్దనె యుండుమీ నేఁటిమొదలు

నో రాజనందన! యుడుగక రేలు । జారులు చోరులు సంచరింపుదురు
మొనయ భూతప్రేతములు పిశాచములు । దనుజులు తిరిగెడితఱి చరింపుదురె?
అదిగాక యొకరహస్యము గలదవల । నొదవు హాని యెఱుంగ వ్వారకుండుమని
పలికెడు నమ్మంత్రి పలుకుల కెదుర । పలుక కూరకయుండె పార్థివసుతుండు
తరువాత నగరశోధనము చాలించి । సరిప్రొద్దు దనుక శాస్త్రంబులు చదువు
తమిపుట్టి యొకనాఁడు తనజాతకంబు । క్రమమెల్ల నొకపుస్తకంబునఁ జూచి
యారార! పదునెన్మిదవయేటఁ దనకు।ఘోరదండనము వచ్చునటంచు బుధులు
వ్రాసిరి మృష యసవచ్చునే? దీనిఁ।ద్రోసిపుచ్చు తెఱంగు దొరకదో!యనుచుఁ
దన బుద్ధిమహిమచేతను గొంతతడవు।మనమునఁ జింతించి మఱియొక్క యుపమ
గాంచి మర్నాఁ డోలగంబున కేఁగు । దెంచి కొల్వుండి బుద్ధిశరీరుఁ బలికె
ఘనశీల! యొకపుస్తకమున మదీయ । జననపత్రిక చూచి చదివితి రాత్రి
పదునెన్మిదవయేటఁ బాటచ్చరునకు । నొదవు దుర్దశవచ్చు నుడుగ కటంచు
వ్రాసినా రదిగాంచి వందురి దానిఁ । ద్రోసిపుచ్చుట కొకదొడ్డ చింతనము
గావించినాఁడఁ దత్క్రమ మెఱిఁగింతు । నోవివేకనిధాన! యూఁకొందుగాక
అల క్షీరగిరిపై సదానందనామ । కలితుఁడౌ యోగి యొక్కరుఁ డున్నవాఁడు
అతని చెంగటికేఁగి యతనిశుశ్రూష । లతిభక్తిఁ గావించి యతనిఁ బ్రార్థించి
తదనుగ్రహమునను త్తమహఠయోగ।పదవిఁ బ్రాపించి యప్పటుమహత్త్వమునఁ
గర్మనిర్మూలనక్షముఁడనై పరమ । శర్మంబులొంది నేఁ జనుదెంతుఁ గనుక
రాజ్యరక్షణ మేమఱక సేయుమయ్య! । పూజ్యమార్గమున నన్ బోవనీవయ్య!
వలదని యడ్డకాల్ వైవకుమయ్య! । యలఘుబుద్ధికి నసాధ్యం బేడదయ్య!
యని దైన్యమున వేఁడు నారాజసుతునిఁ । గనుగొని మంత్రిశేఖరుఁ డిట్టులనియె
నీమాట వినియెకాదే! భవజ్జనకుఁ । డోమహాత్మక! యీడనుండక చనియె
నీవు దలంచినదిది మంచితలఁపు । భూవరాత్మజ! యాత్మబుద్ధియే సుఖము
బుద్ధిచేఁ గర్మంబు పొలియింపరాదు।బుద్ధిచే యోగంబుఁ బొరయఁగావచ్చు
యోగాగ్నిచే నాశమొందుఁ గర్మములు।యోగంబునకు సాటియున్నదె?యొకటి
యాయోగ మధికప్రయాససాధ్యంబు । నాయాసమున నెట్టు లభ్యసించెదవో!
నీకుఁ బదాఱేండ్లునిండె చేకూరు । గాక నీకోర్కె మార్కండేయమౌని

వరుసకుఁబలె పోయివచ్చెదే! క్షీర । గిరి సదానందయోగి కటాక్షమంద
నిను నొంటిగాఁబంచి నేనెట్లు రాజ్య । మొనరింతు బాలుఁడ వొకచోటి కరిగి
యాయాసపడగలవా? యని వగచి । యాయన త్వరచూచి యనుమతి యిచ్చె
నీయనువున సెలవీయఁ బెండ్లికిని । బోయెదుచందాన భూపాలసుతుఁడు
ఆమంత్రి వీడ్కొని యైదునాళ్లకును । శ్రీమహితంబైన క్షీరాబ్ధిఁ జేరి
యందొకగుహలో మహాయోగనిష్ఠఁ । జెంది బాహ్యము మఱచి సుఖించువాని
నుట్టిపడ్డట్లాత్మయోగసామ్రాజ్య । పట్టాభిషిక్తుఁడై భాసిల్లువానిఁ
గరువలితో మనోగతులు బిగించి । యెఱుక నంతర్లక్ష్య మీక్షించువాని
నాసదానందమహాయోగిచంద్రు । డాసి సాష్టాంగదండము పెట్టువేళ
కాదుగావున హస్తకములముల్ మొగిచి।యాదట నిలుచుండె నారాజసుతుఁడు
అంత నొక్కముహూర్త మరిగిన శాంతి । మంతుఁ డాయోగి సమాధి చాలించి
కెలనఁ జాగిలిమ్రొక్కి కేల్దోయి మొగిచి । నిలుచున్న శృంగారనిధి నట్టెచూచి
రావోయి! యారట్టరాజకుమార! । దీవించితిమి నీకు దీర్ఘాయు వొదవ
పుట్టుభోగివి రాజ్యభోగముల్ విడిచి । యిట్టేలవచ్చితి? వింతదవ్వనిన
వినయవిశ్వాసముల్ వెలయ నారాజ । తనయుఁ డిట్లనియె నోతాపసప్రవర!
మీపాదములుగొల్చి మీకటాక్షమునఁ।బాపముల్ తాపముల్ పాపుకోఁదలఁచి
చేరవచ్చితి నన్ను శిష్యులలోనఁ । గూరిచి రక్షించికొండని మరల
మ్రొక్కినఁ గారుణ్యమున లేవనెత్తి । నిక్కంబు శృంగారనిధి వోదువోయి!
యేకోర్కిఁగోరి మమ్మిమ్మవు చేరితివో । యాకోర్కె చేకూరు ననుమాన మేల!
పురుషునికర్మంబె బుద్ధిఁ బ్రేరేచి । పొరయించు సుఖదుఃఖములు గాలవశతఁ
బను లెంచినటులౌను బ్రాపించు సిరులుఁ।జను "ఫలంభాగ్యానుసారి" యనంగ
నీభాగ్యమున యోగనిష్ఠతో సకల । వైభవంబులు గల్గు వగవకు మనుచు
నతని నూఱడఁబల్కి యమ్మహాయోగి।యతని క్రమమున యమనియమములు
నాసనజయము ప్రాణాయామపరత । యా సాధకత మనోవ్యాపారహరణ
పాటవంబును షడబ్జవిలోకనక్రి । యాటోపమును నాడికాధిశోధనము
పూరకకుంభకస్ఫురణలు రేచ । కారూఢతయు సుషుమ్నాభ్యంతరమున
వల మనఃపవనంబు లైక్యమై చొచ్చు।మెలువు కుండలిశక్తి మేల్కొల్పు వెరవు

కలిగించి హఠయోగకలితమార్గమున । నెలకొల్పఁ గాలికానిలయంబునందు
శేలు వసించి నిద్రించుట లుడిగి । పాలోగిరము గురుప్రభుని యోగమున
నంబఁబూజించు బ్రాహ్మణుఁడిడ దినది । నంబు భుజించుచు నలఁకువ లేక
ఆరాజసుతుఁడిట్లు హఠము సాధింపఁ । గా రెండువర్షముల్ గడచె నీరీతి
యెన్ని యోగములు వహించిన విద్య । లెన్ని నేర్చిన భక్తి నెటువంటి బుధులఁ
గని కొలిచిన తనకర్మఫలంబు । లనుభవింపక తీఱదవ్వాల వినుము
పదునెన్మిదవయేఁడు ప్రాపించి నెలలు । పదియైనపిమ్మట పార్థివసుతుఁడు
నొకనాఁటి రే యాత్మయోగసమాధిఁ । బ్రకటమ్ముగాఁ గాళిభవనంబు నందు
సిద్ధాసనమున వసించి యుండంగ । నర్ధరాధరమున కానడి రేయి
కొందఱు దొంగలు కొదకకవచ్చి । యందలి దేవికి నందఱు మ్రొక్కి
దేవి! యీ ఘోట్టాణ దేశవల్లభుని । యావాసమున సొమ్ము లబ్బె నేనియును
నందులో సగము నీ కర్పించువార । మిందున సందేహ మెంచకుమమ్మ!
అని వేఁడికొనిచని యల్ల ఘోట్టాణ । జనపతి పాలించు సౌవర్ణపురము
ప్రాపించి నగరిలోపలికిఁ గన్నంపు । తూపరంబునఁ జొచ్చి దొంగలు హెచ్చి
బొక్కసమింఢ్ల తల్పులుమీఁటి ధనము । పెక్కుమణుల్ గొని పృథివీశుకన్య
యగు మదాలస భర్మహార్యంబు సొచ్చి । మగువ స్వయంవరమణిహారవల్లి
యా వెన్క గ్రహియించి యా మేడడిగ్గి । యావలఁజని కాళికాంబాగృహంబు
ప్రాపించి దేవి కర్పణముగా విసరి । యాపటుమణిహార మగ్గుడిలోన
వైచి తలారులు వచ్చుట బెదరి । యాచోరభటు లేఁగి రచలంబు డిగ్గి
తమకు లభించినధనము సామునకు । సమమని బహురత్నసంగతం బగుట
వారు తీవ్రంబుగా వైచిన రత్న । హార మచ్చోట యోగాభ్యాసనిష్ఠ
మొనయు రాసుతుకంఠమునఁదగుల్కొనియె।వినుమంత నచ్చోరవితతి వెంటాడి
ఘోట్టాణపతి భటుల్ కొందఱు జాడఁ । బట్టుక వచ్చి శాంభవిగుడి చొచ్చి
కరదీపికలు వెలుంగఁగ మూలమూల । లరసి యందొకచోట నఱుతహారంబు
వ్రేల యోగాభ్యాసవివశుఁడై యున్న । యా లోకనుతశీలు నారాజబాలుఁ
గనుగొని వీఁడెతస్కరుడు చిక్కెనని । కినుక నందఱు రెండుక్రేవల నిండి
మన మదాలస కంఠమాలిక వీఁడు । తన మెడఁ దగిలించి తపసివేషంబు

మొనయఁడా కన్నులు మూసికొన్నాఁడు। ధనమెల్ల నెక్కడ దాఁచియున్నాఁడో!
వీనిఁ బట్టుకపోయి విభుచెంత నుంచి । యానరేంద్రుఁడు చెప్పినట్ల చేయుదము
అని మౌనముననున్న యతనిఁ బట్టికొని । పెనుత్రాళ్ల చేఁ జుట్టి పెడచేతులంటఁ
గట్టి కొంపోయి రా కలకలం బెఱుఁగ । డిట్టలంపు సమాధి నెనసి తద్గురుఁడు
శృంగారనిధియు నంచితయోగనిష్ఠ । భంగపాటెఱుఁగ కెప్పటియట్ల యుండె
పరమమౌనవ్రతు బాలు నీరీతి । మొఱకుతనానఁ గొంపోయి యారెకులు
దేవ! ముచ్చును దెచ్చితిమటంచు సర్వ । జీవదయాపరు చెంత నిల్పుటయు
దివిటీలవెలుఁగునఁ దిలకించి యతని । కవనీశుఁడనియె మాటాడఁగదోయి!
నీనామమెయ్యది? నీకులంబేది? । యీనవ్యమణిహార మేరీతి దొరకె?
తోడిదొంగలు నేరి? తోరంపుమాన । మీడకుఁ గొఱగాది దేమి? నీయునికి
యని పెక్కువిధముల నడిగిన యోగ । మునఁ బల్కఁగూడక మూఁగచందమున
నూరకుండిన దొరయొద్దివా రితఁడె। చోరుండు మునిముచ్చు జూటు తాటోటు
చలమునఁ జంపినఁ జంపనిమ్మనుచుఁ । బలుకకున్నాఁడని పలుమాటలాడ
వారిమాటలు విని వసుధేశ్వరుఁడు । హారంబు మెడనున్నయపుడె ముచ్చయ్యె
కరపదచ్ఛేదంబు గావింపుఁ డితనిఁ। గొఱత వేయకుఁడన్నఁ గొనిపోయి భటులు
నగరబాహ్యమున నున్నతవధ్యశిలను । జగతీశసుతు కరచరణముల్ దునిమి
పడవైచి పోయి రప్పట్ల నెత్తురులు । వడియఁగాఁ గరపదద్వయమునఁ బెట్టు
తీపులు దియ్యఁగా దేహంబుదెలిసి । హా! పరమేశ్వరా! యాత్రాంతఫలము
తప్పునే! యని యోగదార్ఢ్యంబు వలన । నొప్పి దలంప కెంతో తాల్మినుండె
నా వేఁగుజామున నయ్యూరిలోనఁ । గోవిద స్తవనీయగుణధుర్యుఁ డనఁగఁ
దనరుచుండెడు ధర్మదత్తుఁడన్ వైశ్య । జనశిఖామణి విరుల్ శంభుపూజకును
గ్రహియించి స్నానంబుగావించి నగర । బహిరంతరుద్యానభాగస్థుఁడైన
శూలి సేవించి వచ్చుట కిల్లువెడలి । యాలోన మడిసంచి యంసదేశమున
వహియించి చనుచుఁ ద్రోవనుఱాతిమీఁద। బహురక్తధారలు ప్రవహింప మేను
మఱచియు మఱువక మాటిమాటికిని । హర! పరమేశ మహాదేవ! యనుచు
స్మరియించువాని సౌందర్యసంపదల । మరుమించువాని నెమ్మేనిచాయహొన్ను
నిరసించువాని నానృపసుతుఁ జూచి । వెరగంది దగ్గఱి విమలేందురేఖ

ముఱువొందు నతనిమోమునఁ జూడ్కిఁ జేర్చి । ... ...
యేదేశ? మేజాతి? యెయ్యది నామ? । మీదుర్దశ ఘటిల్లు టేమికారణము
నిన్నుఁ గన్గొనిన నెంతేదుఃఖ మొదవె । నన్న! నీస్థితిఁ దెల్పుమని వేఁడుచున్న
యావైశ్యమణిఁ జూచి యారట్టదేశ । పావనుండనియె నో భవ్యచారిత్ర!
భద్రావతీనామపట్టణం బేలు । భద్రసేనుని కూర్మిపట్టిని నేను
పదునెన్మిదవయేటఁ బ్రాపించు దొంగ । కొదవు కీడని యార్యు లుగ్గడించినది
విని యది కడఁద్రోసివేసెద ననుచుఁ । జనుదెంచి శ్రీరాద్రిసంయమిఁ జేరి
యాయనకృప యోగ మభ్యసింపుచును । నాయక కాళికాభవనంబునందు
నివసించియున్న యీనృపు వీరభటులు । వివశుఁడనౌ నన్ను వెసఁబట్టి తెచ్చి
కరపదచ్ఛేదంబు గావించిరేమి । యరసిరో! యడియాల మది చేనెఱుంగఁ
గర్మంబు యోగమార్గమున జయించి । పేర్మిఁ జెందెదనని పెనుబాధ పడఁగఁ
బాలైతినని గణింపఁగ ధర్మదత్తుఁ । డేల శోకించెద? వినతేజ! నీకు
గురుకటాక్షమున నేకొదువయు లేదు । వెఱవకు సాఱుఁడు నీవెత దీర్చుననుచుఁ
బరిపక్వజంబీరఫలములు నూనె । సరగునఁ దెప్పించి జ్వాలనార్చిఁ గ్రాఁచి
కరచరణంబు లాఘటమునఁ గొంత । చుఱుకుపుట్టఁగ నుంచి శోష హరించి
తనుగతనవరక్తధారలు గడిగి । నునుచల్వఁ గప్పి యాందోళిక నుంచి
తనయింటికపుడె సత్కరుణ నెత్తించి । కొనిపోయి మేడపైఁ గొమరొందు నొక్క
యరలోన మృదులశయ్యాస్థలి నునిచి । సరసాన్నగోక్షీరశర్కరాదులను
నాఁకలి దీఱిచి యరయుచునుండె । పీకరణి, వివేకులెంచ నవ్యాజ
కారుణికులుగదా! కరిరాజగమన! । యారాజసుతుఁ డిట్టు లానిసౌధమున
వసియించు టధ్ధరావల్లభుఁ డెఱిఁగి । యసమానమతిశాలి యని ఖ్యాతిగన్న
ధర్మదత్తుఁడు ప్రముచ్చుఁదనయింటిలోనఁ । గూర్మినొందుచు నిల్పికొనియున్నవాఁడు
అదియేమి తనకు మర్యాదయే? యనిన । హృదయాళుఁ డనుమంత్రి యిట్లని పలికె
గదిసిన జడునైన ఖలునైనఁ బ్రోతు । రెద వివేకంబు వహించు సజ్జనులు
అసమిచ్చి యొఱువరియై వానిఁ బ్రోచె । పసఁదప్పె నితఁడని భావించితేమొ?
అతఁడు సద్గుణమరయక వానిఁ బ్రోవఁ । డితిహాస మొకటున్న దిందుల కధిప!
విను తొల్లి గౌడభూవిభుఁడు సుద్యుమ్నుఁ । డను రాజుగలఁడు మహాకీర్తిధనుఁడు

ఆరాజు బొక్కసం బరయుచునాప్తుఁ।డై రాజిలు సుపణ్యుఁడను వైశ్యుఁడొకఁడు
నతనిమాటల కెదురాడఁడు రాజు । భృతివెట్టు రాణువకెల్ల నాఘనుఁడె
ఆవైశ్యుఁ డూరి బాహ్యమునఁ బూఁదోఁట।శైవాలయము మహాసరసి గట్టించి
మన ధర్మదత్తునిమాడ్కి వేకువన । చని తోఁటపూలెత్తి సరసిలో మునిఁగి
గుడిలింగము భజించి గురుని దర్శించి । యెడపక జాములో నింటికివచ్చు
నీరీతి మెలఁగుచున్నెడ నొక్కనాఁడు। చోరుఁడొక్కఁడు శాతశూలాగ్రగతుఁడు
సరసికిఁజను వైశ్యచంద్రునిఁ జూచి । కొఱప్రాణములఁ దన్నుకొనుచున్న తనకుఁ
బుడిసెఁడుజలములు పోయవే! యనుచు । గడుదీనుఁడై వేఁడఁ గరుణాబ్ధి యగుట
వానితోనని గురుస్వామిఁ బ్రార్థించి । యేనొక ఘనమంత్ర మెఱిఁగికొన్నాఁడ
నది పఠింపుచునుందు నట నీళ్ల కరుగ । మదినెడ మంత్రంబు మఱచిపోవుదునా!
నీ కది తెల్పెద నీవది మఱచి । పోక నేవచ్చినప్పుడె చెప్పుమనుచు
శివనామ మొక్కటి చెప్పిన వాఁడు । శివయని పఠనమ్ము సేయుచునుండె
నంతఁ దోయము తెచ్చి యామంత్ర మడుగ । నెంతయుభక్తి వాఁడేర్పడఁ బలికి
పలికి తోయముఁ గ్రోలి ప్రాణముల్ విడిచి। యల మంత్రపఠనమహత్త్వంబు వలనఁ
బ్రమథుఁడై దివ్యాభరణ దివ్యమాల్య । కమనీయ దివ్యాంశుకములు ధరించి
శివవిమానంబు వచ్చిన నెక్కి చనక । దివినుండె గురుహితస్థితిఁ గోరికొనుచు
శునకమొక్కటి వగర్చుచుఁ ద్రోవఁగూలి।తనువు వీడఁగనున్నఁ దద్వైశ్యుఁడరసి
శివశివా యని దానిచెవిలోనఁ బలుక । శివభటుండయ్యెఁ జచ్చినకుక్కరంబు
అది విమానంబెక్కి హరుపీటి కరుగఁ । గదిసి శైవత్వంబుగన్న మ్రుచ్చునియె
తగునె? యీగురునకు దక్షిణ యియ్య । కగజేశు సన్నిధి కరుగంగ నీకు
నిచట నిల్వుముగురుహితముగావించి।యచలవైభవమొంది యరుగుద మనుచుఁ
గాచుకుండిరి కొండెగాండ్రంతలోన । నీచులై గాళభూనేత కిట్లనిరి
మన సుపణ్యుని మీరు మంచివిశ్వాసి। యని యుండితిరిగదా! యతఁడిదె నేఁడు
మ్రుచ్చున కొళువిచ్చి మ్రుచ్చు లాలించి। మ్రుచ్చుతో నేకాంతములు కొన్ని పలికి
చచ్చిపోయెడు వేళ జలములు దెచ్చి । యిచ్చినాఁడని పల్క నెంతయుఁ గినిసి
భవనమంతయుఁ జూఱఁబట్టి యాసెట్టి । నవివేకి తోడితెండని వీరభటులఁ
బనిచిన వారట్టిపని చేసి సెట్టిఁ । గన మింటనని రంతకయె మున్నతండు

శునకతస్కరులకు శుభదాయి యగుచుఁ । జని సరోవరమున స్నానంబుచేసి
శివదర్శన మొనర్చి శ్రీగురుచరణ । సవిధదేశము చేరి సద్భక్తి మ్రొక్కి
యతఁడు తత్త్వరహస్య మానతీయంగ । హితబుద్ధి వినుచున్న యింతలోపలను
భవనంబు ముట్టుకోల్పట్టి యాభటులు । శివు దేవళములోన సెట్టి యుండుటలు
విని నల్వురకని నుద్వృత్తిఁ బట్టుకోనఁ । జనుదేర శునకతస్కరు లుగ్రలీల
కాలకింకరసమాకారులై గదలు । కేల ధరించి వాకిట నిల్చి వారి
గుడిఁ జొఱనీకున్నఁ గోపించి భటులు । పొడువవచ్చిన గదాస్ఫురణ నిర్వురినిఁ
బడఁగొట్ట నిర్వురు పఱచి తెల్పుటయుఁ । బడమితేఁ డెనమండ్రఁ బొమ్మని పనిచె
నెనమండ్రలో నల్గురీల్గఁ బడార్గు । రినిఁ బంచె నెనమండ్రు రూపరి రందు
వారిఁ బంచిన వీరవరు లిట్లు దెగిన । ధారుణీపతి బలోద్ధతిఁ దానె వచ్చె
వచ్చిన సేనల వధియింప భీతి । హెచ్చి కోవెలఁజొచ్చి యేఁగి భూవిభుఁడు
గురుచెంత సెట్టిగఁగ్గొని పాదములకు । నెఱఁగిన నిదియేమి? యేమి భూరమణ!
నాకు మ్రొక్కనకారణముఁ దెల్పుమనిన। నీకూర్చుభటులు కంఠీరవార్భటులు
నాసైన్యముల నెల్ల నాశంబుఁ జేసి । యీాసున ననుఁజంప నేతేర బెదరి
శరణుఁ జొచ్చితి నిన్నుఁ క్షమియింపు తప్పు। కరుణాబ్ధి! యనిన నక్కజపడి యతఁడు
గురునితో రాజుతో గుడివాకిటికినిఁ । బఱతెంచి పటుగదాపాణులై రాజు
భూరిసేనలనెల్లఁ బొలియించి కినుక । నారక్తలోచనులైన యిర్వురినిఁ
గని మీారలిర్వు రిక్కార్య మిట్లేల । యొనరించితిరటన్న నురుభక్తి మ్రొక్కి
శునకచోరుల చెవుల్సోక మంత్రంబు । వినిపించి పరమేశు వీటికి మమ్ముఁ
బనిచిన గురుసార్వభౌముండ వగుట । నినుఁ గాకుసేయు నీనృపతి సైన్యముల
ఘనగదాహతి నొంచి కాకుచేసితిమి । విను మీను చోరుఁడ వీఁడు కుక్కురము
జలమిచ్చి మంత్రమొసంగి ప్రోచినది । తెలియక యొళవిచ్చి తీదొంగ కనుచుఁ
గొండెగాండ్రఱిఁగింపఁ గోపించిభూవి। భుండుమాధనధాన్యములుచూఱఁగొనియె
మిముఁబట్ట భటులనంపిన నడ్డగించి । తిమి దానఁబుట్టె విద్వేషం బటన్న
మంచిది సేనల మరల రక్షింపుఁ । డంచు వైశ్యుఁడుపల్క నాక్షణంబునను
శివమంత్రమున నీళ్లు చిలికించినంత । నవనిఁగూలిన సేనలన్నియు లేచె
నాయిరువురు శైవు లతనికిమ్రొక్కి । పోయిరి కైలాసమునకు భూపాల!

నీసద్గుణ మెఱుంగనేరక తప్పు । జేసితినని రాజు సెట్టిని బొగడి
యెత్తిన ద్రవ్యంబులిచ్చి యనేక । విత్తంబు మణులును వినయోక్తి నిచ్చి
యెప్పటివలెఁ జనవిచ్చి మన్నించె । నిప్పగిదిఁ జరింతు రిల మహాత్ములు
వారి భావ మెఱుంగవలవదే? యనిన । నారాజు హృదయాళు నౌనని పొగడె
నంతట నొక్కనాఁ డారాజతనయుఁ । డెంతయు విశ్వాసమెసఁగ నైశ్యుండు
కంటికిఁ గనుఱెప్పగతిఁ దన్నుఁ బ్రోవ । నింటిలో నొరయు నమ్మేడపై నుండి
పండువెన్నెలగాయఁ బానుపుమీఁద । నిండువేడుక శయనించి యాహరిని
హరిహరబ్రహ్మాదులైన కర్మంబు । హరియింపలేరను నర్థంబుగలుగు
శ్లోకంబు వీనులుసొగయఁ బాడుటయు । నాకర్ణనమొనర్చి యారాజకన్య
లావణ్యవతి మదాలస కూర్మిచెలులు । వేవురు గొలువగా విడికెంపుపనుల
గొప్పయుప్పరిగపైఁ గొలువున్నదగుట । నప్పాట కతివిస్మయాక్రాంత యగుచు
నెవ్వండె? పాడేటి యీవగకాఁడు । జవ్వనులార! నైశ్యవరేణ్యు నింట
గాయకులున్నారె? గంధర్వుఁడేమొ । యీయెడఁ దెలిసిరారే! యనిపలుక
వారిలో నొకచంద్రవదన వేఁబోయి । యీ రాకొమరుఁజూచి యప్పుడె తిరిగి
వచ్చి మదాలసావామాక్షి కనియె । నిచ్చ నేనెవ్వఁడో యితఁడని యుంటి
వంచన నీస్వయంవరహార మది గ్ర । హించి కంఠమున వహించినాఁడనుచుఁ
గరపదచ్ఛేదంబు గావింపఁ బంచె । దొర వాని ధర్మదత్తుఁడు చూచి కరుణఁ
దనయింట నుంచి యేఁదగ నుండి హాప్రసు। జనియించి శ్లోకంబుఁ జదివినాఁడీటులఁ
జెలియ! వానికిఁ గాళ్లుసేతులు నున్న । వలరాజు గేరు కేవలరాజసంబు
గల రాసుతుఁడుగాని గాఁడనన్యకులుఁడు । కలికి! వానిమొగంబు గలువలతేనిఁ
గలకలనవ్వు సింగారమ్ములెల్లఁ । జెలువ రాశిగఁజేసి సృజియించెనేమొ!
వీని బ్రహ్మయటంచు వివరింప, వారి । జానన వానిసోయగము ప్రాయంబు
కనుఁగొనవలయు నిక్కడికిఁ దెండనినఁ । గనకాంగియును చెలికత్తె యిట్లనియె
దొర తొల్తనే వాని దొంగయటంచుఁ।గరపదంబులు గోయఁగా నియోగించె
నేవగింపుచునుండె నెటువలె నతని । నీవు దెప్పించెద? విచ్చోటి కనినఁ
బలికె మదాలస భయమేల? రాజు । సెలవునఁ దోడితెచ్చెద నీడ కతని
నీవేళ నని యప్పుడే లేచి సర్వ । జీవదయాపరు చెంగటి కేఁగి

కన్నతల్లియు నుండఁ గరములు మోగిచియున్న చిన్నికుమారి నొయ్యనఁదిగిచి
చేరువ నిడికొని చెక్కిలినొక్కి । కూరిమి శిరముమూర్కొని ముద్దు లాడి
యీవేళ వచ్చినదేమి? తెల్పినది । గావింతుఁ నెఱిగింపు కమలాక్షి! యనిన
నయ్య! పరాకు మీ రలనాఁడె నాకు। నెయ్యంబుమీఱఁ బెండ్లియొనర్పఁ దలఁచి
ధరగల రాజనందనుల నందఱను । బెరిమగల్గినవారిఁ బిల్వ నంపించి
చూపిన నారాజసుతులలో నొకని । రూపైన మెచ్చక రోసినట్లున్న
ననుఁజూచి నీమెమ్మనమున కింపైన । ఘనునిఁ బెండ్లాడు మేఁగాదన నీకను
రమణి! స్వయంవరరత్నహారంబు । రమణీయమహిమ నిర్మాణం బొనర్చి
నీకొసంగెద నది నీ వేమనోహ । రాకారు మెడనుంతు వతఁడె నీమగఁడు
అని యిచ్చితిరిగదా! యారత్నహార । మనఘుఁడొక్కఁడు కంఠమందు ధరించి
హారువొంద, బ్రముచ్చని యాజ్ఞసేయించి । తిగతండు మనవైశ్యతిలకంబు మేడ
నెలకొన్నవాఁ డతని నమోవిలాసములకుఁ జొక్కితి నిజంబుగఁ బెండ్లియాడఁ
దలఁచితి నతని నింతటినుండి చెంత । నెలమితో నిడుకొన నెదఁ గోరికొనెద
సెలవియ్యవలెనన్నఁ, జిన్నికుమారి । పలుకులు విని తండ్రి పరితాపమంది
యక్కటా! నినువంటి యంగనామణికి । నక్కంచు మొండివాఁడగునటే? తల్లి!
వాఁడతిసౌందర్యవంతుఁడో నీవు । నాఁడె వేఁడిన దండనంబు సేయకయె
నీకుఁ బెండ్లియొనర్పనే? కాలుగేలు । లేకయుండెడివాని లేమ! కోరుదురె?
మాయమ్మ! మగపోడి మానె డమ్మోడినె?।పో!యిదేటితలంపు?పొసఁగదు వానిఁ
దలఁపకుమన్న న త్తరుణీలలామ । కలకల నగి తండ్రిఁగని యిట్టులనియె
మనసునఁ దలఁచితి మాటల నతఁడె । యనువైన మగఁడని యంటి నీతోడ
నింక నీతనిమాని యితరుఁ జెందెదనె? । శంకించెదేటికి? జననాథ! యనినఁ
దల్లి యిట్లనె దీని తలవ్రాసినటుల । నుల్లంబునఁ దలంచె నుడుగు మటన్న
నుడుగ దెంతవిమోహమున్నదో! వాని । యెడ సెల్వొసంగు మింకేల జాగనిన
నారాజు విని విననట్లు నీబుద్ధి । కేరీతిఁ దోఁచె నట్లింక వర్తిలుము
కాదన మనిన నక్కన్య తండ్రికిఁ బ్రమోదంబులో మ్రొక్కి ముదితలు గొలువఁ
జని ధర్మదత్తుని సదనంబునందుఁ । దనరు రాజకుమారు ధారుణీవిభుఁడు
తోడి తెమ్మనుచు నాందోళిక యంపి । నాఁ డని యవ్వైశ్యునకుఁ దెల్పఁబనిచి

యతఁడంప నాంధ్రోళికాహూథుఁ జేసి । యతనిఁదెప్పించె సౌధాంతరంబునకు
నీలీలఁ దెప్పించి యిందిరానుతునిఁ । బోలు నాతని రూపమున కరుదంది
యెందునఁ గొదువ లేకింపొందు నతని । నిందఁబొందించి యన్నీచవిధాత
కరపదహీనునిఁ గావించె నేమి।కొఱఁత యుండెనో! యయ్యయ్యో! వింత యనుచు
వగచి యుప్పరిగపై వలిపెక్రొంజలువ । సొగసుపాన్పున నుంచి సురటిచే విసరి
నాసామి! నినువంటి నవమన్మథునకు । నీ సడి వచ్చెగా! యేమందు విధిని
నాభాగ్యమహిమ ప్రాణములతో మీరు । శోభిల్లుటలె చాలు శుభము గల్గెడిని
అని చల్వపావడ నతని నెమ్మేన । మొనయు చెమ్మట హరింపుచుఁ గప్పురంపు
విడియంబొసంగుచు వినయంపుమాట । లాడుచుఁ బరమయోగాభ్యాసమునకుఁ
దగిన వివిక్తవితర్దిక నిడుచు । మగువలసందడి మాన్పుచుఁ జెంతఁ
జేరి శుశ్రూషలుసేయుచు క్షుత్తు । దీఱ క్షీరాన్నముల్ తెచ్చిపెట్టుచును
బగలు రేలిటు లెడఁబాయక యున్న । మగువ కారాజకుమారుఁ డిట్లనియెఁ
గరపదహీనుండుగా! యీతఁడనక । తరుణి! నాయెడఁ జాల దయదాన వగుచు
సేవచేసెదవు నాచే నేమిసౌఖ్య । మావహిల్లెడిని? నీకైన నీభక్తి
మహిమచే సౌఖ్యసంపద దైవమిచ్చు।మహిఁ బతివ్రతలసామర్థ్యముల్ విన మె?
నీకతంబున నాకు నిజము మేలొదవు । నాకత వినుమని నరనాథసుతుఁడు
తన పుట్టుపూర్వముల్ దానితోఁ దెలుప । విని యది మిక్కిలి విస్మయంబందె
వృద్ధశ్రవోముఖుల్ విన బ్రహ్మకడను । బుద్ధికర్మములకుఁ బోరాట మొకటి
యకాలమునఁ బుట్ట నజునకు బుద్ధి । మ్రొక్కి యిట్లనియె వాఙ్మహనాకార!
ఘనత నాదేయని కర్మంబు కలహ । మొనరించె నాతోడ నోహో! యిదేమి!
నీవెంత! నాచెంత నేదొడ్డదాన । నావిధం బెఱుఁగ వెన్న, వితండమేల?
తక్కువయెక్కువల్ ధాతనే యడిగి । యొక్కటఁ దెలియుద మఱక రమ్మనిన
నిదె కర్మ మరుదెంచె నీవాద ముడుపఁ।గదవయ్య యన వారిఁగని బ్రహ్మపలికె
మీవాద ముడిగించు మిన్నక యొక్క । భూవరతనయుండు భూమికిఁ జనుఁడు
ఘోట్టాణనాథుని కూఁతురి యింటఁ । బట్టిమంచంబుపైఁ బవళించినాఁడు
శృంగారనిధి కాళ్లుచేతులు లేమి । నంగనప్రాపున నటుల నున్నాఁడు
గెలిచినవారు కాల్ కేలు నొసంగి । యలరింపుఁ డతనిఁ బొండని వీడుకొల్ప

బుద్ధికర్మములు స్త్రీపురుషరూపముల । నద్ధరావరసూతి హర్మ్యంబు చేరి
తమదేహకాంతులు దశదిశ లొరయ । రమణీసమేతుఁడౌ రాసుతు నెదుట
నిలిచిన నతఁడు నెంతేభక్తి లేచి । చెలి ప్రయత్నంబున క్షితిఁ జాగిమ్రొక్కి
మ్రొక్కి యర్ఘ్యముపాద్యమును దగుపూజ । లక్కన్యచే వారికపుడు సేయించి
యున్నతాసనముల నుండెడివారి । కన్నుప్రపాత్మజుఁ డోదయానిధులార!
మీ దేహరుచులివి మిన్నుననిండె । నేదేవతలొ! మీరలిటఁ బిచ్చుగుంటు
పయిని భాగీరథి పాఱినట్లయ్యె । దయ నన్నుగదియుటే ధన్యుండ నయితి
నిందు మీరరుదెంచు టేమన్న? రాజ । నందనుతో బుద్ధి నవ్వుచుఁ బలికె
నేను బుద్ధిని గర్మమీయన యెక్కుఁ । డేనన నితఁడు తానే యెక్కుఁడనఁగ
నిక్కవడి వివాదమొనసి మాహెచ్చు । తక్కువల్ దెలియ నిద్దఱము నీకడకు
వచ్చినారము వచోవల్లభుఁ డనుపఁ । జెచ్చెరఁ దెలుపు మిచ్చెదము మేలనిన
రాకొమరుఁడు పల్కె రావమ్మ! బుద్ధి । నీకున్న ఘనత వర్ణింపనే రాదు
అన్నిటనేర్పు నీయందున్నదైన । నిన్ను గర్మమునకంటెను హెచ్చటంచు
నేన ననోప నదేమిటి కనిన । నానెగుల్ వినిపింతు నయమొప్ప వినుము
కర్మంబువలన రాఁగలకీడు బుద్ధి । పేర్మిచే నేను దప్పించికొనంగఁ
దలఁచి యోగాభ్యాసవశఁ బెక్కుదినము । లలసితి బుద్ధిసాధ్యంబైన యోగ
గరిమచేఁ గర్మంబు గడచితినోటు! । కరచరణంబులు ఖండించి రుఱక
కావునఁ గర్మంబె ఘనము కర్మంపు । గ్రోవఁ దప్పింపనే ర్తురె? హరిహరులు
పోరేల? మీకిఁక బుద్ధి కర్మాను । సారిణి గాదె! యేజాడఁ గర్మంబు
తిరుగు నాజాడ బుద్ధి చరించు బుద్ధి । కగపడునే కర్మ మాకర్మమునకు
నగపడు బుద్ధి సత్యంబిది యనిన । నగి కర్మ మారాజనందను మెచ్చి
బళిబళి! బుద్ధి దర్పంబడంచితివి । గెలిపించితివి నన్నుఁ గేల్దోయి పాద
వనజంబు లెప్పటివలె వచ్చి శత్రు । జనహర్తవై ప్రాజ్యసామ్రాజ్యభోగ
పరుఁడవై యీపద్మపత్రాక్షిఁ గూడి । హరిఁబోలి కరుణాసమగ్రుండ వగుచుఁ
బ్రజలఁ బాలింపుమీ బహుకాల మనుచు। ఋజుమతినన జనియించె నాక్షణమె
కరచరణమ్ము లొక్కట లేఁజిగుళ్ల । కరణి సరోజరాగశ్రీల బెరసి
పాణిపదంబులు ప్రభవించినపుడె । రాణితోఁగూడి యారాజేంద్రసుతుఁడు

ఆయిద్దరికి మ్రొక్కి యర్ఘ్యాదు లిచ్చె। నాయెడ బుద్ధి యిట్లనియె నో యనఘ!
వరమొసంగెద నేమివలె వేఁడుమనిన । మరలక బుద్ధి ధర్మమునందె మెలఁగ
వలయునంచతఁడన్న వాని కవ్వరము। కలిమియు బలిమియుఁ గరుణించె నపుడు
స్త్రీపురుషాకృతుల్ చెందినవారి । నాపురాధీశ్వరుం డతివతో వచ్చి
సేవించి వారలచే విని నల్ల । కోవెల జపనిష్ఠఁ గూర్చున్న రాచ
కొడుకు కంఠంబున గురుహారవల్లిఁ । బడనైచి దొంగలు పఱచినవిధము
అదిచూచి మ్రుచ్చని యాజ్ఞ పెట్టినది । విదితంబుగా విని వెతఁ జెంది యతని
నాదరించిరి వేల్పు లంతర్ధిఁ జెంది । రాడట భద్రసేనాత్మజుం డలరి
తనమంత్రిఁ బిలిపించెఁ దలిదండ్రులలరి। చనుదెంచి రతని మేల్ సంయముల్ దెలుపఁ
దల్లిదండ్రుల సేవఁ దనుపుచు వారి । యుల్లంబు రంజిల్ల నొకముహూర్తమున
నామదాలసఁ బెండ్లియై యరణముగ । మామ యొసంగిన మణిభూషణములు
చతురంగబలము లసంఖ్యలు వెలయ । నతఁడు భద్రావతికరిగి మంత్రియును
జననియు జనకుండు సంప్రీతిఁ బనుప । ననుపమశ్రీలఁ బట్టాభిషేకమ్ము
వహియించి సర్వసర్వంసహాభార । సహిత దక్షిణభుజాస్తంభుఁడై వెలసె
నతని పట్టపుదేవి యమ్మదాలసయుఁ । బతిభక్తి నెల్లశోభనములు గలిగి
ఘనులైన సుతులఁ బెక్కండ్రను గాంచి। తనరె బాంధవులెల్లఁ దను బ్రస్తుతింప
నీపతివ్రతకథ యెవ్వరు వినినఁ । బ్రాపించు వారికి బహువైభవములు
నని కీర మెఱిఁగింప నలరి యూంవవ్ర । వనిత లోపలి కేఁగె వసుధేశుదూతి
చనెనని శంభుఁ డీసత్కథ దెలుప । విని గౌరి యవ్వలి వృత్తాంత మేమి
యానతి యియ్యవే! యనవిని తెలిపె। శౌనకాదికులు మెచ్చఁగ సూతసుతుఁడు
సనయపతివ్రతాచరితంబునందు । ఘనత నిర్వదియవకథ పూర్ణమయ్యె

---

## రాజశేఖరుని కథ

శ్రీవిశ్వపతి సమంచితమతి యువతి । కావలికథ యిట్టులని యానతిచ్చె
మఱునాఁటిరాత్రి యమ్మహనీయగాత్రి । స్థిరకాంతి మణిపుత్రి శృంగారధాత్రి
యల రాజదూతితో నరుదేరఁ జూచి । వలరాజు మేల్వారువం బిట్టులనియెఁ

జెడుబుద్ధులు గణించి శీలప్రతిష్ఠ । లడఁగించి పరపురుషానురాగంబు
వొడమించి పతిభక్తిఁ బొలియించి చెలుతు। రెడఁబాయ కబలల నిటువంటి కపట
జరతాంగనలు వీరిసహవాస మగునె? । తెలవ! నీవంటి పతివ్రతామణికి
నిటువంటి దుష్కాంత లెంతసెప్పినను । బటుభక్తి గుణముదప్పరు పతివ్రతలు
దీనిఁబోలిన యొక్కద్విజకాంత తొల్లి । ప్రాణనాథు నొక్కనిఁ జంపి తత్పతిని
వేఱొక్కనృపు నింట విడిచి భూజనుల । చే రట్టువడి భ్రమందెఁ జెప్పెద నీకు
నా కథావృత్తాంత మాలింపుమని మ । హాకీరమణి పల్కె నమృతంబుచిలుక
లాటోర్వి లక్ష్మీవిలాసమ న్పురము । నీటొందుఁ గలిమికి నెలవిది యనఁగ
నా నగరంబేలు నసమానకాంతి । భానుమంతుండగు భానుమంతుండు
ఆ జనాధిపు పుత్రుఁడై జ్ఞానవిభవ । రాజశేఖరుఁడొప్పు రాజశేఖరుఁడు
ఆ రాజతనయుఁ డర్థార్థిపోషణ ప । యా రాజితనయుఁడై యఖిలవిద్యలను
జతురుఁడై శస్త్రాస్త్రసాధనక్రియల । నతిలోకుఁడై పూర్ణయౌవనస్ఫురణఁ
జెలువొందఁ దండ్రి రంజిలి పెండ్లిసేయఁ । దలఁచిన నారాజు తలఁ పతం డెఱిఁగి
యుద్వాహ మొనరించి యువరాజుఁ జేసి । విద్వద్గణేయుఁడై వెలయు మాతండ్రి
యీపటుభారంబు నిపుడె నాతలను । మోపనెంచెను బుత్రమోహంబు కతన
నిది కూడదనఁగరా దిపుడె యందైనఁ । గదలిపోయి ధరిత్రిఁగల విశేషములు
చూచి వచ్చెదనటంచుఁ దలంచి యొకఁడె । యేచెలికానితో నెఱుకసేయకయె
ఒకనాఁడు మృగయాసముద్యమోత్సాహ। మొకటితండ్రికిఁదెల్పియూరువెల్వడియె
వెలువడి హయముపై విపినమార్గమున । విలునమ్ములు ధరించి వేఁటలాడుచును
జనుచున్న యారాజచంద్రుని యెదుట । ధనురాది సాధనోత్కరము ధరించి
మృగయావశంబున మృగములఁజంపి । మృగయులచేత నామృగమాంస మెల్లఁ
బురికిఁబుచ్చి శ్రమంబువొందిన యొక్క । ధరణీశతనయునిఁ దా విలోకించి
యతని చెంగటికేగి యశ్వంబు డిగ్గి । హితవచోవైచిత్రి నిట్లని పలికె
నెయ్యది నీదేశ? మెవ్వఁడు తండ్రి? । యయ్య! నీపేరేమి యడవిలో మెలఁగు
మృగములనేల చంపెదు? తెల్పుమనిన । నగరాజధృతికి నాయనకతండనియె
ననఘ! యుశీనరాహ్వయదేశ మేలు।ఘనుఁడు సుధన్వుఁడన్ ఖ్యాత లేశ్వరుఁడు.
ఆయనసుతుఁడ జయంతుఁడ న్వాఁడ । మాయయ్య కీమృగమాంసమ్ము లందు

నరుచిలే దెపుడెంతయైన భుజించు । నెఱచి దెమ్మనుచు నన్నేవేళ నడవి
వేఁటలాడఁగఁ బంపు వినుమన్న! యొక్క-।నాఁటిచందమున దినంబు మృగాళిఁ
దునుమ శక్యంబె? యిందున శ్రాంతిచెంది । చనియెద నెటకైన జనకునిసేవ
చాలునటంచు వేసరియున్నవాఁడ । నాలాగు వింటివన్నా! నిన్నుఁగన్నఁ
గనుపండువయ్యె నెక్క-డికిఁ బోయెదవు? । నినుఁ గొల్చివచ్చెద నీవెంట నేను
నన్నుఁ దోకొనిపొమ్మనఁగ సంతసించి । యన్న రేంద్రకుమారుఁ డతని కిట్లనియె
జనకుని నెడఁబాసి చనియెదు నాకు । నినుఁ దోడుకొనిపోవ నీతిగాదైన
వేసటపడి నీవు వెంటవత్తు ననఁ । ద్రోసి పొమ్మనరాదు దొరబిడ్డ వగుట
వెంబడి రమ్మన్న విని జయంతుఁడు ప్రి । యంబున నీవె మాయన్నవు నేను
నీయనుజుఁడఁ జుమీ! నెనరుంచు మనుచు।నాయనతోఁబల్కు-యలరుచు నరిగె
నిద్దఱు నీరీతి నేఁగుచు రెండు । ప్రొద్దుల కొకమహాద్భుతవనం బెదుటఁ
గని చొచ్చిపోవ నక్క-డ నొక్క-రాజ । తనయుఁడు వింట నస్త్రములు సంధించి
గుఱులేసి కడుడస్సి కూర్చుండఁబడిన । తటిఁ జేరి భానుమత్తనయుఁ డిట్లనియె
నెవ్వరివాఁడ? వీ వేమి నీనామ? । మివ్వని గుఱులేయ నేల? యొంటిగను
అలసితి వూరికి నరుగంగవలదె? । తెలుపుము నా వాఁడు తెఱఁగొప్పఁ బలికె
సౌవీరనృప తనూజాతుండఁ నేను । ధీవిరాజిత! జయత్సేనుఁ డన్వాఁడ
నరుణోదయమువేళ నార్యుల యొద్దఁ । బరిపాటి శాస్త్రముల్ పఠియింపుచుందు
జామైన గరిడిలోఁ సాధనసేతు । నామీఁదఁ గావింతు నస్త్రాభ్యసనము
మాపటిపూట శుంభచ్ఛబ్దగుంభ । నాపారగద్యపద్యములు వ్రాయింతు
వల్లకీ డిండిమస్వర మండలాదు । లెల్లను రేలు వాయింతు వేర్వేఱ
నీవిద్యలం దొకయింత తప్పినను । భూవరుం డదయత్వమునఁ గొట్టుఁదిట్టు
నొక్కింతస్నేహైన నూఅటఁగాన । నెక్క-డికేనిఁ బోయెదనని మదినిఁ
దలఁచియున్నాఁడ నీ తహతహ కోర్వఁ । గలనె? మీ వెంబడిఁ గదలివచ్చెదను
నన్నుఁ దోడ్కొ-నిపొందు నా నతండనియె।నన్న!విద్యలెఱుంగు మను టక్రమంబె?
జనకునివిడిచి మాజాడ నీవెటులఁ । జనుదెంచెదనిన నీసహవాసమునను
సకలవిశేషముల్ సమకూరు నాకు । వికటోక్తులాడక వెంటఁబెట్టుకొని
పొండన్న భానుమత్పుత్రుండు వాని । నిండుమనంబున నెమ్మి లాలించి

తోకొనిచనె జయంతుఁడు జయత్సేనుఁ । డీకైవడిని వెంట నేఁగుదేరంగ
నారాజశేఖరుం డవ్వలఁ జనుచు । నాజవనాఁ డొక్కయడవి లోపలను
జెక్కుటఁ జెయిచేర్చి చింతాభరమున । నొక్కటఁ బరితాపమొందు రాసుతుని
నొక్కనిఁ గనుగొని యొయ్యనఁ జేరి । యెక్కడ నీపురం? బేమినీపేరు?
జనకుఁ డెవ్వాఁడేల జాలి చెందెదవు? । వినిపింపుమనిన సద్వినయవాక్యముల
నారాజసుతుఁ డను ననఘ! చేదీశుఁ । డా రత్నకేతుధరాధీశసుతుఁడ
విజయుఁడందురు నన్ను వినుఁడు నా తెఱఁగు। ప్రజలఁ బ్రోవఁగ నన్నుఁ బట్టంబుగట్టి
మాతండ్రి విపినసీమకుఁ బోఁదలంప । నీతలమో పేల? యిపుడె నాకనుచు
జనకు వంచించి యెచ్చటికేనిఁ బోవు । పనిపూని యిటులఁ జేడ్పడి యున్నవాఁడ
మీ రెవ్వ రెచటికి మీరు పోయెదరు? । మీరు దయాభు లమేయవిక్రములు
నన్నుఁ దోడ్కొనిపొందు నాయన్నలార!।యన్న లాటధరాధిపాత్మజుం డనియె
నేము ముప్వురము వింటే! రాజతనయ!।యీమాడ్కిఁ దండ్రులకెఱుక సేయకయె
వంచనచేసి వెల్వడి దేశములఁ జ । రించనెంచితిమి యీరీతి మావెంట
నలమటకోర్చి నీవరుదేరఁ గలవె? । వలదన మరుదెమ్ము వచ్చెదవేని
వంచనలేక కేవలమైత్రి ధాత్రి । సంచరించంగ నీశ్వరకటాక్షమున
నేమిగల్గిన నదియె విశేషమనుచు । ధీమహిమ గ్రహించి తిరుగుద మనుచు
నతనిఁ దోకొనిచనె నంత దిగంత । గతదురంతధ్వాంతగరిమకుఁ బెరిమఁ
జూపి జక్కవకవ శోకాబ్ధి ముంచి । యాపద్మినీకాంత కలమట పెంచి
పెనుమానికములేని పెట్టెయ పోలె । వనజభవాండమ్ము వన్నెదొరంగఁ
జరమాబ్ధిఁ గ్రుంకె భాస్కరుఁ డట్టివేళఁ । గరుణాబ్ధి రాజశేఖరుఁడు రాజేంద్ర
తనయుల ముప్వురఁ దనవెంటఁ దోడు । కొని చని కెలఁకునఁ గొలఁకొండు సూచి
చరమసంధ్యాక్రియల్ సవరించి యచటఁ । బరమేశ్వరి వసించు భవనంబుగాంచి
భయభక్తులమర నంబకుఁ బ్రణమిల్లి । జయ జగజ్జనయిత్రి! జయపుణ్యధాత్రి
శివ! ప్రణామము సదాశివపత్ని! వినతి । హావఫలదాయిని! సాష్టాంగమనుచు
సేవించి యద్దేవిచెంత జపంబు । గావించి తత్కటాక్షమున నర్చకుఁడు
ననువొందు భక్ష్యభోజ్యాదు లొసంగఁ । గొని భుజియించి నల్గురు తృప్తిచెంది
యందఱు నొకచో సుఖాసీనులైన । నందు లాటేశ్వరుం డనియె వారలకు

నరనాథసుతులార! ననుఁగూడి మీరు । సంచరించిన మేలొసంగు నీశ్వరుఁడు
వినుఁ డొకప్రతిన గావించెద మీకు । మునుపుగాఁ బెండ్లిండ్లు ముగురికిఁ జేసి
కాని నేనొకకన్యకను వరియింప । హానివృద్ధులకు లోనై మీరు నేనుఁ
జరియించువార మీశ్వరి సమ్ముఖమున । నెఱిఁగించితి నటన్న నెలమి వారనిరి
అన్న! నీవూహించినటుల నే మాత్ర । మెన్నడు మిది సత్య మీదేవి సాక్షి
నీతోడివారము నీమేలు దలఁచి । యే తెంచుచున్నార మేల? సందియము
అని దేవిసన్నిధి నగ్నిసాక్షిగను । జననాథసుతు లిట్లు సఖ్యమ్ముసేయ
మంచిదియని బహుమానోక్తి వారి । నెంచి మీరలసితి రిపు డన్నలార!
నిదురింపుఁడని పల్కి నృపసుతుం డంబ । పదపద్మచింతన భక్తితో సలుప
నానిశావేళఁ బ్రత్యక్షమై దేవి । యోనృపాలకుమార ! యుల్లంబునందు
తలఁచినయర్థంబు దయతోడ నిత్తుఁ । దెలియఁ బల్కుమటన్న దేవికి మ్రొక్కి
యా రాజశేఖరుండనియె నోయంబ? । కోరినపనులు చేకూరు నట్లుగను
గరగతఖడ్గసంగతిఁ బ్రాణతతులు । చరియించునట్లను సముచితరీతిఁ
బలికినపలుకు నిబద్ధియౌ నటుల । బలిమియుఁ గలిమియుఁ బ్రాపించునటులఁ
గరుణింపవలెనన్నఁ గాళి యందొసఁగి । కరవాల మొక్కటి కట్టడఁజేసి
యీకత్తి తళతళలెడసిన యపుడె । నీకు హానిఘటిల్లు నెఱి నెప్పటట్ల
మెఱుఁగువెట్టిన నీ వమేయప్రకాశ । భరితగాత్రుండవై బ్రదుకుదు వనుచు
నంతర్ధిఁజెందిన నతఁ డొకమంట । పాంతరస్థలిని నిద్రాసక్తులైన
చెలికాండ్ర చెంతలఁజేరి నిద్రించె । కలువలు ముకుళించె కమలముల్ మించె
జక్కవల్ రహిమీతె జాఱెఁ జీఁకటులు।దిక్కులు జిగిఁబ్రోచె దినరాజు దోఁచె
నంతకుమునుపె నిద్రాసక్తులౌ జ । యంతాదికుల లేపి యందఱఁ గూడి
యవ్వలఁ జనియె రాజాత్మజుం డిటుల । మువ్వురు దనుఁగొల్వ ముందరనొక్క
పురము గన్గొని త్రోవఁ బోయెడివారిఁ । బరికించి యేమి యీపట్టణాహ్వయము?
భూలోకనాకంబుఁ బోలు నీప్రోలు । పాలింపుచున్న భూపతి నామమేమి ?
యనిన ఝంపాపురం బందుర దీని । ననఘ! సువిక్రముండను మహారాజు
పాలించు నిదియని పథికులు దెలుప । నాలించి పురిసొచ్చి యందు వర్తించు
నొక ముద్దియింటికి నొయ్యన నేఁగి । సుకుమారుఁ డారాజసుతుఁ డిట్టులనియె

నవ్వ! నల్వురము మేమాకట సొలసి । యిప్పిటి కరుదెంచి యెవ్వరికైన
నాకలిఁ దీర్పుమవని నిన్నువిఁ మ । హాకాంక్ష నీయింటి కరుగుదెంచితిమి
వలయు నర్థముగొనివంటసేయు మని । పలికిన నమ్ముద్ది పార్థివతనయ!
వంట సేయుటకేమి? వండెద నిపుడె । యింటిలో మంచినీళ్లిన్నియు లేవు
ఊకొను మీయూరి కొక్కటే బావి । యాకడ నొకవ్యాఘ్రము మధివసించినది
పురబాహ్య మగుటందుఁ బోయినవారిఁ । బొరిగొనఁగా రాజు పోటరికాండ్రఁ
బెక్కండ్రఁ బంచినఁ బెంపేది వాఁడు । చిక్కెరి పులిచేతఁ జెప్పెడిదేమి?
పులి బావిచెంగటఁ బొంచియుండుటను । గలుగవు మధురోదకంబు లియ్యూర
నుప్పునీళ్లను డప్పియుడుగునే? ... నిన । నప్పల్కు లాకొని యనియె రాసుతుఁడు
నాలుగుకడవలు నలుగుర మూని । వాలాయ మిపుడె యావ్యాఘ్రముంబుఁ జంపి
మంచిజలంబులు మసలక తెత్తు । మంచుఁ బల్కిన ముద్ది యలరి యిట్లనియె
పులినిఁ జంపఁగనోపు భూరిశౌర్యునకు । నెలమితోఁ దనపుత్రి నిచ్చెదననుచుఁ
జాటించఁబంచె నీజగదీశుఁ డట్టి । హాటుబం టీపురంబున లేఁడొకండు
మీలోన నొక్కఁ డామృగహంతఁ జంపఁ । జాలినవాఁడున్న క్షణములోఁ బెండ్లి
యతనికిఁ గావించు నాత్మజ నిచ్చి । క్షితిపుఁ డిమ్మాట ప్రసిద్ధ మిందనిన
మాలోన నొక్కఁ డమ్మా! పులిఁజంపఁ । జాలు సందియమేల చనియెద మిపుడె
యని కడవలుగొని యాజయంతాదు । లనుచరులై రాఁగ నలప్రోలు వెడలి
పులియున్న యలబావి పొంతకుఁ బోక । బలు పొదమాటునఁ బాయక నిలిచి
యాజయంతునిఁ బిల్చి యన్న! హెచ్చరిక । తోఁ జని బెబ్బులిఁ దునియలు చేసి
నీ విక్రమముఁజూప నృపమౌళి పెండ్లి । గావించు నీ కాత్మకన్యక నిచ్చి
యనినఁ బెండ్లికిఁబోవు నటు లుత్సహించి । యనుపమరేఖాజయంతుఁడై యలరు
నల జయంతుఁడు వామహస్తంబునందు । బలితంపు టొఱమాసి బాకు ధరించి
వలకేల సితకరవాలంబు పూని । మొల దట్టి చల్లడంబులు డంబుగులుకఁ
గిలకిల నార్చుచుఁ గ్రేవలఁ బొంచి । పులి నెదిరించిన భోరున నదియు
గొటగొటధ్వనులు మిక్కుటముగా దిశలు । పటపటఁబగుల నుద్భటవృత్తిఁదోఁకఁ
దటతటఁ బలుమాఱు ధరఁ జఱచుచు మను । మిటమిటఁ జూచుచు మీసంబు లదుర
పైకిరాఁ దెఱనోట బాకు వేఁదుఱిమి । చేకత్తి గ్రుమ్మి విజృంభించి మఱియుఁ

బొడిచిన బలుబాకుపోటు లంగిటను । బెడిదంబుగా నొచ్చి భిన్నాంగ మగుచుఁ
బులి త్రెళ్లె నదిగాంచి పొదఁ బొంచియున్న।యలరాజసుతుఁడు జయత్సేనుతోడ
విజయునితో వచ్చి వీరుఁడ వీవె । భుజశక్తిఁ బులిఁ బడఁబొడిచితి వనుచు
నాజయంతునిఁ గొనియాడె నవ్వేళ । రాజశేఖరునాజ్ఞ రయమున నతఁడు
పులితోఁక తుదనఖంబులు దెగఁగోసి । బలు దట్టిపొర నుంచి పనివడి దాఁచె
నలుగురు రాసుతుల్ నాల్గుకుంభముల । జలములుగొని ముదుసలి యిల్లుచేరి
పులినిఁ జంపిన క్రమంబు గణింప నామె । యలరుచు వండి మృష్టాన్నంబు లిడిన
భుజియించి తద్గృహంబున శ్రాంతిదీఱ । ఋజుమతుల్ వారు నిద్రించి రావేళ
నానాఁటి మునుమాపె యయ్యూరి భూమి।జాని దుకూలముల్ చలువలుసేయు
చాకి పెద్దసుతుండు స్వచ్ఛాంబరుండు । కోకలు మూటలు కొన్ని ఖరాళి
పై వైచి దొర వలిపంబుల మూట।దా వీఁపున ధరించి త్వర వచ్చుచుండి
దూరస్థుఁడగుచు శార్దూలంబు బావి । చేరువ నిపుడు వసించిన దేమొ!
చూచెద ననుచు నచ్చో నిక్కినిక్కి । చూచుచుండఁగ వాని చుట్టంబులనిరి
యోరి శుద్ధాంబర! యోడక నీవు । దారుణవ్యాఘ్రంబు దఱుమునో! యనక
యాదిక్కు చూచె దీ హామిక యేల! । పోదము రమ్మన్నఁ బోవక వాఁడు
వారి నిల్వఁగఁబంచి వటవృక్ష మొకటి । దారిలోనున్న సత్వరమున నెక్కి
బావిచెంగటఁ గూలఁబడి కాకజంబు । కావృతమై యున్న యప్పులిఁ జూచి
యిది డింకివేసిన దేమొ? భీతిలక । గదిసి నిబద్ధిగాఁ గనివత్తు ననుచుఁ
దనవారు వలదనఁ దరువు వే డిగ్గి । చని పొంచి యల్లన శార్దూలమున్న
యునికి తప్పకచూచి యోడక చేరి । తన తుప్పుపట్టిన తరవారిఁ జేటికి
పులిమేనఁ బలుచోట్లఁబొడిచి బల్ గాయ।ములు చేసి కావరంబునఁ గిలార్చుచును
బులిఁ బొడిచితి నహో పురజనులార! । యిలఁ ద్రెళ్లినది చూఁడుడీ! యని కూసెఁ
గునిసి మెత్తనిచోట గుద్దలివాడి । యనుమాట నిజముగా నటువలెఁ గూయు
కూఁతలు విని రజకులు పారుదెంచి । యా తెఱంగు నిబద్ధియగుట వీక్షించి
ఔర! యీపులి నెట్టులణఁచి? తీవెంత । శూరుండవని వాని స్తుతియించి మించి
చాకలివారెల్ల సంతోష మెసఁగ।మూఁకలై బహువాద్యములు పెల్లుమ్రోయఁ
బొడవడంగిన కోలుపులి నీడ్చితెచ్చి । పడవైచి రాభూమిపాలు వాకిటను

పడవైచి మాచిన్ని బాలుండు పెండ్లి । కొడుకయ్యె నీరాచకూఁతున కనుచు
వాని సింగారించి వలిపెంపుఁ జలువ । పానుపుపై నుంచి బాజులు దీరి
మేళతాళములతో మెఱయుచునున్న । నాలో నృపాలుఁ డయ్యాశ్చర్యవార్త
విని చాకివానికి విక్రమక్రమము । జనియించుటేమొ? యీజాతిహీనునకు
నాముద్దుకూఁతును నలినపత్రాక్షి । నేమాడ్కి నొసఁగుదు నివ్వార్త విన్న
సరికొరల్ నవ్వరె? శార్దూల మెచటఁ । బఱతెంచె? నేనేల ప్రతినచేసితిని?
హెచ్చిన యీవెత కేమిసేతునని । వెచ్చ నూర్చుచునున్న వేళఁ దన్మంత్రి
యగు నయార్ణవుఁడు సయ్యన నేఁగుదెంచి।జగతీశుఁగని పల్కె జాలి యేమిటికిఁ
జాకి యెచ్చట! మహాశార్దూల మెచట! । నీకార్య మపసత్య మిది నమ్మరాదు
చాకి నొక్కనినైన సాగి యెక్కడికిఁ । బోకుండ నడ్డగింపుఁడు పనిగలదు
కల్లయు నిజమును గాననయ్యెడిని । తెల్లవారినవెన్క దేవర కనుచు
నతఁడు దెల్పుచునున్న యాసమయమున । నతివలు చని శోభనాంగి కవ్వార్త
యెఱిఁగింప వీణవాయించుట మాని । తరుణి నివ్వెరఁజెంది తహతహఁ గుంది
కళవళింపుచుఁ జెలికత్తెల కనియెఁ । బలుకులు తొట్రిల్ల భావంబు గలఁగఁ
విన్నవై నెమ్మోము వెలవెలఁబాఱఁ । గన్నుల శోకాశ్రుకణములు జాఱ
ననువంటి చెనఁటి యెన్నటికి నీజగతి । జనియింపవలవ దోజలజాక్షులార!
నిండుజవ్వనమేల? నెరనీటు లేల? । పండె నాతపమింకఁ బలుమాట లేల?
గరగరికలు కళాగరిమలు నేర్పు । లోరపులు వగలన్నియును గల్లఁజేసి
కడపట మొఱకు చాకలివాని యింటఁ।బడుమని వ్రాసెఁగా! బ్రహ్మ నానొసట
నేల? వితా జాలి యీరట్టుఁ జెందఁ । జాల దేహంబు విసర్జింతు ననుచుఁ
బొగులుచునున్న నప్పూవుబోఁణులేల । వగచెదవమ్మ! మవ్వపుఁ బువ్వుఁగొమ్మ!
నీపాలిదైవమ్ము నీకింపొనర్చు । భూపాలసుతుఁ గూర్చు బొంకుగాదనుచు
నూఱడింపుచునున్న నొక్కింతలోన । నారాజపుత్రికి నాప్తురాలగుట
నరుదెంచె నప్పేదరాలి పెద్దమ్మ । తరుణికి శోభనోత్సవవార్త దెలుప
నరుగుదెంచినముద్ది నటఁ జేరఁబిలిచి । విరులపాన్పున నుంచి వెలఁది యిట్లనియె
అవ్వరో! వింటె నాదైన యభాగ్య । మెవ్వఁడో! యొకచాకి యీయూరివాఁడె
పులినిఁ జంపితినని పోటుబంటు వలెఁ । బలికెదునఁట! వానిపలుకు లాలించి

హీనుని కెటువలె నిత్తుఁబుత్రి నని । భూనాయకుం డాత్మఁ బొగులుచున్నాఁడు
ఇంతకు నోఁచితి నేమందు ననుచు । వంతఁజెందెడి దాని వదనంబుఁ జూచి
యావృద్ధకాంత యిట్లను నవ్వుకొనుచు । నో వెఱ్ఱి! నీకేల? యూఱక వగవ
వీరుండై పులిఁ జంపివేసినవాఁడు । వేఱె యున్నాఁడు నావీటిలో ననుచు
నారాజసుతుల వృత్తాంతమ్ము చాకి । వారి యాగడమును వయసతోఁ దెలుప
నామెకుఁ గనకాంబరాదు లొసంగి । యామాట తమతండ్రి కప్పుడె తెలుపఁ
జెలులఁ బంచిన వారిచే విని రాజు । భళి! యని నగరిలోపలి కేఁగి ముద్ది
వలన రాజకుమారవరుల తెఱంగు । దెలిసి నయార్ణవు దీమసంబునను
బనిచిన నయ్యవ్వ భవనంబులోనఁ । దపరు రాసుతుల నందఱఁ దోడితెచ్చె
దశరథరాజనందనుల చందనమున । దృశల కింపుజనింప దీపించువారి
నలువురఁజూచి డెందము గందళింప । నల సువిక్రముఁడు నయ్యెగలేచి వారి
నక్కున గదియించి యర్హపీఠముల । మక్కువతో నుంచి మధురోక్తిననియె
నేదేశమున నుందు రెవ్వరితనయు । లీదేశమునకు రా నేమికారణము?
నలువుర కెయ్యవి నామంబు? లిచట । నలవునఁ బులిఁ జంపినతఁ డెవ్వరనిన?
నారాజశేఖరుం డానుపూర్విగ ను । ధారసలసదుక్తిఁ దమకథ యెల్ల
నారాజునకుఁ దెల్పి యయ్య! బెబ్బులిని । ఘోరాసి నఱికిన గురుబలాధికుఁడు
నితఁ డుశీనరదేశ మేలు సుధన్వు । సుతుఁడు జయంతాఖ్య శోభిల్లు ఘనుఁడు
మంచినీళ్లకుఁ బోయి మాపటింతల నొ । కించుక కొంచక హింసించెఁబులిని
పులినఖంబులు వాలమును దెచ్చినాఁడు । తిలకింపుఁడని సభాస్థితులెల్లఁ జూడ
ముందరనిడ ముదంబున నోలలాడి । రందఱిజనులు జనాధీశ్వరుఁడును
జచ్చినపులిఁ దాను జంపితిననుచు । నిచ్చాకి భయములే కీరట్టు చేసెఁ
దల కొట్టివేయుఁ డిద్దారుణకర్ముఁ । దలఁక నీరజకుల దండుగల్ గొనుఁడు
అని సెలవిచ్చి నిజాత్మజామణికి । మనువు మంచిదిగల్గె మనభాగ్యమహిమ
నని మఱునాఁటిరే యంచితలగ్న । మున జయంతునకు నమ్ముద్దుఁగూఁతునకు
నానువిక్రముఁడు కల్యాణోత్సవంబుఁ । జేసి రాజ్యమున నిచ్చెను నగపాలు
తనచెలికాని కీదారిఁ గల్యాణ । మొనరించి కొన్నినాళ్లుండి యచ్చోట
నాజయంతునిఁ జూచి యనియెఁ బ్రేమమున। రాజశేఖరుఁ డోయి రాజకుమార!

నీకుఁ బెండిలియయ్యె నృపకన్యఁ గూడి । యీకడ నీవుండు మేము ముందరను
జని జయత్సేన విజయులకుఁ బెండ్లి । యొనరించి పిదప నే నుద్వాహలీల
వహియించి మాక్షేమవార్తలు నీకు । నహితభీకర! తెలియంగఁ జేసెదను
ఆలస్యమేల? చయ్యనఁ బంపుమనిన । నాలోన బెగడి జయంతుఁడిట్లనియెఁ
దల్లిదండ్రులఁబాసి తగిన చుట్టముల । నెల్లను నెడఁబాసి హితులను బాసి
ఘనశీల! నిన్నేడుగడ యని నమ్మి । చనుదెంచు ననువిడి చనఁ బాటియగునె?
నీవులేకున్న యీనృపకన్య యేల? । నీవులేకున్న వో నీరాజ్యమేల ?
నేను నీవెంటనె యేఁగుదెంచెదను । రానియ్యవే! యేల రవ్వ చేసెదవు?
తమ్మని నని యశ్రుధార కన్దోయిఁ । గ్రమ్మఁ బాదములపై వ్రాలిన నతని
నెత్తి కౌఁగిటఁజేర్చి యేల చింతిలెదు? । క్రొత్తపెండ్లికుమారిఁ గూడి సుఖించు
కాలంబునం దిట్లు గాసిల్లి తిరుగ । నే లాభ మొనగూడు నేఁదెల్పుబుద్ధి
వినుము మూర్ఛించి నావెంట రావలదు।పనియున్న దిచటనే పాయక నిలుము
నామేలు గోరుమన్నా! నూరి యొకటి । క్షేమంబుదెల్పు నిచ్చెద నీకటంచు
నారాజనుతుఁడు జయంతున కొక్క । నూరికత్తి యొసంగి సుముఖుఁడై పలికె
నీకత్తి మెఱుఁగార కెన్నినాళ్లుండు । నా కన్నినాళ్లు ప్రాణము సుస్థిరంబు
జిగిదప్పి కత్తిమాసినఁ బ్రాణహాని । యగుట యెఱింగ యయ్యాపద గెడప
నేనున్న నగర మన్వేషించికొనుచు । క్ష్మానాథసుత! నీవు చయ్యనరమ్ము
వచ్చి నాచేకత్తి వన్నెలేకున్నఁ । జెచ్చెర । మెఱుఁగిడి జీవంబు లిమ్ము
ఈరహస్యం బేరి కెఱిఁగింపవలదు । ధీరుండవై సుఖస్థితి నుండు మనుచుఁ
దనచేతి హేతి యాతనిచేతి కొసఁగి । చనె జయత్సేనవిజయులతో నతఁడు
చెలికాండ్రతో రాజశేఖరుం డిటుల । నిలఁ జరింపఁగఁజన్న నిట జయంతుండు
నతనిమీఁదిదె బాళియై నూరికత్తి । ప్రతిదినం బరయుచుఁ బ్రజలు మేలనఁగ
నత్తమామలకు మహాహ్లాద మెసఁగ । నత్తన్విఁ గూడి రాజ్యము సేయుచుండె
కొమరుఁబ్రాయపు ముద్దుగుమ్మతోఁ గూడి । సమరసక్రీడలు సలుపగాఁ గలిగి
సరిలేని ప్రాజ్యరాజ్యసుఖంబు గలిగి । మఱువఁడు చెలికాని మది జయంతుండు
ఇలలో జయంతున కెనయైన సఖులు । గలరె? యవ్వలికథఁ గలకంఠి! వినుము
ఆరాజశేఖరుం డటువలెఁ బోయి । కారడవులు సొచ్చికటకముల్ గడచి

యేఱులుదాఁటి యనేకశైలముల । దారి క్రమించి ముందర నొక్క చోటఁ
గనిరె మహోత్తాల ఘననీలసాల । కనకగోపురము శృంగాటకపురము
ఆపురిఁ జొచ్చి స్వయంపాకచతుర । యా పేదరాలి పెద్దమ యిల్లు చేరి
అవ్వ యాఁకలిగొని యలసివచ్చితిమి । మువ్వుర కిష్టాన్నములు పెట్టుమనిన
నా రాజసుతున కాయమ యిటులనియె । నో రాజులార! యీయూరిలో వంట
చెఱకులు లేవు తెచ్చిన స్వయంపాక । మరని మేమంబులో నాచరింతు నన
నేల పుట్టవు కట్టె లిటనని? యవని । పాలపుత్రుఁడు వేఁడ బ్రాహ్మణి పలికె
నో రాజతనయ! యీయూరి చెంగటి మహారణ్యమున నొక్క యసుర యేతెంచి
కట్టెలుకొట్టఁగా గమకించు వారిఁ । బట్టి పొట్టలుచీఱి భక్షింపఁ దొడఁగె
వాని గెల్వఁగ నిక్కువల యేశుఁ డోప । కీనిశాటుని వధియింపఁగా నోపు
బలియునకిత్తు నాపట్టి నటంచుఁ । బలికె రాజ్యము సగపాలుతోఁ గూడ
సుముఖి వానికి లభించు నటన్న రాచకొమరుఁ డాజరఠఁ గన్గొని యిట్టులనియె
బల్లిదుండగు దైత్యు భంజించు వాని । కిల్లాలిగాఁ బుత్రి నిత్తునటంచు
ప్రతినగావించె భూపాలకుం డంటి । వతివ! నాయనుజుఁ డీయన మహాబలుఁడు
ఈక్షణంబునఁ బొలియించు రాక్షసుని । నీక్షితిపతి తానె యొఱఁగెడి ననుచు
వేడ్క జయత్సేను విజయకుమారుఁ గొడ్కొనిపోయి దైత్యుం డున్నయడవిఁ
జొచ్చి యిర్వురు నొక్కచో డాగియుండి । రచ్చెదుదైత్యున కావాసమైన
యవనీరుహచ్ఛాయ కాజయత్సేనుఁ । డవిరళోత్సాహసమగ్రుఁడై యేఁగి
యట్టహాసముచేసి యాగ్రహం బెసఁగ । ధట్టించి రాక్షసాధమ! నిన్నుఁబట్టి
చట్టలుచీఱి యిచ్చటి గృధ్రములకుఁ । బెట్టెద విందు చూపెట్టుక యున్న
పట్టణజనులకుఁ బ్రమదంబు వుట్ట । నిట్టట్టు వదరక యిందు రారోరి!
యని నారిసారించి యస్త్రాసనమున । ఘనశరమ్ములు పూన్పఁగాఁజూచి యసుర
గిటగిట రదములు గీటుచు లేచి । చిటచిట నిప్పులు చెదరఁ గన్గొనలఁ
బటుశూలహస్తుఁడై పఱతెంచి విలయ । చటులమేఘార్భటి సంధిల్లఁ బలికె
నోరి రాజాధమ! యోడక చేరి । కాఱులాడెదవు నిక్కము బంటువలెను
నీవిక్రమముమాన్పి నిను సంహరింతు । నీవేళనని యాగ్రహించి యనేక
వృక్షముల్ పెకలించి వృష్టిగాఁ గురియ । నాక్షితీశకుమారుఁ డస్త్రసంహతుల

నవి చూర్ణములుచేసి యైదుబాణముల । దివిజారి శూలంబు తెగనేసి యార్చె
శూలంబు తునియ రక్షోవీరుఁ డలిగి । సాలమొక్కటి వైవఁ జక్కఁ గావించి
వాని బాహులురెండు వాఁడిబాణములఁ।బూని ఖండించి గొబ్బున శరంబొకటి
వింట సంధించి యవ్వీరశేఖరుఁడు । దంటయై వానిమస్తకము ఖండించె
కోటపై నిలుచుండి కువలయాఖ్యుఁడు ని । శాటసంహారు మహాబలోదారు
కరధృతకోదండు కదనప్రచండు । హరిహయప్రతిమాను నాజయత్సేనుఁ
గని సంతసించి యెక్కడనుండి యితఁడు । చనుదెంచెనో!యని సచివులఁ గూడి
వెస నెదుర్కొని లాటవిభు తనూజాతుఁ । డసమతేజుఁడు విజయకుమారుతోడఁ
జేరికయై జయత్సేనుఁడు రాఁగ । నారాజుఁ బొడగన్న నతఁ డాదరించి
యెవ్వరు? మీ దేశ మెచటఁ బేళ్లేమి । యివ్వనంబునకు మీరేల వచ్చితిరి.
చెప్పరే యన రాజశేఖరుం డనియె । నిప్పలాశను వధియించిన యతఁడు
సౌవీరదేశరాజన్యుని సుతుఁడు । ధీవిక్రమతుఁడు జయత్సేనుఁ డన్వాఁడు
ఇతఁడు వివాహార్థ మిట కేగుదెంచె । సుతనిచ్చి సగపాలు క్షోణియు నిచ్చి
నీయొద్ద నెనరుతో నిల్పుకొమ్మనిన । నాయిలేశుఁడు భాగ్యమా యె నటంచు
నల లాటచేదిరాజాత్మజస్థితులు । తొలుతినే విని వారితో జయత్సేనుఁ
దన నగరికి మహోత్సవముతోఁ దోడు । కొనిపోయె నతనిబాగు సువర్ణసౌధ
వాసినియై చూచి వలచి రంజిల్లు । భాసురాంగి ప్రఫుల్లపద్మపత్రాక్షి
సుముఖ పూర్ణశశాంకసుముఖి నారేయి । నమర నాయనకుఁ గల్యాణం బొనర్చి
సగపాలు రాజ్యమొసంగి తత్సఖుల । కగణేయ రత్నభూషాదు లర్పించె
నా విజయునితో జయత్సేను విడిచి । పోవఁజాలక లాటభూపాల సుతుఁడు
కొన్నినాళ్లుండి మక్కువ విజయునకు । నన్న! పెండ్లియొనర్ప నరిగెద ననిన
విని జయత్సేనుండు వెతతో జయంతు । ననువున వెనువెంట నంటిరాఁ దివుర
నొకవిధంబున వాని నొడఁబడఁ జెప్పి । వికచాబ్జమాలిక వింతగా నొసఁగి
యిప్పద్మమాలిక యెప్పుడు వాడు । నప్పుడె నన్నరయంగ రమ్మనుచు
వానితోఁజెప్పి యవ్వలనేగె విజయు।తో నయాఢ్యుఁ డతండు తొయ్యలి!వినుము
తనచెలికాంద్ర మే త్తనమే లటంచు । మనసులో నల భానుమత్సుతుఁ డెంచి
విజయునితోఁ గూడి వెసనేగి యవల । గజరథతురగవిక్రమఘోరవీర

భటసంకులంబైన పద్మినీనామ । పుటభేదనముఁ జూచి పొగడుచు దాని
కలిమి తద్రాజమార్గంబునఁ జనఁగ । గలశధ్వజుండను కటకేశు కూర్మి
తనయ సులక్షణాధవళాక్షి చేది । మనుజాధినాథకుమారుని విజయుఁ
గనుగొని వానిచక్కఁదనంబు వలచి । ననవిల్తుతూఁపుల నలుగుచునుండె
నా వేళ లాటదేశాధీశతనయుఁ । డీవీట వంటలయి ల్లేకడననుచు
నక్కడి జనముల నడుగుచుఁ బోయి । యొక్క శైవాలయం బొప్పెడి వీథిఁ
గడు పేదముద్ది యగారంబు చేరి । యిడు మన్నమవ్వ! మాయిద్దఱి కిపుడె
యన్న ! మహాభాగ్య మందులకేమి । యన్న ! కావలసినయన్న మే నిడుదు
నీయూరి కొకఘోణి యిరుతలల్ గలది । రేయి యేతెంచి చరించు నెల్లెడల
ద్వారముల్ చొరఁబాఱు తలుపులువిఱుచుఁ।గోఱలఁ జీఱు గన్గొన్న పౌరులను
నింగితో నొరయు దానిశరీర మార । యం గూడ దెంతబలాఢ్యున కైన
మును శంభునియనుజ్ఞ మూషికాసురుఁడు । ఘనతపోనిష్ఠుఁడై గాండీవియున్న
యా యింద్రకీలాద్రి నగలించినట్టు । లీయూరు చొరఁబడి యెద భీతిలేక
రాయిడివెట్టెడి రాకాసియేమొ ! । హాయి లేదయ్యెఁ బౌరాళికి దాని
చేత రేలని ముద్దిచెప్పిన మాట । లాతఁడు విని వరాహంబన నెంత !
యీచిన్నవానిచే నీరాత్రి దాని । పీచంబడంచి చంపించెదఁ జూడు
మెల్లి వేకువను నీవే మెచ్చవలయుఁ । దల్లిరో! యన ముద్ది తనరుచుఁ బలికె
చండవరాహంబు జడియక యితఁడె । ఖండించెనేని యీకలశధ్వజుండు
అనుఁగుఁగూఁతురుతోడ నర్ధరాజ్యంబు । నెనరుతో నిచ్చు సందేహంబు లేదు
ఈపని యిప్పుడె యెఱిఁగింతు నృపతి । కో పార్థివకుమార! యోగిరం బాయె
భుజియింపలెమ్మని భోజనం బిడియె । విజయున కతనికి వినయోక్తు లమర
నిష్టమృష్టాన్నంబు లిటుల భుజించి । తుష్టిఁజెంది శ్రమంబుదొరఁగ నిర్వురును
నాయింటిలో నుండిరప్పు డమ్ముద్ది । పోయి సులక్షణపూర్ణేందుముఖికి.
నారాజసుతుల సాహసమహోద్యోగ । మేరుపాటుగఁ దెల్ప నెంతయు నలరి
తనమది విజయునిఁ దలఁచుచునుండె।నినుఁడుగ్రుంకెఁ దమంబులెనసె దిక్కులను
ఆరేయి లాటదేశాధీశసుతుఁడు । వీరాధివీరుఁడౌ విజయునిఁ జూచి
యయ్య!మాయాఘోణి యరుదెంచువేళ।యయ్యె ధనుర్బాణహస్తుఁడవగుచుఁ

గవచాదులు ధరించి కదలి రమ్మనును । భవదీయశౌర్యసంపద గనుంగొనుచు
నంతనింతఁ జరింతుననిన నీకరుణ । కొంతగల్గినఁజాలు ఘోణి యదెంత
యనుచు జత్తాయత్తమై బయల్దేరి । తనశౌర్య మాధరాధవుఁడు సాధమున
నెలకొని పుత్రితో నెమ్మిఁ గన్గొనఁగ।బలియుఁడీతఁడు పందిఁ బడవేయు ననుచుఁ
బురజను లిండ్లతల్పులు బిగియించి । కొరలుభయంబున గుసగుస లాడ
నిటుల బయల్దేరి యెల్లవీథులను । జటుల మహాధనుర్జ్యాఘోష మెసఁగఁ
జరియించుచున్న నిశావేళ యందు । బఱతెంచె నలఘోణి పదహతక్షోణి
పఱతెంచి యారాజబాలునిఁ జూచి । పోరిఁబోరిఁ జుఱుకుచూపుల నిప్పులురుల
గురుతరధ్వనులు దిక్కులఁ బిక్కటిలఁగ। బరుషదంష్ట్రాంకురప్రభలఁ జీఁకటులు
విరియఁ బైఁబడిరాఁగ విజయుండు నవ్వి । శరపరంపరలు వర్షంబుగాఁ గురిసె
కురిసినశరములు కోఱలఁజిఱి । సరభసగతి మీఱి చనుదెంచు దారిఁ
గనిరాసుతుఁడురెండుకాండముల్ దొడిగి।గొని మెదంష్ట్రిలునాల్గుతునియలై రాల
నాతని బలుతూఁపు లంగరోమములు । చేత నల్లడలను జెదర విదిర్చి
కాఱుమొగిల్వోలెఁ గడు రొప్పికొనుచు।మోరత్రోపునరాఁగముంగాళ్లు దునిమె
తునిమితూఁపులురెండుతొడితలల్ రెండు।వినిహతంబులుచేసివేసఁబేర్చియార్చె
గిరిశృంగములు గూల్చు గిరిభేదిరీతి । కిరిమస్తములు గూల్చి కేవలోద్ధతిని
విలసిల్లు విజయుని విజయంబు పొగడి । యల భానుమత్పుత్రుఁ డక్కునఁ జేర్చె
కిరిరూపము దొరంగి ఖేచరుండగుచు । వరవిమానంబెక్కి వాఁడిట్టులనియె
నోవిమలాకార! యోమహాశూర! । యోవిజయకుమార! యొకమాట వినుము
కనకాంగదుండను గంధర్వవిభుఁడ । మునుదళాదుండను మునిశాపముననుఁ
బెనుఘోణినైతిని బృథుబాణనిహతి । జననుత నాఘోరశాపంబు దీఱె
పోయివచ్చెద సుఖంబున నుండుమనుచు । నీయాప్తులందఱు నిర్జరాంశజులు
గావున నెచ్చెలికాండ్రైతి రనుచు । భావికార్యముదెల్పి పతకం బొసంగి
కనకాంగదుఁడుచన్నఁ గలశధ్వజుండు । మనమున నలరుచు మంచిలగ్నమున
మఱునాఁడె కూర్మికుమారి నాయనకుఁ।బరిణయంబొనరించి ప్రాజ్యరాజ్యమున
సగమును గరిహయస్యందనసహిత । ముగ నరణంబిచ్చె ముద మెదఁబొదల
నల లాటనృపసూతి కంబరాభరణ । ములతోడ బహుమానములు పెక్కుఁజేసె

నకూ్మ్రిసఖునిఁ బాయఁగ లేక విజయుఁ। డెక్కడఁ దను బాసి యేగునో! యనుచుఁ
గోరి పెండ్లాడిన కోమలిఁ జేరఁ। డారయ మమత యెంతని యెంచవచ్చు
నీరీతి నహరహం బెడఁబాయకున్న। యారాజసుతుఁ జూచి యట నొక్కనాఁడు
భానుమత్సుతుఁడను ప్రాయంపుఁగొమ్మ। నౌనె యేలక రాత్రులటునిటు దిరుగ
నతివచిత్త మెఱింగి యనురక్తి నెరపు। మతకరింపకు ప్రేమమదియును గాక
నీవు నన్ బాయ లేకిటునిల్పుకొన్న। నేనగఁ బెండ్లియా నిటమీఁదఁ దనకు
నీకు నాక్షేమంబు నిజముగాఁ దెలియఁ। గైకొను మేనిచ్చు కల్హార మనుచు
నిచ్చి నెచ్చెలికాఁడ! యిది వాడినపుడె। వచ్చియన్వేషింపవలయు నన్నచు
నెట్టకేలకు వానియెద వంతఁదీర్చి। యట్టై తాఁబయనమై యవ్వలి కరిగె
నిటువలె నవ్వలనేగి యందొక్క। యటవిలోఁ జరియించు హరిణదంపతులు
దురపిల్లఁ దఱుము శార్దూలంబు నొకటిఁ। బరికించి యడ్డమై బాణాసనమున
సాయకంబొక్కటి సంధించి యేయఁ। గాయంబు దూసి వ్యాఘ్రము నేలఁగూలె
హరిణదంపతులు మహర్షిదంపతుల। కరణియై రాజశేఖరు చెంతకేగి
దీవించి యోబలాధిక! వ్యాఘ్రభీతి। నీవలనఁ దొలంగె నీవుధన్యుఁడవు
ముందర బహుశుభంబులు నీకుఁగలుగు। నెందుఁజూచినఁ బరహితచర్య నీది
మూలికయిది గ్రహింపుము క్షుత్పిపాస। లాలస్యరోగాదు లడఁగించు ననుచు
నొక మూలికారత్న మొసఁగి వారరుగ। వికసితహృదయారవిందుఁడై యతఁడు
సరగున నవ్వలఁజని యొకచోటఁ। గరి మీఁద లంఘించు కంఠీరవంబు
నుద్యచ్ఛరంబున నుదుటార్ప నదియు। విద్యాధరాకృతి వెలయ నిట్లనియె
రాజశేఖర! దృఢవ్రతుఁడన్ దపస్వి। నాజడబుద్ధి కెంతయుఁ గోపగించి
పంచాస్యరూపంబు ప్రాపించుమని శ। పించి నేఁడ నీవే దుగ్గడించె
నీకతంబున శాపనిర్ముక్తి యయ్యె। నాకూర్మికన్యక నవమోహనాంగి
భువనసుందరియను పువ్వారుబోణి। నవనీశతనయ! నెయ్యమున నీకిత్తు
హింగుదీపురమేలు నిలతేనిపుత్రి। యంగనామణి మోహనాంగియు నీకు
పత్నియౌనపుడె చేపట్టుము యువతి। రత్నంబు నాసుత రాజేంద్ర! యనుచు
నొక రత్నమాలికయును దివ్యశక్తి। యొకటియు నతనికి నొసఁగి వాఁడరిగె
పరహితచరితులౌ ప్రభువుల కిటుల। సిరులు తమంతనె చేకూరుచుండు

మునియుగంబిచ్చిన మూలికామహిమ।మున మద్రసాన్నముల్ ముందరనిలువఁ
బరిశుద్ధుఁడై మెక్కి పాటలీవకుళ । కురవకమందారకోవిదారాది
తరుచయచ్ఛాయలఁ దనుగతశ్రాంతి । మరుదంకురంబులు మాన్ప నొకింత
హాయిఁజెందఁగ వినసయ్యె కుయ్యోయెమొ । రో యిందు దిక్కులేదాయను కూఁత
అయ్యార్తరవ మతఁడాలించి లేచి । చయ్యన ధనురాది సాధనోత్కరము
ధరియించి బెట్టుకూఁతలు పెట్టు చోటి । కరుదెంచి యటఁ దస్కరావళిచేత
గడగడ వణఁకుచుఁ గన్నీరుదొరఁగ । సుడివడి నలుగడల్ చూచుచుఁ బ్రజల
రాక గోరెడువాని రతనాలసంచి । యీక పెనంగుచు నీడ్పులఁ బడెడి
వాని నొక్కని వృద్ధవైశ్యునిఁ జూచి । హా నిలునిలుఁడని యట్టహాసంబు
సేయుచు వారిభర్జించి యింకెందుఁ । బోయెదరని రోషమున నడ్డగించి
కరవాల మొరదూసి కడికండలుగను । నఱికెఁ జోరులపదుండ్ర నొకింతలోన
బ్రముచ్చుల నివ్విధంబున వధించుటకు । నచ్చెరువడి వైశ్యుఁ డానందమొంది
యారాజతనయుని కంజలిచేసి । భూరివాగ్గుంభనంబుల నిట్టులనియెఁ
గరుణ శ్రీహరివో? విక్రమమున హరివో?।యురుతేజమున హరివో?గనంబడదు
బలహారుండవో?భాగ్యపటిమ రౌద్రమున।నల హరుండవో? తెలియఁదరంబుగాదు
ఆ కుమారుఁడవో? జయాప్తి చెల్వమున । శ్రీకుమారుఁడవో? వర్ణింపఁగారాదు
పులిగుంపులోఁజిక్కి పొలుపఱియున్న । యల లేడిఁబోలి తా నడలుచునున్న
కడువడి నాకస్మికంబుగా వచ్చి । యడలార్చి యోడకుమని గారవించి
చోరులఁ గ్రూరుల శూరుల దుర్వి । చారులఁ ద్రుంచి నాజాలి తీర్చితివి
నాయిలువేల్పవో! నాదుపెన్నిధివో! । నాయాత్మరంజిల్లు నాగహారుఁడవో!
నీరీతిఁ గననేర నిష్కారణోప । కారివి నీవంచు గణియించు వైశ్యుఁ
గనుగొని రాజశేఖరుఁ డాదరించి । యనియె సుధామధురాలాపములను
నెక్కడ నీపురంబేమి నీజాతి? । యిక్కడికీవేళనేల వచ్చితివి?
నీనామమెయ్యది? నీవృత్తియేమి? । యానుపూర్విగఁ దెల్పుమన నాతఁడనియె
బుధవంద్య! హింగుదీపురమను నగర । మధికవైభవమున నమరు నిచ్చిటికి
నామడదవ్వున నప్పురంబేలు । ధామార్యముఁడు సితధ్వజుఁడను రాజు
కల డానృపతి కొక్కకన్యాలలామ । లలితాంగధామ హేలావతీనామ

యారాము విహరించు నారామసీమఁ । జేరి నిశావేళఁ జెలువ యొక్కరిత
యూరక విలపించుచుండును దెల్ల । వారినదాఁక నెవ్వరికిఁ గన్పడదు
దాని శోకముదీర్చు ధరణీశసుతునిఁ । గాని యన్యునిఁ బెండ్లిగానోప ననుచుఁ
బ్రతినచేసినది భూపాలకుమారి । యితరుల కలవిగా దింతి యేడ్పుడుపఁ
గొంద ఱుద్ధతులు రాకొమరులు వచ్చి । యందు సుందరిఁగాన కయ్యార్తరవముఁ
బాపగాలేక విభ్రాంతులై పోయి । రో పుణ్యపురుష! నీవోపు దప్పనికి
నల యింతి వెతదీర్చి యవనీశపుత్రి । నెలమిఁ బెండ్లాడి నేనిచ్చెదు సుతను
సుభగఁ గల్యాణమై సుఖమొందు మయ్య । శుభలీల నేనువైశ్యుఁడ నసంఖ్యేయ
ధనయుక్తుఁడ హిరణ్యదత్తుఁ డన్వాఁడ । ధనదత్తుఁడ సితధ్వజుని యాప్తుఁడను
వచ్చినవాఁ డియ్యనగు నర్థమడుగ । నిచ్చోటిపేట కేనేతెంచి మగిడి
వచ్చుచో ముచ్చులువచ్చి ప్రాణములు । పుచ్చుకోఁ దివిరినఁ బాదివి యేదితివి
ప్రాణదాతవు భయత్రాతవు నీవు । దీనశరణ్యా! నీ తెఱఁగు నేవినఁగఁ
దగువాఁడ నేనిఁ గొంతగణింపుఁ డనఁగ । నగుచు నారాజనందనుఁ డిట్టులనియె
నూరవ్యశేఖర! యుచితజ్ఞుఁడవు మ । హారాజవరులకు నాప్తుండ వీవు
విన నర్హుఁడవుగావె! వినుము నాచర్య । యని తనవృత్తాంత మంతయుఁ దెలిపి
హింగుదీపురమున కేగె నవ్వైశ్య । పుంగవుతోఁ గూడి భూపాలసుతుఁడు
ఈరీతి నప్పురి కెలమితో నేగి । యారాజశేఖరుం డనురక్తుఁడైన
యూరవ్యమణి యింటనుండె హితోప । చారంబు లతఁడునిచ్చలు నొనర్పఁగను
నతని శౌర్యప్రతాపాదు లయ్యూరి । క్షితిపతి యవ్వైశ్యుచే విని యలరి
యందలం బనిచి చయ్యనఁ బిల్వనంప । నందుపై నెక్కి పౌరావళి పొగడ
రాజుచెంగటికేగి రాజు పూజింప । రాజితమణిపీఠి రహిఁ గూరుచుండెఁ
గూర్చున్న యారాచకొడుకును దివ్య । వర్చస్విఁ గని సితధ్వజుఁ డిట్టులనియె
రాజశేఖర! పరాక్రమచిద్విలాస । రాజశేఖర! మహారాజవు నీవు
నీకెనయెవ్వారు నీరూపురేఖ । మా కుమారితచూచి మరులుచెందినది
అలకన్నెప్రతిన యెట్లైన నీడేర్ప । వలయు నీకవ్వింత వచియింతు వినుము
దయ్యమో? లేకభూతమొ? దేవసతియొ । యయ్యింతి తెలియరాదయ్య! యెవ్వతియొ?
నడురేయి యేడ్చుచున్నది తోఁటలోన । బాడగానఁబడదందుఁబోయి చూచినను

దాని శోధించి పోఁదఱుమ మీచేతఁ । గాని యన్యులచేతఁగాదు నిక్కముగ
ననిన మహాభాగ్యమాయె నీ రేయి । చని దాని తెఱఁగు విచారింతు ననుచు
నగరిలోనన యుండె నరనాథసుతుఁడు । మగువ హేలావతి మదిని రంజిలఁగ
నానడురేయి యుద్యానవనంబు । లో నొక్క యేడ్పు పెల్లుగ వినంబడిన
దిగ్గన లేచి యుద్వృత్తితో ధైర్య । మగ్గలంబుగఁ జంద్రహాసంబు పూని
పరమేశ్వరిఁ దలంచి భసితంబు నొసట।ధరియించి యట్టె యుద్యానంబు సొచ్చి
యొక మాధవీమంటపోపాంతసీమ । ముకురాస్య నొక జగన్మోహనగాత్రిఁ
బట్టి బెట్టుగఁగొట్టి బాధలఁబెట్టు । కట్టిడి రాక్షసిఁ గని యాగ్రహించి
చెంగటికేగి యోసి దురాత్మురాల! । శృంగారవతినేల చెనకెద వనుచుఁ
జే నూరికత్తి దీసి భీరీన ముక్కు । గోసివేసిన నది కుయ్యో! యటంచు
నచ్చోట నిలువలే కటుపాఱిపోవ । నిచ్చటి కిఁకవచ్చి తేని నీశిరము
నసిధారఁ దెగవేతునని వెంటనంటి । వెసఁ దరిమిన మ్రొక్కి వేఁడుచు బెగడి
పరువెత్తె నన్నఁడిపడఁతిఁ జేరనని । మఱలి యేడ్పుడిగిన మానినిఁ జేరి
యడలకుమని కరుణాబ్ధి యాఘనుఁడు । జడుపుదీరిచి ప్రేమసంధిల్లఁ బలికె
నెవ్వతెవీవు? పేరేమి? నీతండ్రి । యెవ్వఁడు? నీవిటకేల వచ్చితివి?
యీదైత్యురాలు నిన్నేల బాధించు? । నేదిహేతువు దీని కెఱిఁగింపు మనినఁ
గన్నీరుఁగ్రుక్కుచుఁ గ్రక్కున లేచి । యన్నాతి మ్రొక్కి యిట్లని విన్నవించె
నో యభినవమదనోజ్జ్వలాకార ! । యో యనాథజనావనోత్సుకాధార !
నాకథవినుము గంధర్వులలోన । హాకీర్తిశాలియై యమరేంద్రు నొద్ద
నలరారు మణికంధరాఖ్యగంధర్వ । తిలక మాయనకు సతీరత్నమగుచు
నమరు విభావతియను దేవకన్య । కమలాక్షునకు రమాకామినిఁ బోలి
వారికి నిటువలె వనరెడు నేను । గారాబుబిడ్డనై కలిగితి నధిప!
యిందురేఖకు సామ్య మెన్నుదు రనుచు । నిందురేఖానామమిడి ప్రోఁదిసేయ
కలితగాంధర్వాదికళలెల్ల నేర్చి । యెలఁబ్రాయము వహించి యేనొక్కనాఁడు
చెలువలతోఁగూడి క్షితి మెలంగుచును।బులహాశ్రమమునకుఁ బోయి యచ్చోటి
తలిరులు నలరులు తఱచు గిల్లుచును । ఫలములుకాయలు వట్టి కోయుచును
దీవెలుత్రెంచుచుఁదిరుగు తత్పుత్రిఁ । గేవలశైశవక్రీడల నచట

నాడుచు మముఁదిట్ట నలిగి కొట్టితిమి । యేడిచెనది దానియేడు పాలించి
యప్పాలహుఁడు వచ్చి యలుక కన్గొనల । నిప్పులురాల నన్వీక్షించి పలికె
నోసి దుర్మదురాల! యొడకపట్టి । యీసున నాపట్టి నేలగొట్టితివి?
యీనేరమున నీవు హింగుదీపురి మ । హానిశాటవధూటి కగపడి రేలు
నయ్యయో!యనువార లచ్చట లేక । న య్యయోముఖి కొట్టి యాపదఁబెట్ట
నేడాది గాసిల్లు మిదివిని దొడ్డ । వాఁడొక రాచూలి వచ్చి నిన్ బరచు
నాసురి నదలించి యసిదూసి ముక్కు । గోసివేసిన నదికూయుచుఁ బరచు
వానిచేఁ దీరు నీవంత నీకతఁడె । పో నాథుఁడగు సికేఁబొమ్మని చనియె
నమ్మాట కెదురాడ నళికి నన్ గన్న ।యమ్మయు మాతండ్రి యడలుచుండగను
నీ యయోముఖి రాత్రు లీడిచి తెచ్చి । సేయు బాధల దేమి చెప్పఁగారాదు
తీరె రాకాసిచేతి యుపద్రవము ల । కారణకారుణికజనాగ్రగణ్యా!
యని పల్కుచున్నెడ నక్కన్నెఁ గన్న । జననియు జనకుండు చదలెల్ల వెలుఁగ
హెచ్చు విమానంబులెక్కి శీఘ్రమున। వచ్చి యాఘను ప్రభావము లెంచునపుడు
తనపుత్రి భువనసుందరినిఁ దోడుకొని । ఘనుఁడు విద్యాధరాగ్రణియు నేతెంచె
నంత సితధ్వజుం డరుణోదయమున । నంతఃపురము పురం బతివైభవమునఁ
గై సేయఁ బనిచె నొక్క ముహూర్తమున నె।భూసురానుజ్ఞ నా భూపాలతుఁడు
హేలావతీకన్య నిందురేఖా పి । కాలాప జ్యోతిర్ముఖాత్మజ యైన
భువనసుందరి వైశ్యపుత్రియా సుభగ । నవిరళోత్సవశాలియై పెండ్లియాడె
మణిసహస్రము లిచ్చె మణికంధరుండు । గుణశాలి జ్యోతిర్ముఖుం డిచ్చెఁ బెక్కు
వగల సొమ్ములుసితధ్వజుఁ డిచ్చె నెమ్మి।సగము రాజ్యముతోడఁ జతురంగబలము
వివిధాంబరములతో వెలలేని వస్తు । నివహంబు లయ్యల్లునికి వైశ్యుఁడిచ్చె
రాజశేఖరుఁ డిత్తెఱఁగున నల్వురు ప । యోజగంధులఁ గ్రమంబొప్పఁ బెండ్లాడి
మామలు ప్రియమంద మణిమయసౌధ । సీమల వారితోఁ జెలఁగి క్రీడించెఁ
బుక్కిటివిడెమిత్తుఁ బోలఁతి రమ్మనుచుఁ।జిక్కించుకొనియొక్క చెలిమోవినొక్కు
దిద్దెదఁ గస్తూరితిలక మంచొక్క । ముద్దులాడి ముఖాబ్జమున మోముఁ జేర్చు
గంధం బలందెద కలికి! యంచొక్క । చందనగంధి బల్ చన్నోన లలము
[illegible] బాల! యంచొకస । ఖినిఁ జేరఁబిల్చి బిగ్గరఁ గాఁగిలించు

నిటు లానవోఘల నెనసి పాంచాల । విటశిఖామణి లాటవిభుతనూభవుఁడు
విహరించు నొకవేళ విద్యాధరాంబు । రుహలోచనాకుచాద్రులఁ బవ్వళించి
యిరవొందు నొకపూట నిందురేఖాంబు । ధరకచాధరసుధాధారలఁ జొక్కి
కేళి యొక్కెడసల్పు కృతకాద్రిగతన్ప । పాలబాలాస్యచుంబనగుంభనముల
నుల్లసిల్లు నొకప్పు డూరవ్యకన్య । కోల్లసన్నర్మమరోక్తు లూకొనుచు
నిచ్చవచ్చినరీతి నిటుల వర్తిలుచు । నచ్చతురాత్మకుం డటనొక్కనాఁడు
తనమామను హిరణ్యదత్తునిఁ జూచి । వినయోక్తి వింతలు వినఁగోరిపలికె
మామ! మీ రీయబ్ధిమధ్యాంతరీప । భూములు దేశముల్ పురములు వనులు
గనుగొని యుందురుగా బేరములకు । జనుచు మీ రెఱుఁగని స్థలములు లేవు
గన్నవి విన్నవి గలవె చోద్యంబు । లన్న హిరణ్యదత్తాహ్వయుం డనియె
వినవయ్య! మరకతద్వీపమన్ ద్వీప । మున రతనపుబేరములు సేయఁదలఁచి
నావనై నెక్కి కొందఱు వణిగ్జనులు । నావెంట రాఁబోయి నవ్యరత్నములు
నలదీవి గొని యూరి కరుదెంచువేళ । బలుగాడ్పుచేఁ గొట్టువడి త్రోవఁదప్పి
యోడ యద్భుతమైన యొకదీవిఁ జేరె । పైఁడికోటలు గానఁబడియె నచ్చోట
బహుగోపురంబులు బహుసౌధములును । బహురత్నభవనముల్ పరికించి యచట
జీనివేసిన యోడఁ జెచ్చెరఁ డిగ్గి । యానికటమునఁ బద్మాకరం బొకటి
గని యందు వంటలు గావించికొనఁగ । జనుదెంచె నటకొక్క జాలరివాఁడు
చనుదెంచి యిటకేల చనుదెంచినారు। దనుజాధిపుఁడు వజ్రదంష్ట్రుఁ డన్వాఁడు
నిక్కోటలోనుండు నిది వేల్పులైన । నిక్కి చూడఁగ లేరు నిక్క మీమాట
నరులుమీ రెంత? వంటలుచాలు వేగఁ । బరువు లెత్తుఁడు దైత్యపతి సింహళేను
తనయుఁ బ్రభావతిఁ దనపుత్రిగాఁగఁ । బెనుపుచుఁ దనతోడఁ బెనఁగి జయింపఁ
గలవానికిత్తు నక్కన్య నటంచుఁ । బలికినాఁడనుచుఁ దెల్పఁగ వానిమాట
విని మేముభయమంది వెసవంట లుడిగి । చనుదెంచితిమి నావఁ జయ్యన నెక్కి
మనుజేశ! దాని నిర్మానుష్యనగర । మని చెప్పఁగా వింటి మను వైశ్యుఁ జూచి
యారాజసుతుఁడను నద్దీవి కేగి । పోరాడి దనుజునిఁ బొలియించి వాని
పెంపుడుకూఁతును బెండ్లాడి వత్తు ! నంపవే యన మామ యల్లుని కనియె
నిలరాయ! భువనమోహినులు గేహినులు । నలువురు నీపాదనలినంబు లెపుడుఁ

ఛాయఁజాలక ప్రియంపడి యూడిగములు । సేయ రాక్షసపుత్రిఁ జింతిపనేల
కొంచాన నిర్జింపఁగూడునే వాని । నెంచగూడని మాయ లెఱుఁగు నయ్యసుర
యనిన వల్లనకుఁ డయ్యసుర నెట్లైనఁ । దునిమి ప్రభావతిఁ దోడ్తెత్తు ననుచు
నల్ల భూపతివేఁడ నవైశ్యుఁ డతని । యుల్లంబురంజిల్ల యోగీంద్రుఁ డొకఁడు
మును దనకిచ్చినమూలికల్ మూఁడు । నెనరుతోనిచ్చి వింటివె! రాజతనయ!
యిది యదృశ్యక్రియ యిది ఖేచరత్వ । మొదవించునది జయంబొసఁగుఁగయ్యముల
ఖచరమూలిక పాదుకలఁజెక్కి యెక్కి । యచటికిఁ జను మదృశ్యాకృతి ననుచుఁ
దెలిపిన నొకరత్నదీపిక సుభగ । కెలమితోనిచ్చి యోయింతి! యీరత్న
దీపప్రకాశంబె తెలుపు నాక్షేమ । మేపొలంతులకిది యెఱిఁగింపవలదు
అతిశీఘ్రమున వత్తునని చెప్పి వైశ్య । పతి శుభోక్తులఁబంపఁ బాదుకల్ మెట్టి
బుద్ధి నిర్మానుష్యపురము దలంచి । యద్ధీరుఁ డసురకన్యక మేడ వ్రాలె
మేడపై వ్రాలిన మిహిరుఁబోల్ వానిఁ । జూడ వేడుకయైన సొబగులవాని
మొలకనవ్వులవాని ముద్దునెమ్మొగము । కళలఁ బూర్ణసుధాంశుఁ గరిసించువాని
నారాజసుతుఁ జూచి యచ్చెరువంబు । కూరిమియును గడల్కొనఁ జేరవచ్చి
యాప్రభావతిపల్కె నంజలిచేసి । యోప్రభాకరతేజ! యోమహారాజ!
యెక్కడనుండుదు? రెద్ది మీనామ? । మిక్కడి కేరీతి నేగుదెంచితిరి?
నాముచ్చటలుదీర్ప ననుఁజేరు చంద । మామ యల్లుఁడవని మనసునఁ దోఁచె
నని యొప్పనడిగిన నచ్చెలి కతఁడు । తనతల్లిదండ్రుల తనయూరిపేరు
సంగతోక్తులఁదెల్పి చతురుఁడై పలికె । హింగుదీపురినుండి యింతి నిన్ జూడ
వచ్చితి మెచ్చితి వలచి నీచెలువ । మెచ్చటఁ గనివిని యెఱుఁగనిసాటి
మరువంపుమొలకవో? మన్మథుండెక్కు । నొఱపురాచిలుకవో? యొయ్యారి! నీవు
హొన్నుసలాకవో? యుల్లాసమెసఁగు । క్రొన్నెలరేఖవో? కోమలి నీవు
నీలవేణీమణి! నీచిన్నిమొగము । చాలదు నీగొప్ప జఘుకుఁగన్నులకు
తరుణి మద్విరహాబ్ధితరణివై జాలి । హరియించి గాంధర్వమను వివాహమునఁ
జేకొని కౌఁగిటఁ జేర్చికొమ్మనిన । నాకన్నె సిగ్గున నౌదలవాంచి
నామేను నాజవ్వనంబు నీసొమ్ము । సామి! చిత్తమునకు సరిపోవునటుల
దయసేయుఁడనుచుఁ గైదండ యొసంగి । ప్రియమునఁ దనకేళిగృహమున కతనిఁ

నోఁగొనిపోయి చెందొవలపానుపున । నేకాగ్రమతి నుంచి యింపువహించి
కప్పురవిడెమిచ్చి గమ్మను తావు । లుప్పతిల్లెడి గంధమొప్పఁగా నలఁది
సురటి వీచుచునున్న సుదతినిఁ దిగిచి । యురమున నిడికొనె నుర్వీశ్వరుండు
నురము కుమ్మెలువోవ నుత్పలగంధి । గురుకుచాగ్రంబులఁ గ్రుమ్మి పైఁ బాడి
కుమ్మెలుపో రొమ్ముగ్రుమ్మిన ముద్దు। గుమ్మ చెక్కిలిమీఁటె గోట భూవిభుఁడు
చెక్కిలి గొనఁగోరఁ జీరిన విభుని । చక్కెరకెమ్మోవి సరిపంట నొక్కఁ
గెమ్మోవి నొక్కిన కిసలోష్ఠి మోము । ముమ్మరంబగుప్రేమ ముద్దాడె విభుఁడు
మొలకనవ్వుల మోము ముద్దాడు మగని । గళమున నఖరరేఖలు నిల్పె నెలఁత
గళమున గోరుంచు కలకంఠి నీవి । చెలువుండు జార్చిన చెలువ సిగ్గునను
గ్రక్కునఁ గరములఁ గనుదోయి మూసి । పక్కలో నొదిగినఁ బైకొని యతఁడు
కలరవస్ఫురణాల గళరవం బెసఁగ । వలిగుబ్బలలముచు వలపురెట్టింపఁ
గళలంటి కరగించి గాఢపుంభావ । కలనఁ బ్రౌఢనుజేసి కడు గారవించె
నీరీతిఁ దనుఁగూడి మెడఁబాయకున్న । యారాజు నొక్క యేకాంతసౌధమున
నునిచి యచ్చెలి యుచితోపచారంబు । లొనరింపుచుఁ జరింప నొకకొంత వడికిఁ
దామసధరుఁ డతిత్వర నేగుదెంచె । నేమి చేసెదవమ్మ? యింటిలో ననుచు
నతివ మజ్జనభోజనాదు లమర్చి । యతని కెప్పటియట్ల హైమసౌధమునఁ
జలువపానుపుఁబన్న శయనించి కొంత । యలఁత దీరిచికొని యక్కన్నెఁ జూచి
కోకిలమెనయని క్రొమ్మావిచిగురు । టాకు కైవడిఁ దేఁటి కందగారాని
పూవుగుత్తివిధంబుఁ బొరసి యున్నాల్గు । నీవుంటి విపుడేమి నెలఁత! నీ మోము
వాడిన దెవ్వఁడువచ్చి నీతోడఁ । గూడినాఁ డెఱిఁగింపు కొంకక యనినఁ
దెలిగంటియును హింగుదీపురి నుండి । బలవంతుఁ డొకరాచపట్టి యిచ్చటికి
వచ్చినాఁ డతనిచెల్వము చూచి వలచి । యిచ్చ నిన్ దలఁచి నీవేమి సేయుదువో?
యనుభీతిచే విన్ననై యున్నదాన । ననిన బెట్టుగనవ్వి యసురేంద్రుఁడనియె
కామిని! ననుగెల్చికదమటి నిన్నుఁ । గామించఁదగు వానిఁ గనుగొనవలయుఁ
బిలుచుకరమ్మన్న బింబాధరోష్ఠి । యల రాజసుతుఁజేరి యవ్వార్తఁ దెలుప
దానిచే నటమున్నె దైత్యుని బలిమి । యానరేంద్రకుమారుఁ డాలించి యుసికి
నతివేగమున లేచి యటవచ్చి నిలువ । నతనియుద్ధతిఁ జూచి యసుర భీతిల్లి

యితఁడు నాతోఁ గలహింపఁగానోపు । ధృతిశాలియౌనని యెద నిశ్చయించి
రావోయి! కూర్చుండు రాజకుమార!। యీవు నన్ మార్కొని యెపుడు పోరెదవు?
పోరాడి గెలిచి నాపుత్రిఁ గైకొనుము । నా రాజతనయుఁ డోనక్తంచరేంద్ర!
యెల్లి ప్రొద్దున లేచి యీవును నేనుఁ । జెల్లుగా యుద్ధంబు సేయుద మనుచు
నొడఁబడఁ జెప్పి యందుండి యారేయి । గడచి కాంతయనుజ్ఞఁ గదిసిన యసుర
నిద్దురమాని యానృపుఁ డాజిఁ బోరి । పెద్దనిద్దురఁ జెందెఁ బృథుఖడ్గనిహతి
నిహతుఁడై యాదైత్యనేత ఖేచరత। శుచిమోనియను మునీశుఁడు స్నానమునకు
నదికి వేకువ నేగ నవ్వాల కేను । పొదనుండి గర్జింపఁ బొలఁదిండి ననుచు
వెఱచిపారఁగ లేచి వికవిక నగిన । నెఱిఁగి యోరి సుకంఠ! యిదిముచ్చటైన
మూఁడు వేలబ్దముల్ మొఱకురక్కసుఁడ । నై డాకలోకుల కార్తి సేయుచును
జరియింపుమన్న నేఁ జాలఁ బ్రార్థింపఁ । గరుణించి రాజశేఖరునిచే నొచ్చి
యెప్పటియూపు వహించెద ననియె । నప్పుడాడినయట్టు లడఁగె శాపంబు
ననుమతిచ్చిన నమరేంద్రునిపురికిఁ । జనియెద నాయెడ సౌహార్ద మునుపు
నా పుత్రితోఁ గూడి నరనాథ! బహువి । ధోపభోగము లొందుచుండు మిప్పురిని
అని యాప్రభావతి నతని కొప్పించి । చనియె సుకంఠుఁడు జంభారిపురికి
ధనవస్తువాహన ధాన్యాదికముల । నెనలేసి యప్పురి నింతితోఁ గూడి
నిఖిలభోగంబులు నెమ్మిఁ జెందుచును । సుఖియించె సురరాజుసొబగున నతఁడు
ఈరీతి నలరుచు నిలరాయఁ డాతఁ । డారామతోఁ గూడి యారామకేళి
సలుపుముచ్చటలు హెచ్చఁగ నొక్కనాఁడు । నెలకొన్న వేడ్కనంతిపురంబు వెడలి
పురి పశ్చిమమున నంభోరాశి చెంతఁ । బరగు సరోవరప్రాంతవన్యలను
మెలఁగుచు వింత లామెలఁతకుఁ బ్రేమఁ । దెలుపుచు శ్రాంతి చెందిన యింతిఁ గూడి
యక్కొలంకున కేగె నపుడు ప్రాఁగెంపు। చెక్కడంపు మెఱుంగు చికిలిపాదుకలు
మెట్టుక మగరాలమెట్లపై డిగ్గి । తొట్టిన తృషదీఱఁ దోయముల్ ద్రావి.
వనజాక్షి వెలువడి వచ్చుచో జాఱి । చని యొకపాదుక జలములోఁ బడియెఁ
బడి రత్నమయమౌటఁ బాదుక మునిఁగి । కడువడి సోపానగతి దూరమరిగెఁ
బడిన పాదుక యెత్తుపనిఁ బూను మగనిఁ। బడఁతి మాన్చె ప్రయాసపడనేల యనుచు
రవి యస్తగిరిఁ జేరె రమణితోఁ గూడి । భవనంబుఁ జేరె నా ప్రభుశిఖామణియుఁ

దత్కాలమున శకంధరభర్త రిపువి । పత్కుడుఁడు హిరణ్యబాహుఁ డన్ రాజు
తనవర్తకు మహార్థదత్తుని మనుజులు । గొనితేరఁ బనుపఁ గ్రక్కున నోడయెక్కి
పొసఁగు మణిద్వీపమున కేగి యచట । నసమానమణులకు నర్థంబు లొసఁగి
కొని యోడయెక్కి గ్రక్కున వచ్చివచ్చి । కనియె నిర్మానుష్యకటక మాజాడఁ
గని వెరగంది యక్కడ నోడడిగ్గి । వనజాకరము చేరువకుఁ బోయివిడిసె
నోడకళాసులం దొప్పెడి సరసి । నేడఁజూచిన లెక్కయిడరాని మీలఁ
జూచియొండొరులఁబిల్చుచు హెచ్చువలలు। వైచితియ్యఁగఁబ్రభావతివామపాద
పాదుక చిక్కినఁ బరికించి మెత్తి । మోదంబుతో వైశ్యముందర నిసిరి
అది వాఁడుదాచి నిజాధిపుచెంతఁ । బొదలు వేడుక నుంచి పొడఁగన్న యపుడె
యప్పాదుక శకంధరాధినాయకుఁడు । తప్పక కనుగొని తనసభవారిఁ
బిలిచి పూరుషుఁ డంఘ్రిఁబెట్టెడి నదియొ?। మెలఁత పాదంబున మెట్టెడి నదియొ?
యిప్పావ యెవ్వరి దెఱఁగింపుఁ డనిన । నప్పు డూరకయుండి రాసభవారు
అంత నచ్చటికి శిల్పాచార్యుఁ డొకఁడు । వింతగా వచ్చి భూవిభున కిట్లనియె
నిది కాంత మెట్టెడి దిలరాయ! పురుష । పదఘట్టితముగాదు భావించినాఁడ
నా విని సతి చరణంబున మెట్టు । పావయే యింతసౌభాగ్యంబు గాంచె
దానియూపెట్టిదో తర్కింపఁదర మె? । నా నవ్వి శిల్పి యన్నాతిరూపంబు
హొన్నునరతనంబులొసఁగిసఁబ్రతిమ।పన్ని తెచ్చెదఁజూడుప్రభుచంద్రయనుచుఁ
దన నేర్పు మెఱసి కుందనమునఁ బ్రతిమ । యొనరించి ముందరనునిచినఁ జూచి
కడుమెచ్చి శిల్పికిఁ గాంక్షితంబిచ్చి । వెడవిల్తునకుఁ జిక్కి విభ్రాంతుఁడగుచు
నిబ్బొమ్మఁ బోలినయింతి యున్నెడకు।గొబ్బునఁజని దానిఁ గొనివచ్చు ఘనుఁడు
గలిగిన వానికి ఘనత నాయేలు । నిలలోన సగమిచ్చి యేలింతు ననుచుఁ
జాటింపఁబంచిన జను లాలకించి । యేటిభ్రాంతి జనించె నీతని కనుచు
ననుకొని రెవ్వారు నప్పనికొప్పి । కొనరైరి దిదిసురాధ్వకుసుమం బటంచు
భ్రాంతిహెచ్చహిరణ్యబాహుఁడాకాంతఁ । జింతసేయు మనుం డెఱిఁతిపతియిటులఁ
జాటించినది విని జరభి పిశాచి । తాటోటుగత్తె భూతకివంటి గొంటి
కల్లరి జూటు బికారి కరాళి । చుల్లకురాలు ముచ్చు తుటారి బడుగు
చెడుగు బజారి కుచ్చితురాలు నీలి । గడుసు టక్కరి జోగి గ్రక్కినముడుసు

మటుమాయల పెడారి మందులమారి। కుటిలాత్మురాలు వెక్కురు తక్కులాఁ
యిప్పాపజాతి యంచెల్లరు రోయ। నప్పురి దుశ్శీలయను వృద్ధవిధవ
పాయంబునాఁడెల్లఁ బలువికారములఁ। బోయి కావలసిన బొజుఁగులఁ గూడి
పలుగూళ్లు గుడిచిన పాపిష్ఠియగుట। కొలువునకేగి సంకోచంబు లేక
పలికె నోయి హిరణ్యబాహుండ! నీవు। వలచిన నిందుజవ్వని వెదకుచును
బోయి నిర్మానుష్యపురముఁ బ్రాపించి।యాయింతి నెలయించి యైదాఱునెలఁ
లోపలఁ దెత్తు నేలుదుగాక దాని। నీపనిచేసిన నేమి యిచ్చెదవు?
నిజముగాఁ దెల్పుము నీవన్న భూమి।భుజుఁడును ముద్ది! యప్పొలఁతిఁ దోడుకొని
యరుదేర నీకిత్తు నర్ధరాజ్యంబు। సరగునఁ జనుమంచు జతమైన యోడ
మాలిమికాని వెంబడి నెక్కఁబనుప। నాయోడయెక్కి చయ్యన దీవిఁజేరి
యందు కళాసులకనియె నేవచ్చు। నందాక మరుఁగుగా నబ్ధిలో నావ
నిలుపుఁడి జీని సంధించి యటంచుఁ। బలికి రేవునడిగ్గి పద్మాకరంబు
కడఁ గొంతతడవుండి కమలబాంధవుఁడు। పడమటివార్ధిలోపలఁ గ్రుంకువేళ
నాకోట డాయ నొయ్యనఁ బోయి తూర్పు। వాకిటిగవనిలో వసియించె నొదిగి
కడపలో వసియించి కపటశోకంబు। గడియించికొని బెట్టుగాఁ బ్రలాపించె
ఆప్రలాపము విని యననీశతనయుఁ। డో ప్రభావతీ! యెవ్వతో తూర్పుగవని
వాకిటినుండి యేడ్వఁదొడంగె వింటె?।రాకాసియో? ముష్కరపుఁ బిశాచంబొ
దాని శోధించి రోదనము వారించి। నేను వచ్చెదనన్న నింగివరాక్షి
తానును వెంబడితగిలె నిర్వురును। దానిఁ జూడఁ దలంచి తలుపులుదెఱచి
యీ సందెప్రొద్దున నిందేల యేడ్చె। దీ సీమ నీవెవ్వ రెఱిఁగింపు మనినఁ
గన్నుల మిథ్యాశ్రుకణములు దొరఁగ। నన్నీలికాన యిట్లనియె నేడ్చుచును
ధర్మైకనిధులార! దంపతులార! । నిర్మలమతులార! నే విప్రసతిని
అల శకదేశంబునందు వర్తింతు। కలఁడొకపుత్రుండు ఘనరూపయుతుఁడు
వాఁడు నన్నెడఁబాసి వైశ్యులఁగూడి। యేడకుఁ బోయెనో యేనది యెఱుఁగ?
మున్ను మణిద్వీపమున వానిఁగంటి। మన్న వైశ్యులమాట యాలించి నమ్మి
యోడ యాదీవికి నొక్కటిపోవఁ। జూడఁగల్గునొ కూర్మిసుతు నీడ ననుచు
నా నావపైఁబోయి యారసి సుతునిఁ। గానక యడల నక్కడిపుణ్యుఁ డొకఁడ

నీయోడ మెక్కించి యిద్దఱిఁ జేర్చి । పోయిన నిటువచ్చి పొగిలెద నిటుల
మానీమయోడ క్రమ్మఱి వచ్చుదనుక । మీసదనంబున మెలఁగెద ననుచు
దయదోపఁ గడుదీనదశ వేఁడుదాని। ప్రియవాక్యములు విని బేల్వోయి పణఁతి
మంచిదిలే ముద్ది! మాయొద్ద నిలువు। మంచు నూరడఁబల్కె నారాజసుతుఁడు
సిరిచాల జగజంత యిలుసేర్ప వలసె। మదిరాక్షి! యనుచుఁ బల్మరు దెల్పవినక
యనప యిదేమి సేయంగల దనుచు । వనితఁ దోడ్కొనిపోయి వాకిలి తెఱచి
కనకాంగి తానొంటికత్తియ యగుటఁ । బనిపాటలకుఁ దోడుపడు నిది యనుచు
విధివశంబున గారవించి యద్దుష్ట । విధవ మంచిదియంచు వీటిలోఁ జేర్చె
నగరిట్లు సేరినంతనె కార్యమాయె । నగమువి యాజాత సంతసం బంది
యనురక్తవలెఁ దిరుగాడు వారలకుఁ । దన కపటం బొకింతయుఁ గాననీక
యప్ప! యీపని సేతునాయని తానె । చెప్పని పనులందిసేయఁగాఁ బోవు
సతివిసయము సేయు నారాజుఁ గనిన । సతియిది ధూర్తలక్షణమని తలఁప
నలివేణి వలయంపు మాటకలిపెట్టి । జలకమార్చుచు మంచిచలువ లందించు
తిలకంబు కస్తూరిదిద్దుఁ గీలుజడ । నలరుసరుల్ చుట్టు నద్దంబుచూపు
నిడువురుఁగూర్పించి నిదె మిగారతెత్తు । పంపరివగల శోభనములు పాడు
రాజు మన్మథుఁ డీవు రతివి పూర్ణేందుముఁ । డీజనవల్లభుం డీవు రోహిణివి
హరియితం డీవెమహాలక్ష్మి వనుచుఁ । గరుణపుట్టఁగ నిచ్చకపు మాటలాడ
నాదంపతులకది యాప్తురాలయ్యె । నేమర్మములు చెంతనెనసి యుండినను
విశ్వసింతురు నీలవేణులు నృపులు । విశ్వస్త నటుగాన వేఱుసేయకయె
నెనరుసేయఁగ నాల్గునెలలయె నంతఁ । బనియేమియునుజక్కఁబడదయ్యె ననుచు
నెతఁబడి యద్దుష్టవిధవ యొక్కపుడు । సతిఁజేరి యతిరహస్యముగ నిట్లనియె
పతిమర్మ మెఱుఁగని పణఁతికి ధైర్య । గతులెక్కడివి? సౌఖ్యగరిమ లెక్కడివి?
మగువ! నీపతి ప్రాణమర్మ మేకాంత । మగువేళ నడిగితో? యడుగనె లేదా?
యడుగకుండిన వెఱ్ఱివని ప్రబోధింపఁ । బడఁతి యానుడి చెవిఁబడిన భీతిల్లి
గుండెజల్లనఁ బలుకులు దొట్రువడఁగ। దండమోయవ్వ! యింతటి దుష్టమతివె
నీకేమిపని తెల్పు నృపుమర్మ మడుగఁ । గాకుపనుల్ సేయఁగడగి వచ్చితివా?
యడుగకు మిటువంటివని యదలింప । నెడవెడ వెఱచినవిధము పాటించి

యలుఁగకుమమ్మ! నీకహితంబు సేయఁ । దలఁపనమ్మ హింతబెతలఁచి చెప్పితిని
యనికొన్ని వెడమాటలాడె నజ్జరభి । వనిత యారాతిరి వసుధేశసుతుని
పక్కలో మక్కువఁ బవళించియుండి । యక్కుటిల దురుక్తు లాత్మలోఁదోఁచి
యడిగెద నొకమాట యలుక సేయక యె।నుడువఁగావలయు మనోహర! యనినఁ
బ్రాణేశ్వరివి యింత ప్రార్థింపనేల । యేణీవిలోచన! యేమడిగెదవు?
అడుగుము దెల్పెదననఁ బ్రాణమర్మ । మడిగెఁ గోమలి యాతఁ డడిదంబుఁ బాయ
దొఱఁగినఁ బ్రాణముల్ దలఁగునంచనిన । వెఱఁగందిసతి పొంచివినియె నాజంత
విని నాఁడు మరునాఁడు వెలదీటి యుండి । జననాథువా లొక్క సందె వేళఁ గొని
యొకగొందిలో దాఁచియువిదయుఁబతియు।సుకమునిద్రించుచోఁజొక్కమా వేళ
నక్కత్తిఁగొనిపోయిప్రొయ్యిలోవైచి । గ్రుక్కెబూడిదలోనఁగ్రూరాత్మయగుచు
నడిదంబు జిగిఁబాయ నసుపులువిడిచె । పడఁతి కౌఁగిటిలోన భానుమత్సుతుఁడు
వెలఁదియు దీపంబువెలుఁగున నతనిఁ । దిలకించి హానాథ! తేజస్సనాథ!
నన్నేలుకొనుసామి! నాముద్దులయ్య! । యెన్నికకెక్కిన యేకాంగవీర!
నను నొంటిడించిపో న్యాయమే నీకు? । నినుఁగూడి వచ్చెద నేను నీవెంటఁ
ద్రోఁకొనిపొమ్మని దుఃఖించుచున్న । నాకష్టురాలది యాలించి యలరి
యేతెంచి యేమియు నెఱుఁగనిదాని । రీతి నిట్లనియె నోశృంగారవల్లి!
యేల యేడ్చెదవేమి యితఁడున్నలాగు।నా, లోలనయన వంతయు రోస మడర
నాపాపజాతితో ననియె నోజంత! । నాపతిఁ బడఁబెట్టి నాకాపురంబు
చెఱచిన చెడుగవు చీ! నిన్నుఁజూచి । యెఱిఁగి నావిభుఁ డప్పుడే దీని నిల్లు
చేరనీయకుమని చెప్పెఁ జాటించి । యారాజు నుడి విన కయ్యయో? నిన్నుఁ
జేకొన్నఫలమెల్లఁ జేసేతఁ గుడిపి । తీకడ నిలనేల యెటకేనిఁ బొమ్ము
పతితోడవహ్నిలోఁబడియెదననుచు । సతిమోదుకొనుచు బాష్పకణంబులురుల
బెట్టుగా విలపింపఁ బ్రేముడి కలిగి । నట్టివిధాన నమ్ముది చేరవచ్చి
కరపద్మములుపట్టి కన్నీరుదుడిచి । పరవశత్వముమాన్చి పలికె నిట్లనుచు
నీపతిఁజంపితి నేనని నింద । మోపెదవేటికే మోహనగాత్రి!
శకదేశమున నొక్కసన్యాసి గలఁడు । సకలజ్ఞుఁ డాతఁడొసంగిన భూతి
యితనిఫాలమ్మున నిడనదే బ్రతుకు । లతకూన! తప్తతైలకటాహముఁనను

బతిదేహముంచి నాబడి యేగుదెమ్ము । వేతఁదీర్త నామాట విశ్వసింపుమని
యాన లొట్లును బెట్టి యది మసగప్పి । మానిని నాకత్తిమాట యేమరిచె
తైలఘటంబున ధవుదేహ ముంచి । యాలయద్వారంబు లన్నియు మూసి
పురి దక్షిణద్వారమున బయల్వెడలి । యరిగె విధిప్రేరితాత్మక యగుచుఁ
దరుణి యివ్విధమున దనవెంట రాఁగఁ । దరణివారరయ నత్తాటోటుకత్తె
వేఁడుకఁ దనకొంగు విసరినఁ జేర్చి । రోడ నయోధ్యాడపై నువిదయుఁ దాను
నెక్కి శకంధరాధీశుని ప్రోలు । గ్రక్కునఁజేరి యక్కాంతఁ గొంపోయి
యునిచె హిరణ్యబాహునిచెంత నతఁడు । కనకాంగి రూపరేఖావిలాసములు
విన్నయట్లనె చూచి విస్మయంబంది । మన్నించి జరతికి మహి సగంబొసఁగి
యక్కాంతఁ గేళిహర్మ్యమునకుఁ బిలువ। గ్రుక్కుచుఁ గన్నీరు కొమ్మ యిట్లనియె
నోరాజ! యొకవ్రతంబున్న దావ్రతము । దీక్షక పురుషులదెసఁ జూడరాదు
ఆఱునెలల్ సైపు మందాఁకఁ గేళి । కారామమున నుందునని తోఁటలోన
వనితయు నంత నంబావ్రతవ్యాజ । మునునుండె బ్రాహ్మణపూజ సేయుచును
పతి ప్రాణవంతుఁడై బ్రదికి యెప్పంటి । గతి వచ్చి కొనిపోవఁగావలె ననుచు
నలగౌరిఁ బ్రార్థించి యంబరాభరణ । ములఁ గాంత దంపతిపూజ లొనర్చె
నంత జయంత జయత్సేన విజయ । లెంతయురహి సఖుఁడిచ్చిన కత్తి
కమలమాలిక హల్లకము కాంతిమాసి । కమలిన దీక్షించి కడు వితర్కించి
ముగురును జతగూడి ముందరఁ బోయి । దిగులుతో నల హింగుదీపురిఁ జేరి
యందలి వైశ్యుచే నారాజు చనిన । చందంబువిని రత్నసందీపకాంతి
మలఁగినదని తత్కుమారి దుఃఖమునఁ । దెలుపఁగా మాలికాదిప్రపాదుకలు
నాయూరుజుఁ డొసంగ నలరి మెట్టుకొని । పోయి నిర్మానుష్యపురిఁ బ్రవేశించి
యంతఃపురంబెల్ల నరసి యందొక ని । శాంతంబుగని యానిశాంతంబు నందుఁ
దైలకటాహంబు దర్శించి నిర్గ । తాలోకుఁడై చేష్టలన్నియు మాని
యందున్న చెలికాని నలరువిల్కాని । యందంబు గలవాని నట్టె వీక్షించి
హా రాజశేఖర! హా మహాతేజ! । నీరాజసంబును నీప్రతాపంబు
నెటుపోయె నిపుడని యేడ్చుచు నశని । పటుఖడ్గ మందలిభవనంబు లెల్లఁ
బరికించి కానక పాకశాలికల । నరసి యందొక ప్రొయ్యియడుగున నెరయు

భసితంబులోఁ జిక్కువడి కాంతిమాసి । పసఁదప్పి కడు నల్లఁబడియున్న కత్తి
గని పేదలర్థంబుగనినట్లు లెత్తు । కొని దానిమట్టెల్లఁ గోకను దుడిచి
చమురిడి తోమి స్వచ్ఛముఁజేసి కాంతి।యమర సానను బట్టినపుడె రాసుతుఁడు
నిదుర లేచినయట్లు నెటిమీఱ లేచి । బ్రదికించితిరి ప్రాణబంధువులార!
అన్న! జయంత! జయత్సేన! విజయ! । నన్నరయుచు వచ్చినది హెచ్చు మీరు
అని బయల్దేరిన యటకలిఁ బెట్టి । యనువొంద జలకంబులాడించి వారు
ఘనవస్త్రభూషణగంధమాల్యముల । మొనసి కైచేసిన మూలికామహిమ
నిష్టమృష్టాన్నంబు లెల్లను గలుగఁ । దుష్టిమీఱఁగ వారితో భుజియించి
ప్రాసాదమున కేగి పడఁతిని గాన । కోసఖులార! మహోద్యోగమూని
యేను బెండ్లాడినయింతిని గాన । మాసిలికాన బ్రాహ్మణి యెలయించి
యెచటికిఁ దోఁకొని యేగెనో యనియు।యచలమ్ము నలకత్తి యట ప్రుచ్చిలించి
ప్రాయిలోన నిడి కాల్చిపోయిన దనుచుఁ।బయనంబుగాఁ దానువచ్చిన కథయు
దనుజుఁ జంపినయది తరళాక్షిఁగూడి।మునికియు బ్రాహ్మణి యొకతె వచ్చుటయు
నది మాయదారి యానవియును దెలుప । విదితంబుగావిని విజమాహు లనిరి
ఆప్రభావతిఁ గొని యళుకింత లేక । విప్రభామిని యెందు వెడలిపోయినదో?
వెదకుద మరుదెమ్ము వేషముల్ పూని । యదనిదియని మాటలాడుచు నున్న
నచటి కారాజు మున్నసుకత మాన్ప । ఖచరతనున్న సుకంఠుఁ డేతెంచి
వారు పూజలొనర్ప వారి దీవించి । చామరత్నాసనస్థలినుండి పలికె
రాజీవమిత్రనిర్భర తేజ! రాజ । రాజీవతంస! ని రాజబింబాస్య
నాప్రియనందన నలినపత్రాక్షి । యాప్రభావతి జరఠాహూత యగుచుఁ
బోయి సుకంధరపురి నున్న దంబి । కాయతవ్రతనిష్ఠ నారామసీమ
నాఱునెలల్ వ్రతంబని యెడఁబెట్టె । నారాజు వలచి సమస్తవస్తువులు
పనుపంగా విప్రదంపతులఁ బూజించు । కొనుచున్నది మేలుగోరుచు నీకుఁ
జనుఁ డందుఁ బాదుకాశక్తిచే ననుచు । జననుతు లాలాగె చనియెద మనుచు
నతని వీడ్కొని పాదుకాసహాయులగుచు । హితులు వెంబడిరాఁగ నేగె నప్పురికి
నీరీతి నప్పురికేగి లాటకు । మారమణకుమారమణి తన రమణి
యెలదోటలో వసియించి భూదేవ । తల కైదువల కిష్టధనము లిచ్చుచును

నక్కుమారుని నెత్తి యక్కునఁ జేర్చి । చక్కనితండ్రి! మెచ్చితి నుంటి వీవు
నిన్నాళ్లు నినుగాన కెంత గుందితినో । యన్న నేఁడానతి లన్నియుఁ దీఱె
సగము రాజ్యము నాకొసంగె నేఁజేయఁ । దగు నుపకృతికి నెంతయు మెచ్చి రాజు
ఈరాజ్యభోగంబు లెల్ల భోగింపు । మీరాజశేఖరులెల్ల నిన్నెంచ
నని యందలంబుపై నతని నుంచికొని । చనె తనయింటికి సంపద మెఱసి
తనచెలికాండ్రును దాను నచ్చెనఁటేఁ । జనుపఁ బోయి హిరణ్యబాహుని గాంచి
యతఁడు మన్ననసేయ నారామసీమ । వ్రతనిష్ఠఁదగు ప్రభావతి విలోకించి
ముందరిపని క్రమంబునఁ దెల్పుఁడనిన । నందఱాలోచించి యలివేణి కనిరి
యదరముల్ మూఁడు వియత్తలం బొరసి । పరగునట్లుగ నొనర్పఁగవలె ననియు
నరద మొక్కంటికి నతివలు మువ్వు । రిరవొందనిడి ముద్దినెక్కించి దాని
సుతు హితత్రయముతో శోభిల్ల నుంచి । క్షితినాథ! నీవు నెక్కిన మంచిదనియు
మంగళద్రవ్యసమాజంబు గొనుచు । నంగజహరురాణి యావాసమున్న
పురబాహ్యావన్యకుఁ బోవలె ననియు । నెఱిఁగింపు మిప్పు రాధీశున కనుచు
హితులతోఁ బతి తనకేర్పడఁ దెలుప । సతి మంచిదని ముద్దిసరగఁ బిల్పించి
యవ్విశేషములెల్ల నధిపునితోడ । నవ్వ! తెల్పుమటన్న నది తెల్పనతఁడు
ననిచె నాక్షణమె శిల్పాచార్యవరులఁ । బనిపూని వారు భూపతికుమారకుఁడు
చెప్పినచందానఁ జేసిరి రథము । లప్పుడె సూత్రంబు లమరించి రొకట
నాసూత్రమర్మంబు లొప్పులు దాను । రాసుతుఁడెఱిఁగి సంభ్రమలీల నుండెఁ
దన యన్నదమ్ముల తనయల రాజ । తనయలఁ గొమ్మంద్ర ధరణీశుఁడీయ
ముప్పురుకన్నెలు ముదితయుఁ దాను । నవ్విజయుం డెక్కి రందొక్క తేరు
ఆజయంతి శకంధరాధిప కన్య । కా జనత్రయము క్కిఁగనె నొక్క తేరు
అల జయత్సేన వృద్ధాంగనా కన్య । కలతోడ నొక తేరు గరము రాణించె
ధరణీశసుతులు సూత్రము లెగఁబట్ట । నరిగె నంబరవీధి కారథత్రయము
అరుగుచో దేవాలయముదారి కొండ । చరియున్న నందులో జరఠను బట్టి
పడఁద్రోసె సౌవీరపార్థివతనయుఁ । డొడిసి హిరణ్యబాహుని బట్టి త్రోసె
నడరుకినక జయంతుఁ డాచరిలోనఁ । బుడమిజనంబు లద్భుతమంది చూడ
విజయప్రభావతీవృతుఁడై స్వకీయ । భుజములుప్పొంగ భూభుజుఁడు హర్షించె

దిగువకు సూత్రముల్ దిగఁబట్టి కాళి । నగరివాఁకిట స్యందనంబులు డించి
యల్ల జయంతజయత్సేనవిజయు । లుల్లాస మంది రయ్యుర్వీశుఁ గూడి
యాప్రభావతి దేవి కర్చనలిచ్చి । విప్రులు దీవింప విలసిల్లెనంత
నాదేశ మాపురం బమరపూర్వైభ । వాదేశము గ్రహించి యాలాటవిభుఁడు
ముగురేసికన్యల ముదముతో నిచ్చి । ముగురికి సఖులకప్పుడె పెండ్లి చేసె
ఖచర గంధర్వశేఖర దత్తరత్న । ఖచిత విమానముల్ కడువేడ్క నెక్కి
యాప్రభావతితో జయంతాది సఖులు । సప్రియపత్నులై చనుదేర నేగి
దీమసంబున హింగుదీపురిఁ జేరి । తాము హిరణ్యాసితధ్వజు లలర
హేలావతీకాంత యిందురేఖాపి । కాలాప జ్యోతిర్ముఖాత్మజ సుభగ
ప్రాణముల్ క్రమ్మఱఁబడసిన యట్టు । లానందపరవశులై యున్న వారి
గారవించి హిరణ్య గాదిలిసుతు మ । హోన్నతుని శకంధరాధీశుఁ జేసి
ప్రజల నెక్కించి నిర్మానుష్యనగర । మజరేంద్రపురనిభం బరయుఁడీ యనుచు
నాసితధ్వజుఁ బల్కి యతనికుమారుఁ । డౌ శిఖిధ్వజునకు నప్పురం బొసఁగె
నయిదుగుఱింతులు నాప్తులుగొలువ । హయ గజరథ సుభటావళిఁ గూడి
చని విజయాదుల సతులతోఁ గూర్చి । కొనిపోయి తజ్జనకులచెంతఁ జేర్చి
యాదారల్ తనగుణం బభినుతుల్ సేయ । నాదటఁ దమతండ్రి నతిభక్తిఁ జేరి
యతనిపాదములకు నభినుతుల్ చేసె । సతులతో నతనికి సంతోష మెసఁగఁ
గోడండ్ర దీవించి కొడుకు నెత్తికొని।చూడఁగలైను నేఁడు సుకుమార! నిన్నుఁ
గన్నులకఱవెల్లఁ గడఁజూతె ననుచు । నెన్నుమఁ గౌఁగిటనిడి గారవించి
యానందబాష్పధారావృతుఁ జేసె । నానరేంద్రుని భాగ్యమలవియె పొగడఁ
దల్లియు బాంధవుల్ తనసఖుల్ హితులు । నెల్లరు హర్షింప నెనలేని సిరుల
నాజయంతాదిసహాయులఁ గూడి । రాజులనెల్లను రణభూమి గెల్చి
వారిజాక్షులఁగూడి వసుధఁ బాలించె । నారాజశేఖరుం డలివేణి! వినుము
వనితలలోఁ బ్రభావతి పుణ్యశీల । గనుక ముజ్జగముల ఖ్యాతివహించె
నీపతివ్రతకథ యెవ్వరు వినినఁ । బ్రాపించు వారికి భవ్యసౌఖ్యములు
అని చిల్క వినిపింప నవ్వైశ్యకాంత । విని వింత యీకథావృత్తాంత మనుచుఁ
బొగడుచుఁ దన యంతిపురమున కేగె । జగదీశదూతియుఁ జనియె నింటికిని

యీవు సుయజ్ఞరాజేంద్రపుత్రుఁడవు । దైవికంబున గోపతనయుండ వైతి
నీసురూపమునకు నీబుద్ధిమహిమ । కేసౌఖ్యకరమగు నీపశురక్ష?
నీకరపదముల నిజము సురేఖ । లాకీర్ణగతి నున్న వదిగాక నీకుఁ
బంచకల్యాణంబు బహురాజ్యలక్ష్మి । ప్రాంచితైశ్వర్యంబు ప్రాపించఁగలదు
నామాట నెఱనమ్మి నరనాథతనయ! । నీమంద నాకిచ్చి నే వ్రాసియిచ్చు
నీచీటిఁ గైకొనియేగు ముత్తరము । చూచెదవపుడు నా శుభవాక్యగరిమ
చనినచో నేవిశేషము లేకయున్నఁ।జనుదెంచి మఱల గోచయము గైకొనుము
అనవిని సుకుమారుఁ డనుమాన మంది । యును హరిశర్మ సత్యోక్తులు నమ్మి
తనదొడ్డిపసుల నాతనికి నర్పించి । ఘనభక్తి నలచీటి గైకొని యరిగె
మందచేకూరిన మహీసురప్రవరుఁ । డందున సుగ్రాసమంది సుఖంచె
సుకుమారుఁడాచీటి సొంపుతోఁ గొనుచు । శకదేశమున కేగె సత్వరగతిని
నాదేశభూనాథుఁ డణఁగుటఁ జేసి । మోహంబుతో మంత్రిముఖ్యుండు తానె
రాజత్వము వహించి రాజ్యమేలంగ । నాజాడ హూణదేశాధీశుఁ డెఱిఁగి
యలమంత్రి పై వచ్చుటది విచారించి । తలఁగిపోవ నతండుదలఁచి యారేయి
మానవీయాకారమహనీయ యైన । మానవేశునిపుత్రి మదిని గామించి
సంకేతమొక్కటి సరగ బోధించి ।పంకజవదన గొబ్బున రాత్రివేళ
నటకు గమ్మని చెప్పి యరిరాజభీతిఁ । బుటభేదనముఁ బాసిపోయె నమ్మంత్రి
పోయిన నమ్మంత్రిబుద్ధికి రోసి । యాయింతి యారాత్రి హయముపై నెక్కి
యెచ్చటికైనఁ బోయెదఁ దుదదైవ । మిచ్చినపతి వరియించెద ననుచుఁ
దనకుఁ గావలసిన ధనమణిభూష । లనువొందఁ గైకొని హరువైన మంచి
మావుపై వేఱొక్కమార్గమ్ము వట్టి । పోవ నందొక వటభూరుహచ్ఛాయ
గొంగడిఁ బైఁగప్పికొని నిద్రవోవు । నంగజాకారుని నారాజసుతునిఁ
గనుగొని తేజిగ్రక్కున డిగి చాన । చనినంత మేల్కాంచి సవిధదేశమునఁ
దనమేనికాంతి రత్నవిభూషణాభ । ఘనతమఃపటలంబు గడఁద్రోయు దాని
నెఱనీటుచే రతినిరసించు సొగసు । నెఱికప్పుకొప్పు క్రొన్నెలగేరు నుదురు
మొలక లేనవ్వులు ముద్దుమొగంబు।తలిరుఁగెమ్మోవియుఁ దళుకుఁజెక్కులును
నిడువాలుఁగన్నులు నీలాలకములు । కడగి నవశ్రీల గదుముకర్ణములు

కటివంకబొమలు చక్కనిపలువరుస । సరసచంపకనాస చారుకంఠంబు
జిగిబిగిగుబ్బలు చిన్నారికౌను । తొగరారుచేతులు తోరంపుపిఱుఁదు
పొగరుపాయము నునుపొన్నపొక్కిలియు। జిగిదేరు నూఁగారు చికిలిపెందొడలు
తిలకించు పులకించు దేహంబుతోడఁ । బలుకరించఁ దలంచు భావంబెఱింగి
వాని శేఁత్రాయంబు వానిసోయగము । మానిని వీక్షించి మరులొంది పలికె
యెవ్వరివాఁడవోయి మనోహరాంగ! । యివ్వని నొంటిగానిటు పవ్వళించి
గొంగళిఁ బైఁగప్పికొని యుండుటేమి? । శృంగారనిధివి నీస్థితిఁ దెల్పుమనిన
నానుకుమారుఁ డిట్లను నోలతాంగి! । నే సుయజ్ఞుండనునృపతి పుత్రుఁడను
గురునియాజ్ఞ వహించి కుంభినిఁ దిరుగ । నరుగుదెంచితి నన్ననతివ హర్షించి
శకదేశమేలు భూజానికుమారి । నకదూరి! నేవిమలాంగి యన్ దానఁ
దల్లిదండ్రులు లేమిఁ దగుపతి నరయ । నుల్లంబుతో సిహాయోత్తమ మెక్కి
వచ్చితి నిచట దైవముచూపె నిన్ను । మచ్చికహెచ్చె నమ్మెజిగిఁ గన్న
నన్నుఁ జేపట్టి మన్మథరాజ్య మేలు । మిన్ని తెల్పఁగనేల నీవేళ ననుచుఁ
దానుదెచ్చిన పదార్థముల భక్ష్యముల । నాని బడలిక యమ్మానిని దీర్చి
జ్ఞాతిభయంబున జవనాశ్వ మెక్కి । యాతటఁ జనిచని యతిశీఘ్రగతిని
జాంపేయపురము నైషధదేశవరము । సొంపునఁజొచ్చి యచ్చో నొక్కయిల్లు
అద్దెకుఁగొని నిల్చి యారాజసుతుని । ముద్దియ గనుగొని ముదమొప్పఁ బలికె
నాభాగ్యవశమున నపమోహనాంగ! । నీభార్యనైతి మంత్రి యుపాధి దీరె
చాంపేయపురమేలు చంపకధ్వజుని । నింపుతోఁ బొడగని యీవేళ నీవు
వెలయంగఁ జేతికి వేయివరాలు । బలుజీతమిమ్ము నీపంపొనరింతుఁ
బోరానిచోటికిఁ బోనేర్తు ననుమః । తేరానివస్తువుల్ తేనేర్తు ననుము
పొమ్మని పనిచిన భూనాథపుత్రుఁ । డమ్మానవతి పంప నటువలెఁ బోయి
యరిభయంకరఖడ్గహస్తుఁడై మ్రొక్కి । ధరణీశ! నేబాహుదాపతి సుతుఁడ
సుకుమారుఁడనువాడ శూరశేఖరుఁడఁ । బ్రకటించి నీవెందుఁ బనిచిన నందుఁ
బోనేర్తుఁ బోవచ్చుఁ బోవరాదనక । తేనేర్తు నేదైనఁ దేఁగూడదనక
సెలవిమ్ము వేవరాల్ చేతికటన్న । నలరి భూపాలకుం డటువలె నిలిపె
నంతటఁ గొన్నినాళ్లరిగిన పిదప । వింతగా సుకుమారువెలఁది యందంబు

బోనగత్తెలు చూచిపోయి భూపాల! । యానిర్మలాంగి మోహనవిలాసములు
గనివిని యెఱుఁగ మెక్కడ దేవకన్య । యని తోఁచెనని తెల్ప నట్టి మోహించి
కామాంధుఁడై చంపకధ్వజుం డపుడ । యామహీవరపుత్రు నటకు రప్పించి
సుకుమార! యోమహాశూరావతార! । యొకఁడ వెచ్చటికైన నోపుదు నరుగఁ
దేరానివస్తువుల్ తేనేర్తు నంటి । కోరికతోఁ గొండగుమ్మడికాయ
యెన్నాళ్లలోఁదెత్తువెఱిఁగింపు మనిన । మూన్నాళ్లుగడువిడిమ్రొక్కి రాసుతుఁడు
తనపత్ని కెఱిఁగించి తద్విధం బెఱిఁగి । ఘనభక్ష్యములు పెరికలఁగొని యరిగి
గండభేరుండప్రకాండంబు లుండు । కొండకుఁ బోయి యక్కొండపై నుండి
చిలువయొక్కటి నిక్కి చెట్టెక్కి చనఁగఁ । దిలకించి దానిఁగత్తినఁ దెగనఱికి
భేరుండశిశువులఁ బ్రేమ రక్షించి । భూరిభక్ష్యంబు లప్పుడు మెక్కనిడినఁ
జవిఁజొక్కి రాతిరి జననీజనకుల । కవిదెల్ప నప్పక్షులతని లాలించి
కవ్వంపుఁగొండకుఁ గ్రక్కునఁ బోయి । మవ్వంపు కొండగుమ్మడికాయ తెగలు
వేవేలు తెచ్చిన వేడ్కతో నెడ్ల । పై వైచి కొనితెచ్చి పతి కొప్పగించె
భళిరె! మూన్నాళ్లలోపు మందరాద్రి । ఫలములు దేనోపు బలియుండు గలఁడె?
యని మెచ్చియును మెచ్చకారాజు మరుని । ననతూఁపులకుఁజొక్కి న్యాయంబుదక్కి
యల రాజసుతుని సభాంతరంబునకుఁ । బిలిపించి మంత్రిచెప్పిన యుక్తి ననియె
పులిజున్ను గావలె భూపాలతనయ! । తెలుపు మెన్నాళ్లలోఁ దేనోపు దనిన
నెనిమిదినాళ్లలో నేనది తెత్తు । నని చెప్పి వీడ్కొని యలివేణి తెలుపు
హితబుద్ధి నీలాద్రి కేగి యచ్చోట । సుతపుఁడన్ ముని భజించుటకు నెత్తమునఁ
జనుచోట నొకబిలస్థలిఁ బ్రవర్తించు । దనుజవీరుఁడు మదోత్కటుఁ డనువాఁడు
అడ్డమై యెటువోయెదని చేతిగండ్ర । గొడ్డలి వైచిన ఘోరాసిధార
నదిమ్రంచి వాఁడేయ నట్టి సాలములు । విదళించి తల రొక్కవ్రేఁటున నఱికె
నందున సంతుష్టులై కొనియాడి । రందున్న వనచరు లచటిసంయములు
సుతపుఁ డాభూపాలసుతుని దీవించి । హితశీల! యిటకు నీ వేల వచ్చితివి?
యెఱిఁగింపు మీడేర్తు నేకోర్కెయైన । సరగున ననిన రాజకుమారుఁ డనియెఁ
బులిజున్ను నన్నేలు భూపాలకుండు । వలెనన్న నినుఁ గొల్వవచ్చితి ననిన
నగివాని యొక్కమంత్రము సరహస్య । ముగఁ దెల్పి యానిన పులిగుంపు లెల్ల

నీవెంటఁ జనుదెంచు నీవుపొమ్మనినఁ। బోవుఁ బాలు ప్రవాహములుగ వర్షించుఁ
జనుమన్న నమ్మంత్రశక్తి నయ్యడవిఁ। దనరు వ్యాఘ్రీసముత్కరము దోడుకొని
పురముసొచ్చిన జనంబులు భయభ్రాంతిఁ। బఱచి రెల్లెడలకుఁ బసులఁ దోడుకొని
వచ్చినచందాన వరుసతోఁ బులులఁ। దెచ్చె నీతండెంత తెగుదారి యనుచు
వెఱఁగంది నృపతి వేవేగ నిప్పులుల। మరలనంపుము సుకుమార! చాల్ చాలు
పులిజున్ను నిన మహాద్భుతమంత్రశక్తి। పులిగుంపు నాక్షణంబునఁ బోవ ననిచె
జననాథుఁ డమ్మంత్రశక్తికి మెచ్చి। పనిచెనింటికిఁ దగుబహుమాన మొసఁగి
యంతటఁ గొన్నినాళ్లరిగిన వెనుకఁ। గాంతపై భ్రాంతి నాథునుఁ బిల్చిరాజు
అన్న! క్రౌంచాండమ్ము లౌషధంబునకు। నెన్నాళ్లలోఁ దెత్తు వెతఁగింపు మనినఁ
బదిహేనునాళ్లలోపలఁ దెత్తు ననుచుఁ। బదిలుఁడై తనభార్యపంపున నేగి
గరుడాద్రిచేరి యక్కడ మోహనాంగి। వరసమాఖ్య వహించు వనచరకన్యఁ
జూచివనది వానిసొబగున కలరి। యోచెల్ల! యెక్కడనుండి వచ్చితివి?
కడుబాలకుఁడ వేమిగావలె? ననుచుఁ। బడఁతుక యడిగి తాఁ బలితుఁడన్నాని
గంధర్వసతియందుఁ గన్నాఁడునన్ను। సింధుసేనుండను చెంచు నన్ బెనిచె
నన్నుఁ జేపట్టుము నరనాథతనయ!। నిన్ను సౌఖ్యంబు లొందించెద ననిన
గాంధర్వమునఁ దానిఁగలసి క్రీడించి। గాంధర్వితోఁగూడి కదలి యాక్షణమె
హంసానువర్తినియను తటాకమున। హంసనీడములఁ గ్రౌంచాండముల్ గాంచి
యవిగొంచు చెంచెత నలగరుడాద్రి। నివసింప నియమించి నెమ్మివహించి
చంపకధ్వజుని దేశమునకు వచ్చి। తెంపుమీఱఁగఁ దాను తెచ్చిన గ్రుడ్లు
ముందరనిడిన నమ్మూర్ధన్యుఁ డలరి। యెందునుబొడగాన మిటువంటివాని
భళి! సుకుమార! నీబలజవోన్నతులు। తెలిసెఁ బూవనిపూలు తెచ్చి యిమ్మనిన
మాసద్వయంబున మసలక తెత్తు। నీసమ్ముఖమునకు నిజమని పలికి
మానినీమణియిచ్చు మంత్రవిభూతి। పూని యామణికర్ణపురమున కేగి
అట పేదరాలిపెద్దమ్మ యిల్ చేరి। కటకటపడు దానిఁగని యిదేమనిన
నాయవ్వపలికె నన్నా! యీపురాధి। నాయకుండై మించు నయగుణాధికుఁడు
మణికర్ణుఁడతనికుమారియై వెలయు। గణనీయ చంపకగంధి యన్ కన్య
అది పుట్టిపెరిగి పదాఱేండ్లప్రాయ। మొదవిన మేడపై నువిదలఁ గూడి

నిదురపోవఁగ మహానిశఁ జెంతఁగూర్కు।సుదతి యదృశ్యయై చూపడ కడఁగు
దినదిన మొక్కొక్క తెలివ యడంగ।విని తండ్రి యిదియేమివింతయో యనుచు
దానినింటను నిల్పఁదగదని యార్త । లై నమంత్రులు తెల్ప నౌగాక యనుచుఁ
బురబాహ్యవనసౌధమునఁ బువ్వుసెజ్జ । నిరవొంద నిలుప నయ్యింతి యెల్ల పుడు
నిదురమబ్బున శయనించియేయుండు । కదలదు మెదల దేకారణంబుననొ
సుత యొంటినున్నఁ జచ్చునోయని నృపతి।వెతఁజెంది యూరెల్ల వినఁగఁ జాటింప
నూరివా రింటింటి కొకరొక రరిగి । యారాజకన్య శయ్యాసమీపమున
దినదినము శయించి తెల్లవారినను । గనఁబడ రథిప! యాక్రమమున జనులు
నడపఁగాఁ జనుదెంచె నాయిలువగుస । కొడుకు నంపఁగలేక కుందెదననిన
నాలించి నీపట్టికై నేనెపోయి । తూలింతు నచ్చటి దుష్టాత్ము ననుచు
నాయవ్వయిడిన మృష్టాన్నంబు మెక్కి । పాయని తుష్టి నప్పార్థివసుతుఁడు
చని పురబాహ్యదేశనివేశ మొంది । ఘనశయ్యపై నిద్రఁ గైకొన్నదాని
మరుని మోహనబాణమహిమంబు చెంది।మురువొందు సౌందర్యమునమించుదాని
మణిభూషణాంబరమాల్యసుగంధ । గణనీయమూర్తియై కరమొప్పుదాని
చంపకగంధి నచ్చటఁజూచి నిదుర । మంపొందు నవ్వధూమణి పక్కలోనఁ
జాయగాఁ దనవిల్లు చలువదువ్వలువ । పాయకుండఁగఁ జుట్టి పైరుమాల్ గట్టి
పురుషుండు పండినపోలిక నిలిపి । పరుల కదృశ్యుఁడై భసితప్రసక్తి
వెనుచక్కి నున్నచో వెసదాని నాసి । కను వెలువడె రెండుకాలసర్పములు
ధనువు మానవుఁడని దంష్ట్రికాహతుల।నినుమారు మున్మారు నిటునటు గఱచి
మరలిపోవఁగ సుకుమారుఁ డాలోనఁ । గరఖడ్గమంకించి కడిఁదిసర్పములఁ
దెగవేసె రెంటిని దీమసంబునను । బగఁబూని యంతలో బ్రహ్మరాక్షసుఁడు
రూక్షకుండనువాఁడు రోషభీషణత । రాక్షుఁడై వింటికి హస్తంబుసాప
కరఖడ్గమునఁ గేలుఖండించి వానిఁ । దఱిమిన భీతిల్లి దైత్యుండు పఱచె
నల్ల చంపకగంధి యలయిక తీర్చి । యల్లన సుకుమారుఁ డామణికర్ణ
చెంతకుఁజని ఫణిచ్ఛేదనక్రమము । వింతగాఁదెలుప నివ్విధమేమొ యనుచుఁ
జింతింప నశరీరిచెప్పె గంధర్వ । కాంత నీసుత చంద్రకళికాభిధాన
చెలులతో నొకవనక్షితిఁ జరింపుచును । దిలకించె నచ్చోట దీప్తాంగుఁడనెడి

తపసిఁ దపోనిష్ఠుఁ డగు వానిఁ జేరి । చపలత పూఁదీగె శయమునఁ జిదిమి
యది రెండుగాఁ జేసి యమ్మౌని మోము। గదియించి పాములుగఱచె నిన్ననుచు
బెదరింప నాయన బిట్టులిక్కి చూచి । కొదమప్రాయంపుటుక్కునఁ జెలరేగి
చెడుగవై మమురవ్వసేయ వచ్చితివె? । పడుచ! నీవు నృపాలబాలవై పుట్టి
నీముక్కులో రెండు నీలాహులుండి । భామరో! నీచెంతఁ బండినవారిఁ
గఱచి హానియొనర్చుఁగాక నీవెంట । నఱుదెంచి నవ్విన యానర్తకుండు
దనుజుఁడై తత్ఫణిదష్టమానవునిఁ । దినిపోవునని బెట్టుదిట్టిన నడలి
శాపమోక్షంబు ప్రసాదింపుఁ డనుచు । నాపడఁతియు నటుం డడుగుల వ్రాలి
వేడిన బాహుదావిభుపుత్త్రుఁ డగుచుఁ । బోఁడిమిచెందిన భూపాలసుతుఁడు
పాములనఱకి శాపముదీర్చు దైత్యుఁ । డామహాత్మునకు నిజాత్మజ నిచ్చి
కరవాలనిహతాత్మకరముఁ బ్రాపించి।మఱి శాపముక్తుఁడౌ మదనుజ్ఞ ననుచుఁ
బనిచిన నాలేమ పట్టియై నీకు । జనియించెదీని నిచ్చుతురాత్మకునకె
యిమ్మని యశరీరి యేర్పడఁ దెలుప । నమ్మౌనవేశ్వరుం డాశ్చర్యమంది
యాకన్నెనీవె పెండ్లాడు మటంచుఁ । జేకొని పెండ్లిచేసిన వేడ్కఁ జెంది
యట నాల్గునాళ్లుండి యార్యోపదిష్ట।వటభూరుహము చేరి వసుధేశసుతుఁడు
నామఱ్ఱితొఱ్ఱలోనటఁ బ్రవేశించి । భూమీశతనయుండు పోయి ముందగను
నొక మహాకాసార మొప్పుగాఁ గాంచి । నికటవృక్షంబెక్కి నీళ్లలో దుమికి
చనిచని యచ్చోట సౌవర్ణరత్న । ఘనపురం బొక్కటిగని చొచ్చిపోయి
యది నిర్మనుష్యమహాపురం బగుట । మదినెంచి యొక రత్నమయసౌధ మెక్కి
యందుఁ జెన్నగు నొక్క యరవిందముఖిని । మందగామిని సుకుమారాంగిఁ జూచి
వెఱఁగంది యొంటి నిర్మలసౌధమునఁ । జరియించెదేటికి చంద్రబింబాస్య!
యని దానినడిగి శుభాంగియన్ పేరి । దనుజుని సుతయౌట దానిచే నెఱిఁగి
యామహారాక్షసు హస్తం బొసంగి । మామగారని తత్కుమారిఁ బెండ్లాడి
యతఁ డక్షవిద్యాసహాయతఁ బూన । మతినుబ్బి యొకనాట మసలకయఱిగి
కనియె స్వర్ణపురంబు కలితగోపురము । చనియె స్వర్ణధ్వజు సదనంబునకును
పగడసాలాడి తత్ప్రభుని నోడించి । దుగదిగయని తాను దొడ్డుగాఁబిక్కు
చేసినఁ బుష్పహాసిని నవ్వెఁగనుక । హాసోదితంబులై యలరులు గురిసె

నానవ్యకుసుమంబు లపుడె గ్రహించి । దాని వివాహమ్మై ధనవస్తుకోటి
నానరేంద్రుఁడొసంగ నయ్యింతిఁ గొనుచు। సేనాసమేతుఁడై చెలఁగి యవ్వాలను
అల దైత్యపుత్రి శుభాంగిఁ దోడుకొని । పలలాశిగొలువఁ జంపకకేతు పురిని
విడిచి చంపకగంధి వేడ్కతోఁగూడి । వెడలి రథాశ్వేభవీరుల తోడ
గరుడాద్రికేగి యక్కడఁ జెంచురాజు । పరిపరివస్తువుల్ పడుచుతో నొసఁగ
నామోహనాంగి మున్నగుసతుల్ నలువు। రామోదమునఁ గొల్వనతివై భవమునఁ
జాంపేయనగరరాజము ప్రవేశించి । యింపుతో సతినవ్వ నెసఁగినపూలు
పూయకపూఁచిన పూలివి యనుచు । నాయవనీశున కర్పించుటయును
వీని కసాధ్య ముర్విని లేదటంచు । నానరేంద్రుఁడు కుత్సితాత్ముఁడై యపుడు
తమ పితాళ్లనుజూచి తడయక రమ్ము । ప్రమదంబుతోనని బహులేఖ లొసఁగ
నవిగొని సతియుపాయంబున నగ్ని । జవమునఁ జొచ్చి భూస్థలిబిలం బొంది
నసబోణి దివ్యమంత్రమహాత్త్వమునను । దనయింటినుండి పితాళ్లంపినట్టి
కమ్మలటంచు వక్కణలిడి వ్రాసి । యమ్మాఁడునెలలేగ నగ్నికుండమున
వెలువడివచ్చి భూవిభుఁ బొడగాంచి । యలవొప్ప మీపితాళ్లందఱు మీకు
కమ్మలువేర్వేఱఁ గ్రమమొప్ప వ్రాసి । యిమ్మహి కనిపినా రివిగో యటంచు
నతని మంత్రిపురోహితాప్త సామంత । చతురసేనాధిప జనములకెల్లఁ
గమ్మలొసంగినఁ గడువేడ్క వార । లమ్మాడ్కి పెద్దలనరసి వత్తమని
యనలకుండములలో నటఁజొచ్చి చచ్చి।చనిరి దుర్జనులకు సౌఖ్యముల్ గలవె?
సుకుమారుఁడును శకఘోణిసుకన్ని । యకు వశ్యుఁడై మోహనాంగి మున్నైన
నలువురుఁ గన్నుసన్నలఁ బనుల్ సేయఁ।గలిమియు బలిమియు ఖ్యాతియుఁ గలిగి
సకలదేశములకు స్వామియై వివిధ । సుకృతంబు లొనరించి సుఖలీల నుండెఁ
బతికి హితంబు సంపాదించినట్టి । సతి విమలాంగిఁ బ్రశంసింపఁ దగదె
యీపుణ్యకథ యెవ్వ రింపుతో వినినఁ । బ్రాపించు వారికి భవ్యసంపదలు
అని చిల్క తెల్పిన నవ్వైశ్యకాంత । విని విస్మయమునొంది వేగినయంతఁ
దనయింటి కేగ భూధవుకడ కేగె । తనపూన్కి వితగాఁగ దాదియు నపుడు
అని మహేశుఁడు దెల్ప నవ్వలి కథలు । వినిపింపుఁడని గౌరి వేడ్కతో నడిగె
సరస పతివ్రతాచరితంబు నందు । గరిమ నిర్వదినాలుగవ కథ వెలసె

# నీ 'ఎఱ్ఱచూపునకు కొంగఁగా'నన్న సతి కథ

శ్రీవిశ్వపతి దయాంచితమతి యువతి । కావలికథ యిట్టులనియానతిచ్చె
దూతితో సందెప్రొద్దున మఱునాఁడు । నాతి రా నక్కారణశుకంబు వలికె
భూతభావిభవత్ప్రభూత కార్యములు । నాతి! పురంధ్రీజనములకుఁ దెలియు
సకల మిట్లెఱిఁగిన సాధ్వీచరిత్ర । మొక టున్న దెఱిఁగింతు నూకొందుగాక
యవని విద్యాకరంబను నగ్రహార । మవితథ ద్విజనికాయం బొప్ప దొల్లి
ఆయగ్రహారంబునం దొక్క ద్విజుఁడు । శ్రీయుక్తుఁడై యుండు శ్రీధరుం డనఁగ
నా విభార్యముభార్య యమితశోభార్య । భావితార్యసపర్య భవ్యసౌందర్య
వెలయు శ్రీసతియన వినయవివేక । సలలిత దాక్షిణ్య సౌజన్యవసతి
పతి కెదురాడదు పరులనిందింప । దతిథులఁ బూజించు నాడదు కల్ల
యలుగదు కలనైన నఖిలబాంధవులు । భళియనఁదగు నింటిపనికి వేసరదు
పతియె దైవంబుగా భావించుఁ దగిన । వ్రతములు పతిహితవాంఛ నొనర్చు
గలఁక చెందని శరత్కాలంబు కొలని । వలెఁ బతిభక్తిచే స్వచ్ఛతఁ గన్న
చిత్తంబుతో విలసిల్లుచు నున్న । మత్తకాశినికి సమ్యగ్జ్ఞాన మొదవె
తనయంత నేయది తలఁచినఁ దోఁచు । మనసున సాధ్వికి మలినత లేని
యద్దంబులో నీడయటువలె నిట్టి । ముద్దియ కెనయైన ముదితలు గలరె ?
ముజ్జగంబులనని మొనసి యెంతురు సు । హృజ్జను లయ్యింతి నెంచ శక్యంబె?
అక్కాలమున నమ్మహాగ్రహారమున । కొక్క విప్రవరుం డహోరాత్రపఠిత
వేదవేదాంగుండు విహితాగ్రశక్రి । యాదక్షమతి కౌశికాభిధానుండు
చనుదెంచె వినుము భిక్షావృత్తిఁ బూని।తనుయాత్ర జరుపుచుఁ దరలక యుండె
నతఁడు నిత్యంబు కల్యమునన లేచి । హితమతి హరి స్మరియింపుచుఁ బోయి
కొలనిలో మునిఁగి యెక్కుడు నిష్ఠ నాత్మ । వెలయ సంధ్యాదిక విధు లొనరించి
జాముపర్యంతంబు జపము గావించి । యామీఁదఁ దపమున కభినుతుల్ చేసి
కృతకృత్యుఁడై రావిక్రింద నేకాంత । మతి నుండి పదము క్రమంబు గుణించి
మధ్యాహ్నమైన నేమంబున లేచి । యధ్యయనము వాన నగ్రహారంబు
చొచ్చి యింటింట భిక్షుకవృత్తిఁ దాల్చి । యిచ్చిన భిక్షాన్న మెలమి భుజించి

యొకమఠంబునఁ బండియుండిరేయెల్ల । నికటస్థులైన వర్ణిశ్రేష్ఠులకును
బాడియుఁ బదవుతప్పక చెప్పికొనుచు । నేడుకాలము క్రమియించె నీరీతి
నంతట నొకనాఁ డహర్ముఖవిధులు । శాంతి నొనర్చి యాసద్ద్విజోత్తముఁడు
ఘనతరుచ్ఛాయను గ్రమము గుణించి।కొనుచున్న యతనిపైఁ గొక్కెర యొకటి
రెట్టవెట్టినఁ గోపదృష్టి నక్కొంగ । నట్టె చూచినయంత నది నేలఁబడియెఁ
బడినకొంగను జూచి బ్రాహ్మణుం డాత్మ।నడలుచు నిటులేల యలిగి చూచితిని
చేటెంచ కేల హింసించితి దీని । నేటితపం బిది యేటిపజంబు?
ఎక్కడి క్రమపాఠ? మెక్కడిశాంతి? । యెక్కడివ్రతనిష్ఠలివి యని పొగిలి
యెప్పటివలె భిక్షమెత్తికోఁ దలఁచి । యప్పారుఁ డయ్యగ్రహార వీధులను
నింటింట భిక్షాన్నమెత్తి యవ్వాలుఁ । గంటి యిల్ సేరి భిక్షాందేహి యనిన
నప్పతివ్రత భిక్ష మతని కొసంగఁ । దప్పక పాత్రశోధనము సేయఁగను
అంతలో శ్రీధరుండను తద్విభుండు । శ్రాంతుఁడై వచ్చిన సతి విలోకించి
యాపాత్ర యటువైచి యధిపుని శ్రమముఁ।బాపి స్నానమునకు బలుకాగులోనఁ
గ్రాఁగెడు జలములు గడువేగఁ దెచ్చి।మీఁగాళ్లు జానువుల్ మేను దోముచును
జలకమార్చి సువస్త్రంబు లర్పించి । పొలఁతి మాధ్యాహ్నికంబునకు నీళ్లొసఁగి
దేవపూజయు వైశ్వదేవం బతండు । గావింపఁదాను పాకము చేసినట్టి
శాకాదికములు భోజ్యములు వడ్డింప । నాఁకలిదీఱఁగా నతఁడు భుజించి
కరములు వార్చుకోఁగాఁ బాన్పమర్చి । తరుణి వీడియమిచ్చి తాళవృంతమున
విసరుచు నతిథి నవ్వేళఁ దలంచి । మసలితి నక్కటా! మహిసురుం డెంత
యలిగెనో యనిభయంబడర భిక్షాన్న।మెలమితోఁ గొనివచ్చి యింటి వాఁకిటను
నిలిచి యుండెడి నతనికి నిడఁబోవ । నలఘురోషారుణితాక్షుఁడై యతఁడు
పలుకులఁ గలఁకదోఁపగ నిట్టులనియె । భళి! సాధ్వి! నీవెంత భక్తిశాలినివి
యెంతసేపాయె నేనిచటికి వచ్చి । శ్రాంతుండనగు నన్ను సరకుసేయకయె
జాగుచేసితి విది సౌజన్యగుణమె? । నేఁ గనుంగొన నెందు నీవంటి సతిని
కలిగిన భిక్ష గ్రక్కునఁ బెట్టి పంప । వలయు లేదని చెప్పవలెఁ గాకయున్న
నిందేమియును లేక యింటిలోపలను । సందడి నీవున్న సతి! యెట్లు తెలియు?
వఱనిపై మమతో?యావనగర్వమహిమొ?। తెలుప! యిందుఁగాని తెలియదో యనుచుఁ

బలుమాటలాడ నా బ్రాహ్మణోత్తమునిఁ । దిలకించి యవ్వధూశీలక మిట్లనియె
నీవు పల్కినపల్కు నిజము తామసము । గావింపఁజనదు భిక్షాం దేహి యనిన
ననఘ! నీవచ్చినయపుడె భిక్షాన్న । మునకుఁ బాత్ర గ్రహింపఁబోవు నాలోన
నాపతి వచ్చె నెంతయు శ్రాంతుఁడగుచు । నా పుణ్యునకు భోజనాదు లమర్చి
బడలికతోనున్నఁ బాను పమర్చి । విడెమిచ్చి సురటిచే విసరుచు నుండి
యప్పుడు జ్ఞాపకంబయిన నిన్ దలఁచి । యిప్పుడు దెచ్చితి నిదె భిక్షగొనుము
కోపంబు చనదు నీకు మహాత్మ నీదు । కోపదృష్టిని జావఁ గొంగనుగాను
క్షమ లేని తపసికి సౌఖ్యముల్ గలవె? । క్షమియింపవలయు వేసరక యిందులకు
క్షమ లేక యొక బ్రహ్మచారి పూర్వమున।సుమతియన్ వాఁడు చచ్చుటనీవు వినవె?
యాకథ యెటులన్న ననఘ! కృష్ణాన । దీకూలమున నుక్తిన్నపాలు చెంతఁ
గలఁ డుదుశ్రవుఁడను త్త్వసురుండొకఁడు।సులలితమతిశాలి సుమతి తత్సుతుఁడు
నాయింటిపొరుగు బ్రాహ్మణునికుమారుఁ । డై యొప్పుదుర్బుద్ధియనువాఁడొకండు
గోదావరీతటి గోవిందశర్మ । నాఁడగు విద్వజ్జనశ్రేష్ఠు చెంతఁ
జదువ వాఁడరుగఁగా జతచేసి సుతునిఁ । జదువుకొమ్మని యుదుశ్రవుఁడును బనిచె
వీఁడు బాలుఁడుసుమీ! వీనికిఁ దోడు । నీడనై నీవు మన్నింపు మటంచు
జనకుఁడీరీతిఁ బంచఁగ వాఁడు మంచి । దని తోడుకొనిపోయి యాచార్యుఁ జేరి
యిద్దఱు సాష్టాంగమెఱఁగిన సతఁడు । పెద్దయు లాలించి ప్రీతిదీవించి
యన్నవస్త్రములిచ్చి యాత్మజుల్లేక । యున్నవాఁడగుట నెంతో వత్సలతను
జదివించె వేదశాస్త్రములు దుర్బుద్ధి । చదివె నాసుమతి యాచార్యు శుశ్రూష
సేయుచు గురుపత్ని సెప్పిన పనులు । సేయుచుఁ దగుభక్తి సేయుచు నుండె
గురుని దోవతు లుదుకుచు వేగి లేచి । విరులును దులసియు విస్తరాకులును
ఫలసమిత్కుశలును బచ్చి లేఁగసవు।పొలపగూరలు దినంబును దెచ్చుచుండుఁ
బొసఁగ దూడలను మేపుచు సందెవేళఁ । బసులనుగట్టి తప్పక కసువిడును
ఆవులపాలు నిత్యంబును బిదుకు । కావలసిన వంటకట్టియల్ తెచ్చు
నీవిధమునఁ బనులెల్లఁ గావింప । గోవిందశర్మ యగ్గుణనిధిఁ జూచి
చదువుకో కిప్పనుల్ సతతంబుఁ జేసె । దిదియేమి తోడివాఁడిదిగో వేదంబు
చదివెఁ గావ్యములందుఁ జతురతఁ గాంచె।నద నీకుఁబని లేదె? యన్న వాఁడనియె

మీకృప గల్గిన మితసత్యవచన! । యేకంబుగా వచ్చు నెల్లవిద్యలును
నా కేమికొదువ యన్న గురుండు మెచ్చె । నీకిటువలెఁ దోఁచెనే వత్స! యనుచు
నంతట నయిదేడు లరుగ దుర్బుద్ధి । కొంతవేదము మఱికొన్ని శాస్త్రములు
తనకు వచ్చుటఁ జేసి తద్గురుస్వామి । కనియె నొక్కదినంబునం దేకతమున
గురురాయ! మీకృపఁ గొన్నిశాస్త్రమ్ము। లెఱిఁగితిఁ దడవయ్యె నిట కేము వచ్చి
వీని తల్లియుఁ దండ్రి వెతఁ జెందుచుండు । రేనేర్చినది యూరికేగిన వెనుకఁ
జెప్పెద సుమతికి శీఘ్రంబె యూరి । కప్పనవెట్టుఁ డేమరిగెద మనిన
గురుఁ డాకుబుద్ధిఁ గన్గొని మంచికార్య । మరిగెద రీవిమూఢాత్మునిఁ గూడి
యూరి కేగినమీఁద నుపదేశ మిమ్ము । కూరిమి నీనేర్చికొన్నవి యెల్లఁ
బనివినుఁ డీశుద్ధపంచమినాఁటి । కని మూఁడునాల్గు నాళ్లిటు మితివెట్టి
యారాత్రి సుమతి నిజాంఘ్రులు తొడలఁ । జేరిచి యొత్తగాఁ జిత్తాబ్జమలర
వానికిట్లను వేకువనెలేచి నేను । స్నానంబు గావించు నదికీవు వచ్చి
నాకంటెమున్న స్నానముచేసి సంధ్య । యేకాగ్రమతి వార్చి యావు సహస్ర
గాయత్రి జపియించి ఘనభక్తినిష్ఠఁ । బాయక నావెన్కఁ బరివసింపుమని
యానతిచ్చిన నట్లగావించ । నానిర్మలాత్మకుం డంతి జామెక్క
నాగురుమూర్ధన్యుఁ డంతకుమున్నె । తా గురునిష్ఠ సంధ్యావిధుల్ దీర్చి
బ్రహ్మగాయత్రి జపంబు గావించి । బ్రహ్మాణి నవదాతపద్మాసనస్థ
నతుల ప్రవాళనవ్య కరప్రవాళఁ । దతకటీర నిబద్ధ ధవళదుకూల
హారకర్పూర నీహారడిండీర । తారేశ తారాభ తరుణశరీర
వాణి వినమ్రగీర్వాణి వినీల । వేణి భావమున భావించి ప్రార్థింప
నాతత మంత్రమాత్రాహూత యగుచు । నాతనిమ్రోలఁ బ్రత్యక్షమై నిలిచె
నిలిచిన భారతీనీరజాతాక్షి । కలరుచు నతఁడు సాష్టాంగం బొనర్చి
యంజలిచేసి యాయర్భకుఁ గరుణ । రంజిల్లఁ జూచి సర్వకళాప్రవీణుఁ
జేసి రక్షింపవే శ్రీశారదాంబ! । భాసురోరునితంబ! భక్తావలంబ!
యని తనవెన్క నున్నట్టి యర్భకునిఁ । గనకగర్భునిరాణి కన్నుల యెదుట
నిలిపిన వాఁడు వినీతుఁడై మ్రొక్కఁ । దిలకించి యిఁకవీఁడు త్రిభువనములను
వెలయుఁ జతుష్షష్టివిద్యాఢ్యుఁ డగుచు। గలిమియుఁ బ్రతిలేని ఖ్యాతియుఁ గాంచు

నని వానినాల్కఁ బీజాక్షరత్రయము । నెనరుతో వ్రాసి యన్నిఖలైకమాత
యంతర్ధిఁ జెందిన నర్భకుం డపుడు । వింతయా సూక్తి గోవిందశర్మాఖ్యఁ
దగు గురుఁ బొగడె శతశ్లోకములను । మిగుల వేడుకయుఁ గూర్మియు గౌరవంబు
ముప్పిరిగొన వానిమోము ముద్దుగొని । యప్ప! నీవిద్య బయల్ సేయ వలవ
దిచ్చోట మీయూరి కేగిన వెనుక । నిచ్చకైనటుల విజృంభింపు మపుడు
వినిపింపఁబోకు మీవిధము దుర్మతికిఁ । జన్మత్రోవ వానితోఁ జర్చ సేయకుము
అవని విద్యకు వినయంబె భూషణము । తివిరి యేసభల వాదించఁబోకు మని
కొన్ని బుద్ధులు సెప్పి గురుఁ డింటికరిగె।నన్నయాఖ్యుఁడు వెంట నరుగుదేరంగ
మరునాఁడు ప్రొద్దున మంచిలగ్నమున । గురుఁ డయ్యిరువుర నక్కున గారవించి
చలిదియు బత్తెంబు చాల నొసంగి । యల సుబుద్ధిని వాని కపు డప్పగించి
నీవిద్యలెల్ల వీనికి నేర్పుమనుచుఁ । ద్రోవ నింతయుఁ దానుదూరంబు పోయి
వారి వీడ్కొని విప్రవర్యుండు మఱలె । వారిద్దఱును గొన్ని వాసరంబులకు
మలలును నదులు గ్రామంబులు దేశ । ములు దాటి చనిరి ప్రమోదంబు మీఱ
సుమతి యేమెఱుఁగక శుంఠఁడాయెనను।ప్రమదంబు కుమతికిఁ బ్రభవించె మదిని
వీని మించితిఁగదా విద్యల ననెడి । యానంద ముదయించె నల సుమతికిని
నిటువలె నలరుచు నిరువురు నేఁ । యటవిలో నొక్కనాఁ డాఁకల బడలి
యొక చెట్టుక్రిందఁగూర్చుండి యున్నపుడు।వికటాత్ముఁడు కుబుద్ధి వినరోరిసుమతి!
హెచ్చె దాహము తోయ మెచ్చటఁగలదొ?।యిచ్చట వెదకి తెమ్మిక్షణంబున నె
పాలుమాలక లెమ్ము బడలికఁ బూని । యీలాగు నీవున్న నేకార్య మగును
అనిన సుబుద్ధి యన్నా! నిన్నుఁబలెనె । వనవీధి నడిచి కేవల మలసితిని
యించుకసేపు సహింపుము వెదకి । కొంచు వచ్చెద నీళ్లు గొబ్బున ననిన
వాఁడల్గియిపు డెన్నివదరెద వోరి । వేఁడుకొంటే చాల విఱ్ఱవీఁగెదవు
బొక్కపాలవు (?) పొట్టపొడిచిన నొక్క।యక్కరంబు నెఱుంగవతివిమూఢుఁడవు
లేచిపొ మ్మూరక లేచిపోకున్నఁ। జూచెదు నాచెయ్యి శుంఠ! యటన్నఁ
దాళుకోలేక విద్యాగర్వమహిమ । బాలుఁ డిట్లనియె నోబద్ధకి! నీవు
విద్యాధికుఁడవైన వేఁడికోనేల । సద్యఃప్రభూతమకా సలిలపూరమున
నీదప్పి దీర్చుకోనేరవే యనినఁ । వాఁడుల్కిపడి విద్యవచ్చువాఁడలకు

వలసిన నీరెట్టు వచ్చురా! యనినఁ । గలకలనగుచు నాఘనుఁ డిట్టులనియె
నేను మహాఘుఁడఁగదా నింగిఁబొంగెడి మ । హానదీజలములిం దావిర్భవింపఁ
జేసెద నపుడు మెచ్చెదవె? నన్ననిన । నీసుతో వాఁడను నీవె మున్నీటి
జలము దెచ్చెదవేని సాష్టాంగ్మ హేళ । తులితుండవని నిన్ను స్తుతియింతు ననిన
విధినియోగమున గర్వించి యాసుమతి । యధికభక్తిని గురు నభినుతుల్ చేసి
కరములు ముకుళించి గంగాస్రవంతి । గరిమ నుతించె శ్లోకచతుష్టయమున
నాశ్లోకములు దీఱునంతట ఘుముఘు । మశ్లాఘనీయ సమగ్ర నిర్ఘోష
చలిత దిశావకాశంబై సుధాచ్ఛ । సలిలప్రవాహంబు జగతికి డిగ్గి
యక్కుమారుని మ్రోలనతలంబునొరసి। యొక్కటఁ బ్రవహింపనోహో రె!యనుచు
నల్ల కుబుద్ధి మహాశ్చర్యమంది । చెల్లు నీకని స్తుతిఁజేసివాఁడంత
స్నానంబొనర్చె నాసలిలంబునందు । వానితో సుమతియు వరభక్తిమునిఁగె
యన్నీట మాధ్యాహ్నికాదులు దీర్చి । యన్నాదికములు సయ్యన వాఁడొనర్చి
యన్న! రమ్మలసితివని ముద్దుగాఁగ । నన్నంబు వెట్టిన నతఁడు భుజించె
వాఁడును భుజియించివచ్చి నిద్రింత । మీఁద నించుకతడ వీవు నే ననుచు
నతని నిద్దురఁబుచ్చి యట్టె తా మ్మెక్కి । సితఘంటమున శిరశ్ఛేదంబు సేయఁ
బూన నిద్దురలేచి భోరున సుమతి । యానీచు వారింప నలవిగాకున్న
మాతండ్రి నాదు క్షేమం బెఱుంగుటకు । వ్రాతు నే నాల్గక్షరములని వాని
చేఘంటమున "నప్రశిఘ"యని యాకు । లో ఘనత్వర వ్రాసి లోఁబడి యుండె
ఘంటంబు చేకొని కంఠంబు గోసి । కంటకవృత్తి నాఖలుఁడు తీవ్రముగఁ
దనువు పూడిచివైచి తనగ్రామమునకుఁ । జని యల్లలేఖ తజ్జనకున కిచ్చె
నాయర్థమెఱుఁగక యవనీశుఁ జేరఁ । బోయి తెల్ప నతండు పురి సుధీజనులఁ
బిలిపించి యడిగినఁ బెద్ద లందఱును । దెలివి నార్నెలలకుఁ దెలుపలేరైరి
అందునఁ గోపించి యధిపుఁడు వారి । నందఱఁ దెగటార్తునని బెదరింప
వారిలో నొకవిప్రవర్యుఁ డశ్వత్థ । ధారుణీరుహము చెంతల నున్న నొక్క
బహ్మరాక్షసుఁడు భార్యకుఁ దేటపఱచె । బ్రాహ్మణతనయుండు ప్రాణాంతవేళ
వడి నప్రశిఘ యని వ్రాసి తన్ జంపు । చెడుగు చేతికొసంగ క్షితిపతి దాని
యర్థ మేమనిన మహాద్విజుల్ దాని । యర్థ మెఱుంగక యతిఖిన్నులైరి

వారల దండించువాఁడై నృపాలుఁ । డారంభ మొనరించె నదియేల యనిసఁ
దనపుత్త్రి నాద్విజాత్మజునకు నొసఁగ । మనసునఁ దలఁచి వేమఱు వానిరాకఁ
గోరుచుండుటఁజేసి కుపితుఁడాయె నన । నారక్కసుని భార్య యయ్యర్థ మడిగె
నడుగఁ * జతుష్పాదమైన శ్లోకమునఁ । బడఁతిరో! ప్రతిపద ప్రథమాక్షరములు
తగ నప్రశిఘ యన దానియర్థంబు । నిగదింతు వీనిచే నీపుత్త్రకుండు
వనమున నిద్రింప వాఁడిఘంటమునఁ । దునుమగాఁబడె శిఖద్రొక్కి పట్టికొని
తల, యని యున్న దీతాత్పర్య మనిన । నల బ్రాహ్మణుఁడువిని యది మఱునాఁడు
నృపతికిఁ దెలుప వాని వధించినట్టి । చపలునితోఁ జని చంపినచోటి
ధరణిలోఁ బూడ్చిన తనువును జూప । ధరణీశుఁడును వాని తల్లిదండ్రులును
బరితాపశిఖిఁ గ్రాఁగఁ బ్రాజ్ఞు లిట్లనిరి । సరగున గోవిందశర్మ నిచ్చటికిఁ
బిలువ నంపించినఁ బ్రియశిష్యు ప్రాణ । ములు వేగ రప్పించు భూనాథ! యనిన
నాలాగె పిలుపింప నమ్మహామహుఁడు । వేళంబె యచటికి వేంచేసి సుమతి
ప్రాణంబు లిప్పించె భారతిచేత । వానికిఁ బుత్త్రి వివాహంబు చేసి
యానందవార్ధి నోలాడె సుకీర్తి । యానందనునిఁ జూచి యక్కునఁ జేర్చి
తల్లిదండ్రు లలరి రాదారుణహత్య । వలన దుర్బుద్ధి జీవవిముక్తుఁ డయ్యె
గోవిందశర్మాఖ్యగురునిఁ బూజించి । భూవిభుం డిష్టార్థములఁ దన్పెఁ బ్రజలఁ
గావున క్షమమాని గర్వంబుఁబూన । నావహిల్లు విపత్తి యవనీసురేంద్ర!
సతులకుఁ బతిసేవ సలుపుట నీతి । యతిథిపూజనము దేవార్చనారతులు
మాకేల నింకొక్కమాట చెప్పెదను । జేకొని యటువలె సేయుము నీవు
లలితమానస! మిథిలానగరమున । నలరు ధర్మవ్యాధుఁ డనుబోయ యొకఁడు
అతఁడు నీకెఱిఁగించునట్టి ధర్మముల । నతిశయించెదవు పొమ్మని యన్నమిడిన
యప్పతివ్రత తెల్వి కాశ్చర్యమంది । యప్పుడే మిథిలకునరిగి కౌశికుఁడు
పొలసమ్ముకొనియెడు బోయను జేరి । తెలిసి యాఘనుఁడు పతివ్రత నిన్నుఁ
బనుపఁగా నీతోడ భాషింపవలసె । జననియు జనకుండు సంతాపమంది
నినుఁగాన కడలుచెందెద రంధవృత్తిఁ । జని వారిఁ బ్రోవుము సద్భక్తియుక్తిఁ

---

* అనేనతవపుత్రస్య ప్రసుప్తస్య వనాన్తరే।
శిఖామాక్రమ్య పాదేన ఘంటేన నిహతం శిరః ॥

దల్లి దండ్రులకంటె దైవముల్ గలరె? యెల్ల బంధువులు వారేసుమీ యనఘ !
తలిదండ్రులను బూజఁ దనరించి యందు । వలన నాత్మజ్ఞానవంతుడ నైతి
నని తనపితరుల నతనికిఁ జూపి । యనుపమతత్త్వరహస్యముల్ దెలిపి
పనిచినఁ గౌశికబ్రాహ్మణోత్తముఁడు । తన తలిదండ్రులఁ దడయక చేరి
వారి శోకముదీర్చి వైవాహికక్రి । యారూఢి ధర్మాత్ముఁడై సౌఖ్యమందెఁ
గౌశికుం డీతెల్వి గను టప్పతివ్ర । తాశిరోమణి పూర్ణదయచేతఁ గాదె?
యీసతీమణికథ యెవ్వరు వినిన । వ్రాసినఁ జదివిన వైభవం బొదవు
పాపముల్ దొలఁగు నిబద్ధియటంచు । నావుష్పమంజరి కలచిల్క దెలిపె
అని శంభుఁడెఱిఁగింప నవ్వాలికథలు । వినిపింపుమని గౌరివేడ్కతో నడిగె
సరస పతివ్రతాచరితంబు నందు । వరుస నిర్వాదియైదవకథ చెన్నొందె

# గంధర్వకన్యకథ

శ్రీ విశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టు లానతియిచ్చె
నావలినాఁటి సంధ్యావేళ దూతి । తో వచ్చు చెలికిఁ గంతుపటాని పలికెఁ
బరిహాసమునకు బాప్రతిమయూ తన్నుఁ । బరిణయం బొనరించి బ్రహ్మచారికిని
ధరణీసుపర్వపుత్రకు లేగ నతని । వరియించిన సుపర్వవనిత చరిత్ర
నోయమ్మ! తెలిపెద నూకొందుగాక । మాయాపురము చెంత మణిసారమనెడు
నగ్రహారము తొల్లి యమరు ధరాకు । చాగ్రహారమురీతి నంచితశ్రీల
నాయూరనుండు మహాప్రజ్ఞనామ । ధేయుండు సకల శ్రుతిస్మృతి వేత్త
ఆమహామహుఁ డుపాధ్యాయుఁడై యచటి । భూమిదేవవరేణ్య పుత్రుల కెల్ల
వేదశాస్త్రంబులు వివిధాగమములు । నాదరంబునఁ జెప్పి యతివిచక్షణులఁ
గావింపుచుండ నక్కడికొక్కవటుఁడు । దేవశర్మాఖ్యుఁ డేతెంచి సేవించి
దేవ! గోదావరీతీరవాసుఁడను । నే వేదశాస్త్రముల్ నేర్చుకోఁ దలఁచి
వచ్చితి మీపాదవనజముల్ గొలువ । నిచ్చ మచ్చికహెచ్చ నిదిమొదల్ నన్నుఁ

జేపట్టి శిష్యుఁగా శిక్షింపుఁ డనిన । నాపుణ్యుఁ డౌఁగాక యని సమ్మతించి
కారుణ్యమున శిక్షగావింప బ్రహ్మ । చారియు వేదముల్ చదువుచు నుండె
నాగురుం డనుప మధ్యాహ్నకాలమున । నేఁగి భిక్షాన్న మింటింటఁ దెచ్చికొని
భుజియించు దిన మొక్కపూట సద్గురుని । భజన మేమరక సేవ లాచరించు
నందున నతఁడు విద్యావంతుఁ డయ్యె । నెందును విశ్వాసమే ఫలప్రదము
అంత నచ్చటివిప్రు లాత్మీయసుతుల । కెంతయు వేడ్కవహించి పెండ్లిండ్లు
సేయింప వారువచ్చిరి పెండ్లికొడుకు । లై యుపాధ్యాయుల కభినుతుల్ సేయ
వచ్చి మ్రొక్కిన శిష్యవరుల దీవించి । హెచ్చినకలిమి మీ రెల్ల గృహస్థ
భావంబు గంటి రీ బ్రహ్మచారి య య్యయో! వివాహము లేక యెదిగి యున్నాఁడు
పాపుదాపులు లేక పరిణయం బగునె?।యీ పేదకుఁ గుమారి నెవ్వఁ డిచ్చునని
యతనిపైఁ గృప గురుం డాడఁగా వినుచుఁ। బ్రతి పల్కకుండి రా బాలు రందఱును
మఱునాఁడు విప్రకుమారకు లెల్ల । సరసిలో స్నానాదిసత్క్రియల్ దీర్ప
నరిగిరి తమవెంట నాబ్రహ్మచారి । యరుదేర వింటివె? యంతకు మున్న
లలితాబ్జరేఖా కళావతు లనెడి । చెలులు ముగ్వురుగొల్వఁ జిత్రరథాఖ్య
గంధర్వకూఁతురు కనకరేఖ యను । సింధురయాన రాజితకళాధీన
యల సరోవరమున కరుదెంచి యచట । జలకేళి చెలులతో సలుపుచునుండి
యావిప్రతనయు లల్లంత రాఁ జూచి । పావడల్ కోక లాభరణముల్ మునుపె
తట నికుంజాంతరస్థలి డాఁచియునికి । నటకేగ ననువుగా కతిసత్వరమున
నీటిలో నట్టె మునింగి యాప్రతిమ । నీటొందె నదిచూచి నెలఁత లట్లెరి
యాతిబొమ్మలరీతి రమణు లీభాతి । లోత్తైన యానీళ్లలోడాగ వారి
కచభార ముఖ విలోకన కంఠ బాహు । కుచ రోమరేఖికా గురుజఘనోరు
చరణాగ్రములు భృంగ జల జాండజాబ్జ । వరబిస చక్ర శైవలలతా పులిన
కరికర కూర్మవైఖరులు వహించి । సరసిఁ బ్రాపించి యిచ్ఛాద్రధిమమున (?)
యారూపులై రానా రమణు లట్లున్న । ధారుణీసురసుతుల్ తానంబు సేయ
బొమ్మలబంటి నీరు చొరంగ మొదటి । బొమ్మ నొక్కఁడు దాఁకి బోరునఁ బట్టి
బయటికిఁ దెచ్చి యాప్రతిమ రూపంబు । నయనాంబుజముల కానందం బొనర్పఁ
జుట్టునుండెడి సహస్రోతలఁ బిలిచి । యిట్టి చక్కనిబొమ్మ నెక్కడనైనఁ

గంటిమే? యిదియ నిక్కము బోఁటి రైయెన। వెంటనంటఁడె తుంటవింటిదంటయిన
మన దేవశర్మ కీమానినిఁ బెండ్లి । యొనరింతమే? నిన్న నొజ్జలు మనల
దూఱిన దెఱుఁగరే? తొడిబడ నిపుడె । యారంభ మొనరింతమని వారినెల్ల
బ్రేరేచి రమ్మని ప్రియమున బ్రహ్మ । చారినిఁ గైసేసి సమిధలు దర్భ
గంధంబు పువ్వు లక్షతలు దెప్పించి । యందు ముందుగను సమావర్తనాఖ్య
హోమంబు సేయించి యుచిత మంత్రక్రి।యామహత్త్వమునఁ గన్యావరణంబు
తలఁబ్రాలు కంఠసూత్రము మొదలుగను । వలసిన వన్నియు వన్యవస్తువుల
ఘటియించి యగ్ని ముంగల వెలుఁగొందఁ।దటుకున విహితకృత్యము లెల్లఁదీర్చి
యనలప్రదక్షిణం బాబొమ్మతోడ । నొనరింపఁగామించి యుద్వాహ మయ్యె
బ్రహ్మచర్యం బికఁ బనిలేదటంచు । బ్రహ్మచారికిఁ దెల్పి పరిహాసభంగి
బాలు రాశీర్వదింపఁగ వారిబలిమి । నాలోచిత్తుఁడై యతఁ డూరకుండె
క్రొత్తపెండ్లికుమారకుఁడు దేవశర్మ । యుత్తమగృహమేధి యూరిలో నెల్ల
నీవార్త దెల్పుద మిఁకనని ప్రతిమ । నావేళఁ దోయమధ్యంబున నుంచి
చనిరందఱును బ్రహ్మచారియు గురునిఁ।గనుగొని యక్కడిగములు దెల్పుటయు
నందఱుఁ గని మీ ప్రియమునకుఁ దగిన । చందానఁ బరిణయోత్సవము సల్పితిరి
ప్రాజ్ఞులౌననుచుఁ గోపముఁజేసె నొజ్జ । లజ్జత నవ్వితిమనిరి వారెల్ల
నక్కడఁ గనకలేఖాబ్జపత్రాక్షి । మొక్కలివగ ద్విజన్మలసుతుల్ తన్ను
నవ్విటునకు వివాహము చేసి చనిన । నివ్వెరపాటుతో నిజరూప మూనఁ
దమతమ రూపముల్ దాల్చి నెచ్చెలులు । రమణికి వస్త్రాభరణగంధమాల్య
వితతిఁ గైసేసి యో వెలఁది! నీవంటి । యతివ కీవడుకవాఁడటె! మనోహరుఁడు
బాగాయె మఱియేమి పడుచులఁగూడి । యాగడం బొనరింప నది నిజంబనుచుఁ
గలఁక చెందఁగనేల కానుగకాయ । గళమున నేటికిఁ గడవేయఁ గదవె!
యిక్కడఁ దడవేల యింతి విమాన । మెక్కవే మనయింటి కేగుద మనిన
నాచెలువలఁ జూచి యతివ యిట్లనియె । నీచందమున వచియింప మీకగునె?
వేదమంత్రములచే విప్రకుమారు । లాదృతినైన హాస్యంబుననైనఁ
గట్టించి రక్షిత మంగళసూత్ర మనుచు । నెట్టు విసర్జింతు నిది కాయయగునె!
యిదియె బంగరుపుస్తె యితరునినిఁక। మది నెంతునె యతండె మత్ప్రియుండనుచు

నలఘుపాతివ్రత్య మంతరంగమునఁ । జెలఁగ విమాన మచ్చెలులతో నెక్కి
తనలోకమున కేగి తల్లిదండ్రులకు । వినిపించె నప్పెండ్లి వృత్తాంత మెల్ల
వారది విని ధాతవ్రాసిన వ్రాఁత । యీరీతి నుండేనే యింతి! నీ కనుచు
వేదోక్తతంత్రంబు విడిపించ రైరి । కాదందురే వివేకజ్ఞులు శ్రుతులు
ఆరాత్రి తలిదండ్రు లనుప నయ్యనుప । మారూఢ యౌవనోదయ హేమరేఖ
చెలులు కై సేయ నంచితపదార్థముల । నలువొందు మణివిమానంబుపై నెక్కి
యలరుచుఁ జని యగ్రహారంబునడుమఁ । బొలుపొందనొక్క విప్రుని యింటిప్రక్క
నొక పంచపాకలో నురువుగా వాఁకి । టికిఁ బెనుతడిక గట్టిగ బిగియించి
తలచుటల్లి కలచేఁ దగు నారికెడపు । విరిమీఁద దోవతి విస్తరించికొని
శయనించి చదివినశ్రమముచే సుప్తుఁ।డయియున్న ద్విజసూను నవసరం బెఱిఁగి
తన విమానము వంచి ధరకు లంఘించి । తనుకాంతులటఁ బర్వఁ దడిక గదల్చి
వనిత వాఁకిలి తెఱవఁగదోయి యనిన । విని యెవ్వరని వాఁడు వేడ రేపాడి
బొట్టు గట్టినయట్టి పురుషుండ వపుడె । యెట్టుల మఱచితీ వేను గంధర్వ
కన్నెను గనకరేఖను నేనునీకు । నన్నియుఁ దెలిపెద నవల రానిమ్ము
నావిని తడికఁ ద్రగ్గన్నవాఁడు దివియఁ । దావిగుబుల్కొనఁ దరుణిలోపలికిఁ
జని వాఁకి లెప్పటిచందాన మూసి । తనుదీప్తి నయ్యంధతమసం బడంచి
తనుఁజూచి వెఱచు నాతని భావ మెఱిఁగి । కనకకంకణములు ఘలుఘల్లు మనఁగ
జడియకుమని వెన్నుచఱచి నామేని । కొడయుండవని స్వకీయోదంత మెల్లఁ
జెప్పి గంధములంది సిగ విరుల్ చుట్టి । యొప్పుకోకలు భూషలొసఁగి కై సేసి
తాను దెచ్చిన పదార్థములచేఁ దృప్తుఁ । డైన వానికి విడియము ప్రేమ నిచ్చి
యువిద నవోఢ యయ్యును ప్రౌఢకాంత । సవరున ముగ్ధుఁడౌ భూసురసుతుని
మేనొల్పుటకుఁ జెక్కుమీఁటి నున్గోటి । సోకులఁ దమిరేచి సొంపు పుట్టించి
పుక్కిటివిడె మిచ్చు పొంకంబు నేర్పె । మ్రొక్కులుతక్కులు ముచ్చటల్ నేర్పె
రాకొట్టి కౌఁగిట రహిమీఱఁ బెనఁగి । పైకొనుమని వేడు ప్రౌఢిమ నేర్పె
నీరీతినాతి యేమెఱుఁగని బ్రహ్మ । చారిని వలరాజు సామ్రాజ్యమునకుఁ
బట్టంబుగట్టి లేఁబ్రాయంబు కొల్లఁ । బట్టె నాతఁడును నేర్పరి యయ్యె రతుల
నేను వచ్చినరాక యెవ్వరితోడ । నైనఁ జెప్పెదునుమీ! యాత్మేశ! యనుచుఁ

గవకూడి రేలిట్లు క్రమియించి వేగు । నవసరంబున నేగు నాత్మీయపురికి
నీలీలఁ గొన్నినా ళ్లైలనాగ యతని । రేలెల్లఁ గోర్కెమీఱి రమించి చనఁగ
నా దేవశర్మ దేహమున సత్కాంతి । ప్రాదుర్భవించెఁ దప్తస్వర్ణ భాతి
మొగముపూర్ణేందుసొంపునిరాకరించెఁ।బొగరుప్రాయపువన్నెపొలుపుఃహించె
నావింత గని యొజ్జ లాశ్చర్యమంది । యీవిలాసములకు హేతు వేమనుచు
దినదిన మడుగ నింతియనుజ్ఞ లేమి । వినిపింప వెఱచె నావృత్తాంత మతఁడు
గ్రుచ్చిగ్రుచ్చి దినంబు గురుఁ డిట్టు లడుగు।టచ్చెలి కెఱిఁగించి యనుమతి గాంచి
యానుపూర్విగఁ దెల్పె నతఁ డవ్విధంబు । వీనులవిందుగా విని గురుం డలరె
నొజ్జలు బోధింప నొక్కనాఁ డాతఁ । డజ్జలజాక్షితో నరిగి స్వర్గాది
లోకంబులెల్ల నాలోకించి యందు । నేకసౌఖ్యములు చెందెడి ధర్మపరులఁ
గనుగొని సంతోషకలితుఁడై దాని । కనియె మాయొజ్జల కలిలేణి సుగతి
కలదొ లేదోయన్నఁ గలదనె నదియు।నలరి సంయమనిఁ దా నరయంగఁ బోయి
సత్పురుషులు గాంచుఁ సౌఖ్యముల్ గనుచుఁ । దత్పురి దక్షిణద్వార దేశమునఁ
బేడకుప్పలు రెండు పెనుగట్టు లట్లు । చూడఁ జోద్యమ్ముగా చూపట్టఁ జూచి
యతఁ డివియేమి తొయ్యలి ! తెల్పుమనిన । సతిపల్కె నీగురుస్వామి కుమారి
విధవ యున్నదిగదా వినుమది ముసలి।బధిరుఁ డంధుఁడునౌ తపస్వి యొక్కరుఁడు
భిక్షవేడిన పేడఁబెట్టిన మఱిగ । యాక్షేపించి కడుగక యెడ్డతనాన
నందులోఁ గొనివచ్చి యన్నంబు పెట్టె । ముందరయకయున్న మోసంబు రాదె?
యదిగాన కంధసన్యాసి భుజించి । మదిఁగుందె నంత గోమయ మింతయయ్యె
నిది తినుమని దాని నీడిచి తెచ్చి । కొదుకక యమభటుల్ కొట్టనున్నారు
నింకమీఁదట నన్న నేణాక్షివదన । పంకజం బీక్షించి బ్రాహ్మణుం డనియె
నిప్పేడకుప్ప లింకెటువలె సమయు? । నప్పాప మణఁగు నుపాయ మేలాగు?
నెఱిఁగింపవే! దాఁచనేల నీకరుణ । గురుపుత్రి సుగతి చేకొని యేగుఁగాక
యనిన లేనవ్వుతో నక్కాంత పలికె । ననఘ! దైవతరహస్యము లడిగెదవు
అడుగ నీకునుదగ దదితెల్ప నాకుఁ । గడు హానిపదమగు కారాని దీవు
దీనత వేఁడగాఁ దెల్పక తీర । దానెలఁత యుపాధు లణఁగిపోవుటకు
నొక యుపాయము గల దూకొందుగాక । నేఁక రేపుమొదలుగా నిందీవరాక్షి

చలువకోక ధరించి సాయంతనమునఁ । జెలఁగి తాంబూలంబు చేత ధరించి
యెవ్వఁ డడ్డంబైన నేమోయి! యనుచు । నవ్వుచు నవ్వాల నడచుచు నొంటి
నొకచోట నిలువక యూరిలో నున్న । సకలజనుల్ వ్యభిచారిణి యనఁగ
నెగ్గులేక చరించెనేని యిప్పెడ । తగ్గిపోఁ దట్టెఁడుతట్టెఁడు దిగిచి
వైతురు నిందించువారి కాభటులు । నాతి నిష్కలుషయై నాకంబు చేరు
మది తగుల్ వొరయక మగలతో నగిన । సుదతి నిశ్చలయౌట సోకదు కీఁడు
నీరహస్యము దెల్పుమీవు నీగురునిఁ । జేరి యంచు గణించి చెచ్చెర నతని
నురువిమానస్థు నయ్యూరిలో డించి । సురకన్య తానున్నచోటికిఁ జనియె
మరునాఁడుగురున కమ్మహిమముల్ దెలిపి । గురుపుత్రి నూరిలోఁ గ్రుమ్మరఁబనుప
నద్దేవశర్మ వాక్యప్రకారమునఁ । బ్రొద్దుగ్రుంకిన నీటుపూని యవ్విధవ
యూరెల్లఁ దిరుఁగ నయ్యో! గురుపుత్రి । యీరీతిఁ జెడిపోయెనే యని కన్న
వారెల్లఁ దూషింప వడిసె నానాఁటి । కారాసులౌ గోమయం బద్భుతముగ
నంత సంయమనీపురాధీశుఁడైన । యంతకుఁ డొక్కనాఁ డాత్రోవ వచ్చి
కోటవాకిటఁ బేడకుప్పలు గాన । కాటోపమున దండహస్తుఁడై గణికుఁ
బరికించి పేడకుప్పలు గాన వేమి? । యెఱిఁగింపుమనిన వాఁడిట్లని పలికె
దేవ! గంధర్వపుత్రిక హేమరేఖ । దేవశర్మాఖ్యుఁడౌ ద్విజునిఁ బెండ్లాడి
తన విమానంబుమీఁదనె వాని నుంచి । కొని దేవలోకముల్ కొదుకక చూపి
యీలోక మంతయు నీక్షింపఁ జేసి । యాలోలమతి వాని యాచార్యపుత్రి
కొఱకు దాఁచిన పేడకుప్ప లడంగు । వెరవు దెల్పఁగ నిది విధవ పాల్గాక
నయ్యూరిప్రజల పాలయ్యె నటన్న । గయ్యాళి యిది యెంత కార్యంబు చేసెఁ
జూచితే! యని యర్కసూనుఁ డారక్త । లోచనుండై మును ల్సుభటులు గొలువ
నమరేంద్రు కడకేగి యంజలిచేసి । కమలాక్షీ కనకరేఖానామ భామ
చిత్రరథాత్మజ చేసిన యవ్వి । చిత్రకృత్యంబును జెప్పిన నలిఁగి
యాచిత్రరథుఁ బిల్చి యగభేది పలికె । నీచస్వభావవై నీకన్నపట్టి
యొకద్విజుఁ జేపట్టి యూర్ధ్వలోకముల । సకలదైవతరహస్యములును దెలిపి
చెప్పినదట యదిచేసిన యట్టి । తప్పు దలంచినఁ దాళదుమనసు
జడగతి సప్తయోజనదీర్ఘశిఖరి । యడుగునఁ బాషాణమై యుండుఁగాక

ఇంకిటనని శాపమిచ్చినఁ దాప । మంకురింపఁగఁ గంపితాత్ముఁడై యతఁడు
నా నిలింపాధీశు నడుగులఁ గెరఁగి । దీనుఁడై ప్రార్థించి దేవ! నాసుతకు
శాపమోక్షంబు ప్రసాదింప వలదె? । చేపట్టి తుద వీడఁజెల్లునే! యనినఁ
బాకశాసనుఁడను బలుప్రయత్నమున । నాకొండ భేదించి యందలిశిలలఁ
బ్రాకారగోపుర ప్రాసాదతతుల । నేకదీర్ఘికలు సేయించి యాక్రిందఁ
గనుపించు రాతి లింగమొనర్ప నందు । జనియించు నీపుత్రి స్వస్వరూపమున
నని యింద్రుఁడాడిన నచ్చిత్రరథుఁడు । తనకుమారిక కవ్విధం బెఱింగించి
దేవశర్మములీవు ద్విజనకుఁ దెలుపఁ।గావచ్చె నియ్యార్తి గడద్రోయ వశమె?
యైన నొక్కఁయుపాయ మావిప్రసుతుని । తో నీవుచెప్పి వైద్యుని వేషమూని
చిత్రపురంబేలు చిత్రధ్వజాఖ్య । ధాత్రీకళత్రు చెంతకుఁ బంపు మనుచు
నొక్క మందులసంచి యొసఁగి కుమారి।నక్కున గదియించి యడలుచుఁ బనిచె
ననిచినఁ గనుదోయి నశ్రువుల్ వారఁగ । గనకరేఖ ద్విజన్మకడకు నారాత్రి
యరుదెంచి బాష్పధారావళి నతని । చరణముల్ గడుగుచు జంభాసురారి
శాపమిచ్చినకథ సకలంబు దెలిపి । తాపంబుచెంద నతండు ధైర్యంబు
వదలక గంధర్వవనిత కిట్లనియె । మదిరాక్షి! నీవేల మదిని గుందెదవు
మాగురుస్వామి కీమాట విన్పించి । వేగంబె దేవతావిభుని రప్పించి
నీశాపమణఁగించు నేర్పు సంధింతు । నీశ వాణీశ లక్ష్మీశుల నైన
ఘనమంత్రశక్తి నాకర్షింపనోపు । ననఘుండు మద్గురుండన నింతి పలికె
నాపని గావింపుఁడది వలదనను । నీపాలి కనుపుచు నేఁడు మాతండ్రి
యెఱిఁగించిన యుపాయ మేర్పడ వినుము । సరగఁ గరూశదేశంబున కేగి
చిత్రపురంబేలు క్షితినాథు పద్మ । పత్రాక్షి గుల్మంబుఁ బాపఁగా నోపు
నౌషధంబుల సంచి యమర ధరించి । భైషజ్య మొనరించుపని యావహించి
వైద్యవేషమున నవ్వసుధేశుఁ గాంచి । యుద్యదౌషధశక్తి నువిదరోగంబుఁ
బాపెద నిక్కొండ బ్రద్దలుచేసి । గోపుర ప్రాకారకోటి గట్టించి
శివలింగమాక్రింది శిలను సేయింప । నవునె? నీచే నని యతఁ డాడంబడిన
నానొప్పి యప్పరమౌషధశక్తి । మానుపు మని చెప్పి మందుల సంచి
యాయనకొప్పించిహానాథ! నిన్నుఁ। బాయఁజేసెనెవిధిపగయాళి(?) (పగఁబూని) యనుచు

వెక్కివెక్కి యేడ్చుచు విభుఁ బాసి పోఁ।యక్కట! కొండఱాయె యుండె నంత
దైవ మించుక దయ దప్పినఁ బాసి। పోవకుండుదురె స్త్రీపురుషు లెందైన?
నానాతి యీరీతి నరిగిన భీతిఁ। బ్రాణేశ్వరి! యెడఁబాసితే నన్ను
నినుఁగాన కెటువలె నే నిర్వహింతు।నినుఁ బాసి యేలాగు నిలుచుఁ బ్రాణములు
నని దేవశర్మ దుఃఖాతురుం డగుచుఁ। జని తనగురున కాశాపక్రమంబు
వినిపించి వగచిన వెత చెంద నేల?। ననిమిషపతిశాప మతిశీఘ్ర గతిని
దీర్చి వేసెదఁ జనుదెమ్ము నావెంట। నర్చింత మింద్రుని నాత్మాంబుజమునఁ
గాళిందిదరి కని కదలి ప్రభాత। వేళ నన్నదిఁ గ్రుంకి విహితసత్క్రియలు
నపుడ యొనర్చి జంభారిమంత్రంబు। జపియింపు మని దేవశర్మకు నొడివె
నామంత్ర మతఁడు మధ్యాహ్నంబు దాఁక। నేమంబు భక్తియు నెరయ జపింప
దివిజాధినాథుఁ డెంతేఁ బ్రీతి నిక్క। దేవులనీలని నెక్కి చెచ్చెర వచ్చి
యాయనమ్రోలఁ బ్రత్యక్షమై నిలిచి। నీయభష్టము దెల్పు నెరవేర్తు ననిన
వడి లేచి సాష్టాంగ వందనత్రయము। కడుభక్తి నొనరించి కరములు మొగిచి
యా విప్రవరసూనుఁ డభినుతుల్ చేసి। యో విశ్వజనరక్షణోపాయదక్ష!
నాపాలఁ గలిగి గంధర్వకుమారి। శాపంబు దీర్పవే సరగున ననిన
వజ్రాయుధుఁడు పల్కె వసుధామరేంద్ర!। వజ్రతీక్ష్ణత కాసివారి టంకముల
నిలిపెద గిరిశిలానికరంబు లెల్లఁ। బలు తునకలగు దానఁ బదిరెండు నెలలు
గోపురప్రాకారకోటులు కొలఁకు। లాపిమ్మటన్ విను మైదేండ్ల కగును
భవలింగ మెనసి సప్తమవత్సరమున। నువిద వెల్వడివచ్చు నుజ్జ్వలాకృతిని
సతి నీకుఁ దెల్పిన చందాన వైద్య। గతిని బ్రయత్నంబు గావింపు మనుచుఁ
దెలిపి యంతర్ధి చెందిన దేవశర్మ। యలరుచు గురువుల యనుమతి వడసి
రత్నకుండల మురురత్నహారములు। రత్నాంగుళీయక రాజిధరించి
నిలువుటంగి ధరించి నెమ్మె నెసంగ। కళుకుబంగరుపట్టు కబ్బాయి దొడిగి
మిహి బురుసాపాగ మీఁద నెంతేని। రహి ముత్తియంపుఁ దురాయి రాణింప
మంచి సూర్యపుటంపు మందుల సంచి।యుంచిన నడికట్టు హొయలు మీఱంగ
గొడుగువాఁడును భటుల్ గుఱ్ఱంబు వెంట। నెడఁబాయ కేతేర నడపంబువాఁడు
గొనబుపావడవాఁడు కుంచియవాఁడు। గునుకుపదువ్వన రాఁగ గొబ్బునఁ బోయి

చిత్రకేతుని పూజ చెంది కూర్చుండి । ధాత్రీశ! యభినవధన్వంతరి యనఁ
బరగు వైద్యుఁడ క్షయాపస్మారకుష్ఠ । శరదప్రభంజన జంఝానిలుండ
జ్వరతాపగుల్మాద్రి శతకోటి యందు । రెుఁగము నాచేత నింపొందు మందు
నీకాంతగుల్మంబు నెలలోనఁ దీర్తుఁ । జేకొని నాపూన్కి చెల్లింపఁ గలవె?
యని సప్తయోజనాయతశైలభేద । మును గుళ్లు గోపురంబు లొనర్చిపనులు
శివలింగము ప్రతిష్ఠసేయు కార్యంబు । వివరింప నతఁడొప్పి వేడ్క నిట్లనియె
నో వైద్యకులచంద్ర! యోదయాసాంద్ర! । యీవు సెప్పిన పనులెల్లఁ జేసెదను
సగము రాజ్యంబు నొసంగెద నీకు । మగువరోగము మాన్చి మావెత దీర్చ
ఖ్యాతియు నందునఁ గలిగెదు ననిన । నాతనినాతికి నౌషధం బిచ్చి
పదునైదుదినములఁ బాపె రోగంబు । మది నుబ్బి సగము సామ్రాజ్యంబుతోడఁ
జతురంగబలముతో సగఁబాలు నిచ్చి । క్షితిపతి యావైద్యసింహుఁ డన్నట్లు
ధరఁ గాసివారి సందటిఁ బిలిపించి! దొరకొని యక్కొండఁ దొలుచఁ బంచుటయు
ధరవైరి తరవారి ధారానిశాత । తర భూరిటంక ప్రతాన నిర్దళిత
శిఖరి శిలాకోటిచే విష్ణుశంభు । ముఖ దేవతాగృహంబులు గట్టి రంత
నాఱేండ్ల కాశిల్పు లటులద్రిఁ గొట్టి । యూరూరఁ గోవెల లురుగోపురములు
కడు నేర్పున సృజించి కడనెట్టనైన । యదుగుజాత నొనర్చి రభవలింగంబు
నాలింగ మద్రికన్యామణికృత దృ । ఢాలింగ మొక హరువౌ దేవళమున
నుంచి పూజలు సేయుచున్న నందుఁడి । కాంచనరేఖాఖ్య గంధర్వకన్య
చంచలానిభతనూచ్ఛాయ వెల్వడియెఁ।బంచాస్త్రి మోహనబాణమో!యనఁగ
హరుజటాచ్ఛటలకెం పధరాధరమునఁ । బరమేశు నెలరేకు బాగు నెన్నుదుట
రుద్రగాంగతరంగరూపంబు వళుల । నద్రిజామాతృకంఠాభ వేనలిని
భవహ స్తహరిణ విభ్రమము చూపులను । శివుహారవల్లికాశ్రీ రోమరాజి
శూలివామేక్షణస్ఫురణ మోమునఁ గ । పాలిపాండుర దేహప్రభ లేనగవున
సంధిల్ల శివవిలాసములతో నిటుల । గంధర్వకామిని గానిపించుటయు
విరహాగ్నిఁ దపియించు విప్రనందనుఁడు । పరితోషవార్ధిలోపల నోలలాడె
కాంతుని దర్శించి గంధర్వసతియుఁ । గంతుతాపమునకుఁ గడచీటిఁ బంపి
చిత్రరథాదులు సేవింప నపుడు । సుత్రాముఁ డరుదెంచె సురల సన్నిధికి

పరమోత్సవమున నాబ్రహ్మవంశ్యునకు । మరలఁ బెండ్లి యొనర్చె మానినీమణిని
చిత్రకేతునృపాలశేఖరుం డాత్మ । పుత్రియగు సురుచి నప్పుడె పెండ్లి చేసె
బలభేదికరుణచే బహుభోగభాగ్య । కలితుఁడై కనకరేఖయు సురుచియును
బరిచర్యలొనరింప బ్రాహ్మణోత్తముఁడు।చిరకాలము సుఖించె సిరు లుల్లసిల్లఁ
గావునఁ బతిభక్తిగల సతిమణుల । కేవెఱపులు గల్గ వీప్సితం బొదవు
నీకథ వినువారి కెల్లసంపదలు । చేకుఱు శివుకృపాంచితదృష్టి ననుచుఁ
జిలుక తెల్పె నటంచు శివుఁడన గౌరి । యలరి యవ్వలికథ యానతిం డనియె
పరమపతివ్రతాచరితమ్ముం దిరువ । దాఱవకథ యిది యమరోక్తి నమరె
ననుచు సూతుఁడు శౌనకాదిమానులకు । వినిపించె నీకథావృత్తాంత మెల్ల

---

## లోపాముద్రకథ

శ్రీ విశ్వపతి సమంచితసూక్తి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁ దొడఁగె
నలినాక్షి! విను మరునాఁటి సాయమున । నలదూతితోడ నైశ్యాంగన వచ్చి
చెంగట నిలిచినఁ జిలుక యిట్లనియె । బంగారుపీటపైఁ బడఁతి కూర్చుండు
దూతికతో నీవు తొంటి పతివ్రతా ! తాతిలకముల కథల్ వింటి గాదె?
యింక నొక్కటి వచియింతు నాలింపు।మంకించి పేరొ్కన్ననది పాపహరము
అనఘ! మిత్రావరుణామోఘతేజ । మున కలశంబున మున్ను జన్మించి
బ్రహ్మచర్యమునఁ దపంబు గావించె । బ్రహ్మవర్చస ముట్టిపడ నగస్త్యుండు
దివినుండి వచ్చిన దివ్యునిఁ జూచి । శతపలాశిత మాన్చి సౌఖ్యం బొసంగె
కాలకేయాది రాక్షసుల కిమ్మైన । యాలవణాబ్ధి నీరెల్లఁ దాఁ గ్రోలె
మత్తుఁడై తనకవమానం బొనర్చు । క్రొత్తవేలుపురాజు క్రొవ్వు వారించె
నామునిమహిమ లెన్నైననను గలవు । భామిని పెక్కేండ్లు పరిణయాపేక్ష
చెందక వైరాగ్యశీలుఁడై భూమి । యందెల్లఁ దిరుగుచు నంతొక్కనాఁడు
అడవియొక్కటి చొచ్చి యానట్టనడుమ । పడియఁ బండొక్కటి పరికించి చేరి

తొంగిచూచిన నందధోముఖులై కృ । శాంగులై గరికవేళ్లమరఁ బట్టికొని
వ్రేలుచుండెడి తపోవృద్ధులఁ జూచి । యేల తపించెద? రిది యేటితపము?
నాకిది తెలుపుం డొనర్తు నేను నన । నాకలశజుఁ జూచి యమ్మును లనిరి
ఇది విను తపముగా దేమియుఁ గాదు । పొదవిన వెత నధోభువనాంతరములు
ప్రాపించు తెరు విది భవ్యాత్మ! మేము । నీపితృవరులము నీవు పెండ్లాడి
పుత్రులఁ గాంచక భూమిఁ ద్రిమ్మరఁగ । మిత్రాత్మజుం డిఁకమీఁద మమ్మెల్ల
నెరయ దుఃఖములు పొందింపఁ దలంచి । పఱతెంచి మూషకభావంబు గాంచి
యేడాది కొక్కవే తెడపకఁ గొఱుకు । నాఁడు నేఁడిటువలె నలఁకువ చెంది
నీతోడఁ దెల్పఁ జింతించి యుండంగ । నేతెంచితివి కోర్కె లీడేర మాకు
నాలస్య మొనరింప కనువైనచోట । బాలికఁ బెండ్లాడు ప్రభవించు సుతుఁడు
అని పితృదేవత లర్థిఁ బ్రార్థింప । వినతుఁడై ఘటనూతి విమలాత్ములార!
మీరు సెప్పినపని మేకొని చేతు । వైరాగ్య మిఁకమీఁద వదలెద ననుచు
వారి వీడ్కొని చని వసుధఁ ద్రిమ్మరుచు । ధారుణీశుల సభాస్థలముల కరిగి
తాను బెండ్లాడఁగాఁ దగుకన్య నడుగ । నేనరేంద్రులు తమయింట లేదనిరి
అంతవిదర్భేశుఁ డగురాజుఁ జేరి । యెంతయు రహిఁ నాతఁడిచ్చు పూజలను
జేకొని కన్యని చ్చినఁ బెండ్లియాడు । నాకాంక్ష వచ్చితి ననఘాత్మ! నీకుఁ
గన్నెయుండిన నిత్తుగా కన్న భక్తి । నన్నరేంద్రుఁడు పల్కె నట్టిభాగ్యంబు
గలవాఁడఁగాను నీకరుణచేఁ బుత్రి । గలిగినఁ బెండిలిగావింతు నీకు
ననినఁ గానిమ్మని యతఁ డిష్టి యొకటి । జననేతచేత నాక్షణమ సేయించి
యనలప్రదత్త పాయసము తద్భార్య । కనురక్తి నిచ్చిన నామె చూలయ్యె
నీదేవియందు జన్మించిన కన్య । నాదిసు మ్మని మునినాథుండు చనియె
నవమమాసమున నందన నొర్తుఁ గనియె । ధవళాయతాక్షి విదర్భేశురాణి
యటులఁ బుట్టిన పట్టి శాకాశవాణి । పటుగుణోన్నిద్ర లోపాముద్ర యనుచు
నామధేయ మొనర్ప నవమోహనాంగి । యాముద్దుకన్య నిజాంబ పోషింప
సవరొందె శుద్ధపక్ష సుధాంశురేఖ । సవతున నానాఁట సత్కళల్ హెచ్చ
శైశవంబు క్రమించ జవ్వనం బొదవె । నాశశిముఖి, కగస్త్యమునీంద్రుఁ డలరె
నిరులు తుమ్మెదగరు లింద్రనీలముల । సరులు గాఁబోలు నీజ్వనికురులు

నెలరేక బలుజోకనిరసించు దీని । యళికంబు భళి! కంబు వౌర! కంఠంబు
బెళుకుమాడుచుఁ గదా బెళుకు బేడిసలఁ । గలకంఠి జళుకు వాల్గన్నుల డాలు
నుదిరిబంగరునక్కు లువిదలేఁజెక్కు । లదిర! పూర్ణేందుసోయగ మోము మోము
చివురుఁదీవి హసించుఁ జెంగావి మోవి । కవజక్కవల లెక్క గడచు చందోయి
నలచీమపరి మీఁజు నాతినూఁగారు । కలదో లేదో కాని కనరాదుకౌను
ప్రతిబింబ ముర్వికి భామనితంబ । మతివపెందొడలు హొన్ననఁటుల తడలు
రాయంచనడల నౌరా! యెంచ దింతి । యీయాననవైఖరి యెందైనఁ గలదె!
అని కనుగొన్నవా రభినుతి సేయ । మనసిజ ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మివలె
నాయతగుణరాశియై మించె నిందు । పాయంపుకలిమి లోపాముద్రయపుడు
ఘటజాన కలికి యాకలికి నిమ్మనుచు । నట రాజులెవ్వరు నడుగ రారైరి
కాంత యీడేరుట గస్త్యుండు నెఱిఁగి । సంతసించి విదర్భజనపతిఁ జేరి
యతనిపూజలఁ దృప్తుఁడై యిట్టు లనియె । క్షితినాథ! నీపుత్రి శృంగారధాత్రి
యీడేరినపుడె మాకిచ్చెద నంటి । వీడేరెఁగద పెండ్లి యిఁకఁ జేయఁదలఁతె
పలుకరే బుధులు శుభస్యశీఘ్రమని । మలయజగంధికి మాకు నీరాత్రి
గావింపు పెండ్లి లగ్నము మంచి దనిన । నావిదర్భాధీశుఁ డాత్మఁ జింతిలుచు
నంతఃపురంబున కరిగి పట్టంపు । టింతినిఁ బిలిపించి యిట్లని పలికె
కలశజుం డేతెంచి కన్నెనిమ్మనుచు । బలవంత మగుతమిఁ బలుకుచున్నాఁడు
ఎటువలె నొసఁగుదు నీపువ్వుబోఁణి । జటిలున కిచ్చిన సౌఖ్యముల్ గలవె?
అంటినఁ గందు నియ్యతివమే నితని । వెంట నెట్లు చరించు విపినభూములను
మేలి రాజాన్నముల్ మెసనెడు ముద్దు । రాలెట్లు కందమూలాదులు మెక్కుఁ
గనకాంబరంబులు గట్టులతాంగి । వనట వల్కలము లేవగ ధరియించు
నీపంకజానన నీమోహనాంగి । నీపల్లవాధర నీమంజువాణి
నీపేదతపసికి నీజటాధారి । కేపాలుపున నిత్తు? నియ్యకలే ననిన
శపియించిపోవు నీసంయమీశ్వరుఁడు । తపసికి ముక్కుమీఁదనె కోప మనయు
ననిన నాతనిదేవి యమ్మ నేఁజెల్ల । ముని కిచ్చు టెట్లు? నాముద్దుకుమారి
నిప్పు డియ్యఁ బొసంగ దింతి నటంచుఁ । జెప్పిరమ్మా! మునిశ్రేష్ఠున కనుచుఁ
బలికెడిపలుకు లోపాముద్ర కెలన । నిలిచి యాలించి తండ్రికి మ్రొక్కి పలికె

యిది యేటియోజన లిపుడు చేసెదరు। మొదట నిచ్చెద నని మునివరుతోడ
నీవు పల్కితివట యెఱుఁగవే! పెండ్లి।గావింపు మనిన నక్కట! బొంకఁ దగునె?
యామహామహుని మహత్త్వంబు వినవె?।యేమికో౽అంత? యీబుషిశేఖరునకు
నత్తపోనిధికి నయ్యా! నేను పూర్వ। దత్తనై వేఁ౽లోకథవునిఁ జెందుదునె?
యతఁడె నాప్రాణేశుఁ డతఁడె నాదైవ। మతని కిప్పుడ వివాహము సేయుఁ డనిన
నయ్య సంతోషించె నంబ మెచ్చికొనె। నయ్యెడ మునిపాలి కరిగి భూవిభుఁడు
అనఘ! కన్యాదాన మాచరించెదను। జనుదెందు లగ్ననిశ్చయము గావించి
యనిన నగస్త్యమహర్షి యారాత్రి। యనుకూలలగ్న మున్నది యనెఁ గనుక
పురము నంతఃపురంబు నలంకరింప। వెరవరులగువారి వేవేగఁ బంచి
తలచుగా శోభనద్రవ్యముల్ గూర్చి। పరమోత్సవ మొనర్చి బంధుల సఖుల
హితుల మంత్రులఁ బురోహితుల రావించి।సుత పెండ్లికూఁతురై సొంపు వహింప
ఘనభూషణాదులఁ గై సేయఁ బంచి। మునికి క్షౌరాభ్యంగములు మజ్జనంబు
నావేళఁ గావింప నలరి యాతఁడు స। మావర్తనాఖ్యహోమం బాచరించి
తనమామ కన్యను దారవోయుటయు। ననురక్తి పాణిగ్రహణము గావించె
స్వకులోచితాచారసరణి నీరీతిఁ। బ్రకటవిభూతి లోపాముద్రఁబెండ్లిఁ
జేసి యల్లునిఁ బూజచేసి రంజిల్లఁ। జేసి కుండినభర్త క్షితిసురాదులకు
ధనకనకాదులు తనియఁగా నిచ్చె। దినములునాలు గీతీరునఁ గడపి
కలశోద్భవుఁడు రాజకన్యకఁ బిలిచి। చెలువ! నావెంట వచ్చెదవేని మేన
నీవుధరించిన నిఖిలభూషణము। లీవేళ సడలించి యింటిలో వైచి
తాటిబొట్టును గమ్మతాటలు దాల్చి। బోఁటి! నావెంటను భోరున రమ్ము
అనిన స్వామిప్రసాద మని యప్పురంధ్రి। తనమేనిసొమ్ము లత్తటి సడలించి
ముని గణించినక్రమంబున నారచీరె।యును బూనె మెడపుస్తెయును వీనుదోయి
మెఱుఁగుకమ్మ లెసంగ మిక్కిలిభక్తి। నెరయఁ దల్లికిని దండ్రికి నెచ్చెలులకుఁ
జెప్పియుఁ జెప్పక చెచ్చెరరాఁగ। నప్పుడంతిని జూచి యతఁ డిట్టు లనియె
నలివేణి! ననుఁ బెండ్లియాడినఫలము। గలిగెఁదోడ్తోడ నేగతినన్న వినుము
చాదుదుకూలముల్ సడలించి నార। చీర గట్టఁగనయ్యె చెలువ! నీకటిని
తొడిగినతొడవులఁ దొడిబడ నవలఁ। బడవైచి నిరుపేదపడుచు చందమునఁ

గరములఁ గాచకంకణములు పుస్తె । యఱుత నల్లలుపూఁన నయ్యోనీకరణి
ఇందున నీడెంద మెంత కుందినదో? । యిందుముఖిమణి! యీసొమ్ము లూని
యింట నుండెదో? వెంట నేగుదెంచెదవో! । జంటగా నీకెద్ది సరిపోవు ననిన
నక్కన్య భయముతో హస్తముల్ మొగిచి। మిక్కిలి మధురోక్తి మించనిట్లనియె
స్వామి! మీపాదదర్శనము సేకుఱిన । నేమియు నేటికి? నీసొమ్ము లేల?
తలిదండ్రు లేల? సందడిసేయు చెలుల । వలన నేమగు నింక వారి నేనొల్ల
మీవెంట వచ్చుటె మిగుల భూషణము । మీవచనము విని మీపనుల్ సేయఁ
గలుగుటె యుభయలోక సుఖప్రదంబు । నెలమి మీ రున్నచోటే త్రిదివంబు
పరమేశ్వరుఁడవు నాపాలికి నీవె । పరికింప నీవె నా ప్రాణబంధుఁడవు
అనిన సంతోషించి యమ్మునీశ్వరుఁడు । తన యత్తమామలఁ దగవొప్పఁ బిలిచి
తపసుల కిండ్లలోఁ దగదు వర్తింప । విపరీతమై తోఁచు వెలఁదిఁ దోడుకొని
యడవికి నేగెద మాత్మజఁ దలఁచి । యడలకుఁ డని వారియార్తి వారించి
పురి వెలువడి దూరముగ నేగి యచట । నిరుత్రోవ వీక్షించి యింతి కిట్లనియె
నలివేణి! యీత్రోవ నరిగినఁ గరులు। పులులెలుంగులు సింహములు ముళ్లు రాళ్లు
గలవు కార్చిచ్చుకాకలు హెచ్చి యుండు । నలయిక జనియించు నతిదుర్గమంబు
ఎలనాగ! యిటు చూడు మీత్రోవఁ జనినఁ। జలువలు వెదఁజల్లు చల్ల తెమ్మెరలు
పూఁచి కాఁచి ఫలించి పొదలు వృక్షములు । నేచక్కిఁ జూచిన నింపావహించు
పన్నీటి కాల్వలు పచ్చకప్పురపుఁ । దిన్నెలు కిన్నరస్త్రీ వితానముల
తానముల్ గానముల్ దగు నివ్విధమున । మానక పోదమా మఱి తొల్త నేను
చెప్పినత్రోవనె చెలువ! పోవుదమొ । యిప్పథద్వయి నేది యిష్టంబు నీకుఁ
దెలుపవే! యనిన నద్దేవి యిట్లనియె । నలఘు తపస్యామహాత్త్వ నిధాన
యీత్రోవలందు మీ కేది యభీష్ట। మాత్రోవఁ జనుఁడు నన్నడుగ నేమిటికి?
స్వామివారరుగుత్రోవయె సత్పథంబు । నా మునినాథుండు నగుచు నందొక్క
సరసపథంబునఁ జని పూర్వదిశను । గరము రంగారు గంగాద్వార మొనసి
యందుఁ దపోనిష్ఠ నచలుఁడై యుండె । సుందరి యలయక శుశ్రూష సలుప
నాయమ మృదుభాష లామెశుశ్రూష । లాయమ్మపతిభక్తి యలవియె పొగడ
నీరీతిఁ బెక్కేఁడు లేకాగ్రనియతి । ఘోరతపంబు గైకొని చేసిచేసి

చాలించి యొకవేళ సన్నిధి నున్న । నాలేమ నవయౌవనాస్థానసీమఁ
గనుగొనియామె మెఱుగుచక్కఁదనము।నునుమోముహాళువుకన్నులబెళుకుమురువు
కప్పుదేఱెడి కొప్పు గబ్బిపాలిండ్ల । యొప్పు సన్నపుఁగౌను హొన్జాయ మేను
దళుకుచెక్కుల టెక్కు తన కనురాగ । విలసనం బొనగూర్ప వెడవింటివాని
బారికిఁ జిక్కి విభ్రాంతుఁడై సొక్కి । హేరాళ మగుతమి నిట్లని తలఁచెఁ
గనికరంబున దీనిఁ గౌఁగిటఁ జేర్పఁ । జనుదోయి నాయురస్థ్సలిఁ గ్రుమ్మదేమొ?
చిక్కించికొని దీని చెక్కిలి నొక్క । చక్కెరలొలుక ముచ్చటలాడదేమొ ?
మొనపంట దీనికెమ్మోవి నొక్కినను । గనుఁగవ మొగిచి సీత్కారమ్ము లెసఁగ
నా యెదసై వ్రాలి నను రతిఁదేల్చి । యీయెడఁ దగుబాళి నేలుకోదేమొ?
అని యెంచి వైదర్భిహస్తంబుఁ బట్టి । కొనిన నచ్చెలి మానికోరిక యెఱిఁగి
కరములు ముకుళించి కడుభక్తిఁ బలికె । వెఱచి వచింతునో వెఱవక మీకు
విన్నవింతునో? సద్వివేకనిధాన? । యున్నది మది కోర్కి యొక్కటి వినుఁడు
కృతకాచలమ్ములు కేళికాగృహము । లతులసౌధములు లే వాభరణములు
చారుదుకూలముల్ స్రక్చందనాది । సౌరభ్యములు లేవు సఖులును లేరు
తగు హంసతూలికాతల్పముల్ లేవు । సొగసువింజామరల్ సురటీలు లేవు
భజియించుటకునొక్కభటుఁడును లేఁడు। భుజియించుటకుభక్ష్యభోజ్యముల్ లేవు
ఎట్టుల సౌఖ్యమౌ నీనారచీరఁ । గట్టి జటీభూతకైశిక నగుచు
నేపోదుములు లేక హృదయేశ! మిమ్ము । నీపర్ణశాలలో నెనసి క్రీడింప
నిది మీకు సరిపోవునేని మేకొనుఁడు । మది నాకుఁ దోఁచినమాట తెల్పితిని
అదిగాక భువనమోహనమూర్తి దాల్చి । సదమలవస్త్ర భూషణ గంధమాల్య
ధారివై రత్నసౌధముల నన్గూడి । భూరిభోగమ్ములు పొందుట లెస్స
యీముచ్చటలు దీర్చు టెచ్చుగా దరయ।మీమహిమ కటంచు మొలఁతుక దెలుప
నాముగ్ధకోరిక లాలించి నగుచు । ధీమంతుఁ డామునితిలక మిట్లనియె
చెలువ! నీయిష్టార్థసిద్ధి గావింపఁ । దలఁచిన నాతపోధనము వ్యయంబు
సేయఁగావలయుఁ గించిదోభోగములకు । నాయాసపడి చేసినట్టి తపంబు
వ్యయ మెట్టుగావింతు వనజాక్షి! విషయ । చయవాంఛ వదలిన జటిలుఁడ నేను
నైన నీకోరినయటులఁ గావింతు । నేను యాచనచేసి యిలయెల్లఁ దిరిగి

నందాఁక యుందుండు మని ముని పతులఁ । గొందఱితోఁడుగాఁ గోమలి నునిచి
సతిబుత్రుకాలంబు చనకముందరనె । యతివేగమున వత్తు ననునిశ్చయమున
యాచనగావింపనరిగె కుంభజుఁడు । భూచక్రమున ఘనంబుగ ధనంబున్న
యవనీశు లెవ్వరో యని వెదకుచును । శివశివ! యెంతలేసి మహాత్ములకును
నడుగఁగావలసె నర్థార్జనాపేక్ష । విడువశక్యమె? తక్కు విషయాతురులను
నిటుల నగస్త్యి యనేకభూములకుఁ । బటుగతిఁ జని శ్రుతపర్వుఁడన్ రాజుఁ
గని రాకవకు నీకు గ్రాస మేడాది । కినిగల్గఁ జూచి మిగిలియున్న ధనము
మాకొసంగు మటన్న మహీనాథుఁ డనియె । మీకేల నిచ్చోట మిగిలిన నేమి
మిగులకుండిన నేమి మీకుఁ గాంక్షింప । నగు ధనంబిచ్చెద నదిగొని చనుఁడు
నావిని యమ్మునినాథుఁ డిట్లనియెఁ । గావలయు ధనంబు కక్కుర్తిఁ జేసి
కొనిపోవరాదు నీకుఁ గలంతధనము । వినుగణికులఁ బిల్చి వివరింపుమనినఁ
గరణంబు లనిరి బొక్కసమున ధనము । పరికింప నున్నది పదిమాసములకుఁ
జాలదుకొదువమాసంబుల కనిన । నా లేనిదొరవుగా వీలేనినిన్ను
వేధింపరాదు నావెంటనె రమ్ము । సాధుపీడ యొనర్పఁ జన దని యతఁడు
నతనితోఁ దద్రస్యుఁడను రాజుఁ జేరి । శ్రుతపర్వు నడిగినచొప్పున నడుగ
మానీంద్ర! తొమ్మిదిమాసంబులకును । నానిలయమున నున్నది ధనం బనిన
నీవు దరిద్రుండ వేమియిచ్చెదని । యావసుధేశుండు ననుచరుం డగుచుఁ
గొలిచిరా ముని పురుకుత్సకుమారు । నిలయంబుఁ జేరి యానృపుల నిర్వురను
నడిగిన ట్లాతని నడుగ బొక్కసముఁ । జడవి యేడాదికి ధనము లేదనఘ!
యొక నెల కొదువగా నున్న దటన్న । పకపకనగి ఘటప్రభవుండు వారి
ముప్వురఁ గని ధనంబు సమగ్రముగను । నెవ్వనికున్నది యెఱిఁగింపుఁ డనిన
స్వామి! వాతాపియిల్వలుఁ డను దైత్యు । లీమణిమత్పురం బేలుచున్నారు
వారు మహాధనవంతులు వారిఁ । జేరిన నిష్టార్థసిద్ధియౌ మీకు
ననిన సంతోషించి యానృపుల్ వెంటఁ । జను దేర దనుజుల సదనంబునకును
ఘటజూతి పోయినఁ గని వార లలరి । పటుభక్తి నర్ఘ్యంబు పాద్యంబు నొసఁగి
యయ్య! యిప్పుడు విందవై వచ్చినాఁడ । వియ్యిల్వలాధిపులతో నీవు మాయింట
భోజనం బొనరించి పొసఁగ వచ్చినప్రయోజనంబు గణించి యొనగూర్చికొనుము

అనిన భోజనమున కమ్మునిఁ బొప్పి । కొనియె వాతాపిని గొఱ్ఱెను జేసి
యటువంగా మెడఁ గోసి యయ్యిల్వలుండు।పరిపక్వముగ వండె భక్ష్యభోజ్యముల
తోడ నమ్మాంసంబు దొర లదియెఱిఁగి । వీఁడు దుర్మార్గుండు విందులు చెప్పి
వాతాపి వేఁటగా వధియించి విప్ర । జాతులకిడి వారిఁ జంపి యాపొలసు
తమ్ముఁడు దానును దగిలి భక్షించు । నమ్మరా దీభోజనము మాని వీని
నడిగి వీఁడిచ్చు మహార్థంబు గొనుచుఁ । గడువేడ్కఁ బోదము కటకంబులకును
నావిని వాతాపి నన్నేమిసేయు । నో వీఁడు సేయు దంభోపాయవిధులు
నూతము సైచు డంచు నగస్తి పలికి । వాతాపిమాంస మిల్వలుఁడు వడ్డింప
భోజ్యముల్ బహుభక్ష్యములుచోష్యములుగ।నాజ్యధారలతోడనశనంబుగొనియె
నారగించి సుతుష్టుఁడై యగస్త్యుండు । వారిధారలఁ గరద్వయి వార్చి యొక్క
వేదిపైఁ గూర్చున్న వేస నిల్వలాఖ్యుఁ । డౌదానవుం డామహాత్ముని మహిమ
యెఱుఁగక వాతాపి యేగుదె మన్కినఁ । జఱునవ్వుతో మహర్షిప్రవరుండు
తనపొట్ట నివిరి వాతాపి జీర్ణించె । నని త్రేన్చి జఠరాగ్ని కాహుతి చేసె
నిల్వలుం డదియెల్ల నెఱిఁగి భీతిల్లి । నిల్వరా దితని సన్నిధి నగ్గెనేని
దగ్ధంబు సేయు నెంతటివాని నైన । స్నిగ్ధతేజుఁ డటంచుఁ జేతులు మొగిచి
స్వామివా రిచటికి వచ్చిన కార్య । మేమి? సత్కృప నానతియ్యవే! యనిన
వానితో నమ్మునివల్లభుం డనియె । నీనరేంద్రులు ధనహీనులు వీరి
ధనికులఁ జేయుము తరువాత మాకు । ధనకనకాది వస్త్రవిభూషణములు
తఱచుగా నిమ్మన్న దైత్యుండు పసిఁడి । యరదంబు బహుధనం బమ్మునికిచ్చె
నతఁడు తెల్పినయట్టు లవనీశ్వరులకు । విదితార్థరాసులు వేర్వేఱ నొసఁగె
మణులు భూషణములు మహితాంబరములు।గణనీయవస్తువుల్ గైకొని మాని
యాముద్వురు నృపాలు రతిభక్తిఁ గొలిచి । రా మణిస్యందనరాజంబు నెక్కి
వైదర్భి యుండెడి వనము ప్రాపించె । నాదొరల్ వివిధహర్మ్యములు సౌధములు
పటసాలలు విచిత్రభవనముల్ గట్టు । నటులఁ జేసి మనోహరాంగసంగతులఁ
జెలులవేవేల నిచ్చిరివి దర్భేశుఁ । డలకుమారికి వివిధాభరణములు
చిత్రాంబరములు నెచ్చెలుల నొసంగె । ధాత్రీశు లేగిరి తమ దేశములకు
మతి దలంచినయట్ల మహితసంపదలు । పతి యిట్లమర్ప లోపాముద్ర యలరి

తోడి కట్టి పూసి యొంతో ప్రకాశింప । జడదారి తద్దృగుత్సవమూర్తి దాల్చె
నింతితోఁ గేళికా గృహములయందు । మంతనంబునఁ బైఁడి మాడువులందు
శృంగారవనులందుఁ జిత్రబంధముల । నంగజప్రాజ్యరాజ్యము మాని యేలె
నందున గర్భిణియై సంతసమున । సుందరి వెయ్యేండ్లు చూలు ధరించి
కనియెఁ గృతాత్ముఁడన్ ఘనపుత్రునొకనిఁ । దనరనాతఁడును వేదములు శాస్త్రములు
తల్లిగర్భమునందె తా నభ్యసించి । ముల్లోకములఁ గీర్తి మొనయ రాణించె
నతనికిఁ దేజస్వి యనుపట్టి వాడమె । పితరులు సద్గతుల్ బెరసి రందునను
వెలఁది లోపాముద్ర వెంబడిరాఁగ । నల మాని వింధ్యాద్రి నడఁగిపోఁ ద్రొక్కఁ
దరుణి పతివ్రతాధర్మంబువలన । మెరసెఁ ద్రైలోక్యంబు మెచ్చ నమ్మౌని
తపసి కీలేమని తలిదండ్రులనఁగఁ । గుపితయై వారించి కుంభసంభవునిఁ
జెట్టబట్టంగ నోచిన పతివ్రతల । పట్టంపుఁదల్లినిఁ బ్రణుతింపఁ దగదె ?
యిట్టి లోపాముద్ర హితగుణోన్నిద్రఁ । దొట్టినభక్తితో స్తోత్రంబుసేయు
వారికిఁ దత్కథ వర్ణించువారి । కారోగ్యభోగభాగ్యములు సిద్ధించు
నని చిల్క తెల్పిన నవ్వైశ్యకాంత । తనువల్లి పులకింపఁ దనయింట్ కరిగె
చిలుక నెంచుచు దూతి క్షితిపతిఁ జేరి । తెలిపె నక్కథ సుధాధికమృదూక్తులను
అని శంభుఁడెఱిఁగింప నవ్వాలికథలు । వినిపింపు మని గౌరి వెండియు నడిగె
ననయ పతివ్రతాచరితమం దిఱువ । దెనిమిదియవకథ హితసూక్తి నమరె

---

## కేయూరబాహుని కథ

శ్రీ విశ్వపతి సమంచితమతి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁ దొడఁగె
దూతితో మఱునాఁడు తోడఁబుట్టుజాతి । నాతి చేరినఁ గేరి నగి కీర మనియె
పుష్పమంజరి! దుష్టబుద్ధులౌ చెలులు । దుష్పురుషులు తప్పుత్రోవఁ జూపినను
ఆత్రోవఁ జనరు మహాపతివ్రతలు । స్తోత్రపాత్రచరిత్ర ధూర్వహలగుట
ఇందుల కొకకథ యెఱిఁగింతు వినుము । మందారమకరంద మాధుర్యధుర్య
ధారాళ వాక్చమత్కార మింపూర । సౌరపూరుజ్జ్వలసౌభాగ్య మహిమ

సవరొ త్రిగర్తదేశమున శృంగార । భవనమన్ పురము భూభామనూపురము
నాపురవర మేలు నహితభూపప్ర । తాప దావానలతాప నిర్వారణ
దారుణ శరవర్ష ధారాధరుండు । భూరిషేణుం డను పుణ్యమానసుఁడు
ఆరాజవర్యు భార్యామణి యగుచుఁ । జాసుశీలానామసాధ్వి రాణించు
నతనిచెంత సుకీర్తి యనుమంత్రి గలఁడు । చతురబుద్ధి వివేకసౌజన్యధనుఁడు
ఆమంత్రితోఁ గూడి యఖిలభూప్రజల । సౌమనస్యంబున సతతంబు ప్రోచుఁ
దనయాజ్ఞ విమతు లౌదలఁ దాల్ప విశ్రు । త నయాప్తి వెలయు నద్ధరణీశ్వరుండు
తనయులు లేకున్కి తహతహ చెంద । మనుజేశుఁ జూచి తన్మంత్రి యిట్లనియె
మనయూరి కాళికాంబను గొల్వ మిచ్చు । ఘనుఁడైన తనయుని గాంభీర్యధనుని
ననిన మంచిది యని యారాజవరుఁడు । దినదిన మమ్మహాదేవిఁ బూజింపఁ
గలలోన నొకనాఁడు కాళికాదేవి । యలరాజమణికిఁ బ్రత్యక్షమై యొక్క
యాణిముత్య మొసంగి యధిప నీకూర్మి । రాణిగర్భమున నీరత్నంబుఁబోలు
పట్టి జనించు నోర్బలశాలి యట్టి । పట్టికిఁ గేయూరబాహుఁ డన్ పేరు
పెట్టి పోషింపుము భీకరాసురులఁ । బట్టి మర్దించు వైభవమున మించు
నిది నిజంబని తిరోహితయైన రాజు । ముద మంది పత్ని కమ్మౌక్తియం బొసఁగె
నది శిరోరత్నమై యమర నద్దేవి । తదనంతరంబునఁ దాల్చె దౌహృదము
గర్భలక్షణములు గని సంతసించె । నర్భకుం డుదయించు ననువేడ్క నృపతి
పదునొకండవనెలఁ బ్రభవించె శుభము । నొదవించు తావులనుండి సురేజ్య
కవిబుధశశిముఖ గ్రహముల్ శుభేక్ష । నవలోకనము సేయునపుడు పుత్రకుఁడు
ఆవేళఁ బుత్రోత్సవాదు లొనర్చి । క్ష్మావరుఁ డానందజలధి నోలాడెఁ
బట్టికిఁ గేయూరబాహుఁడన్ పేరు । పెట్టి శాంభవియాజ్ఞఁ బృథ్వీశ్వరుండు
అతఁడు జన్మించిన యయిదవనాఁడె । ధృతిమంతుఁడగు సుకీర్తికిఁ గుంభి పుట్టె
వాఁడు పుట్టెడువేళ వక్రించి గ్రహము । లేడును రెండు క్రూరేక్ష నీక్షించె
నేఁటఁ బెంచినవాని నెలమితో నొక్క । పూటఁ బెంచిరటన్న పొలుపు దీపింప
దాదు లా రాజనందనునిఁ బోషింపఁ । బ్రోఁది చెందె నతండు పున్నమనాఁడు
కళలచే విలసిల్లు కలువలరాజు । చెలువునఁ గళ లభ్యసించె నానాఁట
గరిడిసాధన నేర్చెఁ గార్ముకవిద్య । లెతిఁగె హయస్యందనేభావరోహ

గతుల యుద్ధము సేయు కదలికల్ వొరసె । చతురుఁడై యౌవనసంపద మెఱసె
నీరీతి శేఁబ్రాయ మొనసిన నృపతు । మారుతోఁ గూడి యమ్మంత్రినందనుఁడు
కుంభి సౌశీల్యాది గుణకుంభినీజ । కుంభి తాను నెఱింగికొనెఁ గొన్నికళలు
కుచ్చితుండని మంత్రికొడుకు నెఱుంగ । కచ్చిన్నిరాజు వాఁడాప్తుఁ డటంచు
నెనరుతో నెపుడు మన్నించు సమీప । మున నుంచికొని తాను భుజియించువేళ
విహరించునెడ నెల్లవేళల యందు । బహుమైత్రి నిటు లెడఁబాయక యుండి
యొకనాఁడు నగరిబాహ్యోద్యాన భూములకు వానితో నరాళము పోవఁ దలఁచి
లలిత చతుర్విధాలంకార మూరు । లలఘు బాణాస సాయక ఖేటకాది
వివిధ సాధనసమన్విత పాణు లగుచు । జవనాశ్వములు రభసంబున నెక్కి
యిరువురు చనిచని శృంగారవనులు । సరములు కేళికాశైలముల్ నదులు
గాంచుచు ముందరఁగాంచి రుత్తుంగ । కాంచనప్రాకార ఘటితకవాట
ధవళగోపుర విచిత్రధ్వజ రత్న । నివహ తోరణ సుమాన్విత వితాన
చలదళి ఝుంకార శారికాకీర । కలకంఠ కలనాద కలనా విశాల
లీలావనంబు కాళీభవనంబు । భూలసత్కవనంబు బుధజీవనంబు
కాంచి పురోవీథిఁ గనుపించు కొలని । యంచెల, నెక్కిన హయముల డిగ్గి
సరసీజలములఁ బ్రక్షాళితహస్త । చరణులై వెలువడి శాంభవీదేవి
గోపురద్వారంబు గురుభక్తిఁ జేరి । రాపట్ల కుంభి చయ్యనఁ గూరుచుండి
కాళి నప్పుడె కనుగొంటి నోభూమి । పాలనందన! చాలబడలియున్నాఁడ
నీగుఱ్ఱముల చెంత నేవసియింతు । వేగ నీవేగి దేవీదర్శనంబు
చేసి రమ్మనిన మంచిదియని యట్టె । రాసుతుం డాగోపురద్వారముననె
కరముల మోడ్పుతోఁ గన్నుఁదామరల దొరగు ముదశ్రుబిందువులతో భక్తి
పరవశత్వంబుతోఁ బ్రతిపదోచ్చరిత । భరిత దేవీస్తోత్రపఠనంబు తోడ
నలరుచు నవ్వాలనరిగి ముమ్మారు । వలగొని దేవి దేవళము ప్రాపించి
భావించి సేవించి ప్రాంజలి యగుచు । నావిశ్వమాత నిట్లని ప్రస్తుతించె

నిరోష్ఠ్యము

జయ జగత్కారణి జయ దయాధరణి । జయ దృశాహారిణి కాసర సాల కరిణి
జయ నీలగాత్రి దాసజనేష్టదాత్రి । జయ చిల్లతాధాత్రి జయ కాళరాత్రి

జయ శాస్త్రసిద్ధాంతసంతతాక్రాంత । జయ గల్లశశికాంత జయ నిత్యశాంత
నీశాంతి నీకాంతి నేర గణింప । నాశాస్యదాయిని యని శతానంద
హరిహరాదిక నిర్జరాళికీర్తింప । నరసిరక్షించిన యాదయయింత
నాయెడ నిడి యేదినన్ గీర్తికల్గ । దే యని గణియించి యేకాగ్రనిష్ఠ
నావల గర్భగృహ ప్రదక్షిణము । గావింపుచున్న నక్కడ నొక్కచోట
దట్టమౌ కెంజడల్ తలదిండుగాఁగఁ । జుట్టి విభూతి నచ్చుగఁ ద్రిపుండ్రంబు
ఫాలభాగంబునఁ బఱఁగు రుద్రాక్ష । మాలికల్ తలచుట్టు మణిబంధములను
గళమున విలసిల్లఁ గ్గా జపసరము । చెలువొందు గోడఁజేర్చిన త్రిశూలంబు
కడఁ గకపాల చొక్కపు భూతిసంచి । నిడుదలాతము మణినివహమ్ము పెట్టి
దీపించ నాసాగ్రదృష్టితో స్వస్వ । రూప చింతా సుధారుచిఁ జొక్కుదాని
వితత చతుష్షష్టివిద్యా సపద్య । చతురతాస్ఫూర్తిచే నడిసన్న దాని
నొక సిద్ధయోగిని నుత్కంఠఁ జూచి । ముకుళితహస్తుఁడై ముందరి కేగి
యతిభక్తి మ్రొక్క నాయమ తెప్పలెత్తి। యతని నీక్షించి మాయన్న! రావోయి
ఘూరిపేణకుమార! పుణ్యసంచార! । చేరి కూర్చుండు మిచ్చెద నభీష్టములు
నీదేవికృప జనియించినాఁడవు శు । భోదయుండవు గాన నొదవు శ్రేయములు
దేవియాజ్ఞ హితోపదేశంబు నీకుఁ । గావింతునని మేను కరమున నిమిరి
విను నీకు శస్త్రాస్త్రవిద్యలు చాల । కునికి కృతాస్త్రుసేయుటకు వచ్చితిని
సకలదివ్యాస్త్రశస్త్రము లొసంగెదను । నికట కమండలు నిర్మలాంబువుల
మనుచర్య శుద్ధాచమానంబు సేయు । మన నాతఁడటువలె నాచరించుటయు
వలనొప్ప మంత్రపూర్వముగ దివ్యాస్త్రములును దివ్యాయుధంబులు ప్రసాదించె
బహుకవచములిచ్చె బ్రాహ్మ్య రౌద్రాస్త్రసహితంబుగాఁగ వైష్ణవబాణమొసఁగె
నిటులఁ బ్రత్యక్షమాహేశ్వరి యగుచు । నట గానుపించిన నద్దేవి వలన
వారుణాగ్నేయ వైవస్వత సౌర । మారుత కౌబేర మానవాస్త్రములు
గారుడ పైశాచ ఘనతమః పర్వ । తోరగేంద్రాసురాత్యుగ్ర బాణములు
నాదిగాఁ గలుగు దివ్యాస్త్రముల్ వడసి। యాదిత్యులకజేయుఁడై యాఘనుండు
నురుభక్తి తత్ప్రయోగోపసంహార । గరిమ లెల్ల నెఱింగి క్రమ్మఱ మ్రొక్కి
కరములు మొగిచి చెంగట నిలుచున్న । మఱల నయ్యోగినీమణి యిట్టు లనియె

దేవీకృపాదృష్టి దివ్యాస్త్రవిద్య । లీవు నేర్చితివిది యెవ్వరితోడ
నెఱిఁగింపఁ బోకుమీ యాకుంభితోడ। మఱచి తప్పియు వచింపకు వీఁడు చెడుగు
తలఁపులో శస్త్రాస్త్రతతు లివిమెలఁగు । కలన రక్కసులఁ బెక్కండ్ర నుక్కణఁచి
బహుభామల వరించి బహుభోగ భాగ్య।మహిమనింద్రునిఁబోలి మహి యేలగలవు
ఊరికిఁ బొమ్ము మేలొదవు నీకనుచు । నారాజసుతుఁ బల్కి యంతర్ధి చెందె
మాయమ్మయైన శాంభవియె కాఁబోలు । నీయమ్మ గాకున్న నీమహామహిమ
యితరయోగినులయందెసఁగునే యనుచుఁ। బ్రతినూత్వమూనియు ప్రతిమాన కాంతిఁ
దనరు నద్దేవికి దండప్రణామ । మొనరించి దేవళం బొయ్యన వెడలి
గోపురద్వారస్థుఁ గుంభినిఁ జేరి । రాపోద మూఁడికి రవి క్రుంకవచ్చె
తడయనేలనిన నాతం డింతసేపు । గుడి నుండుటేమి రాకొమర! నీవనిన
నచ్చటి చోద్యము లచటిచిత్తరువు । లచ్చటి గర్భగృహాంతర స్ఫురణ
లచ్చటి మంటపాయత వితానమ్ము । లచ్చటి చందుఱాయరుగులు గనుచు
నినుఁ దలఁచితినయో నీవు రావైతి । వని తనకొదవు దివ్యాస్త్రలాభంబు
వానితోఁ జెప్పక వంచించి వాజి । పై నెక్కి వాఁడు వెంబడి నేగుదేరఁ
దనతేజి తానెక్కి త్వరమీఱఁ బురికిఁ । జని సుఖస్థితినుండె జనపాలసుతుఁడు
అంతట నొక్కనాఁ డమ్మంత్రిసుతుని । మంతనమ్మునఁ జూచి మనుజేంద్రసూతి
వేఁటాడఁ బోదమే? విపిన దేశముల । కాటవికులు మెచ్చనని మందలించి
మందురలో నున్న మంచి యశ్వములు।యం దేర్పఱచి యొక్కహయముపై నెక్కి
ఘోటకారూఢుఁడై కుంభి యు రామ । హాటోపమున నేగి హరికరి శరభ
శల శల్యఖడ్గాది సత్త్వసంతతులఁ । బొలియించి విశ్రాంతి పొంది యందొక్క
సాలతరుచ్ఛాయ శయనించి యున్న । యాలోన నచ్చోటి కనతిదూరమునఁ
జరమదిక్పథమునఁ జతురంగసైన్య । పరివృతులై మహాబాహు విక్రములు
రాజకుమారులు రథములమీఁద । వాజులపై మదావళముల మీఁద
నాందోళికల మీఁద నతిచిత్ర శకటి । సందోహముల మీఁద సంప్రీతి నెక్కి
కరిఘీంకృతులు రథఘుర్ఘురధ్వనులు । హరిహేషితములు భటార్భటుల్ సెలఁగఁ
జటుల బలోద్ధూత జగతీపరాగ । పటలంబు దశదిశాభాగమ్ము లొరయఁ
గదలిపోయెడి వారిఁగని కుంభిఁ జూచి । పదపడి కేయూరబాహుఁ డిట్లనియె

నీరాజనందను లెటకేఁగుచున్న । వారలో యీసైన్యవర్గంబుఁ గూడి
వీరిచందము నీవు విశదంబుగా వి । చారించి యిప్పుడే చనుదెమ్ము పొమ్ము
నా విని యమ్మంత్రినందనుం డరిగి । యీవేళ నెక్కడి కేఁగుచున్నారు
మీరని యడిగిన మృదువచోరచన । వారిలో నొకమంత్రివరుఁ డిట్టులనియె
ధీరాత్మ! బాహ్లీకదేశంబు నందు । సారస్వతంబు నాఁజను పురియేలు
విక్రమసేనుఁడన్ విపులాధినేత । శక్రసమానుఁ డాజగతీశ్వరునకుఁ
గలదు శృంగారరేఖానామ కన్య । సలలితగుణమాన్య సౌజన్యధన్య
యావిలాసినికి స్వయంవరోత్సవము । గావించు వార్త లాకర్ణించి సకల
భూపాలనందనుల్ పోవుచున్నారు । రేపుమాఁపటికిఁ జేరెద మందటంచు
నెవ్వని కబ్బునో యిందీవరాక్షి । యివ్వచ్చుదొరలలో నెవ్వఁ డెఱుంగు
కలిమియుఁ జెలువంబు గలవాఁడ నేను । బలసముగ్రుఁడ నేను ప్రాజ్ఞుండ నేను
నన్నేవరించు నన్నాతి యటంచు । నెన్నుచు హామికలెసఁగ నొండొరుల
మెచ్చక వీరెల్ల మెలఁతపై మోహ । మెచ్చ నేగెడి త్వర యీక్షింపు మనిన
నామంత్రివాక్యంబు లాలించి కుంభి । తామసించక యేగి తమరాజసుతుని
తోడ బాహ్లీకరాజ దుహితృస్వయంవ । రాడంబరాలోకనార్థులై సకల
జననాథతనయులు చనియెద రనుచు । వినిపింప నాతఁడు విని సంతసించి
మనమును బోదమె మంత్రికుమార! । మన రాజువారికి మన పయనంబు
వినిపింపఁబనుతము వేఁటకాండ్ర నని । యనిచె నాక్షణమె హయారూఢుఁడగుచుఁ
దనుగూడి మంత్రినందనుఁ డశ్వమెక్క । చనుదేర ముందరఁ గలసేనఁ గలసి
పోవుచునుండఁగా భూపాలతనయు । లా విపులోరస్కు నాదీర్ఘబాహు
నామన్మథాకారు నట్టె వీక్షించి । యీమహీశకుమారుఁ డెవ్వఁడో వీని
శారీరకాంతు లిచ్చటనెల్ల నిండె । నౌర! లేఁబ్రాయ మయ్యారె! సోయగము
వీనిఁజూచిన కాంత వేఱొక్క వన్నె । కానిఁ గామించునె! కంటిమే యిట్టి
యందచందము లింక ననుమాన మేల । నిందుబింబాస్య బాహ్లీకరాజపుత్రి
వీని వరించు వేవేల రాసుతులు । దానిఁ గామించిగదా మోహావశత
దూరభారము లేగఁ దొడగి రటన్న । నారాజనందనుం డామాట లెల్ల
విని యెలనవ్వుతో వెంబడి చనియెఁ । బనిపూని బహుదేశపతు లివ్విధమునఁ

జేరెరి విక్రమసేనుని పురము । వారిరాక యెఱింగివారి కందఱికి
నులుపాలు విడుదులు నొనగూర్చి కలిమి । వెలయ బాహ్లీకధరావిభుఁ డాదరించె
వారిలోఁ జారులావణ్య నైపుణ్య । పారీణుఁ గేయూరబాహుని జూచి
తగిన సన్మానముల్ తప్పక చేసె । జగతిలోఁ గల రాజసంఘంబు లెల్ల
నేలయీనిన భంగి నిలిచె నాప్రోల । నాలో స్వయంవరార్హ దినంబు నందు
శృంగారమెల్ల రాశిగఁ జేసినట్లు । బంగారుబొమ్మ సప్రాణ మైనట్లు
అంగజు మాయ ప్రత్యక్షమైనట్లు । శృంగారరేఖ నెచ్చెలిగుంపు గొలువ
నమరు బంగరుగచ్చుటరిగెల నీడ । రమణీయగతిఁ జేరె రంగమంటపము
దాని చక్కఁదనంబు దాని శోభాయు । మానరేంద్రకుమారు లందఱు చూచి
భ్రమసి మారునిబారిఁ బడియున్న వేళఁ । గమలలోచనఁ జేరి కలకంఠి యొకతె
యా యానృపాలుర యన్వయ నామ । ధేయ తేజోబలస్థితు లెఱిఁగింప
నెవ్వరిపై దృష్టియిడక యబ్బోఁటి । యవ్వలవ్వలఁబోయి యగ్రభాగమున
మంచెపై వసియించు మహనీయరూప । పంచాస్త్రుఁ గేయూరబాహునిఁ జూచె
చూచినప్పుడె దాని సుమధన్వి యేఁచె।నా చెల్వ చెలువ మాయన చూచి యలరె
నొండొరులకుఁ బ్రేమలుత్పన్న మగుట । నిండెఁ గ్రొంబులకలు నెమ్మేనులందు
నితఁడె నాపతియని యిందీవరాక్షి । యతని చెంగటికేగి యలరుఁ బన్నీటఁ
నడుగులు గడిగి మోహమ్ము రెట్టింప । నిడెఁ గంఠమునఁ బైడియిప్పపూదండ
కేయూరబాహు నీక్రియ వరియించి । యాయింతి లోపలికరిగిన వెనుక
నచ్చటి నృపులెల్ల నలరి రచ్చెలువ । కిచ్చెలువుఁడు దగు నిచ్చెలువునకు
నచ్చెల్వ దగునని యానాఁటిరేయి । హెచ్చులగ్నంబున నెలమి నిర్వురికిఁ
గావించెఁ బెండ్లి విక్రమసేన నృపతి । యావివాహోత్సవ మలరియె పొగడ
వచ్చిన ధారుణీశ్వరులకు నెల్ల । నిచ్చి భూషణములు హేమాంబరములు
దినములు నాల్గు నిత్తెఱంగున బంధు । జనులు మెచ్చఁగ మహోత్సవములు జరిపె
మామగారింట నమ్మను జేనసుతుఁడు । కోమలితోఁగూడి కొన్నినాళ్లుండి
యరణ మిచ్చిన కరిహరి రథసుభట । పరిచారికాంబరాభరణాదికములు
గైకొని జవనకంఖాణంబు మీఁద । నాకన్య నిడుకొని యఖిలసైన్యముల
ముందర నిజపురంబున కేగఁబనిచి । చెందినరహి కుంభిచేరువ రాఁగ

నొక పయనమున నయ్యుగ్మలితోడ । నకలంకగతి మాటలాడుచు రాఁగ
వెనుక వచ్చుచుఁ గుంభి వికటాత్ముఁడగుటఁ।గనకాంగి మేని శృంగారంబు చూచి
యీరాజు వంచించి యేభంగి నైన । నీరాజబింబాస్య నేనయుదు ననుచుఁ
దగవు ధర్మముమాని తలఁచె దుష్టాత్ము । లగువారి నమ్మ నెట్లాప్తు లటంచు
నీచందమున మది నేమేమొ తలఁచు । నాచెడుగు తలంపు లాతఁడేమియును
దెలియక రాజపుత్రికిఁ ద్రోవలోనఁ । గల విశేషమ్ము లొక్కటఁ దెల్పికొనుచుఁ
గొంతదవ్వరిగి కన్గొనియె ముందర ని । రంతర దానధారా పూరఘోర
కరటి బృంహిత రవాకర్ణనోద్వేగ । పరిగత పంచాస్య పటురవ శ్రవణ
సరభసాయాతోగ్ర శరభనినాద । పరుష తా శ్రుతిసముద్భవ రుషోద్దండ
గండభేరుండ ప్రకాండఘోష ప్ర । చండమౌ నొకపనస్థల మివ్విధమునఁ
గని చొచ్చిపోవ నక్కడ నొక్కచోటఁ । గనఁబడెఁ దుంగశృంగ గతాభ్రసంఘ
చంచల చ్చంచలా చ్ఛాయాప్రపంచ । చంచ దధిత్యకాస్థలమైన యొక్క
నీలాచలంబు దాని యుపత్యకా వి । శాలమార్గంబున జవనకంఖాణ
రాజంబు బరపఁగా రాజకుమారి । యాజగజ్జనరంజనాకృతిఁ జూచి
విధివశంబునఁ బల్కె వినుము ప్రాణేశ!।యధికమైనది దాహ మంబువు లిచట
దొరకవో మంత్రిపుత్రునిఁ బంపి నీళ్లు । సరగునఁ దెప్పించి శ్రాంతి తీర్పుఁడన
నామంజువాణి వాక్యము లాలకించి । దీమసంబున మంత్రిఁదిలకించి యతఁడు
హయమునిల్వఁగఁబట్టియనియెనిప్పుడ్మ।నయ్యనదాహమున నెంతయుశ్రాంతిఁ జెందె
నడవి నెక్కడనైన నంబువుల్ వెదకి । కడువేగఁ దెమ్మిందుఁ గదలక నేను
నుండెద ననినఁ గామోద్రేక మాత్మ । నిండియుండుటఁ జేసి నీచుఁడై వాఁడు
కేయూర బాహు నీక్షించి యిట్లనియె । నోయి రాజకుమార!యొకయడు గిడఁగఁ
జాల మహాపథశ్రాంతితోఁ జాలఁ । దూలియున్నాఁడ నెంతోదప్పి మించె
నడవిలో నేఁదిరుగాడ నోపుదునె । కడఁకతో హరొన్గింఁడి గైకొని నీవె
విపినభూమిని నీళ్లు వెదకి వేఁదెచ్చి । యపనయింపుము దాహమని దీనవృత్తి
వంచకుఁడై పల్కు వాని నీక్షించి । మంచిది నీళ్లకేమసలక యేగి
తెచ్చెద రాజపుత్రిక సమీపమునె । హెచ్చరికై యుండుమిదె వత్తు ననుచు
నా రాజతనయుండు హయముపై నున్న । నీరజాక్షిని డించి నికట భూరుహము

నీడ నిల్వఁగఁ బంచి నిజమంత్రిసుతుని । నాడఁ గావలిపెట్టి యఱిగె నీళ్లకును
నీటికండువఁ బట్టి నృపసూతి యమ్మ । హాటవిఁ జొచ్చి యట్లరిగిన వెనుక
కుంభియన్ దుష్టాత్మకుం డొంటినున్న । కుంభికుంభస్తని గొబ్బునఁ జేరి
తమకంబుతోఁ బల్కెఁ దరుణీలలామ! । సుముఖివి సుగుణవు సుమతివి నీవు
తగునె నీకీనరాధముఁడు రాజనుచు । నిగురుబోణిరో! మది నెంచినావేమొ
కులహీనుఁ డదిగాక గుణవిహీనుండు । వలచి వృథా వీని వరియించి తీవు
తెలియు మేకులగుణాధికుఁడ సమస్త । కళలఁ బ్రవీణుండ ఘనుఁడ నన్ గూడి
కోరికలీడేర్చికొమ్మని మరుని । బారికి నెరయాచు బటువు సిబ్బెంపు
బలు గుబ్బచన్దోయి పయ్యెంట జార్పఁ । దలఁచి కేల్సాచినఁ దలఁగి యాలేమ
యావల నిలచి హాహాకార మెసఁగ । నీవింత ద్రోహివౌ టెఱుఁగక నిన్ను
నాచెంతనిడి రాజనందనుం డరిగె । నీచెడ్డపని కేల నిచ్చగించితివి
కటకటా! విశ్వాసఘాతుకవృత్తి । నెటువలె నొడిగట్టి తెఱుఁగవే బుద్ధి
జలములు దెమ్మన్నఁ జనక నీవిందు । నిలిచినయపుడె సందేహంబు దోఁచె
పరమాత్మ! నినుగన్నఁ బాతకం బొదవు । కరకరిఁ బెట్టక కడనుండు మనినఁ
గామాంధుఁడై నీతిఁ గడద్రోసి భీతి । యేమియులేక వాఁ డెలనాగ డాసి
జడఁబట్టి తీసి భూస్థలిఁ ద్రోసి మీఁదఁ । బడఁ దమికించినఁ బడఁతి నెన్నడుము
గడగడ వడఁక నంగము చెమ్మరింపఁ । గడు భీతిమించ నొక్కట మోదికొనుచు
హారముల్ తెగిరాల హానాథ! యిట్టి । క్రూరకర్మునిచెంతఁ గూర్చుండఁ బెట్టి
యెందుఁ బోయితివి రావే! మానహాని । పొందకుండఁగ నన్నుఁ బ్రోతువు గాని
నేనేలఁ బొమ్మంటి నీళ్లకు నిన్ను । నానోట శనియుండె నాసామి! యనుచుఁ
గాటుకకన్నీరు కాల్వలై పాఱ । గాటంపువెత బెట్టుగా మొఱఁబెట్టె
నామొఱయాలించియచటరక్తాక్ష।నాముఁడౌరాక్షసనాథుఁడొక్కరుఁడు
గిరిగుహ నుండి నింగికి నుద్గమించి । పఱతెంచి యయ్యింతి పైఁబడఁ దివురు
పాపకర్మునిఁ గుంభిఁ బదహతిఁ దన్నెఁ । గోపంబుతో రెండుక్రోసుల మేరఁ
బడ నిట్లుదన్ని యప్పట్ల గుఱ్ఱములు । విడిపించికొని పాఱ వికవిక నగుచుఁ
దన ఘోరరూపంబు దర్శించి భీతి । మునిఁగి మూర్ఛిలిన యమ్ముదిత నెత్తికొని
పఱతెంచె నుడువీథిఁ బంక్తికంధరుఁడు । ధరణిజఁ గొని వియద్గతి నేగినట్లు

శృంగారరేఖ నీరీతి నర్తికొని । నింగికి నెగసి యన్నిశిచరోత్తముఁడు
ఆకొండగుహ నున్న యాత్మీయపురికి । రాకాసు లరుదంద రయమున నరిగి
మును చెఱఁదెచ్చిన ముదితల చెంత । నునిచి కావలియున్న యుగ్రరాక్షసుల
నెచ్చరికై యుండుఁడీ యని చెప్పి । యిచ్చ వేడుక హెచ్చ నేగి లోపలికి
యంతఃపురమున కిట్లరిగి యయ్యసుర । చెంతకువచ్చి నిల్చిన తనభార్య
నీలాంగిఁ జూచి వింటివె వాలుఁగంటి! । శైలాంతికమున లేజవ్వని యొకతె
పసనిచే నిటు పట్టువడి బెట్టుగూయ । నరుదంది విని లేచి యచటి కేఁబోయి
వానిఁ గూలఁగఁదన్ని వనితఁ దెచ్చితిని । మానవాంగనల కామహితలావణ్య
విభవంబు గలుగ దవ్వేడవింటివాని । యభినవ సమ్మోహనాస్త్ర మట్లమరె
తొయ్యాలుల్ తొంబదితొమ్మిదిమంది । యయ్యుండి రిన్నాళ్ల కక్కడఁ దీర్ప
నూహింపఁగా దైవ మొనగూర్చె నిమ్మ । నోహరగాత్రితో నూఱుగు రైరి
వీరి నేనొక శుభవేళఁ బెండ్లాడి । యోరామ! నీదాస్య మొనరించు నటులఁ
జేసెదఁ బ్రాభవస్థితి నుండుమనిన । నాసురాహితు మాట లది విని పోయి
కారాగృహంబునఁ గన్నీరుజాఱ । నూరక యేడ్చుచునుండెడు దాని
శృంగారరేఖ నీక్షించి యచ్చెలి తె । ఱంగది తెల్ప సర్వము విని మఱలఁ
బతిఁజేరి పలికె నో ప్రాణేశ! దాని । పతి మేటి కేయూరబాహునామకుఁ డఁట
శాంభవీ కరుణాప్రసాదంబు వలన । సంభవించిన మహాచారుమూర్తి యఁట
వివిధశస్త్రాస్త్ర కోవిదుఁడఁట వాని । బవరంబులో జయింపఁ దరంబు గాదు
వనితఁగొంపోయి యవ్వనములోడించి। చనుదెమ్ము బహువధూజనములుండఁగను
దీని వీడినఁ గాంక్షదీఱదే మున్ను । జానకిచే లంక సమసినయట్లు
నిక్కాంతచే నశియించు నీపురము । రక్కసుల్ తెగుదురు రణభూమిలోన
నోనాథ! మదిమదినుండి యేమిటికి । హాని చెందెదవన్న నసురేంద్రుఁ డనియె
పటురమా ఘటితేంద్రపౌలస్త్య నేత్ర । పుట భేదనంబు నాపుటభేదనంబు
నమరభీకరము నా నతిశయం బొందె । నమరాసురుల కశక్యము దీనిఁ జొరఁగ
శరభసింహ వ్యాఘ్రసైరిభ వ్యాళ । కరిముఖావరణముల్ గల వెన్మిదిచట
నీవాకిళులు దాఁటి యీపురి సొచ్చి । రా వశమే! యొక్క రాజపుత్రునకుఁ
దప్పి వచ్చిన మర్త్యధాముల సదిరి । యెప్పగిది జయించు నిందఱ గెలిచి

వచ్చెపో నన్నోర్వవశమె? నీదృష్టి । హెచ్చ నిచ్చున శౌర్యమెల్లఁ గైకొనక
యింతి! మీతండ్రినీకిచ్చినవరమ । దెంతయు మఱచితివే జాలియేల
నూరకుండు మటన్న నువిద మాఱాడ । నేరక యాత్మఁ జింతిల్లుచు నుండ
నంత నక్కడ నరణ్యాని రాసుతుఁడు । కాంతకై స్వాదూదకంబులు గొనుచు
వచ్చుచుఁ ద్రోవలో వడిదక్కి యలని । యచ్చరద్వేషి పాదాహతి నొచ్చి
పరవశుఁడై నేలఁ బడియున్న కుంభిఁ । బరికించి యాశ్చర్యపడి చేరఁబోయి
శిశిరోపచారముల్ చేసి యస్నేచ । దశ మాన్చి యల్లన దాహంబు దీఱ
బంగారు గిండిలోపలి జలంబొసఁగి । శృంగారరేఖ నోయీ! యొంటి నడవి
డించి నీవిచటనేఁటికిఁ గూలినాఁడ? । వెంచిచూచిన హేతు వెయ్యది లేదు
ఈయార్తి నీకిపుడేల వాటిల్లె? । నాయింతి యేమాయెనని యడుగుటయు
దీనముఖుండై విధేయుని మాడ్కి । నానీచమానసుం డతని కిట్లనియె
నయ్య! నీవిచటికి నరుదెంచినంతఁ । దొయ్యాలి చెంత నెంతో ప్రయత్నమున
హెచ్చరికై యుంటి నచ్చటినుండి । వచ్చెనో కరిమబ్బు వన్నియవాఁడు
నిడుద కోఱలవాఁడు నీలాద్రికంటెఁ । బొడవైనవాఁడు నిప్పులకుప్ప లొలుకు
చుఱుకుచూపులవాఁడు శోణాభ మెఱయు। కఱకుజుంజురు వెండ్రుకలు గలవాఁడు
గిరిబిలంబునఁ జిల్వక్రియ దెల్పునట్లు । తెఱనోట నాలుకత్రిప్పెడు వాఁడు
నాకసం బగలించు నట్టహాసమున । నాకస్మికముగ ఘోరాసురుం డొకఁడు
పరువునవచ్చి యప్పణఁతి కేనడ్డ । మరుదేరఁ గఠినాంఘ్రిహతిఁ బాఱఁదన్నెఁ
దన్నినచో నింతదవ్వుల ద్రెళ్లి । యున్నాఁడఁ గొనిపోవ కుండునే చెలిని
నాకట్టిఁడి నిశాటుఁడన్న! నీవచట । లేకున్కిఁ గ్రొత్తపెండ్లికుమారి యసుర
పాలయ్యెనని వాఁడు పలికినపలుకు । లాలించి క్రోధశోకాక్రాంతుఁ డగుచు
నారాజనందనుం డాపసఁబడిరు । ధీరుఁడై యమ్మూర్ఖుఁ దిలకించి పలికెఁ
దురగంబుతో ధనుస్త్రాణముల్ చనియె । నరయఁగావలెఁ గానలం దటుగాక
బోఁటి నెత్తుక యెందుఁబోయెనో యలని। శాటుని వెదకి నేఁడవనిఁ గూల్పక యె
నేనన్నము భుజింప నీవె చూచెదవు । మానైన నావిక్రమక్రమం బనిన
నక్కుటిలవిచారుఁ డను మనతరమె? । రక్కసుల జయింప రాజకుమార!
యీయుగ్రసాహసంబేల? చేఁదప్పి । పోయిన పూఁబోఁణి పోలునే మఱల

సాధింప నూరికిఁజని క్రమంబున వి । రోధి నన్వేషించి రోధించి వాని
బలములతో గెల్చి భామఁ జేకొనఁగ । వలెఁ బదరిన పోనివచ్చు నిక్కముగ
రావణుపై రఘురాముఁ డొంటరిగఁ । బోవక క్రోఁతిగుంపులఁ గూడిచనఁడె?
యని కొన్ని వక్రోక్తులాడిన వానిఁ । గినిసి మిక్కిలి వివేకివి చాలుచాలు
చెఱనున్న భార్యడించి పురంబుఁజేర । నరుగుదెమ్మని పల్క నర్హమే నీకుఁ?
బాలుమాలినఁ బొమ్ము పట్టణమ్మునకు । బాల శోధింప కప్పలలాశిఁ బట్టి
పరిమార్ప కేనేల పఱతెంతు ననుచుఁ । ద్వర నొంటినేగు నాతని వెంటనంటి
యక్కుచ్చితుఁడు నేగె నపుడరణ్యమున । నొక్కదిక్కున దైవయోగంబు కతన
ధనురాది సాధనోత్కరముతో హయము । గనుపింప రాచూలిగని సంతసించి
వాగె గ్రక్కునఁబట్టి వదనంబు నిమిరి । తాఁగన్న కొలనిలో దానిదాహంబు
దీఱ నీరముఁజొపి దిగ్భ్రాంతి మాన్పి । యారోహణమొనర్చి యపుడు తా నింతి
నుఱిచిన చోటి కత్యుద్ధతిఁ బఱపి । తునిఁగిన గాజులతునుకలు తెగిన
హారముల్ నెరసినయులఱులు బాష్ప । ధారలఁ దడిసినధరయును జూచి
చేరినవానితోఁ జెలువ పోరాదు । లీరీతిఁ దెగిరాలు లేమిరో యనినఁ
దానొనర్చిన యకృత్యము వాఁడుదెలుప । కానిశాచరుఁడు రాయడిసేయ జాతె
పోరాదు లిచ్చోటనని తెల్ప వగచి । హా! రాజముఖి కెంతయాపద వచ్చె
ననువంటి రాజనందనుఁ బెండ్లియాడి । దనుజుఁ బ్రాపింప ధాత లిఖించెనేమొ?
యతిం ఫాలమ్మునననని కొంతసేపు । మతిలోనఁ జింతించి మంత్రినందనునిఁ
గని చూత మొకసన్న గ్రామంబు చేరఁ । జనుదెమ్ము నావెంట జడియక యనుచుఁ
బలికి యగ్గిరి యుదగ్భాగంబు వెదుక । బిలము లయ్యెడఁ గానుపింపక యున్నఁ
దూఱుపుకడఁ జూచి తోరంపుఁ జఱులఁ । జేరఁగారాని దక్షిణపుదిక్కరసి
చఱులగట్టున నిజాశ్వముడిగ్గి వాగె । కరమునఁబట్టి యొక్కవిధాన జరిగి
తడయక పడమటితట్టు ప్రాపించి । యెడనెడ గుహలున్నవే మొ యటంచు
నాడాడ శోధించి యంకొక్క చెట్టు । నీడ నాఖలుతోడ నిలిచె రాసుతుఁడు
కడు శ్రాంతుఁడయ్యును గార్యభారమున । బడలిక యెఱుఁగక పార్థివసుతుఁడు
ఆయరణ్యాని మధ్యమున నుండఁగను । బోయలు కొందఱు భూరిమాంసముల
కావళ్లుపూని శీఘ్రమున నేతెంచి । భూవరతనయునిఁ బొడగని యనిరి

యిందేలవచ్చితి? రెవ్వరుమీరు? । బృందారకులకైనఁ బోరయరాదిందు (!)
రక్తాక్షుఁడను పేరి రాక్షసుండతుల । శక్తిసమగ్రుఁడీ శైలమధ్యమునఁ
గరమొప్పు నమరభీకరమను పురము । పరిపాలనమొనర్చుఁ బ్రాభవం బెసఁగ
నీచెంతలను జేర రెంతవారైన । రాచబిడ్డలొ? యిందురాఁ గతం బేమి?
యెఱుఁగక వచ్చితిరేమొ? యేమాయెఁ । బరువెత్తుఁ డీత్రోవఁబడి యింకనైన
నేమూలవేసిన నేతెంతు రసుర । లీమాంసభారమ్ము లెత్తుక పోవ
నావిని యారాజనందనుం డనియె । నోవనచరులార! యొకమాట మిమ్ము
తెలియఁగనడిగెదఁ దెలిపిపొండనినఁ । బలలభారంబు లప్పలభోజనులకు
నొప్పించి వచ్చెద మొకకొంత దూర । మిప్పుడుచని నిల్వుఁడిచ్చోటు విడిచి
యనిన గుజ్జుంబుతో నలకుంభిఁ గూడి।మనుజేంద్రసుతుఁ డొక్కమాటున నుండె
నాకొండగుహ వాతికరిగి కిరాతు । లేకకంఠమ్ముగా నీలవెట్టుటయు
గుహవాతిఱాయిఁ గ్రక్కునఁ గడఁద్రోసి। బహురాక్షసులువచ్చి పలలముల్ గొనుచు
వాకిటనెప్పటివలె ఱాయిఁద్రోసి । యాకడకేగిన నవ్వనచరులు
పఱతెంచి కేయూరబాహునిఁ జేరి । రెఱుకలందున ముదియెఱుకొక్కరుండు
వారిలోమేటి యవ్వసుమతీశ్వర కు । మారునిఁ గని నీవు మమ్మేమి యడుగఁ
దలఁచితి వడుగుము తత్క్రమం బేను । దెలిసిన దంతయుఁ దెలిపెద ననిన
నానృపుఁడనియె నీయసుర యెవ్వాని । సూనుఁడు వీని తేజోమహత్త్వంబు
వీని పురస్థితి వీనికిఁగలుగు । సేనల వినఁదలంచితిఁ దెల్పుమనిన
నావృద్ధశబరుఁ డిట్లను మయపుత్రుఁ । ......... యీతఁడుండుటకు
యిగ్గిరిలో సృజియించెఁ బ్రోలాతఁ । డగ్గిరిభేది ప్రోలదియెంత యనఁగ
నది త్రియోజనదీర్ఘ మంతియ వెడలు । పెదిరించు వైరుల కీక్షింపరాదు
అమరభీకరము నా నమరు నప్పురికి । సమబలుల్ వేవురు సచివులుగలరు
పదివేల రాక్షసుల్ పాయక కొలుతు । రదిగాక కరి కిరి హరి శరభాహి
సైరిభ వ్యాఘ్రఘూగ్నిసమితి పాలించు । ద్వారంబు లెనిమిది తగు నిప్పురమున
నవ్వాకిళులు దాఁటి యరిగిన నుందు । నవ్వల నీలాంగియనువాని భార్య
దానిదృక్పథమునఁ దగిలినరుద్రుఁ । డైన దుర్బలుఁడగు నన్య్య లేపాటి
యది చూడకుండిన నవలఁ బోవచ్చుఁ । బదియవవాఁకిట బలసి వర్తిల్లు

పదివేల దనుజుల భంజించుటరిది । కదనశూరులు వారిఁ గదియరా దవల
మంతురుల్ వేవు రమర్త్యుల నైన । నొంతురు మనుజాశనులు వారిచెంత
మానవుల్ నిలుతురె మనుజేంద్రచంద్ర! । యీనిలింపవిరోధి కిపుడొక్క బుద్ధి
జనియించె నెటులన్న జగతిలోఁ గలుగు । మనుజాధినాథకుమారికామణులఁ
జెఱపట్టి తెచ్చి యుంచినవాఁడు నూరు।గురికి నొక్కవధూటి కొదువయై యున్న
చేఁడొకకన్య నన్వేషించి తెచ్చి । నాఁడఁట వీరినందఱ నొక్కనాఁడె
వరియింతునని యున్నవాఁడఁట నేఁడు । తరుణిఁ దెచ్చుటకు నద్దనుజుని భార్య
యడరిబుద్ధులుచెప్పెనఁటవాఁడువినక । కడుఁబ్రేలెనఁటయిందుఁగలవిశేషములు
అడవిలో నొకదైత్యు నడుగఁగా వాఁడు।నొడివె దాపక వాఁడునుడివిన క్రమము
నీకుఁ దెల్పితినన్న నృపపుత్రుఁ డలరి । యాకిరాతు నుతించి యస్మద్వధూటిఁ
జెఱఁదెచ్చినాఁ డీనిశీథినీచరునిఁ । బొరిగొందునని యిందుఁ బొంచియున్నాఁడ
నెనిమిదివాఁకిళ్ల నెసఁగు సత్త్వములఁ । దునిమి నీలాంగి కన్దోయి భేదించి
రాక్షససేనతో రక్తాక్షుఁ ద్రుంచి । రక్షింతుఁ జెఱనున్న రాజకన్యకల
ధనకనకాములఁ దనియింతు మిమ్ము । ననుఁజూఁడుమనిన నందఱు గెల్వుమనిరి
కుంభిచెంగటఁ దనగుఱ్ఱంబు నిల్పి । శాంభవీ యోగినీశ్వరిఁ బ్రశంసించి
సవిధతీర్థంబులో స్నానం బొనర్చి । శివమంత్రము జపించి శ్రీకాళికరుణఁ
గన్న దివ్యాంబర గంధమాల్యములు । నున్నత మకుటకేయూర హారములు
ధరియించి కవచ ముత్కటలీలఁ దొడిగి । స్మరణాగతామోఘ శస్త్రాస్త్ర కోటి
వినయంబుతోఁ గొని విల్లు సజ్యముగ । నొనరించి కవదొనలూని యాత్మీయ
తనుకాంతి దిక్కులఁ దళతళ లీనఁ । దనుఁజూచి సుర లద్భుతముచెంది పొగడ
నీమహామహిమ వీఁడెట్లొందె ననుచు । నామూర్ఖుఁ డెదఁబడి యట్టె కన్గొనఁగ
నిచ్చోట గుఱ్ఱంబునిడికొని యుండు । మెచ్చటి కేగక యిదెవత్తు ననుచు
వానితోననఁ బదద్వయిఁ బదత్రములు । ఫూని పదాతియై పురహంతుకాము
కామాంతకునిఁ బోలి ఖరుసేన కడరు । రామునివలె నవక్రపరాక్రమమున
నసహాయశూరుఁడై యరిగి యొక్కరుఁడె।యసుర గుహాద్వార మలుకతోఁ జేరి
కోదండశింజినీ గుణనినాదమున । రోదసి పగుల నార్చుచుఁ బెచ్చు పెఱిగి
కులిశ బాణమున నగ్గుహావాతి ఊయి । పలుతునుకలుచేసి బలువిడిఁ జొచ్చి

కరులు ఘీంకృతులతోఁ గదిసిన వాని । కరములు శిరములు గాళ్లును దోళ్లు
ఖండించి యచ్చోటుగడచి వరాహ । కాండముల్ పొదివిన కాండప్రకాండ
హేతులకోఱలు ద్రుంచియంగముల్ చించి । గతులడంగించియాఁకటవిజృంభించి
కహకహార్భటుల సింగములు పైకురుక । సహియింప కతిఘోర శారభాస్త్రములఁ
బ్రక్కలు డొక్కలు పదములు రదము।లొక్కటఁ జక్కాడి హుంకార మెసఁగ
నవ్వలఁజని శరభానీక మడరఁ । గ్రొవ్వాఱ గండభేరుండ బాణములు
పఱపి నుగ్గొనరించి బహుపిశాచములు । నురగంబు లవ్వల హుంకారఘోర
బహుళఫూత్కారముల్ పరగఁగ్రైఁబడఁగ।నహిమాంశుశరములనప్పిశాచముల
గండడంచి మహోగ్ర గారుడాస్త్రములఁ।గుండలిప్రచయంబుఁ గూల్చి పెల్లార్చి
సైరిభరూపులై చనుదెంచు నసుర । వీరులఁ గ్రూరుల వెస నిరోధించి
పరశు తోమర కుంత పట్టిసప్రాస । పరిఘాదుల వధించి పటుశక్తి మించి
సప్తమద్వారదేశము చేరి యచట । దీప్త నఖోదార దీధితుల్ మెఱయ
గాట టధ్వనులతోఁ గ్రోల్పులుల్ డాయఁ। జిటచిటమిణుఁగురుల్ చెదరఁగన్నులను
దలలు డొల్లఁగనేసి తద్వ్యాఘ్రకోటిఁ । బొలియించె నొక్కటిఁ బోవనీ కవల
నీరీతిఁ బులులను హింసించి యవలి । ద్వారంబు చొరఁబోవఁ దత్ప్రదేశమున
భుగులుభుగుల్లనఁ బొగలుప్పతిల్ల । ధగధగమంట లెంతయు విస్తరిల్లి
సెగలతో మిణుగురుల్ చెదరిదిక్తటులు।పగులమ్రోయుచు హేమపర్వతాకృతుల
నిప్పులకుప్పలై నెగడఁ గాలాగ్ని । యొప్పున మండుచునుండు దావాగ్ని
గని నవ్వుచును గార్ముకగుణంబు దీటి । మనమున యోగినీమణి సంస్మరించి
వారుణబాణంబు వడిఁ బ్రయోగింప । నాటె గుప్పునఁ వహ్ని యవ్వారిధార
జ్వాలనార్చి యాలీలఁ జల్లార్చి యవలి । నిలవున మణిపీఠి నీలాంగి యునికి
యెఱిఁగి వారునఁ జెంత కేగక గోడ । మఱుగుననుండి దీనుసమున రెండు
శరముల దాని లోచనములు రెండు । హరియింప హోరున నడలుచు నదియు
శయములఁ గన్ను లాచ్ఛాదించి కుపిత । యయి తననేత్రంబు లడఁచిన ఖలుఁడు
కరపద హీనుఁడౌగాక యార్నెలలు । నరుగక ముందర నని శాపమిచ్చె
నాలేమ శాపోక్తి నాలించి ధరణి । పాలకుమారుండుఁ బలికె మరేమి
పరభామలను జెఱల్ వట్టెడు నీచ । చరితుని సతివోట శాప మిచ్చితివి

మీచేయు కర్మంబె మిముఁబట్టి యిట్టి । గాసి నొందించె నొక్కరిఁ దిట్టనేల?
నీ వెంతతిట్టిన నీపతిఁ బట్టి । యీవేళఁ దునుమక యేనేలవిడుతు
ననిన మాటలువిని యుండుండ వెఱచి । దనుజకాంతలఁ గూడిదానవి చనియె
చని సౌధగతుఁడౌ నిశాచరవిభునిఁ । గని నేత్రగత రక్తకణముల వాని
యడుగులు దడుపుచు నడలుచుఁ బలికె । చెడుగాల మరుగుదెంచిన నా సుబుద్ధి
వినక బలాఢ్యుతో ద్వేషంబు చేసి । కొని వృథా కులమెల్లఁ గూల్ప బూనితివి
యిరునాల్గు వాఁకిళ్ల నిభకిరి సింహ । శరభాది మృగములఁ జంపి దావాగ్ని
యార్చి కీలార్చి రెండస్త్రముల్ దొడిగి । తీర్చెఁ జూచితివె! మదీయ నేత్రములు
మును శూర్పణఖ ముక్కు మొదలంటఁ జెక్కె । దనుజులఁ దునిమిన దాశరథివలె
మనవాఁకిళులు దాఁటి మనుజాశనులను । దునుముట కీతఁ డుద్యోగించినాఁడు
అతనితోఁ బగయేల యజ్ఞాశ్వ మిచ్చి । బ్రతుకుము నాపల్కు పాటింపుమయ్య!
యని వేఁడుచున్న నీలాంగినిఁ జూచి । దనుజేంద్రుఁ డనె నేల తల్లడిల్లెదవు?
పదివేల దనుజు లుద్భటశౌర్యధుర్యు । లిదె వానిఁ బరిమార్చి యేగుదెంచెదరు
యూరక చనుమని యుగ్రులఁ బంపి । యారక్తలోచనుండై యాగ్రహమున
నారక్తలోచనుం డపుడు వేవుర మ.। హారాక్షసులఁ బంచె నతనిఁ ద్రుంపుఁడని
వారు శస్త్రాస్త్రదుర్వారులై వచ్చి । యారాజసుతుఁ దాఁకి యసిగదా ముసల
పరశు తోమరముఖ ప్రహరణతతులు । పఱపిన నవియెల్ల భంగ మొందించి
కేయూరబాహుఁ డాగ్నేయబాణమునఁ । బాయక యయ్యసురుల భస్మీకరించె
నావార్త విని దైత్యుఁ డత్యుగ్రకోప । మావహిల్లఁగఁ బంచె నపుడాఱువేల
నక్తంచరుల వారు నరనాథసుతుని । శక్తిత్రిశూలాది సాధనకోటి
ముంచిన నవి చూర్ణములుగఁ గావించి । పంచాస్యతులితుఁ డా పార్థివ సుతుఁడు
తనవింట యోగినీదత్త రౌద్రాస్త్ర । మనుసంద సంధించి యట్టె యేయుటయు
దాన ననేకాయుధమ్ములు వొడమి । నానాముఖముల దానవసేన నడఁచె
హతశేషు లది తెల్ప నద్దైత్యవిభుఁడు । ధృతి మించ ననిఁ బంచెఁ ద్రిసహస్రభటుల
నాభటు లభ్రతుల్యార్భటు లగుచు । భూభర్తపై శైలములు వృక్షములును
గురిసినఁ గెరలి నుగ్గుగఁ జేసి యతఁడు । సురదత్తమున వారి మహిఁ గూల్చి మూర్చె
పదివేల దైత్యు లీపగిదిఁ గూలుటకు । మది నచ్చెరువునంది మనుజాశనుండు

తన చెంతనున్న ప్రధానిశేఖరుల । ననలాక్షు యూపాక్షు హారిదక్షుముఖుల
వేవురఁగని మీఱు వేవేగ నేగి । యావిమతునిఁ ద్రుంచి యతనిమాంసంబు
పలలాశనుల కిచ్చి పఱతెంచు పొందు । కలహాసన్నద్ధులై కడిమితో ననిన
స్వామి యానతియని వారు రథాశ్వ । సామజ కరిసింహ శార్దూలశరభ
కాసరాదుల నెక్కి ఖడ్గదీధితులు । వాసరప్రభు విభావైభవం బడఁపఁ
బఱతెంచి కేయూరబాహునిఁ దాఁకి । శరపరంపరలు వర్షంబుగాఁ గురియ
నవియెల్లఁ దునుమాడి యామ్యబాణమున । దివిజులుమెచ్చ మర్దించె వారలను
దనవద్ది దైత్యులందఱు నిట్లువడిన । దనుజాధినాథుఁ డంతయు నాగ్రహించి
కనకరథంబెక్కి కవదొన లూని । ధనురాది సాధనోత్కరముతో వచ్చి
కేయూరబాహు నీక్షించి యిట్లనియె । నోయి రాజకుమార! యుగ్రాహవమున
నసురులఁ గొందఱ నడఁచితి ననుచుఁ । బ్రాసఁగ దహంకృతిపూన నాచెంత
నిలువుము నాయస్త్రనిహతి కటంచు । విలునారి సారించి విలయకాలార్క
కిరణనిభాస్త్రముల్ క్రిక్కిఱియంగఁ । బఱపిన నవి తన బాణసంహతుల
ఖండించి రక్తాక్షుకవచంబు నిశిత । కాండ కాండముల నొక్కటఁ జెక్కుసేసి
ధనువుద్రుంచినవేఱెధనువె త్తివాఁడు । సునిశితాస్త్రములు వైచుటయుఁదుండించి
తురగ కేతన సారథుల నుగ్గుచేసి । యురమునాఁటగ నొక్క యుగ్రాస్త్ర మేసె
నందున వివశుఁడై యావనిపైఁ ద్రెళ్లి । బృదారకారి యొకింతలోఁ దెలిసి
మాయావియై నభోమార్గంబుఁ జేరి । మాయలు పన్నిన మనుజేశసుతుఁడు
అఖిల మాయాధ్వంసనాశుగం బనల । శిఖలు గ్రమ్మఁగ వైచి చిత్రవైఖరిని
మాయలు మాయింప మఱిమింట నిలువ । కాయసురాధీశుఁ డవనికి డిగ్గి
కేడెంబు కత్తియుఁ గేలఁగీలించి । యోడక పైకిరా నుంకించుటయును
బలకయుఁ గత్తియు బాణద్వయమున । నలవుమై ఖండించి యైంద్రాస్త్ర మేసి
మకుటకుండల దివ్యమానమా మస్త । మొకట నుద్ధారించి యుర్విపైఁ గూల్చె
నప్పుడు గురియించి రమరులు విరులు । మెప్పుగా నాడిరి మింట నచ్చరలు
నొప్పె సుగంధి వాయుప్రచారములు । తెప్పలుగా మ్రోసె దేవదుందుభులు
వఱచిరి దుఃఖితులై దైత్యసంతతులు । పఱచిరి హతశేష పలలభోజనులు
గోలభుండను లుబ్ధకుఁడు బహుశబర । జాలంబుతోఁ జేరఁ జాల మన్నించి

వానికి ధనము లవ్వారిగా నిచ్చి । తానవేంద్రుని యింట ధన కనకములు
ప్రతిలేని భూషణాంబర బహువస్త్ర । తతులు మోపరులచేఁ దన పురంబునకుఁ
బనుప నుద్యోగించి బరువు లమర్చి । తనకాంత బహురాజతనయల తోడ
చెఱసాలఁ బడి జాలిచెందుట తెలిసిఁగి । యరిగి యచ్చట దైన్య మాకృతిగన్న
గతి నడలుచునున్న కాంత నూరార్చి । వెతఁదీర్చి తన రూపవిభవంబుఁ జూచి
కామించిన నృపాలకన్యల నెల్లఁ । బ్రేమ లాలించి వారికి ముత్తియంపు
పాలకు లోనఁగూర్చి భార్యతో దనుజాగ్రపోలు వెల్వడి మంత్రిపుత్రునిఁ గాంచి
యీ పల్లకులవెంట నీసామ్ము దెచ్చు । మోపర్లఁ దోఁకొని ముందరఁ బోవు
మనసేనఁగలసియామగువఁదోఁకొనుచుఁ । జనుచుండుమి దెనేనుజనుదెంతు వెంట
నని ప్రియురాలి హయారూఢఁ జేసి । పనిచినఁ గుంభి పాపప్రయత్నంబు
కాంతుతో వివరింపఁగా నజ్జగాక । యింతి యూరక చనియె హయంబుమీఁద
మునుకొని పల్లకీల్ మోపర్లమంది । చనియెఁ ద్రిగర్తదేశము జాడఁబట్టి
చని ముద్దియటఁబోవు సైన్యంబు గలసికొనియె నిక్కడ రాచకొడుకు దానవుని
భవనంబులో నున్న బహుపదార్థములు । వివిధ రత్నాంబరవితతులు శబర
కోటిచే మోయించికొని జయద్దేరి । బాట చేకొని తనపత్ని పోయెనని
పల్లకీల్ చనుత్రోవ పట్టుక చనియె । నల్ల కుంభి దురాత్ముఁ డంతకమున్నె
శృంగారరేఖ తేజీమీఁద నెక్కి । యంగనల్ చనుత్రోవ నరుగుచునున్న
పోనీక యడ్డమై పొలఁతి ! నామాట । వీనుల నిడ కెందు వెడలిపోయెదవు
ఇరువుర మేగెద మెటకేని రమ్ము । మరులొందె బహువధూమణులపై నితఁడు
సరకుసేయఁడు నిన్ను సకియ! నేనెపుడునురముపై డించక యుంచి యేలెదను
అని వాగెఁబట్టి చయ్యనఁ దప్పుత్రోవఁ । గొనిపోవ వానిఁ గన్గొని పతియచట
లేకున్కి పల్లకీ ల్మించిపోవుటయు । నాకల్కి యెఱిఁగి యిట్టట్టనరాదు
వీనితో నూరక వెంబడి నంటి । రానిచ్చి మాతండ్రి రాజధానికినిఁ
జనిన పిమ్మట వీనిశాసింపఁ బనుతు । ననియెంచి వానితో ననియె నవ్వుచును
నాలాగె నావెంట నరుదెమ్ము నీకుఁ । బోలినచందాన భోగింతు గాక
త్రోవలోఁ గొఱగాని దుడుకులు సేయ । రావలదని తేజి రయమునఁ బఱపెఁ
బ్రొద్దుగ్రుంకకమున్నె పోయె వీటికిని । దద్దయువడిఁ గుంభి దానివెంబడిని

వగరింపుచును గుక్కవలె పరుగెత్తి । మగువపై మోహంబు మట్టుమీఱంగ
నీరీతిఁ దమయింటి కేగి యబ్బోటి । క్రూరుఁడై చనుదెంచు కుంభి నివ్వాలికి
రానీకుఁడనుచు ద్వారపులతోఁ దెలిపి । తానేగె వేగ నంతఃపురంబునకు
నితఁడు వెంబడివచ్చు టేమి? నీవొంటిఁ । బతిఁబాసి యిటువలెఁ బఱతెంచు టేమి?
యెఱిఁగింపుమని తండ్రి యేర్పడ నడుగఁ । దరుణి యాకుంభి చైదము లెఱింగించె
నీనృశంసుని మీఁర లేమియు ననకుఁ । డానరేంద్రకుమారుఁ డరుదెంచుడాఁక
వెలుపటితోఁటలో విడిది గావించి । నిలుపుఁడు బహుమాన నిరతిచే ననినఁ
గానిమ్మనుచు బాహ్లిక క్షమావరుఁడు । వాని మహోద్యాన వనభూమి నునిచి
భటులఁ గొందఱఁ గొల్వఁబనిచి మన్నింప।నటనుండె వాఁడు రాజల్లుండ ననుచు
నంత నక్కడఁ ద్రిగర్తాధీశసుతుఁడు । సంతోష మెసఁగ రాక్షసు నింటిసొమ్ము
సకలమ్ముగ్రహియించిసాగించి పంచి।శకటోష్ట్రములు మహోక్షములు మోపర్లు
చను పథంబునఁ దాను జవనాశ్వ మెక్కి । చనిముందుగా నేగు సైన్యంబు గలసి
పల్లకీ లేగుట పరికించి యలరి । యల్లసైన్యములోఁ బ్రియాంగన వెదకి
యెక్కడఁ బోయెనో యిందీవరాక్షి।యక్కుంభియును లేఁడయారె! ముందుగను
బురమున కేగిరో? ఖో లేక వెనుక । నరుదెంచుచున్నారో? యలసయానమున
నని వితర్కించి నిజాప్తుల నడుగ । జనవంద్య! వార లిచ్చటికి రాలేదు
వెనుకఁజిక్కిరొయన్న వినిమంచిదన్ని।యునుగాననయ్యెడినొకముహూర్తమునఁ
బదుఁడని శృంగారభవనంబుఁ జేరి । కొదమపాయపు ముద్దుగుమ్మలతోడఁ
గరిహయ రథభటోత్కరములతోడ । సరిలేని రత్నభూషణ రాజితోడ
ధనముతో నమితగోధనముతో దాస । జనముతోఁ గనకభాజనములతోడ
మరకత వైడూర్య మరకత వజ్ర । కురువింద విద్రుమ గోమేధికాది
ఘనపేటికలతోడఁ గన్నతండ్రికిని । జనయిత్రికిని భక్తి సాగిలి మ్రొక్కి-
రమణీయ రత్నాంబరములఁ బూజింపఁ । బ్రమదంబుతోఁ గూర్మిపట్టి దీవించి
యక్కునను౦చి వారంగంబు నిమిరి । యెక్కడఁ బోయితి విన్నాళ్లు వత్స!
యీకాంత లెవ్వార లీధనం బెచటఁ । జేకూరెఁ దెలుపు మాచెవుల కింపుగను
వినియెదమని ప్రేమ వేఁడు వారలకుఁ । దనకథ యెల్ల నాతఁడు వినిపించె
శృంగారరేఖ బాహ్లికరాజసుతఁ దు । రంగమెక్కించి పురంబున కపుడె

పనిచితిఁ గుంభియుఁ బఱతేరఁడయ్యె।గనకాంగి మఱల నెక్కడఁ జిక్కవఁజెనొ!
యీవిచారము మదిహెచ్చె నటన్న । భూవరుఁ డయ్యింతి పుట్టినింటికిని
చనెనేమొ తెలియుము చారులఁ బనిచి । యని వేగువారల ననిచె నాతఁడమొ
తొంబదితొమ్మండ్రు తోయజాక్షులను । ... ... ...
తగు సౌధములనుంచి తలిదండ్రు లలర । జగతీజనులు తనశౌర్యంబు పొగడ
జనకునికడనున్న సమయంబు నందుఁ । జనుదెంచి వారితోఁ జారు లిట్లనిరి
అవధారు దేవ! నీయాప్తుఁడౌ కుంభి । చివురాకుబోడి నాశృంగారరేఖఁ
గామించి యేమేమొ కాఱులాడంగ । నామిటారి సహింప కశ్వమ్ము నెక్కి
తన పుట్టినింటికిఁ దరలిన వెంటఁ । జని రాజ! నేనె నీజామాత ననుచు
వంచన శృంగారవనములోపల వ । సించినాఁ డాయింతి చెడుగు వీఁడేడ
నీయల్లుఁ డున్నాఁడు నిశిచరాంతకుఁడు । కేయూరబాహుఁడు కీర్తివర్ధనుఁడు
ఐన నాతఁడు వచ్చునందాఁక వీనిఁ । బోనీకుఁడని రాజపుంగవుతోడఁ
బలికిన నారాజు భటులఁ గొందఱను । గొలువఁగ నియమించి కుంభి నేమరక
నిలిపికొన్నాఁడు వానిప్రభుత్వ మెంచ । నలవిగా దేనె రాజల్లుండ ననుచు
నందలంబెక్కి వాహ్యాళిగా, వీథు । లందు వందిజనమ్ము లభినుతుల్ సేయఁ
జరియించు నొకవేళఁ జననీయఁ డంతి । పురమున కారాజు పూఁబోణి మదిని
బాగులు మన్నది నిన్నుఁ బాడఁగానకునికిఁ।దగదు మీరిఁక నిందుఁ దామసింపఁగను
నేఁట రేపటఁ బోయి నీచుఁ డాకుంభి । యాటోప మడఁగించి యతివఁ దోడుకొని
రావలెననిన తెలంగెల్లఁ దండ్రి । తో వివరించి యా దోర్బలాధికుఁడు
నొకదినంబున దైవయోగంబు కతన । నొకదుండ చేత నాయుధ మేమి లేక
ప్రచ్ఛన్నవేషుఁడై పఱతెంచెఁ గుంభి । తుచ్ఛత శోభింపఁ దొయ్యలి! వినుము
రాకుసాంగన పతివ్రతగాన దాని । యక్షీణశాపోక్తి యటులఁ ద్రేరేపఁ
బురబాహ్యమున వచ్చు భూపాలపుత్రి । వరుని సరాళంబు వచ్చిన కుంభి
పరికించి తనయొద్ది భటులతో వీని । కరపదచ్ఛేదంబు గావింపుఁ డనుచుఁ
బనిచి తానిల్వాక పట్టణమ్మునకుఁ । జనెఁ గృతఘ్నునకు దోషాచార మేల?
నామూర్ఖుఁ డనిచిన యటుల నబ్బటులు।భూమీశసుతునిఁ గొంపోయి దవ్వులను
నెలదోఁట చెంగట నిరవొందు వధ్య । శిల నుంచి కరపదచ్ఛేదం బొనర్చి

పడవైచి పోయి రాపలలాశిరాజు । పడఁతి శాపమున దుర్బలునట్టు లడల
వనపాలుఁ డవు డాత్మవనితతో వచ్చి । కనుగొని యతని శృంగార వైఖరికి
నివ్వెఱపడి యేమి నేరంబుఁ జేసి । తివ్విధి వ్యథనొంద నేమికారణము ?
రాజపుత్రుఁడవేమొ రమణీయ తేజ! । యే జడుం డొనరించె నింత యక్రమము?
నెఱిఁగింపుమనిన రాజేంద్రనందనుఁడు । హరహరా! యెవ్వరిననఁ బనియేమి ?
కుంభియాపమున నాఘోరంపువిధి వి । జృంభించి యిటువలెఁ జేసెనటన్న
నావనపాలుఁడు హా! యని వగచి । వేవేగఁ దనభార్య విపణికి ననిచి
నూనెయు నిమ్మపండులును దెప్పించి । పూని పావకముఖంబునఁ గాఁచి యొత్తి
యానొప్పి దీర్చి యుద్యానవనంబు । లోనున్న తనయింటిలో నొక్క శయ్య
పైనుంచి పోషించె బహుదివసములు । హానియొక్కఁడు సేయనరయు నొక్కరుఁడు
అలరుల సరముల నప్పటప్పటికి । నల రాజతనుజాత కవ్వనపాల
కామిని గొనిపోవుఁగావున నతని । కామెచెందెడు విరహము దెల్పుచుండు
వారు లేనప్పు డావనభూమి తానె । యారయుచుండు నయ్యవనీశసుతుఁడు
రాత్రులు వారప్పురంబున కరుగ । ధాత్రిపై కుఱికి యుద్యానవీథులకు
నెవ్వరిఁ జొరనీక యెలుఁగిచ్చుచుండు । నివ్వగ నెలలు నాల్గేగిన వెనుక
నొకనాఁటిరేయి మహోక్షంబు నెక్కి । మకరాంకవైరి నిర్మల దేహరుచులు
వెలసి దిక్కులు పండువెన్నెలల్ గాయ । జిలువరా తాళీలజిగి దేరు మణులు
ధగధగ వెలుఁగ ముందర వెన్కఁ బ్రమథులగజేశ! శంకర! హర! పరాకనుచు
హెచ్చరించంగఁ జండీశుఁడు కేలి । పచ్చబద్దనె బరాబరులు గావింప
రహిఁ గెంజడలు సాంధ్యరాగంబు గూర్ప । బహు రుద్రకన్యకావ్రతతి సేవింప
వామాంకమున హైమవతినుంచి యామె । మోముగన్గొని ప్రేమముచ్చటాడుచును
నావనమార్గంబునందు రా శివుని । దేవి కన్గొని మహాదేవ! పరాకు
ఈవనం బతిరమ్య మించుకసేపు । నీవు నే నిచట నెంతే వేడ్కనుండి
యవలఁ బోదమటన్న నౌఁగాక యనుచు । శివుఁడు ప్రవేశించె శృంగారవనము
దేవియు దేవుఁ డీరీతిన వనము । లోవచ్చి డిగ్గు టాలోకించి యతఁడు
కాయంబు పులకింపఁగా మఱి సద్దు । సేయక సెజ్జ చెచ్చెర డిగ్గి నేలఁ
బడి పొరలుచుఁ బోయి బలుపొదరింటి । కడ మానువలె కూలి కదలకయుండె

శంభునితోఁ గూడి శాంభవీదేవి । రంభామ్ర జంబు కురంటకాశోక
పనస మధూక పిప్పల పారిజాత । కనకాది తరుసముత్కరముతో నెనయు
మాలతీ మల్లికా మాధవీలతల । నేలకితీఁగెల నెలమిఁ గన్గొనుచు
నల పొదరింటిచాయకు వచ్చి యచట । శిలవలెఁ బడియున్న క్షితివరాత్మజుని
వీఁపునఁ బదముంచి విరులుగోయంగ । నాపట్లఁ బులకించె నతని నెమ్మేను
అందునఁ దెలిసి యయ్యంబ యెవ్వాఁడ।వింతేలఁ బడియుండె దెఱిఁగింపు మనఁగ
నంతలోఁ బరమేశుఁ డచటికి వచ్చి । యింతి! నీసేవకుం డీరాజసుతుని
నెఱుఁగవే? యెఱిఁగియు నెఱుఁగనియటులఁ।గరుణచూడక వేడఁగా నేల? యనిన
గిరిజ సయ్యనడిగ్గి కేయూరబాహ! । వెఱవక శివుని సేవించికొమ్మనిన
మొద్దుచేతులు రయంబున బారసాచి । యద్దేవదేవుని యంఘ్రులు శిరము
గదియించి "ఓంనమోగరళకంఠాయ । సదయాంతరంగాయ సర్వేశ్వరాయ
శంభవే శూలినే శశిశేఖరాయ । దంభూత వామాంగధారిణే పాహి
పాహి" యటంచు సద్భక్తిఁ గీర్తించి । దేహిమే కరపదద్వితయం మహేశ!
తవ దర్శనా దహం ధన్యోస్మి యనఁగ । శివ! కటాక్షించి యచ్చిన్నిబాలునికిఁ
గరపద యుగళముల్ గరుణింపుఁడనిన । హరుఁ డట్లౌగాక యని వరంబిచ్చెఁ
జిగురుటాకులలీలఁ జేతులుగాళ్లు । నగజేశ్వరులకృప నావిర్భవింపఁ
గ్రక్కున లేచి యగ్గౌరి యంఘ్రులకు । మ్రొక్కి హస్తంబులు మోగిచి యనేక
విధముల వినుతించి వినుఁ డోకమనవి । యధికవాత్సల్య కల్యాత్ములై మీరు
కావలసినవేళఁ గరము లంఘ్రులును । రావలె వలదన్న రాకుండవలయు
నటు ప్రసాదింపరే! యన్నఁ దలంచి । నటుల యౌనని వారలంతర్ధిఁ గనిరి
మరునాఁటిరేయి నమ్మనుజేశసుతుఁడు । విరులు తానెగ్రహించి వింతగా బంతి
కట్టి పంపిన రాజకన్యక కిచ్చె । నట్టి యవ్వనపాలికాబ్జపత్రాక్షి
యీవింత పూబంతి యెవ్వరు గట్టిరో! వెలందుక! యన్న నొక మొండివాఁడు
వనిఁజేరి యున్నాఁడు వాఁడిట్లు గట్టె । పనిచెనటన్న నబ్బాలిక పలికె
మొదటనే యంటివి మొండివాఁడనుచు । నిదియెట్లు గట్టినాఁ డేల మొండయ్యె?
వినిపింపుమనిన నవ్వెలఁది యిట్లనియె । ననబోణి! కుంభి యన్వాఁ డకారణము
కరపదహీనుని గావించె నతఁడు । చిఱుత పాయపువాఁడు శృంగారమూర్తి

యతని నొప్పి హరించి యరసితి మేము।సఖి! యన్నఁబూబంతి సడలించి యందుఁ
గేతకీదళ సంలిఖిత వర్ణపంక్తి । యాతలోదరి చూచి యది చదివికొని
యతఁ డాత్మవిభుఁడౌట నప్పుడెఱింగి । పితృసమీపమునకు భీతయై యరిగి
యాచీటి చదివి రక్తాక్షాది బహుని । శాచరవీరుల సమయించినట్టి
గురువిక్రమాఢ్యుఁ డీకుంభిచే నిటులఁ । గరపదహీనుఁడై గాసిల్లె ననుచు
నడల విక్రమసేనుఁ డాకన్య శోక । మడఁచి మిత్రులు మంత్రు లాప్తులు గొలువ
బాలికఁ దోఁకొని భార్యయుఁ దాను । గేళీవనముసొచ్చి కేయూరబాహుఁ
గరపదహీనునిఁ గని చాలవగచి । యెఱుఁగక నిల్పితి మీకుంభి నీకుఁ
బరమాప్తుఁడని యెంత పాపాత్ముఁ డనుచుఁ।గరమల్గి వానినక్కడకుఁ బిల్పింప
నరుదెంచె భటులు హేయపుమాట లాడఁ । బరిభవం బొదవదే! పాపిష్ఠి కిటుల
వచ్చి యచ్చటఁ దలవాల్చి నిల్చున్న । యచ్చెడుగును జూచి యలరాజకన్య
పలికె నిక్కజనుండు బాటలో నన్నుఁ । దలఁబట్టి పడఁదోయఁ దమకించి మీఁదఁ
బడిరాఁగ నేభయంపడి మొఱయిడినఁ । గడు వేగవచ్చి రాక్షసుఁడు ముంగాల
నీమూర్ఖుఁ దన్ని నశ్నుత్తుక పోయె । నామీఁదఁ దేజిపై నరిగెడు నన్నుఁ
బోనీక యెటకేనిఁ బోదము గమ్ము । మానినీశతము నీమగని కుండఁగను
నిను సడ్డసేయునే! నెఱినీటుకాఁడ । నను వరింపుమటంచు నానావిధముల
వదరుచుఁ దప్పుత్రోవను గొనిపోవ । నిది తఱిగాదని యెంచి మాపురికిఁ
జనుదెమ్ము నీకోర్కి సఫలమౌ నచట।నని వాగెవదలించి హయము దోలికొని
వచ్చితి నిచటికి వైధేయుఁడెదిగి । వచ్చె నావెంబడి వడి నిట్లువచ్చి
తానె జామాత నీధరణీశ్వరునకు । శ్రీనిధి తనభార్య శృంగారరేఖ
యని వదరుచుఁ దిరుగాడు నిప్పుడని । నిను నెంటిరాఁ జూచి నెనరింతలేక
తునిమించెఁ గాళ్లుచేతులు క్రూరుఁడగుచు ।గనివిని యెఱుఁగ మేకడ నిట్టిఖలుని
నీకృతఘ్నునిఁ బట్టి యెంతచేసిన ధ । రాకాంతతనయ! తీఱదు కోప మనుచు
నందఱువినఁ దనయంగన పలుక । ముందరనున్న యమ్మొఱకు నీక్షించి
కేయూరబాహుఁ డాక్షేపించి పలికె । నోయి కుంభీ! యెంత యుగ్రకర్ముఁడవు!
చెలికాఁడవని విశ్వసించితి నిన్ను । భళిభళిరా! యెంతపని చేసినావు
నీతోడఁ బలికిన నిముఁ గనుంగొనినఁ । బాతకం బొదవు నిబద్ధిగా ననుచుఁ

బలుక బాహ్లికభూమిపతి యాగ్రహించి। తులువ నాఁజను వీనితో మాటలేల?
నెదురుగాఁ జెంగట నిడుకొని యనుచుఁ।గుదియంగఁ గట్టించి కూలఁ ద్రోయించి
బండిపై నిడి వీనిబలుకండ లెల్ల। ఖండించి కాకులు గ్రద్దలు దినఁగ
వ్రేయుఁడు కళలెత్తి వ్రేయుఁడు తునిమి। వ్రేయుఁడు కరపదద్వితయంబు ననుచు
సెలవొసంగిన నట్లచేసిరి కొంత। బలవంతులగు వీరభటు లంతలోనఁ
గరపదములు కోయఁగా వలదనుచుఁ। గురుణతో రాజశేఖరుఁ డద్దురాత్ము
విడిపించెఁ గాకాదివిహగముల్ వాని। యొడలి కండలు తిన కోకిలించికొనె
ధర నట్లుగాదె కృతఘ్ను రక్తంబు। కొఱగానిదని క్రక్కుకొనుఁ గుక్క లైన
గడురోసి సిగగోసి కన్నులుదీసి। విడిచిన వాఁడొక విపినంబులోనఁ
బడిపోయెఁ గేయూరబాహుని నంత। నడరువేడుక బాహ్లికావనీశ్వరుఁడు
పచ్చల పల్లకిపై నిడికొని భ। టోచ్చయంబులు మంత్రు లుర్వీజనములు
గదిసి కొల్వఁగఁ దనగారాబు పట్టి।మదవతుల్ గొలువఁగా మగనిఁ గ్రమ్మఱను
గనఁగల్గెనని కౌతుకంబు వహించి। జననితో ననుచరాఁ జని పురిఁజొచ్చి
మగఱాలమేడ జామాతను నిలిపె। నగణిత గుణగణ్య యారాజకన్య
కరపదహీనుండుగా యని యాత్మ। నెఱబఱికము లేక యెంత లేదనక
పాలుమాలక వెతఁబడక పోషణల। కాళీజనముఁ బంప కహారహం బెనసి
మమతతో నతని నేమరక పోషించెఁ। గ్రమ మెఱింగిన పతివ్రతగాన యిటుల
స్థిరబుద్ధి నొకనెల సేవలుసేయఁ। దరుణి భక్తికి మెచ్చి ధరణీశసుతుఁడు
నేకతంబున దానికిట్లని పలికె। నీకేమికావలె నీలోత్పలాక్షి!
యెఱిఁగింపు మడిగిన నిచ్చెద ననిన। నరవిందలోచన యానందమంది
నను మెచ్చితేని మానవనాథతనయ! । మునుపటివలెఁగరంబులు పాదములును
వహియింపుమనియెఁగావలసినకోర్కి!మహిమాఢ్యుఁడవుతుచ్ఛమనుజుఁడమాడ్కి
నిట్టులుండుట పాడియేయని వేడు। పట్టంపుదేవి నున్ బలుకుల కలరి
నీతలిదండ్రుల నీసహోదరుల। నీతోడిసకియల నీబంధుజనులఁ
బిలిపింపుమిచటి కంబిక కృపాకలనఁ। దెలిగంటి! నీదు పాతివ్రత్యమహిమఁ
గరములు చరణముల్ గలిగెడు ననినఁ। దరళాక్షి వారినందఱఁ బిలిపించె
నత్తమామలు మొదలైనవారలకుఁ। జిత్తంబు రంజిల్ల క్షితివరాత్మజుఁడు

హరహర! శంభో! మహాదేవ! యనుచు స్మరియింపఁ గరపదాబ్జము లుద్భవించె
నాయద్భుతము చూచి యచటివారెల్లఁ గేయూరబాహునిఁ గీర్తించి రపుడు
అత్తమామలు బంధు లత్తలోదరియు । బత్తిసేయంగ శోభనలీల నచట
నురుతరోత్సవములఁ గొన్నినాళ్లుండి । తరళాక్షిఁ దోడ్కొని తనయూరి కరిగి
తొంబదితొమ్మండ్రు తోయజాక్షులఁ బ్రి । యంబునఁ బెండ్లాడి యందఱఁగూడి
యొందునఁ గొదువ లేకెల్ల భోగములు।చెంది తండ్రియనుజ్ఞ క్షితిఁ బ్రోచుటకును
బట్టాభిషిక్తుఁడై ప్రజ జయవెట్ట । నిట్టలంబగు ప్రేమ శృంగార రేఖ
వలనఁ బుత్రులఁగాంచి వన్నెయువాసి।గలిగి శాంభవి కటాక్షమున సొంపొందె
శృంగార రేఖాచరిత్రంబు వినిన । సంగతిఁ జదివిన సత్పురుషులకు
నాయురారోగ్య భాగ్యంబులు గలుగు।శ్రీయుప్పతిలునంచుఁజిలుక తెల్పుటయు
నాపుష్పమంజరి యలరుచు నేగె । లోపలి కలనృపాలుని దూతి చనియె
నని శంభుఁడెఱిఁగింప నవ్వలికథలు । వినిపింపుఁడని గౌరి వేడ్కతో ననియె
సరస పతిప్రతా చరితంబు నందు । నరయ నిర్వదితొమ్మిదవకథ యమరె

---

# శుక గాంధర్వ కథ

శ్రీ విశ్వపతి సమంచితమూర్తి గౌరి । కావలికథ యిట్టులని తెల్పఁదొడఁగె
చెలి మఱునాఁడు పశ్చిమదిశా కాంత । బలు సంజకెంజాయపట్టు ధరించు
వేళ దూతికపిల్వ వెనుకొని వచ్చు । బాలఁగన్గొని చిల్కపల్కె నవ్వుచును
బతిని వంచనజేసి భామలు చెడిన । కతలవి యెన్నైనఁగల వెంచ నేల
నతిరహస్యంబైన యర్థంబు దెలిపి । పతిగుట్టు దెల్పిన పడఁతి చరిత్ర
యొకటి గలదది యూకొందుగాక । యక్క! పరాకులే కాదికాలమున
వంగరాజ్యంబున వాసంతికాఖ్య । రంగారు నొకనగరము రమాకరము
నింద్రుఁడు దివిఁబోలి యేలు నప్పురము । చంద్రధ్వజుండను జగతీశ్వరుండు
ఆదొరకు వరాంగుఁడను కుమారకుఁడు । ప్రాదుర్భవించె రూపజితాంగజుండు

అతనికిఁ బరిపూర్ణ యౌవనోల్లాస । మతిశయింపఁగ మున్నె యమ్మహారాజు
గావించెఁ బెండ్లి చక్కనిదాని మత్స్య । భూవల్లభుని పుత్రిఁ బున్నాగగంధి
నక్కన్యకను బెండ్లియాడిన మొదలు। చక్కఁ జూడఁడెకదా స్వగృహమ్మునకును
దోడితెమ్మని నిజాప్తులఁ బంపఁడొక్క। నాఁడైనఁ బుట్టినింటనె యుండె నదియు
పుట్టినింటనె యున్నఁ బొలఁతిపాయు మది । యెట్టానొయని సంశయింప కిరీటి
రాచూలి యున్నఁ బరద్వారయయ్యో । నోచెల్వ! యిదిమీఁద నుగ్గడించెదను
ఆవరాంగకుఁడిట్లు యౌవనోజ్జ్వలిత । యౌవరాజ్యమునకు నభిషిక్తుఁడగుచుఁ
దమతండ్రినుడి జవదాటక యున్న । సమయంబున వివేకశాలియౌ నొక్క
ద్విజకుమారుఁడు దూరదేశంబు లేగి । స్వజనమ్ములున్న వాసంతికాపురికి
నరుదెంచి యొక్కనాఁ డావరాంగకునిఁ । బరిజనసహితునిఁ బ్రాభవోన్నతుని
సభలోనఁగని రెండు జంబీరఫలము । లభినవాదృతి నిచ్చి యాశీర్వదించి
యతనిమన్ననఁగాంచి యర్హపీఠమున । హితగోష్ఠినుండి యోయివరాంగ! సుతులు
గలరె నీకని చెలికాఁడౌట నడుగ । నెలనవ్వుతో నమ్మహీశనందనుఁడు
బొట్టుగట్టిన మొదల్ పూబోణిముఖము। దెట్టులుండునో! చూచియెఱుఁగ నటన్న
నల కమలాకరుండను పిన్నవయసు । నలినాక్షిఁ బుట్టినింటనె నిల్పనగునె?
పొగరుఁ బ్రాయపుటాలిఁ బుట్టినయింట । దిగవిడిచిన కుబుద్ధికి నొక్కతిట్టు
తనధనం బన్యుచే దాఁచగానిచ్చు । చెనఁటికి నట్ల చెచ్చెరఁ దానుపోవు
పనికి వేఱొక్కనిఁ బనిచిన పాల । సున కొకతిట్టను సుజనోక్తి వినవె ?
యనిన వరాంగుఁడట్టైన నప్పురికిఁ । జని దానిశోధించి చనుదెంతు ననుచు
భోరునఁజని మత్స్యపురి గోపవేష । ధారియై యొకవైశ్యధామంబు చేరి
వానిచేతికి నూఱువరహాలు దాఁచఁ । గానిచ్చి నగరివెన్కను గణేశ్వరుని
గుడి నున్నచోఁ బ్రొద్దుగ్రుంకిన నాల్గు । గడియల కయ్యూరుగాఁచు తలారి
కొడుకు పావలుమెట్టుకొని కత్తి చంక । నిడుకొని తెలికుమాలిమ్ముగాఁ గట్టి
వలిపదుప్పటి వలెవాటుతో నీటు । గులుక నుద్ధతివచ్చి గుడి సెవ్వరనుచుఁ
బలుకరించుటయు గోపాలకవేష । మొలసిన నృపసూనుఁ డోయన్న! నేను
పరదేశి గొల్లండఁ బండియున్నాఁడ । నరుగలే నెక్కడికనిన వాఁడోరి!
యీరాయి వడిఁద్రిప్పి యివ్వలఁబెట్టి । రార నావెంట శీఘ్రంబున ననినఁ

బిల్లారిముందరఁ బెనురాయి తిగిచి । యల్లన కడఁబెట్టి యందొకబిలము
గనుగొని యిఁకనేమి గావింతు ననినఁ । దనచేతి విరిసరుల్ తావిగంధంబు
వక్కలాకులు నిచ్చి వాఁడు నావెంట । నిక్కడి కరుగుదె మ్మివిగొని యనుచు
నన్నేలమాళిగ యతనితోఁ జొచ్చి । పున్నాగగంధి పాన్పుసమీపమునను
నవియెల్లఁ బెట్టించు నప్పుడయ్యింతి । యవలికి నత్తలయారినిఁ బిలిచి
వీఁడెవ్వడని భీతివేడిన గొల్ల । వాఁ డేలవెఱచెదు వగలాడి! యనుచు
నిటువంటిశావుల కీవింతవాని । నెటువలె తోతెచ్చి తెఱుఁగవే బుద్ధి
యిప్పుడే చంపించు మీవేషధారి । తప్పిన మనలకిద్దఱకు మోసమగు
ననునెడ దానిరాజాత్మజ యనుచుఁ । గనుఁగొని తెలిసి భూకాంతునిసుతుఁడు
నిది తఱిగాదని యేమనకుండె । నొదిగి తలారి యయ్యువిధ పంపునను
నారాజసుతుతో బయల్దేరి వీధి । బారులై చను తనభటుల కందఱకు
గమికాఁడయినవానిఁ గ్రక్కునఁ బిలిచి । నిమిషంబులోన వీనిశిరంబు ద్రెంచి
యల వధ్యశిల నుంచి యరుగుదెమ్మనుచు। సెలవిచ్చి యొప్పగించి బిరీనఁ జనియెఁ
జెడుగులౌ కులటలఁ జేపట్టినట్టి । జడుల కాపదలిట్లు సంఘిల్లకున్నె!
ఆగమికాఁడు వరాంగకు నిట్లు । వేగంబె పెనుత్రాళ్ల విఱిచి కట్టించి
కొనిపోవ వారికిఁ గూరిమివుట్ట । వినయోక్తులాడి యోవిమలాత్మ! నీకు
శతనిష్కములు చేనొసంగెద నిపుడె।బ్రతికింపుమని చాలఁ బ్రార్థించి యొక్క
వరవీరభటు నంపి వైశ్యుఁడు నూఱు । వరహాలొసంగెడి వడిగఁ దెమ్మనుచు
ననిచిన వైశ్యుఁడాయన నెవ్వఁడెఱుఁగు।నిను నెవ్వఁడెఱుఁగు కంటివెవరాలతఁడు
నాచేతి కొసఁగ మిన్నక పొమ్మటన్న । రాచబిడ్డని కత్తెఱఁగు వాఁడుదెలిపె
దెలిపిన నొరునిచేతికి నర్థమొసఁగు । ఖలునకుఁ దిట్టన్నకత నిజంబయ్యెఁ
బుట్టినయింట నంభోజాక్షి నిడిన । యట్టివానికి నట్లయగుట కాన్పించెఁ
దనపని కొరునంపఁ దగదనితాన । చనియెఁ దలారులు జతగూడి రాఁగఁ
జని శెట్టిచేతి నిష్కము లట్టెపుచ్చు । కొని తలారికొసంగి గుట్టునవాఁడు
పురబాహ్యమున డించిపొమ్మన్న నవల । నరిగె తూర్పున భానుఁ డంతటఁదోచె
నరుణోదయమున సంధ్యావిధుల్ దీర్చి । తరుణిపైఁ గ్రోధమత్సరములు హెచ్చ
మామచెంగటి కేగి మామ! కన్గొనుము । నీముద్దుకూఁతురి నిలయం బటంచు

నానేలమాళిగ యతనికిఁ జూపి । దానికిఁ బ్రియుఁడైన తలయారికొడుకు
తెలిఁగును దాను రాతిరిగన్న విధము । నెఱిఁగింప నతఁడుగ్రహించి తలారి
కొడుకు నాక్షణమునఁ గొఱ్ఱవేయించి । పడుచును నూతిలోపలను ద్రోయించి
యతనికిఁ దమ్ముని యాత్మజునొసఁగ । మతినెంచ సమ్మతింపక యూరికేగి
ద్విజసుతుఁ గని నీవు తెల్పినదెల్ల । నిజమాయె నని యతని బహూకరించి
మగువలనింక నమ్మఁగరాదు వారి । తగు లొల్లనని విరక్తస్వాంతుఁ డగుచుఁ
బరిణయస్పృహవహింపక యవ్వారాంగుఁ । దుఱక యుండఁగఁ దండ్రియును మంత్రివరులు
నీడేరిన మిటారి నిఁకనీవు పెండ్లి । యాడవేనియు నుపాయము వినుమొకటి
యనివారలొక యుపాయము దెల్పమంచి । దని సమ్మతించి చయ్యనఁ దమతండ్రి
యనుమతి గర్భిణులగు రాజు సతుల । నెనరుగల్గిన వారి నెమ్మిఁ బిల్పించి
నగరిలో నిడికొని నానాఁటి కుచిత । మగురీతిఁ బ్రసవ పర్యంతంబునరయ
వారిలోఁ జేది భూవరకాంత యొకకు । మారిని గనియె మన్మథు చిక్కటారిఁ
బోలినదాని నాభూవరసుతుఁడు । బాళిమైఁ జేకొని ధర్మసౌధమున
నేకతంబుననుంచి యెవ్వారి నటకు । రాకుండ నేమించి రాతిరిపగలు
కనికరంబునఁ బ్రోవఁగా దాదినొకతెఁ । బనిచి తా నప్పటప్పటి కేగి యేమి
వలసిన నిచ్చుచు వాక్రువ్వరాని । యెలమితోఁ బ్రోఁదిసేయించెఁ గొన్నాళ్ల
నేఁడెనిమిదియేఁడు లేగిన నేఁడు । మేడల కవ్వలిమేడపై నుంచి
దాదిని రానీక దానికి మజ్జ । నాదులు భోజనం బాదిగాఁ గలుగు
పనులెల్లఁ దానెతప్పక యొనర్చుచును । బెనుతల్పులన్నియు బీగముల్ వేసి
బయలుదేరుచుఁ బాట పదమును జదువు । ప్రియమొప్పఁ దానె చెప్పి నిరంతరంబు
నించియు మంచియు నిడుచు నలంక । రించుచు రత్నపరిష్కారములును
వలువలు అవిక పావడ గంధమాల్య । ములు దెచ్చియిచ్చుచు మూలనే దాఁచి
నోరూర దాని మనోరమ యనుచుఁ । జేరుచుఁ జెక్కిలిఁ జేరుచు మోము
ముద్దిడుకొనుచు సొంపున నది తెలుపు । సుద్దు లాలింపుచు సుముఖుఁడై యుండె
సుమమంజరికిఁ దావిసుడిసిన ఠీవి । కొమరు పాయమువచ్చె కోమలి కపుడు
వెలఁది కొప్పునకొక వింతకప్పొదవెఁ । జెలికన్నుఁగవకు హెచ్చెవింతబెళుకు
కలికి చెక్కులకుఁ జక్కనికాంతి మొనసె । నెలఁత మోమున కొకనీటు వాటిల్లె

బాలిక గబ్బిగుబ్బల కుబ్బువోడమి । నీలవేణికి మేన నెఱమించు మించె
నాతి వాతెఱకెంపు నాడెంబుగాంచె । నాతలోదరికిఁ బాయపువన్నె మించె
నీలీల నెలఁబ్రాయ మెనసిన దాని । జాళువా మేడపై సకినెలకోళ్ల
పట్టెమంచము మీఁదఁ బఱచిన విరుల । దట్టంపుఁ బాన్పుపైఁ దమి యగ్గలింప
వలరాజు సాక్షిగా వనిత గాంధర్వ । కలనఁ జేపట్టి యంగము పులకింపఁ
గలసి మన్మథకేళికాలోలుఁ డగుచు । నలరెఁ దాఁబడిన ప్రయాస మంతయును
ఫలియించె నిపుడని పార్థివసుతుఁడు । దలఁచి రేలెల్ల నత్తరుణితోఁ గూడి
క్రీడించుఁ బగలు వాఁకిళ్లెల్ల మూసి । వేడుక గొలువులో విభవంబు మెఱయు
మసలక వసియించు మధ్యాహ్నమైన । వెసఁ బోయి వాఁకిళ్ల వేసిన యట్టి
బలుబీగములు దీసి భవనముల్ సొచ్చి । తలుపులు గడెలు భద్రంబుగా వేసి
కక్ష్యాంతరంబులు క్రమియించి చని మృ । గాక్ష్యనురాగ లోలాత్ముఁడై యుండు
నంతట నొక్కనాఁ డలినీలవేణి । కాంతుఁడు పేరోలగమునకుఁ జన్న
నొంటిగా మేడపై నుండగా లేక । యింటి చెంగట నొప్పు నెలదోఁట నడుమ
చెన్నొందు సురపొన్నచెట్లలో వ్రేలు । చున్న బంగరుతూఁగు టుయ్యాల లోనఁ
బికములు తన జిలిబిలి తేటపాట । లకు గుంపుగూడి కెలంకుల మెలఁగ
నెరయ ముంగురులతో నెక్కొని నుదుట । హారువుగాఁ జేర్చుక్క యల్లలనాడఁ
గంగుల అలికపై గబ్బిపాలిండ్ల । రంగారు రత్నహారములు చలింపఁ
గరకంకణధ్వనుల్ కాంచికార్భటులు । చరణ నూపుర ఝుళంఝుళ లైక్యమందఁ
జక్కని నెమ్మేనిచాయ నద్దెసలఁ । గ్రొక్కారు బల్ మెఱుంగుల రంగు గూర్పఁ
గేళి సల్పెడుదాని కిలికించితాది । హేలలు వినువీథి నేగుచునున్న
కనకాంగదుండను గంధర్వవిభుఁడు । కనుఁగొని యాశ్చర్య కలితాత్ముఁ డగుచుఁ
దన విమానము వియత్తలమున నిలిపి । వనలక్ష్మియో? యిది వలరాజుసతియొ?
యనిమిషాంగనల క్రీయందముల్ గలవె? । యని దానిచెంగటి కరుదెంచి పలికె
నొంటిగా నుయ్యాల లూగెడు వాలు । గంటి! నీవెవ్వరికాంతవు? చెపుమ
కళలీను నీనెమ్మొగము గనుంగొనినఁ । బొలఁతి! ముద్దాడనే బుద్ధిపుట్టెడిని
వనజాక్షి! నీకెంపువాతెఱఁ గనిన । మొనపంట నొక్కనే ముచ్చటయ్యెడిని
కలికి! నీబిగిచన్నుఁగవఁ జూచినంత । నలమి కౌఁగిటఁజేర్ప నాసగ్రమ్మెడిని

చెలువ! బంగరుబొమ్మ జిగిఁబన్ను నిన్నుఁ । దిలకింప భోగేచ్ఛ తీవ్రపెట్టెడిని
చిలుకలఁ దరుము నీచిన్నారిపలుకు । వెలఁది! నావీనులు విననె కోరెడిని
పలుకవే! కపురంపుఁబలుకులు గులుకఁ । దలయెత్తి చూడవే! ధవళాయతాక్షి!
యనిన గంధర్వుని యాకారరేఖఁ । గనిమరుల్గొని తనకథయెల్లఁ జెప్పి
దైవంబె నినుఁదెచ్చె ధవుఁడు మధ్యాహ్న । మావేళ నిటువచ్చు నందాఁక నీవు
ననవుతో నాజవ్వనము కొల్లలాడు । మని వానిఁజేకొని హర్మ్యంబుఁ జేరి
చలువపానుపుమీఁద శయనింపఁ బంచి । వెలఁది కర్పూరంపు వీడియం బిచ్చి
తమిఁ బెనంగొని పేరెదను గుబ్బలొత్తి । సమరసక్రీడలఁ జతురత చూపఁ
గడుమెచ్చి వాఁడును గళలంటి దాని । నుడివోని సురతసౌఖ్యోదధిఁ దేల్చె
వలచె గంధర్వుఁ డాపనితయు మూఁడు । వలపులు వలచె నీవగ దినదినము
నేఁడు వచ్చినవేళనే వచ్చి నన్నుఁ । గూడి సుఖంపు మేగుము నేఁటి కిదిగొ
పగలయ్యె నాపతి పఱతెంచి కన్నఁ । బగలయ్యెను నటంచు బాళితో వాని
మోము మోమునఁజేర్చి మోవి గ్రోలుచును। గామిని పనిచిన గంధర్వుఁడరిగె
చెలువంబు నేర్పులు చిన్నెలు గలిగి । కళల మర్మమెఱుంగు గంధర్వసుతుఁడు
వచ్చి భోగించిన వలవకయున్నె । యెచ్చంద్రముఖయైన నిదియేమి యరుదు
పగటిదాఁక నెలంతఁ బాయకయుండి । గగనయానంబున గంధర్వుఁ డేగ
వాఁకిళ్లు దెఱచుకవచ్చి యావెనుక । భూకాంతతనయుండు భోగించుదాని
నీరీతిఁ గొన్నినాళ్లేగిన నాడు । కీరంబవై రమ్ము ఖేచర యనుచు
వాని నియోగించి వగలాడి తోఁట।లో నాడుచిల్క పొల్పున వాఁడు మెలఁగ
వగపుతోఁ జేదోడు వాదోడు లేక । నగరిలో నొంటినుండ వశంబె యనుచుఁ
బతిఁజూచి యీచిల్కఁ బట్టియిమ్మనిన । నతఁడు కానిమ్మది యాడుచిక్కైనఁ
బట్టియిచ్చెదనని పలికి శోధించి । పెట్టమైయునికి సంప్రీతితోఁ బట్టి
యిచ్చె నచ్చిలుకయు నెప్పుడెప్పుడని । యిచ్చ నెంచుటఁ జేసి యిటునటుఁ జనక
చెచ్చెర నాయనచేతికిఁ జిక్కె । కుచ్చితుల నెఱుంగఁగూడ దెవ్వరికి
నాకపటోపాయ మారయలే కి । లాకాంతుఁడది నిజాలకుఁ జిల్క యనుచు
దీనినెప్పుడు అమ్మోదింప కేదుమని । యాసీలికొప్పించి యరిగె కొల్వునకుఁ
గలకలనగి కల్కి గంధర్వ! యెపుడు।చిలుకను అమ్మోదించెదు సుమీ! యనుచు

సెలవిచ్చెఁ బతి యట్లచేసెద రమ్ము । కలువపాన్పున కని గంధర్వుఁడైన
వానితోఁ దన యిచ్చవచ్చిన యటుల । నానావిధక్రీడనముల రంజిల్లెఁ
బలివచ్చునందాఁక పతిరీతి ఖచర । పతిఁదాను సమరతిప్రౌఢిమఁ దేల్చి
పతి యిల్లుచేరినఁ బంజరకీరి । గతిఁ గల్కిపల్కుల గంధర్వుఁ డలరఁ
గలిపయాబ్దములిట్లు గడపె గంధర్వ । సుతుఁ డామనోరమాసుదతిని గూడి
తత్కాలమున సభాస్థలిలో వరాంగుఁ । డుత్కంఠ నొక్కనాఁ డోలగంబున్న
బలుచేప నొకటి శంబడివాండ్రు దెచ్చి। కెలఁకున నుంచి మ్రొక్కిన వారిఁజూచి
మగమీనొ?యిదియాడుమత్స్యమో? తెలిసి । మగమీనమైనమామందిరంబునకుఁ
గొనిపోకుఁ డనినఁ బక్కునఁ జేప నవ్వె । విని సభాసదులెల్ల విస్మయపడిరి
చచ్చినచేప యీసభ నేలనవ్వె? । నిచ్చిత్ర మూహించి యెఱిఁగింప రయ్య
యని దొర మంత్రులనడిగిన వారు । జననాథ! యిది తెల్ప శక్యమే యిపుడు
ఆలోచనము చేసి యందఱ మొక్క । వేళ మీతో వచ్చి విన్నవించెదము
గడు వారు నెల లియ్యఁగావలె ననిన । నొడఁబడ కొకరీతి నొప్పె భూవిభుఁడు
ఆ మంత్రు లైదుగుర గ్రప్రధానుఁ । డౌ మహాబుద్ధి గృహంబున కరిగి
యోజనసేయుచు నున్న నాతని త । నూజుఁడౌ కార్యవంతుఁ డిదేమి మీరు
చింతచేసెదరన్నఁ జెప్పి రాకార్య।మంతయు గడువుతో నమ్మంత్రివరులు
కాలోచితజ్ఞుఁ డాఘనుఁ డదివిని యి । దేల యొప్పితిరి? నూతేఁడులకైనఁ
జేప నవ్వినదవ్వు చెప్ప శక్యంబె? । యీపని తెలియుట కేడాదిదాఁకఁ
బట్టు భూపతికి నప్పని తెల్పుఁడనుచు । నట్టె వారునుదారు నవనీశుఁ జేరి
యేడాది గడువియ్య కిప్పని తెల్పఁ । గూడదటంచుఁ బల్కుటయు నారాజు
నొకగతి నొప్పిన నున్న యమాత్య । నికరంబు నిల్పి తండ్రి యనుజ్ఞవడసి
యసమానమతులౌసహాయులఁగూడి । వసుధఁద్రిమ్మరఁగార్యవంతుఁడుచనియెఁ
జని మ్లేచ్ఛ బర్బర శక పుళిందాది । జనపదంబులు దాఁటి సౌగంధికాఖ్య
పురవర మమ్మార్గమున నొందుగాంచి । పరిసరోర్వి రసాల పాటలీ వకుళ
కురవక మరువక కోవిదారాది । తరువుల మొనయు నుద్యానంబుఁ జొచ్చి
యా వనవీథి వయస్యులఁ గూడి । పూవులుచిదిమెడి పువ్వారుబోణి
కలకలనగు నెమ్మొగము గలదానిఁ । గులుకు గుబ్బలదానిఁ గోకిలానీక

కాకలీకలనచేఁ గడు నొప్పుదాని । రాకన్నె నొకతె సారసరేఖ యనెడి
దానిఁ గనుంగొని తద్వయోరూప । మానిత సౌభాగ్యమహిమ మెచ్చుచును
ననుచరసహితుఁడై యాత్రాశ్రమంబు । చన నొక వటతరుచ్ఛాయ వసించె
నాలోన నేడాకులనఁటుల లోన । నాళీసమేతయై యక్కన్య మెలఁగ
బాలనాగము మెట్టఁబడి మెట్టదమ్మిఁ । బోలు దానిపదంబు భోరునఁ గఱచె
కఱచినంత విషాగ్నిక్రమ్మిన దేహ । మెఱుఁగక మూర్ఛిల్లె నిగురాకుబోణి
యది చూచి జనులు హాహాకార మెసఁగఁ । గదిసి బిట్టడలఁగాఁ గార్యవంతుండు
నచ్చోటి కరిగి మహామంత్రశక్తి । నచ్చెల్వఁ బ్రతికించె నర్ధక్షణమున
బ్రతికి దిగ్గన లేచి బాల యమ్మంత్రి । సుతుని చక్కఁదనంబు చూచి మోహించె
నక్కన్య బ్రతికిన దయ్యు మెఱింగి । గ్రక్కున బిలిపించి కార్యవంతునకుఁ
బరిణయం బొనరించెఁ బరమోత్సవమునఁ । దరుణితోఁ గూడి యతండు సుఖించె
నంతట నొక్కనాఁ డనఘుఁ డక్కార్య । వంతుఁ డప్పురబాహ్య వనవీథి మెలఁగ
నొక వన్యగజము మహోద్ధతిఁ దరుమఁ । జకితాత్ముఁడై భీతిఁ జారుపణ్యుఁడను
నూరవ్యుఁ డొకఁడు కుయ్యో మొఱ్ఱో యనుచుఁ । బాఱ తేఱఁగ నడ్డపడి వనేభంబుఁ
గరము కరాసి నొక్కటఁ జక్కుచేసి । పొరిగొని వైశ్యునిఁ బ్రోచె నవ్వేళఁ
బ్రాణదాతకు నీకుఁ బ్రత్యుపకార । మేను సేయంగల దేమున్న దనుచుఁ
జారుపణ్యుఁ డమాత్యజన శిఖామణికిఁ । జారుగాత్రీనామ సత్పుత్రి నొసఁగె
నవనీశపుత్రియు నచ్చారుగాత్రి । సవినయస్థితిఁ బరిచర్యలు సేయఁ
బది నెల లయ్యూరఁ బాయక నిలిచి । తుద మత్స్యహాసన హేతువు గాన లేక
పరితపించుచు వణిగ్బాలతోఁ దెలుప । నెఱుఁగ నయ్యెడిఁ త్రోవ యిందేల మసలఁ
బయనమై రండు మీ పట్టణంబునకు । దయఁ బ్రోచు మిమ్ముఁ గాత్యాయని యనుచు
నద్దేవి నోము లెన్నైనను నోమి । తద్దయు భక్తిచేఁ దగిలెను గనుక
పతిఁ బ్రబోధించి భూపతిచే ననుజ్ఞ । నతఁడు గాంచి రథేభ హయ భటావళులఁ
గూడి రాసుతను దోకొని యేగుదేఱఁ । బైఁడిపల్లకి యెక్కి పద్మాయతాక్షి
యాడంబర మెసంగ నరుదెంచె నతఁడు । నాఁడె ప్రోల్వెడలి తిన్నని పయనములఁ
జని త్రోవ నొకచోట శాంభవినగరుఁ । గని తత్సమీప సంగత వనస్థలిని
సేనల విడియించి చెలువలతోడ । నానిశి కాళీగృహంబున నుండె

నృపకన్యయును నతండు నిద్దురవోవ । నపుడు లేచియ యుండె నవ్వైశ్యకః
కాళికాంబ యదంభకరుణావలంబ । పాలితార్యకుటుంబ భవశైలశంబ
నామగం బోకమీను నవ్విన హేతు । వేమియుఁ దెలియలే కిదఁ గలంగె
ఆహేతు వెఱిఁగించి యడలార్పవమ్మ।త్రాహి పాహి యటంచు దాస్యంబొన
నని వేడుకొనుచుండె నంతకుమున్న । తనవెంట భూతబేతాళ పిశాచ
శాకినీ ఢాకినీచయములు గొలువ । నాకాళికాంబ సయ్యన బయల్దేరి
స్వారిగాఁ జని వేగుజామున మఱలి । దారుణార్భటుల భూతములు గీర్తింప
నరుదెంచి కోవెల నవ్వైశ్యకన్య । వరునితో నునికి భావమున నెఱింగి
నాభక్తురాలుగాన భయంబు లేక । యీభవనంబులో నిరవొంది నన్ను
నల చేప నవ్వినయట్టి కారణము । దెలుపవే! యనుచుఁ బ్రార్థింపఁగాఁ దొడఁ
దీని కవ్విధమెల్లఁ దెలిపెద ననుచు । మానసంబున నెంచి మందిరద్వార
ఘటిత కవాటంబు కరములఁ జఱచి।యిట నెవ్వరని యాగ్రహించు భూతము
వారించి యచ్చేరువనె తగు కొలని । తీరంబునందు వర్తించి నెయ్యంపు
సకియ నొక్కతెఁ గాంచి శాంభవీదేవి । ప్రకట వచోవిజృంభణ మొప్పఁ బలి
మాతృకామణి వినుమా! వంగరాజ్య ॥ నేతయైన వరాంగనృపతి కేపటికిఁ
దన మంత్రివరుల నందఱ నాజ్ఞ సేయు । ననిన మాతృకపల్కె నంబ! యిదేవి
పనికి మంత్రులఁ జంపఁబనుచు భూవిభుఁడు । వినిపింపవలెనన్న విశ్వైకజనని
యాకాళి వైశ్యకన్యక వినవలసి । యాకర్ణనము సేయుమని బోఁటి కనియెఁ
దొలుత మత్స్యనృపాలు దుహితఁ బెండ్లాడి।చలచిత్తయైన యాసతి నుజ్జగించి
చుట్టంపుసతి గన్న సుందరి నొకతెఁ । బుట్టినప్పుడె గొని పోషింపఁ బనిచి
యానాతి నిండుప్రాయము సెంద నతఁడు । దాని వరించి సౌధంబుపై నుంచి
బోలుతల్పులు బీగములు బిగియించి । యోలగంబున దినంబుండు నట్లున్న
యాలేమ యొంటి నాహర్మ్య మందుండు । నాలోన నొక్కనాఁ డాకాశవీథిఁ
జను నొకఖచరుఁ డాజవ్వని రూపు । గని విమోహాంధుఁడై కదిసి నేరుపున
మేకొల్పి దాని రమించి మాయాను । కాకృతిఁ బిమ్మట నధిపు ననుజ్ఞఁ
బక్కఁబాయకఁ రేయుఁ బవలు వర్తించె।నక్కైతవ మెఱుఁగఁ డారాజవరుఁడు
తా వచ్చినపుడు గంధర్వుఁడె చిలుక । యై వసించుట సాధ్వియని దానినమ్మె

చచ్చిన బలుమీను జాలరుల్ సభకుఁ । దెచ్చిన యచ్చేపఁ దిలకించి యతఁడు
మగమీనొ యిదియాఁడుమత్స్యమో తెలిసి।మగమీన మైనమామందిరంబునకుఁ
గొనిపోవ వలదన్నఁ గొలువువారెల్ల । వినఁగఁ జచ్చినచేప వికవిక నవ్వెఁ
తన విమూఢతకిట్లు దైవంబు నగిన । మనుజేశుఁ డెఱుఁగక మంత్రులఁ జూచి
చేప యేటికినవ్వెఁ జెప్పుఁడటన్న । నాపని దెలియలే కమ్మంత్రివరులు
నేఁడాదిలోపల నెఱిఁగింతు మనుచు । వేడిన గడువులో వినిపింపరేని
నందఱఁ బొరిగొందునని బెట్టిదముగ । మందలించిన వారు మంచిదటంచు
సమ్మతించిరి నవ్వుజాడ యెఱుంగ । కుమ్మలించెద రిప్పుడుడివోయె గడువు
ఏడాది తప్పిన హింసింతునన్న । వాఁడు గావున రాజు వారి నందఱను
బట్టి బందిగమునఁ బడవైచినాఁడు । గట్టిగా రేపాకకార్యంబు నడచు
నీమర్మ మెవ్వరి కెఱుఁగనో ననిన । నామాతృకామణి యాశ్చర్య మందె
చారు పణ్య కుమారి శాంభవీసూక్తి । నారహస్యము విని యద్దేవిఁ బొగడి
కొలని కావలఁ గాళికొలువున్న యజ్జ । దెలిసి భర్తను సవతిని లేపికొనుచు
గుడివెన్కఁ దగుసేన గొలువ వేకువనె । పడమటితెరువునఁ బతిప్రోలు చేరె
గడువులోఁజనుదెంచెఁగార్యవంతుఁడని । పుడమితేనికిహితుల్ పోయితెల్పుటయు
నావరాంగకుఁడు మహామాత్య వరుల । తో వచ్చి కార్యవంతుని నాదరించి
యూరసి వచ్చితివఁట చేపనగిన । కారణంబనిన నక్కార్యవంతుండు
కాళి తెల్పఁగఁ జారుగాత్రి యాహేతు । వాలించినానని యటఁద్రోవ ననఁగ
విన్నవాఁడగుట నవ్విమలాంగి నిలిచి । యున్న యత్తెఱఁజెంత నుర్వీశు నునిచి
యూచంద మెఱిఁగింపుఁడనిన ఖేచరుఁడు । రాచిల్కయైన తెఱంగు రేవగలు
పక్కఁబాయక యున్నభాళియుఁ దెలిపెనక్కల్కి, యదివిని యతఁడు కోపంబు
తాపంబు వెఱఁగును దనమదిఁ బొదల । నాపడఁతికి భూషణాదు లొసంగి
కార్యవంతునిఁగూడి గంధర్వసుతు నవార్యశౌర్యంబున వధియింతు ననుచుఁ
దలుపులు తెఱచుక తావచ్చు రాక । తెలిసి గంధర్వుఁ డత్తెఱవనెత్తికొని
ఘనవిమానం బెక్కి గగనమార్గమునఁ । జనియె వరాంగుండు సంతాపమందె
నతని తాపముదీర్తునని కార్యవంతుఁ । డతుల మంత్రనిరూఢి నమరవల్లభునిఁ
గూర్చి జపంబు నాల్గుదినంబు లూని । యర్చింప వజ్రి ప్రత్యక్షమై నిలచి

యావరాంగునిఁ బిల్చి యలుగకు మాత్మ । భూవర! గంధర్వపుత్రుని మీఁద
గారణం బటులుండెఁగద క్రోవవశమె! । యారామకంటె మహారూపరేఖ
గల సులోచనయను గంధర్వకన్య । నెలమి నిచ్చెదనిది యెంతేని సాధ్వి
దీని వరించి సుస్థిరధైర్యశౌర్య । మానసీయుల సత్కుమారులఁ బడసి
ధర యేలుమనుచు గంధర్వకుమారిఁ । బరిణయం బొనరించి బలభేది చనియె
చారుగాత్రీశాంత సౌశీల్యమహిమ । పౌరులు ధీరులు ప్రణుతించి రపుడు
పతిని వంచించిన పాపంబువలన । నతివ మనోరమ యాతనఁ బడియె
జారునితోడ మత్స్యనృపాలపుత్రి । తీఱినకథయు సాధ్వీరో! వింటిగాదె!
పతిభక్తిగల చారుపణ్యకుమారి । కత దాని సౌశీల్యగరిమయు వేడ్క
వినినవారికిఁ గల్గు వివిధసౌఖ్యంబు । లనినఁ జిల్కను గొనియాడి పూఁబోణి
యాపుష్పమంజరి యరిగె లోపలికి । భూపాలదూతియుఁ బోయె నింటికిని
అని గిరీశుఁడుదెల్ప నమ్మహాదేవి । యనఘ! యవ్వలికథ యానతిమ్మనియె
సనయ పతివ్రతాచరితంబునందు । ననఘమౌ ముప్పదియవ కథ వెలసె

---

## కిరాత సతి కథ

శ్రీ విశ్వపతి దయాంచితమతి గౌరి । కావలికథ యిట్టు లానతి యిచ్చె
చిలుక మర్నాఁడు వచ్చిన వైశ్యసతిని । దిలకించి పలికె దూతికయును వినఁ
అక్క! పతివ్రత లగువారి కథలు । పెక్కుపాపంబులఁ జెడఁ శాప నోపు
పతిదేవతామణుల్ పరదైవతములు । క్షితి వారివలన రక్షితమై తనర్చు
నేకులంబున నుదయించిన ఘనత । యే కాక సాధ్వికి హీనత లేదు
వినుమింక నొకకథ వినిపింతు నీకుఁ । గనకాంగి! మున్ను కేకయదేశమునన
జంద్రప్రభా పురస్వామియై వెలయు । చంద్రసేనుండను జనపాలమౌళి
యతనికి శుభమతియను సతి కలదు । సతిఁబోలు గుణవతి సౌజన్యవసతి
భార్యతో నీశ్వరోపాస్తి యొనర్చి । యార్యవర్ణితుఁ డతం డచిరకాలమునఁ
బడసె సుచంద్రుఁడన్ పట్టి నొక్కగని।జడతయు శఠతఁ గాంచని పుణ్యధను!

సకలకళాభ్యాస చతురుఁడై యాతఁ।డొకట నొచ్చెములేక యొప్పచుండియును
సూక్ష్మధర్మంబేమొ శోధింపవలయు । లక్ష్మీశ గౌరీశులకుఁ దక్కనట్టి
వర సూక్ష్మధర్మ మెవ్వారికిఁ దెలియు । ధరణిలోఁ దిరిగి యేతద్విశేషంబు
తెలిసి వచ్చెదనని దృఢబుద్ధిఁ దలఁచి।తలిదండ్రులకు నొక్కతఱిఁ దెల్పుటయును
జనకుఁ డానుడి విని చాలఁ జింతించి । యనియెఁ గుమారుతో నన్నిధర్మములు
గడు శ్రేష్ఠతరములుగా నెంచు శ్రుతులు।పుడమిఁ ద్రిమ్మర నేల?బుధు లిందు లేరె?
వారి నొక్కటఁగూర్చి వారిచే నీకు । దారున దెలిపింతు ధర్మసూక్ష్మంబు
పరిణయం బొనరించు పనిఁబూని మేము । పరికింపుచున్నాము పదుచుల ననిన
గురునిమాటకుఁ బ్రతికూలంబు లాడ । దొరకొన కాతఁ డాందోళింపు చుండి
యొకనాఁడు వేటాడు నుత్సాహ మూని । యొకఁడును జనిచని యొక వనవీథిఁ
దపసినొక్కని శమదమశాలిఁ జూచి । కృప ధర్మసూక్ష్మ మెఱింగింపుఁ డనిన
నా యోగి యను నుత్తరాభిముఖుండ । వై యేగు మందొక్క యడవిలో నీకుఁ
బటు సూక్ష్మధర్మ మేర్పడఁ గానిపించ । నిటునటుఁ దిరుగాడ నేమిటి కనిక
స్వామి! హసాదని చాఁగిలి మ్రొక్కి । యాముని వీడ్కొని యతఁ డాక్షణమున
ధనువు భుజంబునఁ దగిలించి వీపు । నను దూణయుగ మూని నాణెంపు పసిఁడి
పరుజచేఁ దుళకించు బలుపట్టెసంబు । చిఱుతకట్టెయుఁ బూని చికిలిధట్టియును
బలుచల్లడంబును బాగొప్పఁ దాల్చి । తల బొమిడికపు క్రొందళుకులు గులుక
నుత్తరాయణమున నొదవు భానువలె । నుత్తరాపథ మందె నుర్వీశసుతుఁడు
నదములు నదులును నానాసరములు । పొదలును పల్లెలు పుట్టలు గిరులు
చెరువులు దొరువులు శృంగారవనులు । తెరువునఁ జూచుచు దిగ్భ్రాంతిలేక
వారణాసీ పథవర్తియై చనుచు । నా రాజసుతరత్న మట నొక్కనాఁడు
ప్రొద్దున లేచి గొబ్బున పోయిపోయి । యద్దెస విభ్రాంతుఁడై త్రోవఁదప్పి
బలుకానలోఁబడి బాటయుఁ గాన । కలమటఁ గండ్లుముండ్లరు దైన పొదలు
గట్టులు పుట్టలు గడిచి సందీని । చెట్టులగుట్టలఁ జీకాకుపడుచు
బడలికతోఁ దిగ్మభానుండు మింటి । నడిమికి వచ్చునందాఁక చరించి
యెడయాని పొడలు చెట్లింతలింతలుగ । బెడిదంపు టడిదంపు పెక్కువ నతికి
త్రోవ గల్పించుక దురుసుగాఁ బోయి । యావల నొక్కబయ ల్గానుపింప

నిచ్చోట నీళ్లు లేవేమొ యటంచు । హెచ్చిన డప్పి నోరెండి నల్గడల
నరయుచుఁ జనిచని యగ్రభాగమున । యరుణ వర్ణంబైన యచలంబుఁ జూచి
యప్పర్వతముప్రక్క హరువొందు చలువ । చప్పరంబును జూడ సౌకర్యమైన
యిల్లును సున్నంపు టెఱమంటి పట్టె । లుల్లసిల్లఁగ నిదియొక విప్రగృహమొ?
చలివెందరయొ? చేరి శ్రాంతిఁ బాపికొని । యలరుచు రేపటి కరిగెద నవల
నని యాగృహము చేర నరుగుచునున్నఁ । గనకాంగి యొక్కతె గజరాజయాన
పసపు కాటుక బొట్టు పచ్చని యవిక । కుసుమగర్భితపుఁ గీల్కొప్పు మెప్పొసఁగఁ
జిన్నారికొనుతో చేరలంతేసి । కన్నులతో సోయగపు మోముతోడ
సరిగంచు చీరయు సందిదండలును । గరకంకణంబులు కడియముల్ మెఱయ
నుదకముల్ గొనితేర నొకకుండ చంకఁ । గుదురుగా నొకకుండ కుతికలఁ బూని
చనుదేర నెదురుగాఁ జని రాజసుతుఁడు । వినయంబు గావించె విప్రకాంత యని
యక్కాంతయును వాని యాకార రేఖ । తక్కక గని తనతమ్ముని లీల
నున్నాఁడ వెక్కడనుండి వచ్చితివి? । యన్న! నీ పేరేమి? యయ్య యెవ్వాఁడు?
బడలినట్లున్నది బాట దప్పించి । చెఱుతెరువున నెట్లుచేరితి విందుఁ
బసిబిడ్డఁడవు మన్నప్రజలను బాసి । దెసచెడి యడవులఁ దిరుగ నేమిటికిఁ?
బుట్టుభోగివి నిన్నుఁ బొడగన్న నెట్టి । కట్టిఁడికైనను గరుణ రాకున్నె!
యెందెన నొకచోటి కేగ కిట్లలసి । యిందేల చనుదెంచి తిది పాపభూమి
యనిన రాకొమరుఁ డిట్లనియెఁ గేల్మోగిచి । కనకాంగి! మాయమ్మకరణి నున్నావు
భూసురకన్యవో! భూపకన్యకవో! । నీసుశీలత్వంబు నీరేఖఁ గన్న
వెఱగయ్యె నిచ్చోటి విషయ మిందేల । యరుదెంచితని పల్కితా విధంబేమి?
చంద్రసేనుండను జనపాలసుతుఁడఁ । జంద్రాస్య! నేను సుచంద్రుఁ డన్వాఁడఁ
దల్లిదండ్రులఁ బాసి ధర వారణాసి । యెల్ల రెంచఁగఁ జూచునిచ్ఛ వచ్చితిని
ఉదకాయలమున నేడొకయూరు వెడలి । పదరి కాఱడవిలోఁబడి త్రోవఁ దప్పి
కరపదములఁ గంటకములు గాడఁగను । ఖరకిరణుని యెండకాఁకల గ్రాఁగి
మీయిల్లుఁ జూచితి మెలఁత! నీనామ।ధేయ మేమందు? రెద్దియు మీకులంబు?
ప్రాణేశుఁ డెవ్వఁ డేర్పడఁ దెల్పుమనిన । నానీలవేణి యిట్లనియె నాయనకుఁ
గలఁ డీయడవి సప్తఘాతుకుం డనఁగ । వేయు కిరాతుండు విక్రమోన్నతుఁడు

అతని గేహంబిది యనఘ! నేనతని । సతిని జాబిలియను శబరాబ్జముఖని
నిందొంటి నీవురా నీక్షించి జాలి । చెందితి నేలన్న చెప్పెద వినుము
జనులెవ్వరైన నీజాడఁ బట్టుకొని । చనుదేరఁగ నెనేని సర్వఘాతుకుఁడు
పడఁ గుమ్మి పైనున్న బట్ట సైతముగ । వడి దోఁచుకొను పాపవర్తనం బనఁడు
అతని దుష్క్రియ లెన్నియని యుగ్గడింతుఁ।బతినింప సేయుట పడఁతికిఁ దగదు
నిన్నిందుఁ జూచిన నేఁడేమి సేయ।నున్నాఁడొ యొకగొంది నొదిగి యుండుమని
కరుణతో గద్గదకంఠయై పలుకు । తరళాక్షిఁ గని రాజతనయుఁ డిట్లనియె
అక్క! యిందులకు నేనళుక దాహమున । స్రుక్కితి నుదక మిచ్చోటఁ గల్గినను
జూపితేనియు మహాసుకృతమౌ దేహ । తాపంబు దీఱిన తరువాత నవలి
పని జూచికొనియెదఁ బదరకు మనిన । వనిత భాగ్యంబాయె స్వాదూదకములు
నీకుఁ జూపెద రమ్ము నృపపుత్ర! యనుచు । నాకడ నెట్టని యచలంబు చెంతఁ
బ్రవహించు విమలనిర్ఝరవారిఁ జూపి । సవిధామలక తరుచ్ఛాయలఁ గొంత
వడి విశ్రమింపుము వనినుండి విభుఁడు।తడయ కింటికివచ్చు తఱి యయ్యె నిలువఁ
జనదని కుండల జలములు ముంచి । కొని యుసిరికపండ్లు గోసి రాసుతుని
చేతి కొసంగుచుఁ జెచ్చెరఁ జనియె । నాతఱి రాసుతుం డామలకములు
భక్షించి యమృతంబువలె నున్న నీర । మక్షీణకాంక్ష దాహముదీఱఁ ద్రావి
యాదరి తోఁపులో నటు శయనించి । సేదదేరఁగ నిద్రచెందె నంతటను
అక్కడ శబరేంద్రుఁ డడవి వేటాడి । పెక్కుమృగంబుల పీచం బడంచి
కానడితో మాసంఖండముల్ గొనుచు । వేవేగఁ దన గూఁటివీఁపు చలింప
మిడిగ్రుడ్లు కెంజాయమీసముల్ దోనె।కడుపు జేగురుబల్ మొగముబొక్కి ఱొమ్ము
మసిరాసి నగు మోము మైలచల్లడము।పసరంబులోల్ కాసె బలుమోటుకత్తి
కఱకు జుంజురు వెంట్రుకలు రెండుకాళ్లుఁ । బొరసిన కారెనుబోతు చందంబు
గలిగి యింటికివచ్చు కాంతునిఁ జూచి । యెలనాగ సద్భక్తి నెదురుగాఁ బోయి
కానడి వడిడించి కలశోదకముల । చే వానికాళ్లు మచ్చికహెచ్చఁ గడిగి
పయ్యెదఁ దడియొత్తి పాణి గ్రహించి । చయ్యనఁ దోకొనిచని చప్పరంబు
నడిచక్కి తిన్నె నందంబౌ తివాసి । కడ మించుతలగడల్ గలచోట నుంచి
సురటిచే విసరుచు సొలపువాల్చూపు । మరుతూపు నిరసింప మరులు పుట్టించి

బలుతావి కపురంపుబాగా లొసంగి । తెలి యాకుమడుపులు తిన్నగాఁ గొన్ని
మడిచి యొసంగుచు మమత గాన్పింపఁ । బొడఁగని వాఁడను బోఁటి! నీవేమొ
మనవి దెల్పఁగవచ్చు మార్గంబు దోఁచె । వినిపింపు నీవేమి వేషిన నిత్తు
కల్లగా దీమాట కాత్రేనియాన । చెల్లుగా నీకోర్కె చెప్పవే! యనిన
నాయింతి వానికి హ స్తముల్ మొగిచి।నాయఁడా! నేఁడొక్క నరనాథసుతుఁడు
నా తమ్ముఁగుట్టు చందమున నున్నాఁడు । భీతిల్లి త్రోవదప్పి కడింది డప్పి
గూరి యిందే తెంచెఁ గూరిమి నతని । కేఱుసూపితి నీరమిదిగొ గ్రోలుమని
యసురుసురై డస్సె నాఁకటిచేత । నుసిరిక తోఁపులో నున్నవాఁ డిపుడు
అతని యాఁకలిదీర్చి యన్నం బొసంగు । మతిసుకృతఫలంబు లబ్బు ప్రాణేశ!
యేమందువో విని యీమాట కనుచు । నామదిలోన నిందాఁక కొంకితిని
అనినఁ బుళిందుఁ డత్యానంద మంది । వనిత! నీతమ్మునివలె నున్నయపుడె
యతఁడు బావమఱంది యయ్యె నింకేల।మతి శంక తోడి తెమ్మా! వేగ నిటకు
వడిచెడి యింటికి వచ్చినవాని । యెడఁ గీడుదలఁచు ద్రోహి ధరిత్రిఁ గలఁడె!
యనుమానపడక పొమ్మని త్వరసేయ । ననబోణి వానిచే నమ్మిక వడసి
యారాజసుతుఁడున్న యారామసీమ । చేరి లేవన్న! రాజితగుణోత్పన్న!
నినుఁ దోడితెమ్మని నీబావ వచ్చి । చనుదెమ్ము నావెంటఁ జయ్యన ననిన
అక్క! మహాభాగ్యమాయె నటంచు । గ్రక్కున లేచి యాత్మావరసుతుఁడు
తన యంపదొన లాయుధము విల్లు గదయుఁ।గొని యామె వెంబడి కొంచ కేతేర
నెదురువచ్చి కిరాతుఁ డెంతేని మమత । నెదఁజేర్చి కైదండయిచ్చి తోడుకొని
పోయి యాజముఖాణమున నుంచి వినుతి । సేయుచు నేనొనర్చిన సుకృతమున
నాయింటి కరుదెంచినాడవు పండు । గాయె నేఁడేను గృతార్థుండ నైతి
నోరాజసుత! వట్టి యుపచారములను । దీఱునే యాఁకలి దీమసంబునను
తెమ్ము వండుకొనంగ లీలామనోజ! । కొమ్మ పదార్థముల్ గొనితెచ్చు నటకు
నని కాంతఁజూచి తొయ్యలి! సన్నబియ్య।మును కందిపప్పును బాలును బెరుగు
తగు కూరగాయలు తప్పెల లక్ష్మా । మగు పదార్థంబులు నన్నియుఁ గొనుచు
నత్తోటలోపలి కరిగి వండికొన । ని త్తరి పొయిలు నీవేర్పాటు చేసి
యింగలంబును రాజనిడి వంటమైన । సంగత సురభిళ సద్యోఘృతంబు

భోరునఁ గొనిపొమ్ము భూపాలతనయుఁ । డారగింపకయ నే నశనంబు గొనను
అనిన నత్తెఱఁగున నతివ యమర్చె । ననువుగా నతఁడు స్వయంపాకి యగుచుఁ
బదునైదు కూరలు పప్పుపాయసము। మొదలుగా బహుభక్ష్యములతో నొనర్చి
యప్పుడు గాఁచిన యావులనెయ్యి । తెప్పలుగా నామె తెచ్చి యియ్యఁగను
మెచ్చుచు భుజియించె మీఁగడ పెరుగు। హెచ్చిన తనశ్రాంతి యెల్లఁ బాపగను
నతఁడు భోజనము సేయఁదొడంగె ననుచు । సతి తెల్ప మఱిపోయి జలకంబులాడి
చలువలు ధరియించి జాయ వడ్డింపఁ।గలమాన్న ఘృతమాంస కలితంబు గాఁగ
భుజియించె నంతలో భూపాలసుతుఁడు। భుజియింపఁ దచ్ఛేషములు గొంచు వచ్చి
శబరకామినియు భోజన మాచరించె । శబరుండు సరసభోజన తుష్టుఁడగుచుఁ
దను జేరవచ్చిన ధరణీశసుతునిఁ । గనుగొని మణిపీఠిక వసింపఁ జేసి
ఘనసార కాశ్మీర గంధసారములు । తనువున నలఁది పూదండలు పెక్కు
సిగయందుఁ జుట్టి మంచిరుమాలు చుట్టి । వగవగ సొమ్ములు వస్త్రంబు లొసఁగి
కర్పూర వాసనా కలిత తాంబూల । మర్పించి యభ్యంతరాగార సీమఁ
గనుపట్టు మణిడోలికను శయనింపఁ । బనిచి వీవనఘూని భామిని విసర
నుయ్యాల చెంగట నుండి యూఁచంగ । నయ్యెడ నిదురించె నారాజసుతుఁడు
అతిథికి నిటువలె నాతిథ్య మొసఁగి । కృతకృత్యుఁడై బోయ యింతియుఁ దాను
స్థిరబుద్ధి నద్దినశేషంబు గడపె । మఱి భానుఁ డస్తమింపఁగ నిద్రలేచి
యారాజసుతుఁడు సంధ్యావిధుల్ దీర్చి । వారి చెంగటఁ దాను వసియించి కొన్ని
కతలు దెల్పుచు రేయి గడపఁగా నంత।శతమఖుదిశఁ దోఁచె జలజబాంధవుఁడు
చలువలు వెదఁజల్లసాగె తెమ్మెరలు।బలియుఝుంకృతులతోఁబరగె తుమ్మెదలు
కలువల జిగిదీఱె కమలముల్ మీఱె । తెలివి జక్కవగూరె తిమిరంబు జాఱె
నంతకమున్నె ప్రయాణసన్నాహ । వంతుఁడై లేచి భూవరకుమారుండు
అక్కకుఁ దెలిపి బావా! నన్నుఁబనుపు । మెక్కడ పరుసపోయెదు కాశితెరువు
నావిని శబరుఁడన్నా! నేఁడు నిలిచి । పోవరాదే యన్నఁ బోవలె నిచటఁ
దడవు సేయఁగ రాదు దయయుంచు మనుచుఁ।గడు త్వరఁజేసినఁ గానిమ్మటంచు
నతఁడు మార్గము చూప నరుదెంచె వెంట।సితఖడ్గ మొకటైనఁ జేతఁ బట్టకయె
బోయముందర నిట్లుపోవఁగా వెంటఁ । బోమె రాసుతుఁడును భూరివేగమునఁ

బరువునేల క్రమించి బడలి కిరాత । వరుఁడు నీరిదె త్రావి వచ్చెద ననుచు
నాచెంతఁ గొలనికి నరిగె శీఘ్రమున । రాచకొమారు మార్గంబున నిలిపి
కొలనిలో నీరుత్రాఁగుచునున్నఁ గోలు । పులి ఘుటఘుట రవంబున వచ్చి వాని
గళ మట్టె విఱిచి రక్తముద్రావి చనియె । నలవియే తప్పింప హా! దైవఘటన
గడియసే పల్లమార్గంబున రాచ । కొడుకుండ నిదియేమొకో తామసించె
బావ యటంచు గొబ్బున గుంటకేగి । యావల శార్దూలహతుఁడైన వానిఁ
గని గుండెదిగ్గనఁ గన్నీరు దొరుగఁ । బనవుచు నిటువంటి బలవంతునకును
వచ్చెనే యీకీఁడు వ్యాఘ్రంబు చేత । నిచ్చంద మామెతో నెటు లుగ్గడింతు
నాకొఱ కరుదెంచి ననుబైట నుంచి । యీకొలనికి వచ్చి యిటులైతి వకట!
నేనేల వచ్చితి నీవున్నచోటి । కీనెగు లెటులోర్తు నేమిసేతునని
వగచుచుఁ బరువునవచ్చి యవ్వార్త । దగ దొట్టికొనఁగ నత్తరుణితోఁ దెలిపి
కన్నీరు మున్నీరుగా నేలవ్రాలి । యున్న రాకొమరుని నొయ్యనఁ జేరి
జాబిలి పలికె విచార మేమిటికి । నాబోయరాజు కృతార్థుఁ డైనాఁడు
నీకతంబున నాతనికి శుభం బొదవె । నీకొండగుహలో ననేకధనంబు
బహురత్నరాసులు బహుభూషణములు।బహుపదార్థములు నాపతి దాఁచినాఁడు
తెరువాటు గొట్టి సాధించిన ధనము । లెఱుఁగుమీ ధనరాసులెల్ల నీవశము
పరుల పాల్గాకుండఁ బాలించి దీని । ధరణీశసుత! బహుధర్మంబులకును
వినియోగములుసేయువిసువకయిపుడె । వనచరోత్తమునితోవహ్నిఁజొచ్చెదను
జనుదెమ్ము నావెంట సహజుండ వీవె । మనమున ఖేదంబు మానుమటంచు
నతఁడు రానింటి పదార్థమ్ము లెల్ల । సతి గుహలోనుంచి చట్ట బిగించి
కొన్నికోకలు మణుల్ కొంతధనంబు । సన్నుతగాత్రి సుచంద్రుచే నిచ్చి
యివి కాశిలో వసియించు నైదువ । కవనీసురేంద్రుల కర్పింపు మనుచు
వివరించి యతనితో వేగఁ బ్రాణేశు । శవముచెంగటి కేగి సాధ్వి కన్దోయి
తడిఁబెట్ట కీమహాధర్మంబు చేసి । కడతేఱితివిగదా కాంతుఁడా! నేఁడు
పరహితచర్య స్వప్నంబున నైన । నెఱుఁగని నీకుదయించె సద్బుద్ధి
అందునఁ దెలిసితి నప్పుడె నేను । మ్రందిపోవు నితండు మనఁడని మతిని
నాజన్మ మీడేరె నాథ! యటంచు । రాజపుత్రునిఁ జూచి రమణి యిట్లనియె

పొద చేర్పవలయు ని న్నోట నాడాడ । వెదకి కాష్ఠంబులు వెసఁ గూర్పవన్న
యేనును దోడ్పడియెద నని యడవిఁ । దానును గాష్ఠసంతతు లేర్చి తెచ్చె
నమ్మ! నావలన నీయగచాట్లు నీకుఁ। గ్రమ్మెఁగా యని పొద ఘటియించె నతఁడు
ననలమ్ము దెప్పించి యటఁ బ్రజ్వరిల్ల । నొనరించి సడలించి యొడలి సొమ్ముల్లఁ
గొలనిలో మునిగి గ్రక్కున హొన్నుపట్టు।వలువ ధరించి పావకునకు మ్రొక్కి-
చితిఁ జొచ్చి నలుగడ శిఖ ప్రజ్వరిల్లఁ । బతిదేహ మెదఁ జేర్చి పడఁతి రాసుతునిఁ
బిలిచి యిట్లనియె నోపృథుధర్మనిరత!।తలఁచినాఁడవు సూక్ష్మధర్మంబుఁ దెలియ
నిందునఁ దెలిసెద విఁకఁ గాశిఁ జేరి । యందుండి యొక్కయేఁ డారాజు తోడఁ
బలుకుము నీకొక్కపట్టి పుట్టునని । పలికినట్టుల రాజభార్య గర్భంబు
ధరియించి మఱి తొమ్మిదవనెల నొక్క । వరసుతుఁ గను పదివాసరములను
బుడుచ్చునప్పు డబ్బుడుతని నడిగి । మఱువక సూక్ష్మధర్మ మెఱింగికొనుము
అతఁడె తెల్పెడు మదీయస్థితి కాశి । పతిపుత్రి నీకిఁక భార్య కాఁగలదు
అతఁడు పుత్రులులేమి నడలుచు నుండ । వెతఁదీర్ప నీవందు వేగఁ బొమ్మనుచుఁ
బలికి శిఖజ్వాలఁ బ్రాణముల్ విడిచె । నలరాజసుతుఁడు హాహాకార మెసఁగ
నన్నిటిలోఁ గ్రుంకి యక్కొమ్మ సొమ్ము । లన్నియుఁ గొని కాశికరిగి యచ్చోట
మణికర్ణికావారి మజ్జనం బాడి । మఱిలు సొమ్ములును గోమలి చెప్పినటుల
ద్విజదంపతుల కిచ్చి వీధి నేతేర । నజరేంద్రసుతుఁ బోలు నతని రూపంబు
కాశిరాజు కుమారి గాంచి మోహించి।యాశౌరిసుతు శరాహతిఁ దాల్మి డించి
యున్న చందము తల్లియును దండ్రి యెఱిఁగి।యన్నరేంద్రకుమారునపుడె పిల్పించి
బహుమాన మొనరించి బాంధవ్య మెఱిఁగి।మహిత వైభవ!మత్కుమారినిచ్చెదను
పరిణయం బగుమన్నఁ బార్థివుఁ జూచి । ధరణీశ! యేడాదిదాఁక పెండ్లాడ
నింతలో సుతుఁడుదయించు నీకొకఁడు । చింతదీఱినఁ బెండ్లి సేయుము మాకుఁ
దేవతామహిమచేఁ దెలిసిన వాఁడ । నీవిధంబిఁక సంశయింపఁగా వలదు
అనవిని కాశిరా జాశ్చర్య మంది । తనవద్ద నాన్నపాత్మజు నుంచికొనియె
నంత రెండవనెల నక్కాశిరాజు । కాంతాశిరోమణి గర్భిణి యయ్యె
నెలలు తొమ్మిదియును నిండిన వెనుక । లలితాంగి యొక శుభలగ్నంబు నందుఁ
గనియెఁ గుమారు నొక్కని శుభాకారు । జనకుండు సంతోషజలరాశిఁ దేల

పురుడుచ్చునప్పు డప్పుత్రుని యొద్ద । నిరవొంది కేకయాధీశ నందనుఁడు
జనులు దాదులు మహోత్సవముల మెలఁగు।చుఁ కి నేకతమాట నోయి కుమార!
మహి నెద్దినూత్న్మధర్మము దెల్పుమనిన।నహహా!యనుచునవ్వియాబాలుఁడనియె
నొకపూట నీకన్న మొసఁగిన యట్టి । సుకృతవైభవమున సుజనులు మెచ్చ
సకలదోషమ్ములు క్షణములోఁ బాసి।సుకలుండనై మహాశుభమూర్తి నగుచు
నీ కాశిలోపల నీపురంబేలు । భూకాంతునకు నేను పుత్రుండ నైతి
సర్వఘాతుకుఁడను శబరుండఁ గానె । యుర్వీశతనయ! నీవూహింపు మాత్మ
నాఁకొని వచ్చిన యతిథికి నన్న । మేకాగ్రమతి నెవ్వఁడిడు వాఁడె సుమ్ము
పరమపుణ్యుఁడు మహాపాప నిర్ముక్తుఁ।డెలుఁగు మిందునఁ బోల వేధర్మములును
క్షితిఁ బెక్కుక్రతువులు చేసిననేమి । యతిథిపూజను బోల వాయజ్ఞతతులు
క్షితిఁ దీర్థయాత్రలు చేతురు.గాక । యతిథిపూజను బోల వాతీర్థతతులు
శ్రుతులేల స్మృతులేల శోధనలేల । నతిథిపూజను బోల వవియెల్లఁ గూడి
యతిథిపూజ మహత్త్వ మరసితి వింత । క్షితిపాలసుత! పూజసేయుము వారి
నవని జాబిలికిని ననుజుఁడ వగుట । బావవైతిపుడు నిబద్ధిగా నాకు
నాకాంత కాశ్మీరమను దేశమేలు । భూకాంతునకు నింకఁ బుత్రియై పుట్టి
నన్నె పెండ్లాడు నంతయు నిఁకమీఁదఁ । గన్నారఁ జూడఁగాఁగలవు నీవనుచుఁ
బలికి యూరకయుండె బాలకుం డింకఁ । బలుక నీతోనని, పద్మాక్షి! వింటె
యానూత్న్మధర్మ మాయన విని యలరి । భాసురాంగినిఁ గాశిపతి కుమారికను
ధవళాక్షిఁ బెండ్లాడి తలిదండ్రు లలర । వివిధ వైభవముల వెలసి యావెనుకఁ
దమతండ్రి కేకయధరణీశ్వరుండు । విమలచిత్తుఁడు కాశివిభుఁడును గూడి
తనవెంట రా శోణధరమున కేగి । వనచరు ధనమెల్ల వారికిఁ జూపి
చలివెందరలు సత్రశాలలు దేవ । నిలయముల్ తోఁపులు నిర్జలస్థలులఁ
జెరువులు దొరువులు క్షితిసురపూజ । లరుదుగా సేయించె నవని నెల్లెడల
శబరకామిని మహాసాధ్వీలలామ । విబుధ వర్ణితధామ విఖ్యాతిసీమ
యట్టె కాశ్మీరరాజాత్మజ యగుచుఁ । బుట్టి సుద్యుమ్నాఖ్యఁ బుట్టిన విభుని
కాశీశ్వరాత్మజు ఘనతఁ బెండ్లాడి । యా శచీదేవి యట్లలరుచు నుండె
వింటివే యాసాధ్వి విజ్ఞానమహిమ । కంటివే యెందైనఁ గాంతలయందు

యీ సతీమణికథ యెవ్వరు వినిన । వ్రాసినఁ జదివిన వారికి శుభము
ప్రాపించునని చిల్కపల్కిన నలరె । నాపుష్పమంజరి యని మహేశ్వరుఁడు
నానతి యిచ్చిన నవ్వాలికథలు । ప్రాణేశ! వినిపింపుమని గౌరి యడిగె
ననయ పతివ్రతాచరితంబు నందు । ఘనత ముప్పదియొక కథ సాంగమయ్యె

---

# ద్రౌపదీదేవి పూర్వజన్మకథ

శ్రీ విశ్వపతి సముచితమతి గౌరి । కావలికథ యిట్టు లానతి యిచ్చె
మఱునాఁటి సాయంసమయమున దూతి । సరణి రాఁ బుష్పమంజరికనె చిలుక
వనిత! యింకొక పతివ్రతకథ నీకు । వినిపింతు వీనులవిందుగా వినుము
మున్ను మౌద్గల్యుఁడన్ మునివరుం డొకఁడు । సన్నుతవ్రత తపస్యాశాలి కలఁడు
వలిగాలి యెండయు వానయు మంచు । గలవేళలఁ జలించక జపం బొనర్చు
యమ నియమా సనాద్యష్టాంగ యోగ । సమధికనిష్ఠల సతతంబు మెలఁగ
శమ దమాదిక గుణసంపత్తి హత్తి।యమనస్క నియతి బ్రహ్మధ్యాన మూను.
శోకమోహములను క్షుత్పిపాసలను।గాకుచెందఁడు వృద్ధికార్శ్యంబు లోలయు
తనువుపై మమత యింతయిన వహింపఁ।డనయంబు పూజించు నభ్యాగతులను
ఆమహాత్మునకు నాలాయనీ నామ । భామాశిరోమణి భాగ్యయై వెలయు
నాభామ యుమ నంబుజాలయన్ బోలు । నాభామ కింద్రసేనాఖ్యయుఁ గలదు
ఆయింతి పతిభక్తి కామె ప్రియోక్తి । కాయమ యనురక్తి కామాని యలరి
గృహమేధియై ప్రవర్తించె బెక్కేండ్లు । విహిత సత్కర్మముల్ విడువక నియతి
ననుకూలవతియైన యతివ కావలయు । పను లొనరింప నేపట్ల నేక్రియలు
గావింపవలయుఁ దత్కర్మముల్ చేసి యా । విమలవిచారుఁ డతిశయం బందె
నంతఁ బ్రారబ్ధ కర్మాప్తి నమ్మునికిఁ । గొంతకాలమునకుఁ గుష్ఠురోగంబు
ప్రాపింప మేనెల్లఁ బగిలె నసహ్య । మై పూతిగంధ మంతంతకు మించె
చీము నెత్తురు పడిసెను వ్రేళ్లుదునిసె । పాము జనించె బైపై గోళవలసె

కరచరణంబులఁ గ్రమ్మఁ బగుల్లు । ముడికి గాఱఁ గోడంగె ముదిరెఁ జర్మంబు
కడువివర్ణంబయ్యెఁగార్శ్యంబుమొనసెవడియడంగె మొగంబువాచెఁగూర్చున్న
యెడ లేవలేఁడయ్యె నెందుండె నందె । విడువసాగె మలేమి విష్ఠాజలములు
నావికారము లెన్నియని యుగ్గడింతు । జీవచ్ఛవము రీతిఁ జేరరా కుండె
దజ్ఞనైన ముదిమిచేఁ దలయెల్ల నరసెఁబోరసి మునుగోపంబు పొదలె నిర్దయత
యట్టి నెతల్ చూచి యల్లపురంధ్రి । యిట్టుండెగా నాయదృష్టం బటంచు
నప్పతిఁజేరి రోయక లేవనెత్తి । యొప్పుగా వేన్నీట నొడలెల్లఁ గడిగి
మంచులు నూటి వేమఱు మైనలంది । గంధంబు పూసి దుర్గంధంబు మాన్చి
సారెకు నోటికిఁ జవిపుట్టఁ గూడుఁ । గూరయుఁ గావించి కొద్దికొద్దిగను
వడ్డించి చెంగట వసియించి వేగ । నడ్డిసేయక సామియారగింపుడును
నారగించిన నోరు హస్తముల్ గడిగి । నేరుపుతో నెత్తి నికట సంఘటిత
మృదుతల్పమున నుంచి మేనెల్ల నిమురుఁబదములు లొడనుంచి భక్తితో నొత్తు
నొకమాఱు రెండుమూర్లొసఁగువీడియము। మొకముద్రిప్పక మలమూత్రంబులెత్తు
బడలక వేసటఁబడక రేఁబవలు । పడఁతి యిట్లుపచరింపఁగ నొక్కనాఁడు
ముని భుజింపఁగ నన్నమునఁ జీముతోడ । పెనుప్రేలు పడె వీడి బింబోష్ఠి చూడ
నాకూడు భుజియింప కతఁడు లేచుటయు । రాకేందుముఖి వేగిరమునన ప్రేలు
కడవైచి రోఁతలేక భుజించె భర్త । విడిచిన యన్నంబు విం లెవాల్గంటి!
ఆయద్భుతము చూచి యమ్మౌని మెచ్చి।మాయురే! గుణవతి మజ్ఝారె! సాధ్వి
నీ మనోద్రఢిమకు నే మెచ్చినాఁడ । నేమికావలెఁ గోరు మిచ్చెద ననిన
నవనతవదనయై యతనికి మ్రొక్కి । యువిద యిట్లనిపల్కె నోమహాభాగ!
మదనసంజీవని మహనీయసౌఖ్య । పదవి మనోరథ ప్రాబల్యధాత్రి
సకలేంద్రియానంద సందోహదాత్రి । స్వకన ద్రవిణలోభ వల్ల్యసిపుత్రి
కామోపభోగసంగతి గాన దాన । మామకహృదయంబు మగ్నమైయుండు
నేనుశరీరంబు లీవూన వలయు । నానాఁటికిఁ బ్రియంబు నాటికొనంగ
నభినవమదన మోహన విలాసమున । శుభకరాకార విస్ఫురణ వహించి
నావాంఛ దీర్పవే! నాస్వామి! యనిన । భూవినుతుం డాతపోనిధి పలికె
నీవాంఛ యెఱుఁగుదు నీరేజగంధి! । యీవు గోరినకోర్కె యీడేర్తు నిపుడె

ప్రారబ్ధ మనుభవింపక తీఱ దెంత । వారికిఁ గాన నీవ్యాధి ప్రోయకయె
యిన్నినాళ్లును గృశియింపఁగా వలసె । నన్నగుల్ తీఱె శుద్ధాత్ముండ నైతిఁ
గంతునిఁగేరు శృంగారంబు దాల్చి । యింతటనుండి నిన్నునసి క్రీడింతు
నంగన! వెతమాను మనుచు నాకాశ । గంగా తరంగిణీ కనకారవింద
సంగత మకరంద సౌరభాభంగ । రంగత్తరంగ పారంపరి కెగసి
యరవిందబాంధవు నపరంజిచాయ । యరదంబుపై నెక్కి యతిభక్తిఁ జొక్కి
యంతఁ గృతస్నానుఁడై దుర్వికార । సందోహముల నెల్ల జాడించి విడిచి
మనసిజోపమ భాసమాన విలాస । ఖనినై మనోహర గంధమాల్యములు
బహురత్నభూషణాంబరములుదాల్చి । మహనీయమహిమతో మహి కేగుదెంచి
నాలాయనకి భూషణ దుకూల కుసుమ । మాలికా కర్పూర మలయజశ్రీలు
కల్పించి దానితోఁ గలసి సంతాన । కల్పక మందార ఘన పారిజాత
హరిచందనాదుల కాస్పదం బగుచు । హరువొందు నందనోద్యానంబు నందు
శశధరకిరణ ప్రసార విస్తార । శిశిర స్థలములందు సింధుతీరములఁ
గైలాసగిరియందుఁ గనకాద్రియందు । నీలాచలమునందు నిషధాద్రియందు
మందరగిరియందు మాల్యవంతంబు । నందుఁ జైత్రరథంబునందు ననేక
కాలముల్ సురతసౌఖ్య రసాంబురాశి । నోలలాడుచు దాని యుదుటుపాలిండ్ల
కవుగిలింతలు శైలకటకంబులందు । నువిద వాతెఱ తేనెయూట త్రావుల్లు
కుసుమ మరంద భాకుంజమ్ములందు । నసమాంగి నునుచెక్కు టద్దంపు నొక్కు
వేడుకల్ శశికాంత వేదికలందుఁ । జెఱ కీల్జడ వ్రేట్ల చిన్నెలు మత్త
మధుకర నికర సమ్మర్దవల్లికల । విధుముఖ ముచ్చట వినికి కందర్ప
వాహ వికస్వరస్వర భాస్వరాతి । మోహన మాకందముల నీడలందుఁ
జొక్కాడి కటీతటీ విహారముల । యెక్కువల్ మిన్నేటి యిసుకతిన్నెలను
వహియించి శృంగారవనుల దీవులను । బహు సహస్రాబ్దముల్ భామినిఁ గూడి
విహరించి మనమున విసివి యమ్మౌని । సహజ చిదానంద ఝరములోఁ దేలి
[illegible]పరబ్రహ్మానుభవత । బ్రహ్మభూయుండయ్యె బ్రహ్మాఖ్యుఁడగుటఁ
బ్రాణంబు వాసిన పతిమేను డాసి । యేణీవిలోచన యేడ్చుచు నతనిఁ
బరిరంభణము చేసి బాష్పాంబుధారఁ దొరుగ హా ప్రాణేశ! తొలఁగిపోయితివె!

చాలించి నాతోడి జంజాట మెల్ల । నేలీల నీఁక నిర్వహింపుదు నేను
నినుఁ బాసి నీతోడ నేఁడగ్నిఁ జొచ్చి । కనియెదఁ బరలోకగతుని నిన్ననుచు
సొదపేర్చి పతిమేను సొదమీఁదఁ జేర్చి।సుదతి యగ్నిజ్వాలఁ జొచ్చి యాక్షణమె
చిరతర ధ్యానవిశేషంబు వలనఁ । బరమాత్ముఁ బ్రాపించెఁ బతిభక్తి యసదె!
తనువు వీడెడువేళఁ దరుణిభోగేచ్ఛ । తనమదిఁ బాయని తత్కారణమున
నాకళ కాశిరాజాత్మజ యయ్యె । సౌకుమార్య విలాసంపదల్ హెచ్చ
నతివ దౌర్భాగ్య మేమనవచ్చు రాజ । సుతుఁ డొకఁడైన నీసుదతి నిమ్మనుచు
నడుగరాఁడయ్యె నయ్యయె యిత్తుననిన । నొడఁబడ రెవ్వరిట్లొక కొన్నియేండ్లు
కడచిన నక్కన్య కడువెత నొంది । తడయక పతికాంక్ష తనుఁ దీవరింప
నొక తపోవనమున నుగ్రునిఁ గూర్చి । యకలంకభక్తి మహానిష్ఠఁ బూని
ఘోరతపంబు గైకొని సేయుచుండ । నారామకడకు ధర్మానిలశక్ర
నాసత్య లొక్కొకనాఁడు వేర్వేఱ । నాసతో వచ్చి దేహాంతరంబునను
దమకిది పత్నిగాఁ దగునని తలఁచి । గమనించి రది కొంతకాలంబు జలము
గాలి యాహారమ్ముగాఁ గొని కొంత । కాలంబు పర్ణభక్షణ మాచరించి
పనివడి కొన్నాళ్లు పంచాగ్నిమధ్య । మున నిల్చి యొకపాదమునఁ గొన్నినాళ్లు
నెలకొని కొన్నాళ్లు నిరశన యగుచు । సలిపె నుగ్రతపంబు సంయముల్ మెచ్చ
నాయుగ్రతపమున నభవు డింపొంది । కాయజ భసిత రంగన్మూర్తి తోడ
గాలిమేపరి పదకంబుల తోడఁ । గాళిమ గులికెడు కంఠంబు తోడ
మొఱకులఁ గెడపు ముమ్మొనవాలు తోడఁ।బరిచర్య సలిపెడు ప్రమథుల తోడ
నందివాహనమెక్కి నగుమోము తోడ । ముందర నిలిచిన ముదిత హర్షించి
కరములు ముకుళించి కడుభక్తి మించి । హర! నీలకంఠ! మహాదేవ! రుద్ర!
శంకర! భక్తవశంకర! నాగ । కంకణ! ధృతగాంతు ? కంకణ! శరణు
దేవ! మే కృపయా పతిం ప్రదేహ్యన్య।థా వాంఛితం నాస్తి ధవళాంగ!యనుచు
నామాటయే బోఁటి యైదుమార్లనిన । వామదేవుఁడు నవ్వి వామాక్షి కనియె
మగలు నీకపరజన్మమున నైదుగురు । వగవక పొమ్మన్న వనిత యిట్లనియె
మగవాని కెందఱు మానినులున్నఁ । దగుగాక బహుపతుల్ తగుదురె సతికి?
నీవరం బేనొల్ల నిభచర్మవసన! । నావుడు శివుఁడను నలినాయతాక్షి!

యేనుమారులు పతినిమ్మని కాంతు । తో నన్నువేడి తైదుగురి నిచ్చితిని
నీవేల వగచెదు నిన్ను నిందింప । రీవసుమతి వారలీక మీఁద నీకుఁ
బతు లనురక్తులై బహువిధ సౌఖ్య । గతు లొనఁగూర్తురు గలుగు భాగ్యంబు
ప్రత్యేక సహవాస పరిణతు లొదవు । నిత్యకుమారీత్వ నియతి మించెదవు
పతులపై భక్తిసౌభాగ్యంబు గలిగి । యతిశయించెదవన్న నది సమ్మతించి
శివుని యనుజ్ఞచే జిష్ణునిఁ బిలువ । నవలఁ బోయి సురాపగాంతికభూమి
నెలకొని యేడ్వఁ గన్నీరు సువర్ణ । జలరుహాకృతి గాఁగ జలములఁ దేల
దాని తపోమహత్త్వంబున కద్భు । తానంద కందళితాత్ముఁడై వచ్చి
వాసవుండిందేల వగచెద వతివ! । నీసోయగముగన్న నెమ్మది యలరె
నీవిధం బెఱిగింపు నిజముగా ననిన । నావెంటఁ జనుదెమ్ము నాకలోకేంద్ర!
నావెతఁ దీర్చునంత కటాక్షమున్న । నావిని దానివెంటనె వచ్చెవజ్రి
వచ్చియక్కొండపై వరుణరూపంబు । హెచ్చఁ బార్వతితోడ నేకాగ్రవృత్తి
నెత్త మాడుచునున్న నీలకంధరుని । నత్తఱి గనుగొని యలిగి వాసవుఁడు
నిదియేమి వరుణ నీకీగర్వ మేల । యుదయించె నెత్త మీయుమ తోడనాడఁ
దగవౌనె కొండనెత్తంబున నుండి । బెగడవు లేవవు పేర్మి నన్ జూచి
...    ...    ....    । ఘనబాహు విక్రమక్రమము గల్గినను
పెలుచ నీశిఖరంబు పెల్లగింపుమని । పలికిన నింద్రుండు పటుమహాసత్త్వ
పర్వతశిఖర ముత్పాటించి    ...    ।    ...    ...    ...
...    ధరశృంగకుహర । మున నల్వురున్న యద్భుతమంది యతఁడు
వీరెవ్వరోయని వికలతఁ జెంద । నారుద్రుఁడనియె మీరైదుగు ర్వు
...    ...    ...    । పతి నియోగించిన నభవుని యాజ్ఞ
ననుపమాకృతి నింద్రు లైదుగు రిలను ।
నైవస్వ తానిల వాస వాశ్వినుల । పావనాంశములతోఁ బాండురాజునకు
మగువలౌ కుంతికి మాద్రికిఁ బొడమి । పొగడొంది రాయింతి భూతేశుఁ డనుప
శ్రీమూర్తియై యాజ్ఞసేని యనంగ । హోమానలంబున నుద్భవం బంది
ద్రౌపదీనామంబు ధరియించి వెలసె । నాపాండవులు ధర్మరాజాదు లేవు
రాపణఁతికిఁ బతులై ప్రవర్తిలిరి । భూపాలు రెల్ల నద్భుతమంది చూడ

నల యర్జునుఁడు మత్స్యయంత్రంబు నేసి । విలసిల్లెఁ గర్ణాదివీరుల నోర్చి
పాండవులకు ధర్మపత్నియై యాయ । ఖండ పాతివ్రత్య కలిత పాంచాలి
హరు ననుగ్రహమున నతిలోకకీర్తి । భరియించె హరికృపఁ బడసి రంజిల్లె
నతితపశ్శక్తి దూష్యతలేక వేలసె । నితరకామినుల (యందీ శక్తిగలదె ?)
కౌరవుల్ మానభంగము సేయఁ దివుర । శౌరి యక్షయవస్త్ర (శాలినిఁజేసె)
పాంచాలి సౌశీల్యపరిణత గాదె । యెంచ నద్భుతమైన యీకథ వినిన
వారికిఁ జదివినవారికి వ్రాయు । వారికిఁ జేకూరు వరశుభోన్నతులు
అని చిల్క తెల్పెనంచ భవుండు దెలుప । వనజాక్షి గౌరి యవ్వలికథ యడిగె
నని శౌనకాది మహామునీంద్రులకు । వినిపించె సూతుండు విపులవాక్సిద్ధి
సరస పతివ్రతాచరితంబు నందు । వరుస ముప్పదిరెండవకథ చెన్నొందె

శ్రీ. శ్రీ. శ్రీ.

# శుద్ధపత్రిక

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 20 | విశ్వైకర్త | విశ్వైకభర్త |
| 2 | 16 | సెప్పఁదొడింగె | సెప్పఁదొడంగె |
| 4 | 1 | వలగొనిమ్రొక్కి | వలగొనిమ్రొక్క |
| 6 | 24 | శాపముననొ్కయడవి | శాపముననొక్కయడవి |
| 6 | 25 | నాహరింవుచును | నాహరింపుచును |
| 6 | 27 | రత్నావతీకటంబు | రత్నావతీకటకంబు |
| 9 | 8 | రాజుఁబ్రార్థింప | రాజుప్రార్థింప |
| 12 | 5 | కింకణీ | కింకిణీ |
| 12 | 13 | భైరవస్పూర్తి | భైరవస్ఫూర్తి |
| 17 | 9 | గిరిహాంతరవీథి | గిరిగుహాంతరవీథి |
| 19 | 23 | చెట్టుకుక్కనెడ | చెట్టెకుక్కనెడ |
| 20 | 11 | మిద్రావతి | మింద్రావతి |
| 23 | 13 | నింద్రపాభ | నింద్రగోపాభ |
| 29 | 13 | చంద్రసాల | చంద్రశాల |
| 31 | 19 | కింపై  చక్కని | కింపైన  చక్కని |
| 31 | 19 | బలిపించి | బిలిపించి |
| 31 | 27 | చలువగలుగట్ట | చలువలుగట్ట |
| 35 | 12 | నమ్మోనిమ్రాల | నమ్మానిమ్రోల |
| 41 | 27 | కంతుపట్టవుదేవి | కంతుపట్టపుదేవి |
| 42 | 7 | వెఱఁగింపు | వేఱఁగింపు |
| 46 | 12 | నా దేవతాగ్రణి | నో దేవతాగ్రణి |
| 50 | 16 | దులకొంచు | దులకించు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 50 | 21 | గీలోన్నకతన | గీలోఁన్నకతన |
| 54 | 16 | మూర్కొఁచు | మూర్కొఁనుచు |
| 55 | 17 | జిలుకనై | జిలుకవై |
| 57 | 19 | గెలయు | గెలియు |
| 59 | 6 | శయాగాన్యం | శయ్యాగానం |
| 60 | 25 | అభినవమందనుండ | అభినవమదనుండ |
| 62 | 23 | జుగన్మోహనుండు | జగన్మోహనుండు |
| 63 | 5 | చాతుర్యళయొ | చాతుర్యకళయొ |
| 81 | 19 | వాంఛాబుద | వాంఛాంబుద |
| 86 | 11 | జరిమి | చరిమి |
| 86 | 16 | మూర్ఖనై | మూర్ఖునై |
| 98 | 25 | యిమ్మిాట | యిమ్మాట |
| 104 | 16 | బలిపించి | బిలిపించి |
| 108 | 10 | డిదెవచ్చ | డిదెవచ్చు |
| 111 | 25 | రత్నాంగధరణీశు | రత్నాంగదధరణీశు |
| 119 | 8 | దుఃఖపెట్టితి | దుఃఖపెట్టితి |
| 121 | 24 | నిచ్చెలి! | నిచ్చెలి |
| 124 | 20 | నందని | నందన |
| 131 | 26 | వఱ్యఁబడసి | వఱ్యనిఁబడసి |
| 134 | 23 | నందని | నందన |
| 136 | 3 | చంద్రాదగ | చంద్రాంగ |
| 167 | 22 | నొల్లఁడితని | నొల్లఁడితఁడని |
| 169 | 11 | కరసరోహ | కరసరోరుహ |
| 176 | 7 | నపారహ | నపార |
| 183 | 14 | రాజత | రాజిత |
| 184 | 16 | రాహాత్తుల | రాహుత్తుల |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 192 | 14 | వసుధేశ్వరుడు | వసుధేశ్వరుండు |
| 221 | 18 | మోయని | మేయని |
| 222 | 12 | వనిమె | వనియె |
| 224 | 1 | తక్కులారి | తక్కులాఁడి |
| 228 | 6 | యటకలి | నటకలి |
| 228 | 7 | కై చేసిన | కై సేసిన |
| 229 | 21 | వచ్చినాడని | వచ్చినాఁడని |
| 229 | 23 | అర్థరాజ్యంబు | అర్ధరాజ్యంబు |
| 229 | 27 | యిడఁబాసి | యెడఁబాసి |
| 229 | 27 | నిన్ననని | నిన్ననిన |
| 229 | 26 | జ[illegible]భి | జఱభి |
| 232 | 23 | ద్విజుండు | ద్విజుఁడు |
| 248 | 9 | యెదిగి | యొదిగి |
| 253 | 27 | యాయన | యాయున |
| 254 | 12 | యభష్టము | యభీష్టము |
| 262 | 18 | నృవుల | నృపుల |
| 266 | 8 | మూరు | మూర్త |
| 274 | 24 | నెతుక | నెత్తుక |
| 276 | 2 | శెలమధ్య | శైలమధ్య |
| 278 | 13 | గొటటధ్వనుల | గొటగొటధ్వనుల |
| 279 | 14 | బంబి | బంచి |
| 279 | 23 | దానవసేన | దానవసేన |
| 279 | 24 | సహన్ర | సహస్ర |
| 281 | 1 | రానవేంద్రుని | దానవేంద్రుని |
| 282 | 16 | నిజావుల | నిజాప్తుల |
| 283 | 5 | జగతి | జగతీ |

| పుట. | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 294 | 3 | బలివచ్చునందాఁక | బలివచ్చునందాఁక |
| 296 | 26 | బక్క_బాయకఁ | బక్కఁబాయక |
| 297 | 5 | చెప | చేప |
| 297 | 25 | గగనమూగ్గమున | గగనమార్గమున |
| 300 | 17 | యెందెన | యెందైన |
| 300 | 23 | ఉదకాయలమున | ఉదయకాలమున |
| 302 | 15 | రాజితగుణోత్పన | రాజితగుణోత్పన్న |
| 308 | 15 | బింబోషి | బింబోష్ఠి |
| 309 | 7 | విడిడి | విడిచి |
| 311 | 13 | వాసపుడు | వాసవుఁడు |